# హరి కొలువు

రచన

**జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

ఉపసంపాదకుడు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.




ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2008**

# HARI KOLUVU (Telugu)

By
**Julakanti Balasubrahmanyam**



T.T.D. Religious Publications Series No : 585

First Edition · 2000
Revised Edition : 2002
Re-prints : 2003, 2004,2006,2008

Copies :10,000

Published by
**Sri K.V. Ramanachary, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

Printed at
**Standard Press (India) Pvt. Ltd.,**
Sivakasi - 626 123. Ph: (04562) 221108
www.sales@standardpressindia.com

# సమర్పణ



**శ్రీ అలమేలు మంగమ్మ**
**దివ్య పాదార విందములకు..**

# ముందుమాట

"వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి."

'బ్రహ్మాండంలో వేంకటాద్రికి సమానమైన పుణ్యక్షేత్రం లేదు. అలాగే శ్రీ వేంకటేశ్వరునకు సాటిరాగల దేవుడు ఇటు భూతకాలంలో లేడు, అటు భవిష్యత్తులోనూ ఉండబోడు' - అన్న ప్రశస్తికి అనేక కారణాలు గోచరిస్తాయి.

అందులో మొదటిది శ్రీనివాసుడు నెలకొనివున్న దివ్యస్థలం.

వేదములే శిలలై వెలసిన దీ కొండ
యే దెస బుణ్యరాసులే యేరులైన దీ కొండ
గాదిలి బ్రహ్మాది లోకముల కొనల కొండ
శ్రీదేవు డుండేటి శేషాద్రి యీ కొండ

అంటూ ఈ క్షేత్రంయొక్క నిజమైన ఆధ్యాత్మిక తేజోవైభవాన్ని అన్నమాచార్యులు ఆవిష్కరించాడు.

ఇక ఆ స్వామి పేరుకూడా ఒక అద్భుతమే! తిరుమలేశుడు తాను నిలిచివున్న దివ్యస్థలాన్ని బట్టీ, తన వక్షఃస్థలంమీద వెలసిన శ్రీమహాలక్ష్మి పేరు ననుసరించీ పిలువబడుతూవున్న సాక్షాత్తు పరబ్రహ్మమూర్తి. అంత మాత్రమే కాదు, ఆ శ్రీనివాసుడు నిలిచివున్న తీరుకూడ ఆశ్చర్యకరమే! 'సంసార సాగర సముత్తరణైక సేతో' అన్నట్లుగా కటి వరదహస్తాలతో ఒక సొంపైన భంగిమలో నిలిచివుంటూ అందరినీ అనుగ్రహించి అలరిస్తూవున్న ఆ స్వామి ఆనందనిలయుడు. అలాగే, తిరుమలప్పనికి అలంకరింపబడే అనేక దివ్యాభరణాలూ, వివిధ రకాలైన నవరత్న మణిహారాలు చూపరులను ఆశ్చర్య పరవశులను గావిస్తూ వేంకటరమణుని అనంతవైభవాన్ని వేనోళ్ల చాటుతూ వున్నాయి.

ఆ నిత్యకల్యాణచక్రవర్తికి కొనసాగుతూవున్న అర్చనా విధానం కూడా ఒక విశిష్టతను సంతరించుకొంది. అత్యంత ప్రాచీనమైన వైఖాన

సాగమం ప్రకారంగా షట్కాలార్చనలు జరుగుతూవుండటమేగాక, ఆ స్వామికి సమర్పింపబడే అనేక దివ్యప్రసాదాలు ఆయనకు జరిగే మహోత్సవాలు ఊరేగింపులు కూడ 'న భూతో న భవిష్యతి' అన్న ప్రఖ్యాతిని పొంది, ఆ కొండలరాయుని ప్రత్యేకతను బ్రహ్మాండం అంతటా చాటుతూ వున్నాయి.

తిరుమలేశుని సేవలో తరించిన తొండమానుచక్రవర్తి, తిరుమలనంబి, అనంతాళ్వారు, అన్నమాచార్యులు, హథీరాంబావాజీ, తరిగొండ వెంగమాంబ.. వంటి ఎందరో భక్తవరేణ్యుల పవిత్రగాథలు, శ్రీ వేంకటేశ్వరుని భక్త ప్రియత్వాన్ని చాటుతూ, ఆ క్షేత్రానికి సాటిలేని వైభవాన్ని, మరింత ప్రాశస్త్యాన్ని ప్రసాదిస్తూవున్నాయి.

ఇలా సప్తగిరీశునకు సంబంధించిన అనేక అంశాలను, వివిధ విషయాలను పరిశీలించి, పరిశోధించి, తిరుమల పుణ్యక్షేత్రవైభవాన్ని, శ్రీ వేంకటేశ్వరుని ఆశ్రిత వాత్సల్యాన్ని, దయాళుత్వాన్ని, శ్రీవారి ఆలయ విశేషాలను అందరికీ అర్థమయ్యేరీతిలో అత్యంత సరళరీతిని వివరిస్తున్న విశిష్టరచన ఈ "హరికొలువు."

ప్రతిదినమూ పవిత్రఅరుణోదయవేళలో శ్రీవారిఆలయ ప్రాంగణంలో శ్రీ వేంకటపతికి "హరి కొలువు" అనే కొలువుమేళం, పవిత్ర మంగళ వాద్యగీతికగా వినిపించబడుతూ వుంటుంది.

తదనుగుణంగా శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీనివాసుని దివ్యసన్నిధికి సమర్పించిన అక్షరాత్మిక మంగళగీతికయే ఈ "హరికొలువు."

ఇప్పటికే పలుమార్లు ప్రచురితమయిన ఈ పుస్తక ప్రతులన్నీ అయిపోయినందువల్ల పునర్ముద్రణగా అందిస్తున్నాం. ఆస్వాదించండి, ఆనందించండి.

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# పరిచయం

స్మరణా త్సర్వపాపఘ్నం స్తవనా దిష్టవర్షిణమ్,
దర్శనా న్ముక్తిదం చేశం శ్రీనివాసం భజేఽనిశమ్.

ఆ స్వామిని స్మరిస్తే చాలట! పాపాలన్నీ పోతాయి. ఆ దేవుణ్ణి కీర్తిస్తే చాలట! కోరికలన్నీ తీరుతాయి. ఆ దేవదేవుణ్ణి కన్నులారా దర్శిస్తే చాలట! ముక్తి కలుగుతుంది. అటువంటి శ్రీనివాసభగవానుణ్ణి నిత్యమూ భజిస్తాను.

భక్తప్రియుడు, కోరిన వరాలరాయడు అయిన శ్రీ వేంకటేశ్వరస్వామి అర్చామూర్తియై స్వయంభువుగా వెలసిన పవిత్రస్థలమే తిరుమల పుణ్య క్షేత్రం. ఆ ఆనందనిలయుని ఆలయప్రాంగణంలోని అనేక దివ్యస్థలాలు, మండపాలు అద్భుతశైలీ విన్యాణములతో విరాజిల్లడంతోపాటు, తిరుమలేశు నితో పెనవేసుకొన్న ఎంతోమంది భక్తుల మధుర జీవితఘట్టాల్నీ, తద్వారా శ్రీనివాసుని భక్తవాత్సల్యాన్నీ, లీలలనూ నిక్షిప్తంచేసుకొని వున్నాయి.

'నిత్యకల్యాణం పచ్చతోరణం' గా ప్రశస్తి చెందిన ఈ వేంకటాచలంలో ఘనవేంకటేశ్వరునకు ప్రతిరోజూ 'కల్యాణోత్సవం' ఒకటే కాక, సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవ వంటి నిత్యోత్సవాలు; విశేష పూజ, అష్టదళపాదపద్మారాధన, సహస్ర కలశాభిషేకం, తిరుప్పావడసేవ, పూలంగిసేవ, శుక్రవారాభిషేకం వంటి వారోత్సవాలు; రోహిణీ, ఆర్ద్ర. పునర్వసు, శ్రవణం..వంటి నక్షత్ర ఉత్సవాలు,కోయిల్ ఆళ్వారుతిరుమంజనం, ఉగాది ఆస్థానం, పద్మావతీ పరిణయం, జ్యేష్ఠాభిషేకం, ఆణివార ఆస్థానం, పవిత్రోత్సవం, బ్రహ్మోత్సవం... ఇత్యాది సంవత్సరోత్సవాలు జరుపబడుతూ, ప్రతిరోజూ ఒక పండుగగా, ప్రతిపూటా పాయసాలతో పరమాన్ననివేదనలతో భాసిస్తూ, ఏడుకొండలవానికి ఏడాది పొడవునా సుమారు 450కి పైగా ఉత్సవాలు నిర్వహింపబడుతూ వున్నాయి.

ఎంతటి సంపదగల భక్తులకయినా, ఎంతటి విరామమున్న యాత్రికుల కయినా, అత్యంత వేగవంతమైన ఈ యాంత్రిక యుగంలో ఆనంద నిలయుని ఆలయ విశేషాలను, ప్రత్యక్షంగా చూస్తూ తెలుసుకోవడం, ఆ స్వామివారికి జరిగే అన్నిఉత్సవాల్లోనూ పాల్గొని తిలకించడం సాధ్యమయ్యే

పని కాదు. శ్రీవారిఆలయ అద్భుతవిశేషాలతోపాటు, తిరుమలేశునికి ఏ యే ఉత్సవాలు, ఎప్పుడెప్పుడు జరుగుతున్నాయి; ఎలా జరుగుతున్నాయనే విషయాలను తెలుసుకోవాలన్న జిజ్ఞాస, ఆసక్తి, ప్రతి భక్తునికీ ఉండడం సహజం. మరి ఆ భక్తుని ఆకాంక్షను కొంతవరకైనా తీర్చడానికి చేసిన ప్రయత్నమే అక్షర రూపాన్ని పొంది, ఇప్పుడు మీ చేతుల్లో అలరారుతూవున్న "హరి కొలువు."

ఈ గ్రంథంద్వారా శ్రీవారి ఆలయంలోని మహాద్వారగోపురం - కృష్ణ రాయమండపం - అద్దాలమండపం - రంగనాయకమండపం - బంగారు ధ్వజస్తంభం - బలిపీఠం - క్షేత్రపాలకశిల - విమాన ప్రదక్షిణంలోని 'చుట్టుగుళ్లు' - ఘంటామండపం - బంగారువాకిళ్లు - స్నపనమండపం - రాములవారిమేడ - శయనమండపం - గర్భాలయంలోని శ్రీవారి మూలవిరాణ్మూర్తి - ఇతర ఉత్సవమూర్తులు.... ఈ రీతిగా ఆయా ముఖ్యప్రదేశాలను, మూర్తులను, అనేకానేక అద్భుతవిషయాలను పాఠకులు ప్రత్యక్షంగా దర్శిస్తూ, ఆనందిస్తూవున్న అనుభూతిని పొందుతారు.

1992 సంవత్సరంలో శ్రీ కార్యనిర్వహణాధికారిగా వున్న పూజ్యులు, సుగృహీతనామధేయులు శ్రీ ఎం.వి.ఎస్.ప్రసాద్, ఐ.ఎ.యస్., గారు, తిరుమల శ్రీవారి ఆలయ విశేషాలతోపాటు, ఉత్సవ విశేషాలన్నింటిని అందరికీ తెలిసేవిధంగా గ్రంథ రచనకు పూనుకోవలసిందన్న ప్రేరణను, స్ఫూర్తిని నాకు ప్రసాదించారు. అంతమాత్రమేగాక శ్రీవారి ఆలయంలో రెండేళ్ల పాటు విధినిర్వహణ (On Duty) మీద సంచరించడానికి, అన్ని సేవలను ఉచితంగా తిలకిస్తూ పరిశీలించడానికి ఉత్తరువులను అనుగ్రహించి, శ్రీవారి భక్తులకు మహోన్నతమైన ఉపకారం చేశారు. సహృదయశేఖరులయిన శ్రీ ఎం.వి.యస్. ప్రసాద్ గారికి భక్తిపూర్వక ప్రణామాంజలులు.

1995 సంవత్సరంలో శ్రీ కార్యనిర్వహణాధికారిగావున్న గౌరవనీయులు శ్రీ నిమ్మగడ్డ రమేష్‌కుమార్,ఐ.ఏ.యస్., గారు ఈ 'హరి కొలువు' గ్రంథం వ్రాతప్రతుల్ని స్వయంగా పరిశీలించి, భక్తులకందించడం అత్యంతఅవసరం అని, ముందుగా 'సప్తగిరి' మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురించ

వలసిందని ఆనతిచ్చారు. సౌజన్య మూర్తులైన శ్రీ రమేష్‌కుమార్ గారికి కృతజ్ఞతా పూర్వక ప్రణామములు.

1995 సెప్టెంబరు నుంచి 2000 ఫిబ్రవరి వరకు "సప్తగిరి" పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడి అశేషభక్తపాఠకుల మన్న నలందుకొన్న ఈ "హరి కొలువు" సంపుటాన్ని తి.తి.దేవస్థాన ధార్మిక ప్రచురణగా వెలువరింపజేసి, భక్తలోకానికి కానుకవెట్టిన, తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రస్తుత శ్రీ కార్యనిర్వహణాధికారి, సంగీతసాహిత్యవిద్వద్వరేణ్యులు సహృదయ వతంసులు డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.యస్., గారికి భక్తి పూర్వక నమోవాకములు.

తిరుమల తిరుపతి ఆలయాలను, ఆలయాల విశేషాలను, శ్రీవారి భక్తులనుగూర్చి విపులంగా శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీసాధుసుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ టి.కె.టి. వీరరాఘవాచార్యులు, శ్రీ ఎం.ఎస్. రమేశన్, శ్రీ వేదాంతం జగన్నాథాచార్యులు, శ్రీ ఎస్.కె.రామచంద్రరావు, శ్రీ ఎన్.సి.వి. నరసింహాచార్యులు, శ్రీ గోపీకృష్ణ, ప్రొ॥ కె. సర్వోత్తమరావు... వంటి విద్వాంసులెందరో అనేక గ్రంథాల్ని వ్రాశారు. వారందరి గ్రంథాలు ఈ రచనకు ఎంతగానో తోడ్పడ్డాయి. వారందరికీ కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

ఇంతమాత్రమేగాక, తిరుమల శ్రీవారి ప్రధాన అర్చకులు, తి.తి.దేవస్థానం వైఖానసాగమ ఆస్థాన పండితులు శ్రీమాన్ మాడంబాకం శ్రీనివాస భట్టాచార్యులు మరియు తి.తి.దేవస్థానం రిటైర్డు ఇంజనీరు శ్రీ డి. విఖనసాచార్యులు - వీరందించిన సలహాలు, విశేషాలు ఈ రచనలో నాకు మిగుల సహకరించాయి. వీరలకు భక్తి పూర్వక నమస్కారములు.

సుప్రభాతం, ఏకాంతసేవ, నిత్యకల్యాణోత్సవం వంటి శ్రీవారి ఆలయ ఉత్సవవిశేషాల్లో పాలుపంచుకొంటున్న తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయులు శ్రీ తాళ్లపాక సత్యనారాయణాచార్యులు, మరియు దేవస్థానం వేదపారాయణందారు శ్రీ రాజగోపాలన్‌గారు - వీరిరువురు ఆలయ విశేషాలతోపాటు ఓపికగా ఎన్నో విషయాలను వివరించారు - వీరలకు వందనములు.

వీరేగాక ఎందరో దేవస్థాన అధికార అనధికారులు ఇందలి విషయ సేకరణలో మిగుల తోడ్పడినారు. వారందరికీ కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈ గ్రంథ రచనా విషయంలోను, "సప్తగిరి"లో ధారావాహికంగా ప్రచురించే విషయంలోను ఎంతో ప్రోత్సాహపరచిన తి.తి.దేవస్థానం పౌర సంబంధాధికారివర్యులు శ్రీ ఎ.సుభాష్ గౌడ్ గారికి, 'సప్తగిరి' సంపాదకుడు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారికి కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఆస్తిక మహాశయులు ఈ గ్రంథాన్ని ఆనందనిలయుని ప్రసాదంగా ఆదరంతో అందుకొని ఆస్వాదించగలరని అభిలషిస్తున్నాను.

"ఆ పరితోషాద్ విదుషాం"-- అనే ఆర్యోక్తియే నాకు ఈ సందర్భంలో శరణ్యమైనది.

"వేనామాల వెన్నుడా! వినుతించ నెంతవాడ?
కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేయయ్యా!"

తిరుపతి,
19-4-2000. జూలకంటి బాలసుబ్రహ్మణ్యం.

## మనవి

ప్రక్కపుటలోని "**శ్రీవారి ఆలయం నిర్మాణ రేఖాచిత్రం**"లో సూచించబడిన సంఖ్యలను, "విషయసూచిక"లో పేర్కొన్న సంఖ్యలతో సరిచూచుకొనగలరు.

# విషయసూచిక

ప్రాణికోటికి చేయూత యిస్తాడు. పట్టుతెలిసినవాడు కాబట్టి, జారిన జీవులు దిగజారిపోకుండా పట్టుకుంటాడు. పడిపోతామని భయపడే పసిపిల్లలను జారుడుబండమీద పెద్దవాళ్లు చేయిపట్టుకొని ఆడించినట్లుగా, భగవంతుడు భక్తులకు చేయూత యిచ్చేందుకు, స్కందుడవుతాడు, స్కందధరుడుకూడా అవుతాడు. అస లతడు ధుర్యుడు. కీలకం తనచేతిలో పెట్టుకున్న దిట్ట. ఇలా ఒక చక్కని భావం ఈ మూడునామాల్లో ఒదిగిఉంది. ఓర్పుతో, నేర్పుతో ఆలోచిస్తే ఇలాంటి భావాలు సహస్రనామంలోని ప్రతిశ్లోకంలో, ప్రతి చరణంలో స్ఫురిస్తాయి.

ఇలాగే 'అమానీ, మానదో, మాన్యః' అని మూడునామాలు వరుసగా వినిపిస్తాయి. అతనికి అభిమానం లేదట. కాని ఇతరులకు ఇయ్యవలసిన గౌరవం, చూపవలసిన ఆదరం ఏమాత్రం లోటులేకుండా చూపుతాడట. అందువల్లనే ప్రపంచం అతన్ని గౌరవిస్తుందట. కీర్తికండూతితో బాధపడే పండితులకు, పామరులకు ఈ మూడు నామాలు ఎంత అమోఘమైన సందేశాన్ని అందిస్తాయో ఊహించవచ్చు.

ఒకచోట 'సువ్రతః, సుముఖః, సూక్ష్మః, సుఘోషః, సుఖదః, సుహృత్' -- అని ఒక్క గుక్కలో ఆరు సూక్తులు వస్తాయి. ఇవన్ని యెందుకు చెప్పినట్లు? అర్థం తెలియకుండా ఊరక చదువుకున్నా యీ ఆరు నామాలు నోటపలికేసరికి, లోపలి దుర్గంధం పోయి సాధకులకు వావవి అంటే ఏమిటో బోధపడుతుంది. అర్థం తెలుసుకునేందుకు ప్రయత్నిస్తే ఇందులో లోక పాలకులకు, ప్రజా పరిపాలకులకు కావలసిన లక్షణాలు సూత్రప్రాయంగా కనిపిస్తాయి. ముందు మన సంకల్పం మంచిదై ఉండాలి, గట్టిగాకూడా ఉండాలి. అదే దృఢవ్రతునిలోని సువ్రతత్వం. అంతటితో చాలదు. మనస్సులోని సంకల్పానికి ఇతరుల ఆమోదం, అనుకూలత అవసరం. అందరినీ 'సుముఖం' చేసుకోవాలి. ఆ తర్వాత ఆ సంకల్పంలోని సాధక బాధకాలను 'సూక్ష్మం'గా పరిశీలించి పరామర్శించుకోవాలి. అప్పుడు తన సిద్ధాంతాన్ని తగినమాటల్లో అందరికీ నచ్చే విధంగా చెప్పాలి. అదే సుఘోషత్వం. అలా మనస్సులోని సంకల్పం జనామోదాన్ని పొంది ప్రజలలో

పలుకుబడికి వస్తే అందరికీ 'సుఖప్రద' మవుతుంది. అందరూ సౌహార్దంతో దాన్ని అంగీకరిస్తారు. ఏ సంకల్పానికైనా చరమలక్ష్యం సుహృత్ ప్రాప్తి. మంచి హృదయం మంచి పనిని సాధించగలుగుతుంది. నిత్యజీవితంలో అనుక్షణం స్మరించవలసిన సందేశం ఈ ఆరు నామాల్లో ఆచార్యులు మన కందించారు.

ఇలాంటి పూర్వాపర సంబంధమే కాక, కొన్ని నామాలు అక్షర కుసు-మాలతో మాలలు గ్రుచ్చినట్లు వినేందుకు వీనుల విందుగా ఉంటాయి. వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్ కవిః, కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః, బ్రహ్మణ్యో బ్రహ్మకృద్ బ్రహ్మ బ్రహ్మ బ్రహ్మ వివర్ధనః, మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః, దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా -- ఇలాంటివి నామ కుసుమహారాలకు మచ్చుతునకలు. అర్థం తెలియకపోయినా అనిర్వచనీయమైన ఆనందాన్ని అందించే అక్షర సంపద వీటిలో ఉంది. ఇలాంటి నామ సముచ్చయంలోనే ఒక చోట శ్రీసూక్తం వినిపిస్తుంది.

*శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః,*
*శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః.*
*శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః.*

ఈ చతుర్దశ (14) నామాలను ఉచ్చరించే సమయంలో మన మనస్సు చతుర్దశభువనాల్లో సంచరిస్తున్నట్లు తోస్తుంది. మూడు లోకాలకు ఆశ్రయం ఇచ్చే శ్రీతత్త్వం ప్రణవహాసంలో మిళితమై లోకోత్తర లావణ్యం పంచి పెట్టుతున్నట్టు భాసిస్తుంది. ఆశ్రయవాచకమైన శ్రీ (శ్రి) ధాతువును చర్వణ చేయగా వచ్చిన నామ రసాయనం ఇది. ఈ మూడు చరణాల్లో మూడు లోకాలు సంచరిస్తుంటాయి.

సహస్రనామంలోని కొన్ని నామాలు కొంచెం విచిత్రంగాకూడా ఉంటాయి. మామూలుగా మనం విని వినిపించే మాటలకు అవి కొంచెం దూరంగా ఉంటాయి. ఉదాహరణకు 'శిపివిష్ట' నామం ఉంది.

# హరికొలువు

తిరుమల పుణ్యక్షేత్రానికి 'కలియుగవైకుంఠ'మని ప్రసిద్ధి. ఈ ప్రశస్తికి మూలకారణం ఇందు స్వయంవ్యక్త స్వరూపంతో విలసిల్లుతూవున్న వేంకటే శ్వర స్వామివారు. తిరుమలగిరిపై పవిత్రాద్భుతమైన ఒక సాలగ్రామశిలద్వారా స్వయంభువుగా వెలసివున్న శ్రీవేంకటేశ్వరుణ్ణి శ్రీనివాసుడని, సప్తగిరీశుడని, ఏడుకొండలవాడని, బాలాజీ అని, తిరుమలప్ప, తిమ్మప్ప అని.... ఇలా ఎన్నో పేర్లతో భక్తజనులు ఆర్తిగా సంబోధిస్తూ వుంటారు. ఆనందనిలయుడైన శ్రీస్వామివారు నెలకొనివున్న బంగారుమందిరానికి 'ఆనందనిలయ'మనే వ్యవహారం అనాదిగా ప్రసిద్ధమై ఉంది.

కలియుగారంభంలో -- అనగా ఇంచు మించు అయిదువేల సంవత్సరాల క్రిందట, తానొక్కడే వక్షఃస్థలమహాలక్ష్మితో కూడ ఆవిర్భవించివున్న శ్రీ శ్రీనివాసస్వామికి తరతరాలుగా ఎందరో భక్తులు మందిర, గోపుర ప్రాకార మహాద్వారాలను నిర్మిస్తూ వచ్చారు. ఆ ఘనవేంకటపతికి నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ సంవత్సరోత్సవాది వివిధోత్సవాలను అత్యంత భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తూ వచ్చారు.

నారాయణవనం అధిపతులు ఆకాశరాజు, తొండమాన్ చక్రవర్తి, పల్లవ రాణి సామవై (పెరుందేవి), విజయనగర పరిపాలకులు సాళువ నరసింహరా యలు, శ్రీకృష్ణదేవరాయలు, తిరుమలరాయలు, అచ్యుత రాయలు..... ఇలా ఇలా ఎందరో ప్రభువరేణ్యులు కావించిన అద్భుత నిర్మాణ విన్నాణములకు, మహనీయుల అపూర్వ సేవా కైంకర్యాలకు నెలవుపట్టుగా విరాజిల్లిన తిరుమల శ్రీవారి ఆలయాన్ని సందర్శించి అందలి విశేషాలను మనం తెలుసుకుందాం.

కాని ఈ క్షేత్ర సంప్రదాయం ప్రకారం ముందుగా మనం "శ్రీవరాహ స్వామివారి ఆలయా"న్ని సందర్శించి ఆతర్వాత తిరుమల ఆనందనిలయుని "బంగారుమేడ"ను సందర్శిద్దాం.

# శ్రీవరాహస్వామివారి ఆలయం

తిరుమలలో శ్రీస్వామి పుష్కరిణికి వాయవ్యమూలలో తూర్పుముఖంగా శ్రీవరాహస్వామిఆలయం ఉంది. శ్రీమహావిష్ణువు ఆదివరాహస్వామిగా అవతరించి భూదేవిని రక్షించి ఇక్కడే నిలిచాడు. అందుకే ఇది ఆదివరాహక్షేత్రమని ప్రసిద్ధి పొందింది. ఆ తర్వాత మరి కొంతకాలానికి శ్రీనివాసుడు వైకుంఠం నుండి ఇక్కడికి వచ్చి తాను వుండడానికి శ్రీవరాహస్వామివారిని 100 అడుగుల స్థలాన్ని దానంగా అడిగాడు.

స్థలం దేహ్యవనీకాంత యావత్కలియుగం భవేత్
ఇతి తేన సవిజ్ఞప్తో వరాహవదనో హరిః.

ఉవాచ వచనం దేవ స్థలం మౌల్యేన గృహ్యతాం
ఇతి వాక్యం తత శ్శృత్వా ప్రోవాచ మధురం వచః.

ప్రథమం దర్శనం చ స్యాన్నైవేద్యం క్షీర సేచనం
ఇదమేవ పరం ద్రవ్యం దదామి కరుణానిధే.

ఇత్యుక్తో హరిణాపోత్రీహరయే స్థాన కాంక్షిణే
తదా దదౌ స్థలం పాదశతమాత్రం రమాపతే.

అని పేర్కొన్నట్లుగా 'ప్రథమదర్శనం, ప్రథమ పూజ, ప్రథమ నైవేద్యం' అను నియమ ఒప్పందంతో దానపత్రం రాసిచ్చి, 100 అడుగుల స్థలాన్ని దానంగా పొందినాడు. ఆ తర్వాతి కాలంలో ఆక్షేత్రంలో తన ప్రాబల్యాన్ని పెంచుకున్నాడు వేంకటేశ్వరస్వామి. ప్రస్తుతం ఆనాటి నియమం ప్రకారమే నేటికీ తిరుమలలో శ్రీభూవరాహస్వామివారికి తొలిగా పూజా నివేదనాదులన్నీ సక్రమంగా జరుపబడుతున్నాయి. అంతేగాక శ్రీవరాహస్వామివారికి వలసిన నివేదనలు, పూజాసామాగ్రి, వగైరాలన్నీ శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయం నుండే నేటికీ పంపబడుతుండటం గమనించదగిన విశేషం.

ఈ వరాహస్వామిని తొలుత దర్శిస్తేనే శ్రీవేంకటేశ్వరుడు సంతోషిస్తాడు కూడ.



శ్రీ వరాహస్వామి ఆలయం



శ్రీ వరాహస్వామి

వరాహ దర్శనా త్పూర్వం శ్రీనివాసం నమేన్న చ
దర్శనా త్ప్రాగ్వరాహస్య శ్రీనివాసో న తృప్యతి.

శ్రీవేంకటేశ్వరుణ్ణి తొలిగా దర్శించటం శ్రీనివాసునికి ఎంతమాత్రమూ తృప్తికరం కానేకాదు. క్షేత్ర సంప్రదాయంప్రకారం, శ్రీ వరాహస్వామిని దర్శించినతర్వాతే శ్రీనివాసుని దర్శించటం ఫలప్రదంకూడా.

శ్రీ వరాహస్వామిఆలయాన్ని గూర్చిన ప్రాచీన శాసనాలంతగా కన్పించటం లేదు. తొలిగా మనదృష్టికి వచ్చిన క్రీ.శ. 1380 నాటి శాసనంలో శ్రీ వరాహస్వామి 'వరాహనాయనార్'గా పేర్కొనబడ్డాడు. ఆ తర్వాత క్రీ.శ. 1476నాటి శాసనంలో ఈ వరాహస్వామి 'జ్ఞానప్పిరాన్' అని పేర్కొనబడ్డాడు. అంటే 'జ్ఞానప్రదాత' అని అర్థం. తొలిగా ఈయనను దర్శిస్తే భక్తుడు జ్ఞానమయకోశంలో ప్రవేశిస్తాడట! జ్ఞానమయకోశంలో ప్రవేశించిన భక్తునికి ఆనందమయకోశం సులభంగా, శాశ్వతంగా సిద్ధిస్తుంది! అందుకే చివరగా ఆనందప్రదాత అయిన శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శించవలెను. ఆనందనిలయుని దర్శించిన భక్తునికి శాశ్వత ముక్తి కరతలామలకం!

క్రీ.శ. 1481 తర్వాత వ్యవహారంలో "ఆదివరాహప్పెరుమాళ్" అని పిలువబడిన ఈ వరాహస్వామిని పౌత్తరాహులు శ్రీవేంకటేశ్వరునికి 'ఆది గురువు'గా పేర్కొంటారు. జ్ఞానప్రదాత అయిన గురువుద్వారానే భగవంతుణ్ణి దర్శించవలె. అప్పుడే భగవత్సాన్నిధ్యం సులభంగా లభ్యమవుతుంది. అందువల్లే వరాహస్వామివారిని తొలిగా దర్శించినతర్వాతనే శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించడం సంప్రదాయం.

శ్రీ వరాహస్వామివారికి ప్రతిరోజు మూడుపూటలా వైఖానసాగమం ప్రకారంగా అర్చనలు, నివేదనలు జరుపబడుతున్నాయి. శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలోని వంటశాలనుండే తీసుకొనివచ్చిన అన్నప్రసాదాలు వగైరాలన్నీ శ్రీవేంకటేశ్వరస్వామి వారికంటే ముందుగానే శ్రీ వరాహస్వామివారికి నివేదింపబడతాయి. అలాగే ప్రతి శుక్రవారం తెల్లవారు జామున అభిషేకం జరుగుతున్నది. కాని ప్రత్యేకంగా ఉత్సవాలు మాత్రం ఏమాత్రం నిర్వహింపబడటంలేదు.

స్వామిపుష్కరిణికి వాయువ్యమూలలో తూర్పుముఖంగా ముందుకు చొచ్చుకొని వచ్చినట్లున్న వరాహస్వామిఆలయం ముఖమండపం, అర్థ మండపం, అంతరాళం, గర్భాలయం అని నాలుగు భాగాలుగా నిర్మింప బడింది. శిల్పశోభితమైన రమణీయ స్తంభాలతో నిర్మింపబడిన శ్రీవరాహ స్వామి ఆలయ ముఖమండపంలోనికి ప్రతి బ్రహ్మోత్సవం చివరిరోజు శ్రవణ నక్షత్రం రోజున 'చక్రస్నానం' సందర్భంగా శ్రీదేవి భూదేవి సమేతుడై శ్రీవేంకటేశ్వరుడు, చక్రత్తాళ్వారుతోకూడ వేంచేస్తాడు. ఈ మండపంలో వీరికి పంచామృత స్నపన తిరుమంజనం జరిగిన తర్వాత వరాహపుష్కరిణిలో చక్రస్నానం జరుగుతుంది. ఇలాగే రథసప్తమినాడు, ముక్కోటిద్వాదశినాడు శ్రీచక్రత్తాళ్వారు మాత్రమే ఇక్కడికి వేంచేయగా ఆ మూర్తికి అభిషేకం జరిపి, పుష్కరిణిలో స్నానం చేయిస్తారు.

ఈ ముఖమండపం ఆవరణలోనే శ్రీవరాహస్వామి ఆలయానికి ఒక ప్రదక్షిణమార్గం ఉన్నది.

ముఖమండపంనుండి లోనికి ప్రవేశిస్తే వుండేదే అర్ధమండపం. ఇదే శ్రీవరాహస్వామివారి గర్భాలయానికి చుట్టూ నిర్మింపబడి ప్రదక్షిణ మార్గంగా కూడా ఉపయోగపడుతున్నది.

అర్ధమండపాన్ని దాటి లోనికి వెళితే చిన్న అంతరాళం వుంది. ఈ అంతరాళం బయట, ద్వారాని కిరువైపులా శంఖచక్ర గదా ధారులైన జయవిజయులు కాపలా కాస్తున్నారు. సుమారు 6 అడుగుల ఎత్తుగల పంచలోహమూర్తులైన ఈ జయవిజయుల చుట్టూ కటాంజనం నిర్మింప బడివుంది. వీరిని దాటి లోన ప్రవేశిస్తే ఐదారు అడుగుల చతురస్ర అంతరాళం వుంది. ఈ అంతరాళంలో నిలువబడి గర్భాలయంలోని శ్రీ భూవరాహస్వామిని దర్శించవలసి వుంటుంది.

అంతరాళం తర్వాతే గర్భాలయం. సుమారు 7 x 7 అడుగుల కొలతలతో వున్న గర్భాలయం మధ్యలో సుమారు ఒక అడుగు ఎత్తుగల శిలావేదికపై సుమారు రెండడగుల ఎత్తుగల శ్రీ భూవరాహస్వామివారి శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడివుంది. అదిగో! పై రెండు చేతుల్లో శంఖ చక్రాలు, ఎడమ తొడమీద భూదేవిని కూర్చొనబెట్టుకున్నట్లుగా వున్న, ఊర్ధ్వపుండ్రధారియైన శ్రీవరాహస్వామిని కన్నులారా దర్శించండి!

ఈ మూలమూర్తితోపాటు ఒక అడుగు ఎత్తు పంచలోహ వరాహమూర్తి, ఇంచుమించు అంతే ఎత్తుగల శ్రీవేంకటేశ్వరుని పంచలోహమూర్తి, కొన్ని సాలగ్రామాలు ఇక్కడ చోటుచేసుకున్నాయి.

శ్రీవరాహస్వామిదగ్గర వున్న సుమారు ఒక అడుగు చతురస్రాకార రాగి పలకయంత్రాన్ని తిలకించండి! అది శ్రీవేంకటేశ్వరుడు శ్రీవరాహస్వామి వారికి వ్రాసి ఇచ్చిన దాన పత్రమని చెప్పబడుతున్నది. దాని మీద బ్రాహ్మి లిపిని పోలిన వ్రాత వున్నది.

శ్రీవేంకటేశ్వరస్వామివారిఆలయ మహాప్రదక్షిణం ఆవరణలోనే వున్న ఈ వరాహస్వామిఆలయంలో ప్రత్యేకంగా ధ్వజస్తంభం లేదు. అందువల్లే శ్రీవరాహస్వామివారికి ప్రత్యేకంగా ఉత్సవాలు నిర్వహింపబడటం లేదు. అంతేగాక శ్రీ వేంకటేశ్వరస్వామివారి జన్మనక్షత్రం, శ్రీ వరాహస్వామి జన్మ నక్షత్రం కూడ శ్రవణమే. ఇద్దరూఒక్కరే కాక అభిన్నూలూ అయినందువల్ల శ్రీవేంకటేశ్వరునకు జరుగుతున్న ఉత్సవాలన్నీ ఈ వరాహస్వామివారికి జరిగినట్లేనని భావించవలసియున్నది.

క్రీ.శ.1800 ప్రాంతంలో ఈష్టిండియా కంపెనీ, ఆదాయం అతితక్కువగా వున్న శ్రీ వరాహస్వామి ఆలయాన్ని పర్యవేక్షించటానికి నిరాకరించినందువల్ల శిధిలావస్థకు గురి అయింది. తర్వాత 1900 ప్రాంతంలో దేవస్థానం అప్పటి అధికారిగావున్న మహంతు ప్రయాగదాసు శిధిలమైన వరాహస్వామి ఆలయంనుండి శ్రీవరాహస్వామి మూర్తులను సేకరించి, శ్రీవేంకటేశ్వర స్వామివారిఆలయంలోని ఇప్పటి అద్దాల మండపంలో భద్రపరిచారు. ఆ తర్వాత పదేళ్లకు శిధిలమైన వరాహస్వామిఆలయాన్ని ప్రత్యేక శ్రద్ధతో, భక్తితో పునరుద్ధరించి వరాహస్వామిని మహంతుప్రయాగదాసు పునః ప్రతిష్ఠించాడు. అప్పటినుంచి ఈ ఆలయం ఆలనాపాలనా శ్రీవేంకటేశ్వరుడే చూస్తున్నాడు.

ఇటీవల 1982 ఏప్రిల్ 21 నుండి 26 వరకు శ్రీవరాహస్వామి ఆలయానికి మహాసంప్రోక్షణ జరిగింది. శ్రీవరాహస్వామి మూలవరుల వేదిక ఎత్తును పెంచడం, శ్రీస్వామివారి చుట్టూ బంగారు మకర తోరణం అమర్చటం, ఆలయంపై పెద్దవిమాన నిర్మాణం, బంగారుకలశస్థాపన వంటి కార్యక్రమాలు ఘనంగా జరుపబడ్డాయి.

తిరుమల క్షేత్రంలో వెలసిన మొట్టమొదటి దైవం శ్రీ వరాహస్వామి. అందువల్లనే "తిరుమల" ఆదివరాహక్షేత్రమని ప్రసిద్ధి పొందింది. అందువల్లే శ్రీవేంకటేశ్వరుని దర్శించే భక్తులు, యాత్రికులు, ముందుగా స్వామి పుష్కరిణీ తీరంలో కొలువైవున్న భూసమేత శ్రీ ఆది వరాహస్వామివారిని దర్శిస్తారు.

క్షేత్ర సంప్రదాయం ప్రకారం మనమంతా ఈ వరాహస్వామివారిని తప్పక దర్శించుదాం. తానే మళ్లీ అనంతరకాలంలో ఇక్కడే ఈ క్షేత్రంలోనే శ్రీవేంకటేశ్వరునిగా వెలుగొందుతూ భక్తుల కోరిక లీడేరుస్తూ వున్న శ్రీ శ్వేత వరాహస్వామివారిని ఒక్కసారి ఇలా ప్రార్థిద్దాం!

*వరం శ్వేతావరాహాఖ్యం సంహారం ధరణీధరమ్*
*స్వ దంష్ట్రాభ్యాం ధరోద్ధారం శ్రీనివాసం భజే௨ నిశమ్.*

శ్రేష్ఠమైన అవయవాలతో విరాజిల్లేవాడును, భూదేవిని హరించిన హిర ణ్యాక్షుని సంహరించిన వాడును, తన కోరలచే భూమిని ఉద్ధరించినవాడును, శ్వేతవరాహుడును అయిన శ్రీనివాసుని ఎల్లప్పుడు భజింతునుగాక!!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

* * *

# కోనేటిగట్టు ఆంజనేయస్వామి

శ్రీవరాహస్వామిఆలయానికి ఎదురుగా కోనేటి ఆవలగట్టున అనగా సరిగా స్వామిపుష్కరిణికి ఈశాన్యమూలలో ఒక ఆంజనేయస్వామి ఆలయం వుంది. శ్రీ వరాహస్వామికి అభిముఖంగా నమస్కార భంగిమలో వున్న ఈ ఆంజనేయస్వామిని వ్యాసరాయలవారు (15వ శతాబ్ది) ప్రతిష్ఠించినారని ప్రతీతి!

ఈ కోనేటిగట్టు ఆంజనేయస్వామివారికి ప్రతి ఆదివారంనాడు పంచా మృతాభిషేకాదులు, నివేదనలు ఘనంగా జరుపబడుతున్నాయి.

*శ్రీమదాంజనేయ వరద గోవిందా!! గోవిందా!!!*

# బ్రహ్మాండనాయకుని బంగారుమేడ
## (తిరుమల శ్రీవారి ఆలయం)

శ్రీమహావైకుంఠంనుండి భువికి దిగి వచ్చిన శ్రీహరి సాక్షాత్తుగా కొలువై వుంటూ దివ్యదర్శనమిస్తున్న సుప్రసిద్ధ స్థలమే తిరుమల పుణ్యక్షేత్రం. కోటి మన్మథసదృశుడై అత్యంత మోహనరూపంతో కేవలం ఆ హరి కొలువై వుండటమే కాదు. మానవులందరి వేం పాపాలను, కటః నశింప జేసే "వేంకటపతి"ని తానేనంటూ ఆ మహావిష్ణువు చాటుకొంటూ ఈ కలియుగంలో అందరిపాలిట పెద్దదిక్కై "కలౌవేంకటనాయకః" అన్న బిరుదుతో సార్థకనామధేయుడై కీర్తి ప్రతిష్ఠలందిన స్వామి తిరుమల శ్రీనివాసుడు. శేషాచలం, గరుడాచలం, వేంకటాచలం, నారాయణాచలం, వృషభాచలం, వృషాచలం, అంజనాచలం అనే ఏడుకొండలమధ్య వెలసివున్నందువల్ల ఏడుకొండలవాడనీ, సప్తగిరీశుడనీ, వక్షఃస్థలంలో శ్రీమహాలక్ష్మిని ధరించినందువల్ల శ్రీనివాసుడనీ, తిరుమలలో నిలిచివున్నందువల్ల తిరుమలేశుడనీ, తిరుమలప్ప అనీ... ఇలా ఎన్నో పేర్లతో ఎన్నెన్నో పేర్లతో భక్తులచే పిలువబడుతున్న శ్రీవేంకటేశ్వరస్వామివారు కోరినవారి కల్పతరువు! పట్టినవారి చేతి బంగారం! ముట్టి కొలిచినవారి ముందుజీతం! సేవ చేసినవారి చేతిలోని మాణిక్యం! భావించువారి పరబ్రహ్మ! కావలెనన్నవారికి మనోరథసిద్ధి నిచ్చే గురుతైన దైవం! తన్మయించి నుతియించేవారి ఆనందరూపం!

భూమండలంపై 13°40' - 79°20' అక్షాంశరేఖాంశాలమీద సముద్రమట్టానికి 2800 అడుగులు మొదలు 3600 అడుగుల ఎత్తువరకు నెలకొని వ్యాపించి వున్న సప్తగిరుల శిఖర శ్రేణులమధ్య శ్రీమహావిష్ణువు స్వయంభువై వెలసి "ఆనందనిలయ"మనే బంగారుమేడలో దివ్యదర్శనం ఇస్తూ వున్నాడు. అదిగో! కన్నులు మిరుమిట్లు గొలిపేలా కోటిసూర్యతేజంతో అద్భుతంగా ప్రకాశిస్తూవున్న బ్రహ్మాండ నాయకుని బంగారుమేడ!అదే శ్రీహరివాసము! దర్శించండి!

అదిగో దర్శించండి! బంగారుమేడ! అందులోని ఒక్కొక్క మండపం ఒక్కొక్క భక్తుని త్యాగానికి ప్రతీక! భక్తికి నిదర్శనం! ఆ భవనంలోని ప్రతి

అడుగడుగూ భక్తుల విచిత్ర గాథలకు పట్టుగొమ్మలు! ప్రతి అణువణువూ ఆ గోవిందుని వరప్రదానానికి, భక్తానుగ్రహశీలానికి తార్కాణాలు! తరతరాలుగా ఎందరో భక్తులు తిరుమలేశునికి తమ తనువులనూ మనసులనూ మీదుకట్టి గుండెలనిండుగా నింపుకొన్న ఆ 'బంగారుమేడ' లోనికి ప్రవేశిద్దాం! ప్రవేశిస్తూ అందులోని విషయాలను, విశేషాంశాలను తెలుసుకుందాం రండి! నడవండి! ముందుగా ఒక్కసారి ఆ గోవిందుని ఆర్తిగా పిలవండి మరి!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 1. మహాద్వార గోపురం

అదిగో! ఆ కనబడేదే బ్రహ్మాండనాయకుని బంగారుమేడ (తిరుమల దేవాలయం) యొక్క ప్రధాన ప్రవేశద్వారం. సమస్త లోకాలకు అధిపతియైన తిరువేంకటగిరీశ్వరుని వైభవాన్ని వేనోళ్ల చాటుతూ వున్నట్లుగా మహోన్నతంగా పూర్వాభి (తూర్పు) ముఖంగా ప్రకాశిస్తూ వుంది! ఆ మహాద్వార గోపురానికి భక్తితో చేతులెత్తి దండాలు పెడదాం.

గోవింద! గోవింద!! గోవింద!!!

ఇలా స్వామిని స్మరిస్తూ వుండగానే ఇదిగో అప్పుడే మహాద్వారంవద్దకు వచ్చేశాం.

ఈ ప్రధాన ద్వారానికే 'పడికావలి' అని 'ముఖద్వార'మని, 'సింహద్వార'మని వేర్వేరు పేర్లు నిత్య వ్యవహారంలో ఉన్నాయి. తమిళంలో దీన్నే 'పెరియ తిరువాశల్' అని అంటారు. అనగా 'పెద్దవాకిలి' అని అర్థం.

ఈ మహాద్వారం మీద ఎత్తైన గోపురం నిర్మించటానికి అనువుగా బలిష్ఠమైన శిలలతో ద్వారానికి లోవైపు, వెలుపలివైపు ఇరుప్రక్కల 'చౌకట్టు' నిర్మింపబడింది. 38' x 32' కొలతలుగల దృఢమైన ఈ రాతి చౌకట్టుపై అనల్ప శిల్పకళాశోభితమైన ఐదు అంతస్తుల గోపురం నిర్మింపబడింది. ఈ గోపుర నిర్మాణం క్రీస్తుశకం 13వ శతాబ్దినుండి అంచెలంచెలుగా పెంపొందింపబడినట్లు తెలుస్తున్నది. అదిగో ఆ గోపురంపై సువర్ణరంజితాలై ధగ ధగ మెరుస్తున్న సప్త కలశాలను తిలకించండి! నేలమట్టంనుండి ఈ గోపురం ఎత్తు ఏబది అడుగులు.

ఈ మహాద్వారానికి అనుసంధింపబడివున్న ప్రాకారమే మహాప్రాకారం. ఇది స్వామివారిఆలయుంచుట్టూ పెద్ద పెద్ద శిలలతో సమున్నతంగా 4 అడుగుల మందంతో సుమారు 30 అడుగుల ఎత్తుతో నిర్మింపబడింది.

మనమిప్పుడు ఈ ప్రాకారాన్ని అనుసరించి వెళుతూ స్వామివారి ఆలయానికి మహా ప్రదక్షిణం చేసి వద్దాం.

ఈ మహా ప్రాకారకుడ్యం పొడవు ఉత్తర దక్షిణంగా 263 అడుగులు, తూర్పు పడమరగా 414 అడుగులు, మొత్తం చుట్టు కొలత 1354 అడుగులుగా అమరివుంది.

ఈ దేవాలయం చుట్టూ వున్న ప్రధానమైన పురవీధులు తూర్పు దిక్కున వున్న వీధిని తూర్పుమాడ వీధి అనీ, దక్షిణ దిక్కున, దక్షిణ మాడవీధి అనీ, పడమరదిక్కున పశ్చిమమాడవీధి అనీ, అలాగే ఉత్తర దిక్కున వున్నది ఉత్తరమాడవీధి అని అంటారు. అలాగే శ్రీ స్వామివారి మహాద్వార గోపురానికి ఎదరుగా శ్రీ బేడి ఆంజనేయస్వామి వారి ఆలయం వరకు వున్న వీధిని 'సన్నిధివీధి' అంటారు. ఈ దేవాలయానికి తూర్పుమాడ వీధి పొడవు 750 అడుగులు. దక్షిణపుమాడ, ఉత్తరపుమాడ వీధుల పొడవు ఒక్కొక్కటి 800 అడుగులు. పడమటిమాడ వీధి పొడవు 900 అడుగులు. ఈ నాలుగుమాడ వీధులగుండా ఆలయాన్ని చుట్టివచ్చే మార్గానికి మహా ప్రదక్షిణమార్గమని పేరు. ఈ మార్గంలోనే శ్రీవేంకటేశ్వరస్వామివారి ఉత్స వాలు, ఊరేగింపులు నిర్వహింపబడుతూ వుంటాయి. ఈ మహాప్రదక్షిణం మొత్తం విస్తీర్ణం 16 ఎకరాలు. ఈ ప్రదేశంలోనే శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయం, శ్రీవరాహస్వామివారి ఆలయం, శ్రీస్వామిపుష్కరిణి, పాత పుష్క రిణి షెడ్లు, శ్రీవారి అర్చకుల ఇండ్లు.... మొదలైనవన్నీ చోటు చేసికొని వున్నాయి. అయితే ఇటీవల నానాటికీ పెరుగుతున్న యాత్రికజనులరద్దీ దృష్ట్యా క్షేత్ర విస్తరణకోసం, ఈ ప్రదక్షిణ మార్గంలో వున్న మఠాలు సత్రాలు పడగొట్టి విశాలంగా తీర్చిదిద్దబడుతున్నది.

వీటిలో శ్రీవారి ఆలయం= 2.20 ఎకరాలు; పుష్కరిణి వైశాల్యం= 1.50 ఎకరాలు; పాత పుష్కరిణి క్యూషెడ్లు= 2.50 ఎకరాలు; వరాహస్వామి ఆలయం, మిగిలినవి= 10.00 ఎకరాలు — మొత్తం = 16.2 ఎకరాలు.

ఈ మహాద్వార ప్రవేశమార్గం చూశారా! ఈ మార్గం 32' x 99' పొడవు, వెడల్పులతో విరాజిల్లుతూ వుంది.

ఈ ప్రవేశమార్గంలో తూర్పునకు, పడమటికి రెండువైపుల సరిసమాన దూరంలో రెండు చెక్కడపు రాతి ద్వార బంధాలు బిగించబడ్డాయి. బయటివైపువున్న మొదటి ద్వారబంధానికి ఎత్తైన రెండు పెద్దచెక్కవాకిళ్లు అమర్చబడి వున్నాయి. ఈ వాకిళ్లు చిరుగంటలతో అలంకృతాలై ఉన్నాయి. ఈ రెండు వాకిళ్లలో ఉత్తరంవైపున ఉన్న వాకిలిలో చిన్న తలుపు ఏర్పరుప బడివుంది. మహాద్వారం మూసి వుంచి నప్పుడు ఆవశ్యకత ననుసరించి ఆయా సమయాల్లో ఆలయ సిబ్బంది మాత్రం ఈ చిన్న తలుపు ద్వారా రాకపోకలు సాగిస్తూ వుంటారు.

ఇటీవలే (1996 జనవరి) ఈ పెద్దవాకిళ్లకు ఇత్తడిరేకు తాపబడింది చూడండి! అందువల్ల దీనిని "ఇత్తడి వాకిళ్లు" అనవచ్చు. లోపల 'వెండివాకిళ్లు, బంగారువాకిళ్లు' వున్నాయి. వాటినిగూర్చి తర్వాత తెలుసుకుందాం.

'నిత్యకల్యాణం - పచ్చతోరణం' అన్నప్రసిద్ధికి తగినట్లుగా, పచ్చనిమామి డాకు తోరణాలతో, ఎత్తైన అరటిస్తంభాలతో ఈ పడికావలి ప్రవేశద్వారం నిత్యమూ కళకళలాడుతూ వుంటుంది.

శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించటానికిగాను, భక్తులు వైకుంఠం క్యూ ద్వారా లేదా పాతపుష్కరిణి షెడ్లద్వారా మాత్రమే వచ్చి ఇదిగో ఇచ్చట ఈ మహాద్వారంలో ప్రవేశించవలసివుంటుంది.

ఇక ఈ మహాద్వారం గుండా ఆలయంలోనికి ప్రవేశిద్దామా!

రండి! ప్రవేశిస్తూ ఒక్కసారి ఆ గోవిందుని గట్టిగా స్మరించండిమరి!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 2. శంఖనిధి - పద్మనిధి

కాస్త ఆగండాగండి! ఇటు చూడండి. ఈ మహాద్వారానికి ఇరుప్రక్కల విడుపుల్లో ద్వారపాలకులవలె సుమారు రెండడుగుల ఎత్తు పంచలోహ విగ్రహాలు కనిపిస్తున్నాయి కదూ! వీరే శ్రీవేంకటేశ్వరస్వామివారి సంప దలను నవనిధులను రక్షించే దేవతలు! ఇందులో ఎడమవైపున అంటే

దక్షిణదిక్కున ఉన్న రక్షక దేవత, రెండు చేతుల్లోను రెండు శంఖాలు ధరించి ఉండటం గమనించండి! ఈయన పేరు 'శంఖనిధి'. ఇలాగే కుడివైపున అంటే ఉత్తరదిక్కున ఉన్న రక్షకదేవత చేతుల్లో రెండు పద్మాలు ధరింపబడివున్నాయి. ఈయన పేరు 'పద్మనిధి'.

ఈ నిధిదేవతల పాదాలవద్ద ఆరంగుళాల పరిమాణంగల రాజవిగ్రహం నమస్కార భంగిమలో నిల్చొని వుండడం గమనించండి! ఈ విగ్రహం విజయనగర రాజైన అచ్యుతదేవరాయలది. బహుశా అచ్యుతరాయలే ఈ నిధిదేవతామూర్తులను ప్రతిష్ఠించి వుంటాడనవచ్చు.

ఆగమశాస్త్రం ప్రకారం సాధారణంగా ఈ నిధి దేవతలను ఆలయానికి మూడవ ప్రాకార ప్రవేశద్వారంవద్ద ఏర్పాటు చెయ్యడం సంప్రదాయం. దీన్నిబట్టి తిరుమల ఆలయం మూడు ప్రాకారాలు కలిగిన ఆలయమని ఈ నిధి దేవతల ప్రతిష్ఠవల్ల స్పష్టమవుతున్నది. ఆలయంయొక్క మొదటి ఆవరణ ముక్కోటి ప్రదక్షిణం, రెండవది విమాన ప్రదక్షిణం, మూడవది సంపంగి ప్రదక్షిణం.

ఈ ప్రదక్షిణ మార్గాలను గూర్చి తర్వాత వివరంగా తెలుసుకుందాం. మహాద్వారదేవతలైన ఈ శంఖనిధికి, పద్మనిధికి భక్తితో నమస్కరించి ఇప్పుడు ఆలయంలోపల అడుగిడదాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 3. కృష్ణరాయ మండపం

మహాద్వారానికి ఆనుకొని లోపలివైపు 16 స్తంభాలతో 27' x 25' కొలతలు గల ఎత్తైన మండపం నిర్మింపబడివుంది. ఈ మండపాన్ని కృష్ణరాయమండపమని, ప్రతిమా మండపమని అంటారు. ఈ మండపం విజయనగర శిల్ప సంప్రదాయ రీతిలో నిర్మింపబడింది.

ఈ మండపంలో కుడివైపున ఉన్న ఈ నిలువెత్తు రాగి విగ్రహాలను చూడండి!

ఆహాహా! సాహితీ సమరాంగణ సార్వభౌముడు! విజయనగర సామ్రాజ్య చక్రవర్తి శ్రీకృష్ణరాయలవారు! వారికి ఇరుప్రక్కల ఆయన దేవేరులైన

తిరుమందేవి, చిన్నాదేవులు — ఈ ముగ్గురు శ్రీ వేంకటేశ్వరునికి ఎదురుగా నిల్చొని ప్రాంజలి ఘటిస్తున్న భక్త వేషంలో ప్రతిష్ఠితులై ఉన్నారు! క్రీస్తుశకం 1517 సంవత్సరంలో జనవరి 2వ తేదీన శ్రీకృష్ణరాయులవారే స్వయంగా తమ విగ్రహాలను ఇక్కడ ప్రతిష్ఠించుకొన్నాడు! ఈ విగ్రహాల భుజసీమల్లో వారి నామధేయాలు లిఖింప బడివున్నాయి చూడండి! ఆనాటినుండి ఇది కృష్ణరాయమండపమని ప్రశస్తి పొందింది!

శ్రీకృష్ణదేవరాయులు క్రీ.శ 1513 నుంచి 1521 వరకు ఏడుసార్లు తిరుమల యాత్ర చేశాడు. 1513 ఫిబ్రవరి 10 న తొలిసారిగా రాణులతోపాటు వచ్చిన రాయలు శ్రీవేంకటేశ్వరునికి ఒక నవరత్న కిరీటం, 25 వెండి పళ్లాలు ఇవ్వగా, ఆయనరాణులు శ్రీస్వామివారి పాల ఆరగింపునకుగాను రెండు బంగారు గిన్నెలు ఇచ్చారు. ఆ తర్వాత రాయలొక్కరే 1513 మే 2న; జూన్ 13న - ఇలా నెలతేడాతో రెండుమార్లు తిరుమలకు వచ్చి శ్రీస్వామివారి మూలవిరాట్టునకు అమూల్యమైన ఆభరణాలు, ఉత్సవ మూర్తులకు మూడు మణిమయ కిరీటాలు సమర్పించుకున్నాడు. నిత్యనైవేద్యానికి గాను ఐదు గ్రామాలను ఇనాములుగా సమర్పించాడు. ప్రతిసంవత్సరం తమిళనెల 'తై' మాసంలో తన మాతాపితరుల ఆత్మోద్ధరణకై ఉత్సవం ఏర్పాటు చేశాడు. క్రీ.శ 1514 జూలై 6న నాల్గవసారి దర్శించి శ్రీస్వామివారికి 30 వేల వరహాలతో కనకాభిషేకం చేశాడు. నిత్యారాధనకై "తాళ్లపాక" గ్రామాన్ని దానమిచ్చాడు. ఇక 1515లో విజయనగరంలోనే వుండి కృష్ణరాయలు శ్రీవారికి రత్నాలు పొదిగిన బంగారు మకరతోరణం సమర్పించుకొన్నాడు. ఆ తర్వాత 1517 జనవరి 2 న ఐదవసారి తిరుమలకు వచ్చి తమ విగ్రహాల్ని స్వయంగా ప్రతిష్ఠించుకొన్నాడు. 1518 సెప్టెంబరు 9న ఆనందనిలయ విమానానికి 30 వేల వరహాలతో బంగారు మలాము చేయించాడు. 1518 అక్టోబరులో ఆరవసారి, 1521 ఫిబ్రవరి 17న ఏడవసారి కృష్ణదేవరాయలు తిరుమలను సందర్శించి శ్రీనివాసునికి అపురూపమైన నవరత్నాల కుళ్లాయిని, పీతాంబరాన్ని సమర్పించాడు.

భక్తితోపాటు త్యాగాన్ని పుణికి పుచ్చుకొని, తిరుమలేశుని 'బంగారు మేడ' ముంగిట్లో అతి నిరాడంబరంగా నమస్కార భంగిమలో నిలుచున్న ఈ తెలుగువల్లభుడు నిత్యమూ సంస్తవనీయుడు!

అలాగే ద్వారానికి ఎడమప్రక్కన నిలువెత్తు రాగిప్రతిమ నమస్కార భంగిమలో ప్రతిష్ఠింప బడివుంది చూశారా! ఇది చంద్రగిరి రాజైన వేంకటపతిరాయలవారిది. క్రీస్తుశకం 1570 ప్రాంతంలో చంద్రగిరిని పాలించిన చక్రవర్తి ఈయన!ఆలయరక్షణతోపాటు ఎన్నో కానుకలు పెట్టిన ఉదారశీలి ఈ వెంకటపతిరాయలు.

వెంకటపతిరాయల విగ్రహానికి ఆనుకొని దక్షిణంవైపున అచ్యుత రాయలు, ఆయనరాణి వరదాజి అమ్మాణ్ణి - ఈ రాజదంపతుల నిలువెత్తు నల్లరాతి ప్రతిమలు నమస్కారం చేస్తున్న భక్తవేషంలో ప్రతిష్ఠింప బడి వున్నాయి. అచ్యుతదేవరాయలు తిరుమలలో శ్రీస్వామివారిఆలయంలో శ్రీస్వామివారిబంగారుశంఖంతో పోయబడిన పవిత్రతీర్థజలాలతోనే విజయ నగరసామ్రాజ్య చక్రవర్తిగా పట్టాభిషేకం చేసికొన్నాడని చరిత్ర చెబుతూ వుంది! క్రీ.శ. 1530లో "అచ్యుతరాయ బ్రహ్మోత్సవం" అని తనపేరిట తిరుమలలో ఒక బ్రహ్మోత్సవాన్ని కూడ అచ్యుతరాయలు జరిపించాడు. ఇంతమాత్రమేగాక తిరుమల ఆలయానికి ఎన్నో గ్రామాలను, ఇనాములుగా సమర్పించిన భక్తశిఖామణి ఈ మహారాజు!

ఇలా శ్రీస్వామివారి ఆలయం ముంగిట్లో నెలకొల్పబడిన ఈ రాజులు, రారాజుల ప్రతిమలను చూస్తూవుంటే మనకు ఏమని తోస్తోందో తెలుసా!

"ఎంతటి చక్రవర్తులైనా రాజులైనా రారాజులైనా సర్వజగత్సార్వభౌము డైన ఆ శ్రీనివాసచక్రవర్తి సమక్షంలో ఎంతటివారు? ఏపాటివారు? సర్వజగద్రక్షకుడైన శ్రీవేంకటప్రభువుల దయతో లభించినవే మా రాజ్యాలూ, మా భోగాలూనూ!" అని వినయ విన్రమంగా, మౌనంగా ప్రకటిస్తూ మనల్ని ప్రబోధిస్తూ వున్నట్లు వుంది కదూ!!

క్రీస్తుశకం 16వ శతాబ్దం పూర్వార్ధంలో నిర్మింపబడిన ఈ మండపం స్తంభాలమీది శిల్పాలలో శివధనుర్భంగం - శ్రీ రామపట్టాభిషేకం - అశోక వనంలో సీతాహనుమంతుల సమాగమం - శ్రీ కృష్ణలీలలు, శంఖుచక్రాలు, ఊర్ధ్వపుండ్రాలు మున్నగు శిల్పాలు ఎంతో మనోహరంగా చెక్కబడివున్నాయి. కన్నులారా తిలకించండి!

ఈ మండపానికి మరో ప్రత్యేకత కూడా ఉంది. శ్రీస్వామివారు తిరుమల పురవీధుల్లో ఊరేగివచ్చిన అనంతరం ఆలయప్రవేశంచేసిన వెంటనే ఈ ప్రతిమామండపంలో కొంతసేపు నిలుస్తారు. ఆ సమయంలో జియ్యంగారులు మొదలైన శ్రీవైష్ణవ ఆచార్యపురుషులు దివ్యప్రబంధాన్ని గానంచేస్తూ స్వామివారిని కీర్తిస్తారు. పిదప శ్రీస్వామివారికి ఘనంగా మంగళనీరాజనం ఇవ్వ బడుతుంది. అటుపిమ్మట శ్రీ స్వామివారు ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా ఆలయం లోపలికి వెళ్లుతారు.

ఇలా ఇన్ని విధాలుగా ప్రశస్తినందిన ఈ కృష్ణరాయమండపం చరిత్ర ఇది!

జనసేవతోపాటు, జనార్దనుని సేవకై తరతరాలుగా అంకితమైన ఈ తెలుగు ప్రభువులను తిరుమలేశుని ముంగిట్లో, 'బంగారుమేడ'కాంతుల్లో శాశ్వతంగా ప్రకాశింపజేస్తూ, మనందరిలో భక్తిని మరింత ఇనుమడింపజేస్తూ వున్న ఈ ప్రతిమా మండపంవద్ద శ్రీస్వామివారికి ఒక్కసారి మనసారా జేజేలు పలకండి మరి!

*జయ జయహో గోవిందా!*
*సర్వజగత్సార్వభౌమా!!*
*జయ జయ హో గోవిందా!!!*

## 4. అద్దాలమండపం

ఇదిగో ఇటురండి! కుడివైపు చూడండి. ప్రతిమా మండపానికి ఉత్తరం దిక్కున పంద్రెండడుగుల దూరంలో వున్న విశాలమైన మండపాన్ని చూడండి.

ఇది ఎత్తైనఅధిష్ఠానంమీద నిర్మింప బడివుంది. దీన్నే అద్దాలమండప మని, అయినామహల్ అని అంటారు. హిందీలో 'అయినా' అంటే అద్దమని అర్థం. ఈ 'అయినామహల్'లో ముఖమండపం, అంతరాళం అని రెండు భాగాలున్నాయి. 43' x 43' కొలతలున్న ముఖమండపంలో తూర్పున ఉత్తరంవారగా శ్రీస్వామివారి అన్నప్రసాదాలు అమ్మే అరలు వుండేవి. ఈ అరల్లో అర్చకులు తమవంతుకు వచ్చే శ్రీస్వామివారి ప్రసాదాలను భక్తులకు

తగిన వెలకు విక్రయించేవారు. ఈ అరల ప్రాంతాన్నే 'ప్రసాదం పట్టెడ' అంటారు. ప్రస్తుతం అర్చకుల వంతుకువచ్చే ప్రసాదాలను దేవస్థానంవారే స్వీకరించి ఉచితంగా భక్తులకు వితరణచేస్తున్నందువల్ల ఈ ప్రసాదం పట్టెడ అరలు తీసివేయబడినాయి.

ఈ మండపంలో పడమటి భాగాన తూర్పుముఖంగా 42' x 42' కొలతలతో నిర్మింపబడ్డ అంతరాళమే అద్దాలమండపం. ఈ అంతరాళం మధ్యలో నాలుగుస్తంభాల చతురస్ర మండపం ఉంది. అందులో డోలోత్సవానికి అనువుగా గొలుసులు వేలాడదీయబడి వున్నాయి. ఈ చతురస్ర మండపం చుట్టూ ప్రదక్షిణమార్గం ఏర్పాటు చేయబడింది. ఈ చతురస్రమండపం చుట్టూ వున్న గోడలకు, పై కప్పునకు అంతటా అన్నివైపులా పెద్దపెద్ద అద్దాలు బిగింప బడ్డాయి. ఈ మండపంలోని ఊయలలో వేంచేసి ఊగుతున్న శ్రీస్వామివారి రూపం అద్దాల్లో అన్నివైపులా ప్రతిబింబించి శ్రీవేంకటేశ్వరస్వామివారి సర్వవ్యాపకత్వం ద్యోతకమవుతూ వుంటుంది. ఆ దివ్యదర్శనం కళ్లారా చూచి తీరవలసిందేకాని, నోటితో చెప్పడానికి మాటలు చాలవు.

ఈ అద్దాల మండపంలో మధ్యాహ్నం రెండు గంటల సమయంలో శ్రీస్వామివారికి డోలోత్సవం జరుగుతుంది. నిర్ణీతరుసుమును చెల్లించిన గృహస్థులు మాత్రమే ఈ సేవలో పాల్గొనే అవకాశముంది. ఆ వివరాలు మరోచోట మనవి చేస్తాను.

ఈ డోలోత్సవం ఉత్తరభారతం నుంచి వచ్చిన సేవావిధానం. ఇది దేవస్థాన మహంతులవల్ల తిరుమలక్షేత్రంలో ప్రవేశపెట్టబడి వుండవచ్చు. క్రీస్తుశకం 1831 నాటికే ఈ అద్దాల మండపంలో డోలోత్సవం జరుపబడుతున్నట్లు దాఖలాలు ఉన్నాయి.

అదిగో శ్రీనివాసుని సర్వ వ్యాపకత్వాన్ని ప్రతిబింబింపజేస్తున్న ఈ అద్దాలమండపం వద్ద ఒక్కసారి తిరుమలేశుని నోరారా కీర్తిద్దాం:

**అణువులోపలి నీవు ఆదిమహత్తును నీవు**
**ప్రణుత శ్రీవేంకట ప్రచుర నిలయా!**

*అణిమాది విభవా ఆద్యంతరహితా!*
*గణుతించి నాపాలఁ గలుగవే నీవు!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఇక రంగనాయక మండపం దర్శించుదాం! అటు పదండి!

## 5. రంగనాయక మండపం

అద్దాల మండపానికి ఎదురుగా, కృష్ణరాయ మండపానికి దక్షిణపు వారకు ఎత్తైన శిలావేదికపై నిర్మింప బడిన ఆ విశాలమైన మండపమే "రంగనాయక మండపం". దీన్నే "రంగమండపం" అని కూడ అంటారు.

108 అడుగుల పొడవు, 60 అడుగుల వెడల్పు కలిగి ఎత్తైన రాతి స్తంభాలతో అనల్ప శిల్ప శోభితమై విరాజిల్లుతూ వున్న ఈ రంగమండపం లోపల ఆ చివరకు అంటే దక్షిణం వారకు 12 అడుగుల చతురస్రాకార మందిరం వుంది. ఈ చిన్న మందిరంలో శ్రీరంగనాథుడు కొంతకాలం కొలువై వుండి పూజలు చేయించుకున్నాడట! క్రీస్తుశకం 1320-1360 సంవత్సరాలమధ్య మహమ్మదీయ దండయాత్రల వల్ల శ్రీరంగక్షేత్రంలోని శ్రీరంగనాయకుల ఉత్సవమూర్తులను తిరుమలకు చేర్చి ఈ మండపంలో నెలకొల్పి రక్షిస్తూ నిత్యపూజా నివేదనలు చేశారట! ఆ తర్వాత తురకల హాళాహాళి తగ్గిన తర్వాత యథాప్రకారంగా ఆ విగ్రహాలను మరల శ్రీరంగానికి తీసుకొని వెళ్లడం జరిగింది. ఈ హేతువు చేతనే ఈమండపం "రంగమండపం" అని "రంగనాయకుల మండపం" అని పిలువ బడుతున్నది. మాలికాఫర్ దండయాత్రల బారినుండి కాపాడుతూ శ్రీరంగనాథుని ఉత్సవ విగ్రహాలను తిరుమలకుచేర్చి పూజలు చెయ్యటం కోసమే ఈ మండపాన్ని "రంగనాథయాదవరాయలు" అనే తిరుపతి ప్రాంత పాలకుడు కట్టించినట్లు చెబుతారు.

శ్రీరంగనాథుడు తిరుమలలో ఈమండపంలో వేంచేసి వున్న సందర్భం లోనే, శ్రీరంగనాథుని పూజావిశేషాలు, ధనుర్మాసంలో తిరుప్పావై పఠనం,

ఉత్సవాల్లో, సేవల్లో ద్రావిడ దివ్య ప్రబంధ పారాయణం వంటివి తిరుమల స్వామివారి సన్నిధిలో సైతం ప్రవేశపెట్టబడినాయని చెప్తారు.

చూశారా! శ్రీరంగనాథుని స్మరింపజేసిన ఈ మండపం వెనుక ఎంతచరిత్ర దాగి వుందో! ఒక్కసారి ఆ రంగణ్ణి కూడా స్మరిద్దాం.

*శ్రీరంగ! రంగ! రంగా!!*
*కావేటి రంగ! రంగా! శ్రీరంగా!!*

ప్రస్తుతం వాహనమండపంగా ఉపయోగింపబడుతూవున్న ఈ రంగ మండపంలో ఆర్జిత వసంతోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం, వాహనసేవలు నిర్వహింపబడుతూ వున్నాయి. ఈ రంగనాయకుల మండపం నడుమ కొలువై వున్న ఏడు తలల బంగారు శేషవాహనాన్ని తిలకించి పులకించండి ! చూపరులకు గగుర్పాటును కలిగించే ఈ వాహనాన్నే "పెద్దశేష వాహనం అంటారు.

*వీడు గదే శేషుడు! శ్రీ వేంకటాద్రి శేషుడు!*
*వేడుక గరుడనితోఁ బెన్నుద్దైన శేషుడు!!*

ఈ రంగమండపానికి మరో ప్రత్యేకత ఉంది. శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ఉత్సవమూర్తి (మలయప్పస్వామి) ఉభయదేవేరులతోకూడ ఆనందనిలయం నుండి ఏతెంచి సంవత్సరంలో రెండు పర్యాయాలు, చాలకాలంపాటు ఈ మండపంలో కొలువై వుంటాడు ఆ రెండు పర్యాయాలు

1. దసరా బ్రహ్మోత్సవాల్లో ధ్వజారోహణం అయిన నాటినుండి దీపావళి వరకు సుమారు ఒక నెలరోజులపాటు ఈ రంగమండపంలోనే కొలువుదీరి వుంటూ పూజా నైవేద్యాలు స్వీకరిస్తారు.
2. వైకుంఠ ఏకాదశికి పదకొండు రోజులు ముందుగా ఆరంభమై సుమారు 25 రోజులపాటుసాగే అధ్యయనోత్సవాల్లో కూడ శ్రీదేవి భూదేవీ సమేతంగా వున్న శ్రీమలయప్పస్వామివారు ఈ రంగమండపంలో వేంచేసి అర్చనలు, నైవేద్యాలు స్వీకరిస్తాడు.

ఒకప్పుడు ఈ రంగనాయక మండపం లోనే శ్రీ స్వామివారికి నిత్య కల్యాణోత్సవాలు జరిగేవి. రాను రాను భక్తజనుల సమ్మర్దం పెరిగినందువల్ల

కల్యాణోత్సవాలు సంపంగి ప్రదక్షిణంలో దక్షిణంవైపున ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన మండపంలో జరుపబడుతూ వున్నాయి.

శ్రీస్వామివారి దర్శనానంతరం, దేశాధిపతులు రాష్ట్రాధిపతులు మున్నగు వారికి ఈ రంగమండపంలోనే వేదపండితుల ఆశీస్సులతోపాటు దేవాలయ అధికారులు శ్రీస్వామివారి ప్రసాదాలను అందజేస్తారు.

తర తరాలుగా ఎంతో పవిత్రతను వైభవాన్ని సంతరించుకొన్న ఈ రంగమండపం దగ్గర గట్టిగా అందరం గోవిందనామాన్ని స్మరిద్దాం.

*గోవిందా! గోవిందా !! గోవింద!!!*

## 6. తిరుమలరాయ మండపం

రంగనాయక మండపాన్ని ఆనుకొనివున్న ఈ తిరుమలరాయమండపాన్ని చూద్దాం కదలిరండి! తిరుమలేశుడు భక్తులపై చూపుతున్న తరగని ఉదారత్వానికి మచ్చుతునక ఈ తిరుమలరాయుని మండపం.

ధ్వజస్తంభ మండపానికి 10 అడుగుల దూరంలో దక్షిణదిక్కున ఎత్తైన రాతి స్తంభాలతో కనబడే ఈ నిర్మాణాన్ని పరికించండి. 77 x 38 అడుగుల పొడవు వెడల్పులుగల ఈ మండపం రెండు అంచెలుగా నిర్మింపబడింది. మొదటి అంచె దక్షిణపుదిక్కున 42 x 38 అడుగుల కొలతలతో ఎత్తైన వేదికగాను, ఉత్తరంవైపున అంటే ధ్వజస్తంభమండపం వైపు తగ్గుగా నేలమట్టానికి సమంగా వుండి, వేదికపై జరిగే ఉత్సవాలను భక్తులు తిలకించడానికి వీలుగా ఎత్తైన స్తంభాలతో 38 x 35 అడుగుల కొలతలుగల సభా ప్రాంగణమండపంగాను ఏర్పాటు చెయ్యబడింది.

ఆ తిరుమలస్వామి ఎలాంటి కోరికలు తీర్చాడో! ఎలాంటి వరాలు ఇచ్చాడో! ఎలాంటి విజయపరంపరలు చేకూర్చాడో మరి! అందుకు మొక్కుగా విజయనగరచక్రవర్తియైన సాళువ నరసింహరాయలు శ్రీస్వామివారికి "అన్నా ఊయల తిరునాళ్ల" అనే ఉత్సవాన్ని నిర్వహించే నిమిత్తం క్రీస్తుశకం 1473 లో ఈ మండపంలోని ఎత్తైన వేదికను నిర్మించాడు. 'అన్నా' అనే పదానికి తమిళంలో 'హంస' అని అర్థం. ఊయలగా కట్టబడిన హంసతూలికలో శ్రీవేంకటేశ్వరస్వామివారు వెనుకకు ముందుకు

ఉభయనాంచారులతో కలిసి ఊగుతూవుండగా భక్తులు ఈ ఉత్సవాన్ని నేత్రపర్వంగా తిలకించేవారట!

మిథునమాసం (ఆణినెల) (జూన్-జూలై నెలలమధ్య)లో పదిరోజుల పాటు జరిగే ఈ అన్నా ఊయలఉత్సవం, భక్తుల హృదయాలను ఆనంద పుటుయ్యాల లూగించేది. కాలాంతరంలో ఈ ఉత్సవం నిలిచిపోయింది.

అళియ రామరాయల సోదరుడు ఆరవీటివంశ చక్రవర్తి అయిన తిరుమలరాయలు క్రీస్తుశకం 16 వ శతాబ్దం ఉత్తరార్థంలో ఈ మండపాన్ని విస్తరింపజేశాడు. ఇందువల్లే ఇది 'తిరుమలరాయ మండపం' అనే పేరిట పిలువ బడుతూవుంది. ఇలా తనవంతుకానుకగా తిరుమలరాయలు విస్తరింప జేసి నిర్మించిన ఈ మండపంలో ప్రతి సంవత్సరం వార్షిక వసంతోత్సవం నిర్వహించే ఏర్పాటు చేశాడు. అంతేకాదు. ఆ సందర్భంలో 'తిరుమల రాయని పొంగలి' అనే పొంగలి ప్రసాదాన్ని తన పేరుతో ప్రత్యేకంగా శ్రీస్వామివారికి నివేదన చేయించి భక్తులకు పంచిపెట్టిన వితరణశీలి ఈ రాజమణి! ఆ తర్వాతికాలంలో ఈ రాజు ఏర్పాటు చేసిన ఉత్సవం కూడా అర్థాంతరంగానే నిలిచిపోయింది.

ప్రస్తుతం బ్రహ్మోత్సవసమయంలో ధ్వజారోహణవేళ మాత్రమే శ్రీ స్వామివారు ఈ తిరుమలరాయమండపంలో అద్భుత శిల్పశోభితమైన 6 అడుగుల చతురస్రశిలావేదికపై వేంచేస్తారు. ఆ సమయంలో పూజా నివేదనలు హారతులు వైభవోపేతంగా జరుగుతాయి.

ప్రస్తుతం ఈ తిరుమలరాయ మండపంలోనే ప్రతినిత్యం ఉభయ సంధ్యలలో 'కొలువుమేళం' అనబడే మంగళవాద్యాలు శ్రీస్వామివారికి విని పించబడతాయి. సూర్యోదయవేళ (6 నుండి 6-30 గంటల మధ్య) శ్రీస్వామివారికి మంగళగీతికగా విన్పించే శుభప్రదమైన ఈ కొలువు మేళాన్ని 'హరికొలువు' అంటారు. అలాగే తిరుమల శ్రీస్వామివారికి సమర్పింప బడుతూవున్న మంగళగీతికయే, దివ్యనీరాజనమే ప్రస్తుతం మీరు చదు వుతూవున్న ఈ "హరికొలువు" రచనకూడా. ఇక సూర్యాస్తమయ సమయంలో (5-30 - 6-00 గంటలమధ్య) వాయించబడే కొలువు

మేళానికి 'సందె కొలువు' అని అంటారు. ఉభయసంధ్యల్లో వాయించబడే "కొలువుమేళం"లో మేళం, డోలు, నగారాలు మోగించబడతవి.

నిత్యకళ్యాణచక్రవర్తి అయిన శ్రీనివాసుని వరప్రదానానికి గుర్తుగా ఇరువురు చక్రవర్తులు భక్తి ప్రపత్తులతో నిర్మించి, కానుకలుగా సమర్పణం చేసుకొన్న ఈ మండపనిర్మాణాలు ఆశ్చర్య ఆనందసంధాయకాలై వరలుతూ వున్నాయి! ఇలా తెలుగు ప్రభువుల త్యాగనిరతినీ, భక్తినీ తెలుగువారి ఇలువేలుపు అయిన తిరుమలేశుని భక్తప్రియత్వాన్నీ చాటుతూవున్న ఈ మండపంవద్ద ఒక్కసారి ఆర్తిగా ఆర్ద్రంగా శ్రీనివాసుణ్ణి ఎలుగెత్తి స్మరిద్దాం!

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 7. తులాదండం

ఇక ఈ తిరుమలరాయమండపంలోనే అటు ఉత్తరం వరకు చూడండి! అక్కడ ఒక పెద్ద తులా దండం (త్రాసు, తక్కెడ) వేలాడుతూ కనిపిస్తున్నది కదా!

శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో సంతానం కలిగినవాళ్లు తన బిడ్డల బరువుకు సరిసమానంగా ధనం, కలకండ, బెల్లం, కర్పూరం ఇలా తమకు నచ్చిన ద్రవ్యాల్ని ఇక్కడ ఈ పెద్దత్రాసు ద్వారా తులాభారంగా శ్రీస్వామివారికి సమర్పిస్తారు. అలాగే రోగవిముక్తులు అయినవారుకూడా.

ఈ త్రాసు ఇటీవలనే ఈ మండపంలో ఏర్పాటు చేయబడింది. అంతకుముందు ఇది లోపల 'హుండీ'కి సమీపంలో ఉండేది. ప్రస్తుతం (2001) ప్రతిమామండపానికి దక్షిణదిక్కున రంగనాయక మండపం ముందుభాగాన ఏర్పాటు చెయ్యబడింది.

భక్తుల భక్తి తత్పరతను కొంతలో కొంత వరకైనా కొలిచి చూపిస్తూ, తద్వారా శ్రీనివాసుని అనుగ్రహతత్వాన్నీ, దయనూ ప్రస్ఫుటం చేస్తూవున్న ఈ తులాదండానికి మనసారా జోతలు పెట్టండి మరి!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 8. రాజా తోడరమల్లు

ఇటువైపు చూడండి! ఈ తిరుమల రాయమండపంలోనే వాయువ్య మూలన నాలుగు స్తంభాలమధ్య అంటే సరిగ్గా ధ్వజస్తంభ మండపానికి సుమారు పది అడుగుల దూరంలో దక్షిణంగా శ్రీస్వామివారికి అభిముఖంగా నమస్కరిస్తూవున్న భంగిమలో ముగ్గురి భక్తుల నిలువెత్తు రాగి విగ్రహాలు మనకు దర్శనమిస్తూవున్నాయి. ఈ విగ్రహాల భుజాలపై పేర్లుకూడా ఉన్నాయి చూడండి! వీరిలో ఒకరిపేరు 'లాలాఖేమరాము'. ప్రక్కన అతని తల్లి 'మాతా మోహనదేవి' ఆ ప్రక్కన ఆయన భార్య 'పితాబీబీ!'

తలపాగా ధరించివున్న ఈ లాలాఖేమరాము క్షత్రియుడు. ఈతనినే 'రాజాతోడరమల్లు' అని పిలుస్తారు. ఈయన ఆర్కాటు నవాబైన సాదతుల్లాఖాన్ కొలువులో అతని ప్రతినిధిగా 'కర్ణాట ప్రాంతాన్నంతటినీ పర్యవేక్షించిన ప్రధానాధికారి'.

క్రీస్తుశకం 17వ శతాబ్దంలో అటు తురకల దాడి నుండి, ఇటు ఆంగ్లేయుల దాడినుండి తిరుమలక్షేత్రాన్ని కాపాడిన పరాక్రమశాలి, భక్తాగ్రణీ! ఇతడు!

శ్రీనివాసుని సేవకు అంకితమై నిలిచివున్న ఈ భక్తకుటుంబాన్ని చూస్తుంటే మీకు ఏమనిపిస్తుంది? "ఆహాహా! ఇలా కుటుంబాన్ని అంతటిని ఆకర్షించుకొని సేవలు చేయించుకొంటూ తనసన్నిధిలో శాశ్వతంగా నిలుపుకొన్న తిరుమలేశుని భక్తప్రియత్వం, భక్తపక్షపాతం ఎంతటిదో..... ఎంతెంతటిదోకదా!" అని ఎనలేని ఆనందం కలుగుతూవున్నదికదూ!!

శ్రీనివాసుని అనుగ్రహాన్ని సంపూర్ణంగా పొందిన ఈ భక్తకుటుంబానికి వందనాలు సమర్పించి ముందుకు నడుద్దాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 9. ధ్వజస్తంభ మండపం

మరి ఇప్పుడు మనం ఎక్కడ నిలబడి వున్నామో గమనించారా!

ప్రతిమా మండపానికి, అద్దాలమండపానికి, రంగనాయక మండపానికి మధ్యలో చతురస్రంగా ఏర్పడివున్న ఆరుబయలు ఖాళీస్థలంలో నిలిచివున్నాం.

ఇక్కడ నిలబడి ఎట్ట ఎదురుగా చూడండి! బంగారుధ్వజస్తంభం. శ్రీ స్వామివారి వరప్రదానాన్ని, మహిమోపేతమైన వైభవాన్ని చాటుతూ వినీలాకాశంలో మహోన్నతంగా ప్రకాశిస్తూ ఉందికదూ! బంగారుకాంతులతో తళతళ మెరుస్తూ చిరుగంటలతో ప్రకాశిస్తూ వున్న శ్రీవారి బంగారుధ్వజస్తంభానికి చేతులెత్తి దండం పెడదాం!

అలాగే శ్రీవారి బంగారు ధ్వజానికి ఎదురుగా ఏడుబంగారు కలశాలతో మూడు అంతస్థుల గోపురం ఎలా ప్రకాశిస్తుందో కన్నులారా తిలకించండి! ఆ గోపురానికి శిరసువంచి నమస్కరించుదాం!

*గోవిందా! గోవిందా!! గోవిందా!!!*

ఇప్పుడు మనం కాస్త ముందుకు నడచి ఈ ధ్వజస్తంభ మండపంలోనికి ప్రవేశిద్దాం!

ఈ ధ్వజస్తంభ మండపం వెండివాకిలి (నడిమి పడికావలి) గోపురానికి ముందు వైపున తూర్పుభాగంలో అనుసంధించి నిర్మింపబడివుంది.

నాలుగు వరుసలుగా నిల్పబడిన ఇరువది స్తంభాలుగల ఈ (15 అడుగుల) చతురస్ర మండపంలో నడుమ బంగారు ధ్వజస్తంభం, దాన్ని ఆనుకొని తూర్పువైపున బలిపీఠం, వీటికి ఈశాన్యమూలన క్షేత్రపాలకశిల ప్రతిష్ఠింపబడివున్నాయి.

క్రీస్తుశకం 15వ శతాబ్దంలో నిర్మింపబడినదని చెప్పబడుతూవున్న ఈ ధ్వజస్తంభమండపంలోని శిలాస్తంభాలపై యోగనరసింహస్వామి, హనుమంతుడు, బకాసురవధ, శ్రీనివాసకల్యాణం మొదలైన శిల్పాలు ఎంత రమణీయంగా మలచబడినాయో తిలకించండి!

ఈ ధ్వజస్తంభ మండపంలోని ధ్వజస్తంభం, బలిపీఠం, క్షేత్రపాలకశిల — వీటిని గూర్చి విశదంగా తెలుసుకుందాం.

## 10. ధ్వజస్తంభం

వెండివాకిలి (నడిమి పడికావలి) ఎదురుగా సుమారు 15 అడుగుల దూరంలో చెక్కడపురాతి పీఠంపై ధ్వజదండంవలెనున్న ఎత్తైన దారుస్తంభం

నాటబడింది. ఇదే ధ్వజస్తంభం. రాతిపీఠానికి స్తంభానికి మొత్తం క్రింది నుండి మీదివరకు బంగారుపూత పూయబడిన రాగిరేకు తాపబడివుంది. చూశారా!

ఈ స్తంభం మీద, శ్రీస్వామివారికి ఎదురుగా గరుత్మంతుడు, నాలుగు వైపుల హనుమంతుడు, శంఖ, చక్రాలు, కాళీయమర్దనంవంటి శిల్పాలు కూడ చోటు చేసుకున్నాయి. చూడండి!

మీరు 'ధ్వజారోహణం' అన్నపదం ఎప్పుడైనా విన్నారా? ఆ! ఆ!! అవును. శ్రీవేంకటేశ్వరస్వామివారికి ప్రతి ఏటా బ్రహ్మోత్సవంలో తొలినాడు జరిగే ఉత్సవమే 'ధ్వజారోహణ' ఉత్సవం. ధ్వజం అంటే జండా. ఆరోహణం అంటే ఎగురవేయడం. ధ్వజారోహణం అంటే తిరుమల శ్రీస్వామివారి బ్రహ్మోత్సవాలను ప్రారంభిస్తూ విజయకేతనాన్ని ఎగురవేయడమని భావం.

ప్రతి బ్రహ్మోత్సవంలోను ఈ బంగారు ధ్వజస్తంభంపైన గరుడుని చిత్రాన్ని చిత్రించిన ధ్వజపటాన్ని ఎగురవేస్తూ, ఆ గరుడని ద్వారా సర్వలోకాల్లోని దేవదానవ యక్షకిన్నర గంధర్వాదులను శ్రీ స్వామివారి బ్రహ్మోత్సవాలకు ఆహ్వానించడం జరుగుతుంది.

తమిళంలో ధ్వజస్తంభాన్ని 'కొడిక్కంబం' అని అంటారు. 'కొడి' అంటే 'కేతన'మని అర్థం.

ఇంకోవిషయం ఏమిటంటే, వెలుపలినుండి ఏ వస్తువైనా లేదా పూజా ద్రవ్యాలైనా లోనికి వెళ్లాలన్నా, లోపలినుండి బయటికి వెళ్లాలన్నా ఈ ధ్వజస్తంభానికి ప్రదక్షిణం చేస్తూ తీసుకొనివెళ్లవలసిందే. శ్రీస్వామివారు కూడా వెలుపలికి వెళ్లినా లేదా లోనికి వేంచేసినా ఈ ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగానే పయనిస్తారు.

పూర్వం ఈ ధ్వజస్తంభం, బలిపీఠం వెండివాకిలి లోపల విమాన ప్రదక్షిణమార్గంలో గరుడుని మండపం వెనుక వుండేవని, క్రీ.శ. 1417లో బంగారువాకిలికిముందు ముఖమండపం నిర్మింపబడటంచేత, ఆ మార్గం ఇరుకైనందువలన, ఇక్కడికి మార్చబడివుంటాయని పరిశోధకుల అభిప్రాయం.

ఈ ధ్వజస్తంభం కర్రదైనందువల్ల కాలాంతరంలో చాలమార్లు మార్చబడింది. ఇటీవల 1982లో కూడ నూతన ధ్వజస్తంభం ప్రతిష్ఠింపబడింది.

ఇవీ! ఈ ధ్వజస్తంభాన్ని గూర్చిన విశేషాలు! విశిష్టత!!

ఇక ఆ ప్రక్కనే వున్న బలిపీఠాన్ని గూర్చి తెలుసుకుందాము.

## 11. బలిపీఠం

ఇదిగో! ధ్వజస్తంభానికి తూర్పున ఆనుకొని వున్నదే బలిపీఠం. ఈ బలిపీఠం చెక్కడపు పనితనంకల రాతితో ఎత్తైన పీఠంగా నిర్మింపబడివుంది. దీనికి కూడా బంగారు మలాము చేసిన రాగిరేకు తాపబడింది. ధ్వజస్తంభ మండపంలో మనకు ముందుగా కానవచ్చేది ఈ బలిపీఠమే.

ఇంతకూ దీని ప్రత్యేకత ఏమిటి? అంటారా!

శ్రీవేంకటేశ్వరస్వామివారికి, ఇతర ప్రధాన, పరివార దేవతలకు నివేదన అయిన తర్వాత ఆలయానికి విమానప్రదక్షిణమార్గంలోని అష్టదిక్కుల్లోవున్న చిన్నచిన్న బలిపీఠాల్లో ఆయా దిగ్దేవతలకు బలిని వేస్తారు. అంటే అన్నాన్ని మంత్రపూర్వకంగా ఆ యా దిక్కుల దేవతలకు ఆహారంగా సమర్పిస్తారన్న మాట. ఇలా విమానప్రదక్షిణంలో ఆ యా దిక్కుల్లో బల్యన్నాన్ని సమర్పిస్తూ వచ్చి, అర్చకులు చివరగా వెండివాకిలి బయటకు వచ్చి, ఆ మిగిలిన అన్నాన్ని (బలిని) ధ్వజస్తంభం ముందున్న ఈ ఎత్తైన బలిపీఠంపై ఆహారంగా సమర్పిస్తారు. ఈ బలిపీఠంపై వేసిన అన్నాన్ని రాత్రింబవళ్లు సంచరించే భూత, ప్రేత యక్ష పిశాచాది గణాలు ఆహారంగా స్వీకరిస్తాయని ప్రతీతి! ఇలా బలిని వేసిన తర్వాత అర్చకులు శ్రీస్వామివారి సన్నిధికి వెళ్తారు.

ఇంతటితో నైవేద్యం పూర్తవుతుంది. ఆలయంలో తర్వాతి కార్యక్రమాలు మొదలవుతాయి.

అందరం ఈ ధ్వజస్తంభం, బలిపీఠాలవద్ద సాష్టాంగ నమస్కారం చేసి తిరుమల గోవిందుని గట్టిగా స్మరిద్దాం.

*ఏడుకొండలవాడా!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 12. క్షేత్రపాలక శిల (గుండు)

**ఇటు చూడండి! ఈ ధ్వజస్తంభమండపం ఆవరణలోనే బలిపీఠానికి ఈశాన్యమూలన బలిపీఠంలాంటి ఆకారంలోనే సుమారు $1\frac{1}{2}$ అడుగుల**

ఎత్తుగల చిన్న శిలాపీఠం వుంది. చూశారా! దీన్నే "క్షేత్రపాలక శిల" అంటారు.

తిరుమల పుణ్యక్షేత్రానికి పరిపాలకుడు రుద్రుడు (శివుడు). క్షేత్ర పాలకుడైన రుద్రునికి గుర్తుగా అనాదిగా ఈ శిల ఉందట! అయితే ఈ శిల పూర్వం రుద్రుని పూర్ణాంశతో ప్రకాశిస్తూ, ఈ గుడిచుట్టూ తిరుగుతూ కాపలా కాస్తూ వుండేదట! ప్రతిరోజూ రాత్రి అర్చకులు ఇంటికి వెళ్ళేప్పుడు గుడితాళాలను ఈ శిలపై పెట్టి నమస్కరించి వెళ్ళేవారు. మళ్లీ తెల్లారిన తర్వాత వచ్చి అర్చకులు ఆ శిలకు నమస్కరించి తాళంచెవులను తీసుకొనే వారు. ఒకనాటి రాత్రి ఆలయంచుట్టూ తిరుగుతూవున్న ఈ గుండుకింద పడి ఒక బాలుడు మరణించాడట! మళ్లీ అలాంటి దుర్ఘటన జరగకుండా ఆ శిల, ఇక్కడినుండి తిరుమలకు సమీపంలో వున్న గోగర్భతీర్థంవద్దకు తరలింపబడిందనీ, అందులోని ఒక చిన్నభాగమే ప్రస్తుతం మనం చూస్తున్న "క్షేత్రపాలకశిల" అని పెద్దలమాట.

ప్రస్తుతం ఈ క్షేత్రపాలకశిల పూర్ణస్వరూపంతో అటు గోగర్భతీర్థం (పాండవతీర్థం) లోను, అంశా స్వరూపంతో ఇక్కడ ఆలయంలోను వెలు గొందుతూ వుంది.

ప్రతిసంవత్సరం మహాశివరాత్రి పర్వంనాడు అర్చకులు, ఆలయ అధి కారులు, యాత్రికులు మంగళవాద్యాలతో కూడ పాండవతీర్థానికివెళ్లి, అక్కడ ఏకాదశ రుద్రంతో క్షేత్రపాలకుడగు రుద్రునకు అభిషేకం చేస్తారు. అనంతరం ఆ గుండుకు వెండినామాలు (ఊర్ధ్వపుండ్రాలు) కండ్లు అతి కించి పుష్పాలంకరణ కావించి ధూపదీప అర్చననివేదనాదులు శాస్త్రోక్తంగా నిర్వహిస్తారు. చివరగా రుద్రునకు ఆరగింపు అయిన వడపప్పు, పండ్లు, పానకం, తాంబూలం స్థాన బహుమానంగా వితరణ అయిన పిమ్మట యాత్రికులకు ప్రసాదం పంచబడుతుంది. పిదప అర్చకులు, అధికారులు మంగళవాద్య సహితంగా ఆలయానికి విచ్చేస్తారు.

మనం గోగర్భానికి (పాండవతీర్థానికి) వెళ్లినప్పుడు ఆ క్షేత్రపాలక గుండును తప్పక దర్శనం చేసికొందాము.

ప్రస్తుతం ప్రతిరోజూ తెల్లవారుజామున శ్రీస్వామివారి కైంకర్యానికి వచ్చే అర్చకులు తమ బీగాల గుత్తిని, 'కుంచెకోల'ను క్షేత్రపాలక శిలకు తాకించి, నమస్కరించి ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వెళ్లి ఆలయప్రవేశం చేస్తారు. అలాగే రాత్రి ఏకాంతసేవానంతరం ఇంటికి వెళుతూ అర్చక స్వాములు తమ బీగాలను కుంచెకోలను ఈ క్షేత్రపాలకశిలకు తాకించి నమస్కరించియే ఇంటికి వెళ్తారు. ఇది ఈ నాటికీ నిత్యమూ కొనసాగుతూ, అమలులో వున్న సంప్రదాయము.

కలియుగ వైకుంఠమైన తిరుమల క్షేత్రంలో సాక్షాత్తు మహావిష్ణువైన శ్రీనివాసునిసన్నిధిలో క్షేత్రపాలకుడుగా శివుడు ఉండటం ఆశ్చర్యంగా తోచినా నిదానంగా ఆలోచిస్తే, అటు విష్ణువు, ఇటు శివుడు తామిద్దరూ ఒక్కటే తత్త్వమని ప్రబోధిస్తూవున్నట్లు అనిపిస్తూవున్నది కదూ!!

శ్రీస్వామివారి సన్నిధిలో నెలకొన్న ఈ రుద్రదేవుణ్ణి ఒక్కసారి స్తుతించుదాం.

అందరూ బిగ్గరగా అనండి మరి!

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

## 13. సంపంగి ప్రదక్షిణం

నడిమి పడికావలి (వెండివాకిలి) గోపురం యొక్క ప్రాకారానికి, బయట మహాద్వార గోపురప్రాకారానికి మధ్యనగల సుమారు 30 అడుగుల వెడల్పువున్న ప్రదక్షిణ మార్గాన్ని 'సంపంగిప్రదక్షిణం' అంటారు. ఆలయం లోపల మనం ప్రవేశించిన వెంటనే వుండే మొదటి ప్రదక్షిణ మార్గమే ఈ సంపంగి ప్రదక్షిణ మార్గం. అయితే ఆలయం వెలుపలవున్న మహాప్రదక్షిణ మార్గాన్ని ఆలయ ఆగమశాస్త్రం పరిగణనకు తీసుకోదు. అందువల్ల మనం చూస్తూవున్న సంపంగి ప్రదక్షిణమార్గమే మొదటిది.

పూర్వం ఈ ప్రదక్షిణమార్గంలో స్వామివారి పూజకు ఉపయోగపడే సంపంగి (చంపకవృక్షాలు) పూల వృక్షాలు దండిగా వుండినాయట! అందువల్లే దీనికి చంపకావరణమని, చంపకప్రదక్షిణమని, సంపెంగప్రదక్షిణమని సంపంగి ప్రదక్షిణమని పేర్లు ప్రసిద్ధిగా ఏర్పడినాయి.

# నీడతిరుగని చింతచెట్టు

చాలకాలం కిందట ఈ సంపంగి ఆవరణమార్గంలో పడికావలి (మహా ద్వారానికి) గోపురానికి దగ్గరగా ఒక పెద్ద చింతచెట్టు వుండేదట! దానికి కొమ్మలు, రెమ్మలు శాఖోపశాఖలుగా పెరిగి అతి విశాలంగా వ్యాపించి, ఆ చెట్టునీడ ఎటూ తిరగక, ఆ వృక్షమూలంలోనే స్థిరంగా వుండేది. అందువల్ల అది నీడ తిరుగని చింతచెట్టుగా ప్రసిద్ధి పొందింది. అంతమాత్రమేకాదు. అది నిద్రపోని (ఉన్నిద్రతింత్రిణీ వృక్షం) చింతచెట్టుగా కూడ పేర్కొన బడింది. దాని శాఖలు కొన్ని చిగిరించగా, మరికొన్ని శాఖలు పుష్పించగా ఇంకొన్ని శాఖలు కాయలు పండ్లు కాస్తూ వుండేది. ఇలా అన్ని కాలాల్లో విశ్రాంతి అనేది ఎరుగక ఆ చెట్టు నిరంతరం చిగిరించటం, పుష్పించటం, ఫలించటంవల్ల అది నిద్రపోని చింతచెట్టుగా పిలువబడింది. ఆ చెట్టుక్రింద పుట్టలో శ్రీనివాసుడు కొంతకాలం దాగి వుండినాడు. ఆ తర్వాత ఆ స్వామివారు, విగ్రహమూర్తిగా స్వయంభువై వెలసి ఆ పుట్టలోనే నిక్షిప్తమై వుండినాడు. ఆ నీడ తిరుగని, నిద్ర ఎరుగని చింతచెట్టు సాక్షాత్తు వసుదేవుడనీ, ఆదిశేషుడనీ ఆ చెట్టుకింది పుట్ట దేవకీదేవి అనీ పురాణాలు పేర్కొంటున్నాయి.

అట్టి సమయంలో మొట్టమొదట గోపీనాథుడనే వైఖానస విప్రుడు ఈ క్షేత్రానికి వచ్చి పుష్కరిణికి దక్షిణతీరంలో చింతచెట్టుకింద వున్న పుట్టలో వున్న శ్రీవేంకటేశ్వరుని దర్శించి, పుట్టలోని ఆ స్వామివారి విగ్రహాన్ని పుష్కరిణి పశ్చిమతీరంలో (ప్రస్తుతం శ్రీవారు ఉన్నచోటు) పునః ప్రతిష్ఠించి, ఆనాటినుండి అక్కడేవుంటూ ఆ స్వామివారికి అర్చన పూజాదికములు చేస్తూవుండినాడు.

ఆ తర్వాత రంగదాసు అనే భక్తుడు కూడ ఆ క్షేత్రానికి వచ్చి ఒక బావి తవ్వి సంపంగి, చామంతులు మున్నగు చెట్లను పెంచి, శ్రీస్వామివారి పూజకు అవసరమయ్యే పూలను పండ్లను తెచ్చి సమర్పిస్తూ అర్చకుడైన గోపీనాథునికి సహాయంగా వుండేవాడు. ఈ రంగదాసే మరుజన్మలో తొండమానురాజుగా జన్మించి శ్రీనివాసస్వామికి గోపుర ప్రాకారాదులు నిర్మించాడట. ఆ సందర్భంలో తనకు ప్రీతిపాత్రమైన ఆ చింతచెట్టునూ, ఆ

చింతచెట్టుకు కొద్దిదూరంలోనే నైరుతి మూలకు వుంటూ లక్ష్మీదేవికి ఆవాసస్థానమై అత్యంత ప్రియమై, ఎల్లప్పుడూ పుష్పిస్తూవున్న చంపకవృక్షాన్ని మాత్రం రక్షించి, ఇక మిగిలిన చెట్లను తొలగించి ఆలయ ప్రాకారాదులు నిర్మించవలసిందన్న శ్రీవేంకటేశ్వరుని ఆదేశాన్ని తొండమానుడు నిర్వర్తించాడని "వేంకటాచలమాహాత్మ్యం" అనే గ్రంథం తెలుపుతూవున్నది.

శ్రీవేంకటేశ్వరునికంటే ప్రాచీనమై వెలుగొందిన ఈ నీడతిరుగని చింతచెట్టు, చంపకవృక్షాలు నేడు కానరావు. కాని ఇటీవలి కాలంలో, అంటే భగవద్రామానుజులవారు (11వ శతాబ్దం) కూడ ఈ చింతచెట్టును దర్శించినట్లుగా "తిరుగని చింతలు దెరలించు నీడదిరుగని చింత కెంతే భక్తి మొక్కి" నట్లుగా "పరమయోగివిలాసం" (చిన్నన్న) అనే గ్రంథంలో రాయబడింది. అంతేకాదు ఈ చెట్లను దర్శించి శ్రీరామానుజులు వాటికి నిత్యమూ పూజాదికములు నిర్వహించే ఏర్పాట్లను కూడ కావించినట్లుగా 'శ్రీవేంకటాచల ఇతిహాసమాల' అనే గ్రంథం పేర్కొంటున్నది. పిదప 15వ శతాబ్దంలో తాళ్లపాక అన్నమాచార్యులు కూడ తొలిగా వేంకటాచలయాత్ర చేసిన సందర్భంలో—

"............................. కుందనపు
బొలుపుల పెద గోపురము సేవించి
తరగని ఫలపుష్పతతితోడ నీడ తిరగని
చింత వర్తిల నమ్రుడగుచు."

అని మహాద్వారం లోపలవున్న నీడతిరగని చింతచెట్టును దర్శించి, సేవించినట్లుగా చిన్నన్న రాసిన "అన్నమాచార్యుల జీవిత చరిత్ర (ద్విపద)" వల్ల తెలుస్తున్నది.

పూర్వం ఈ సంపంగి ప్రదక్షిణ ఆవరణంలోనుండే నేరుగా పుష్కరిణికి వెళ్లడానికి వీలుగావుండేదని, అంటే ఆలయమహాప్రాకారం వుండేది కాదని తెలుస్తున్నది. తర్వాతికాలంలో మహాప్రాకారం, ఆ మహాప్రాకారానికి ఆనుకొని లోపలివైపు చుట్టూరా సంపంగి ప్రదక్షిణ మార్గంలో సుమారు 18 అడుగుల వెడల్పుతో వున్న మండపాలు ఇంకా ఇతర నిర్మాణాలు చోటుచేసుకున్నాయి. ప్రస్తుతం ఈ ఆవరణ మార్గంలో కల్యాణమండపంలో

తప్ప మిగిలిన చోట్ల యాత్రికులకు ప్రవేశం లేదు. అయినా వాటిని కూడ వివరించడం జరుగుతుంది.

ఈ సంపంగి ప్రదక్షిణ మార్గంలో దక్షిణంవైపున 'కల్యాణమండపం' ఉంది. పడమటి దిక్కున వున్న మండపాలు చక్కెర, సెనగపప్పు, సెనగ పిండి, బెల్లం వగైరా వాటిని నిల్వ చేయడానికి వినియోగపడే గదులుగా వింగడింపబడి వున్నాయి. ఈ మార్గంలోనే వాయవ్యమూలకు ప్రసాదం తయారీలోను, స్వామివారి సేవలలోను వినియోగించే కర్పూరం-చందనం జీడిపప్పు-ద్రాక్ష-నెయ్యి మున్నగు వస్తువులను పంపిణీచేసే 'ఉగ్రాణం' అన బడే కొట్టిడి వున్నది. ఈ ఉగ్రాణానికి ముందుభాగాన 'విరజానది' అనే తీర్థం ఉంది.

సంపంగి ప్రదక్షిణ మార్గంలో ఉత్తరం వైపున 'పడిపోటు' అనబడే వంటశాల వుంది. ఈ పడిపోటువద్ద వుండే బావిని 'పోటుబావి' అంటారు. ఈ వంటశాలయందు వంటలకు ఈ బావి నీళ్లనే ఉపయోగిస్తారు.

పడిపోటుకు ప్రక్కన తూర్పున 'యామునాత్తురై' అని పిలువబడే 'పూలఅర' ఉంది. దాన్ని ఆనుకొని తూర్పుదిక్కున వున్నదే 'వగపడి అర'. పూల అరకు ఎదురుగా 'పూలబావి' వుంది.

ఇంకా ఈ సంపంగి ప్రదక్షిణ మార్గంలో నాలుగుమూలల్లో 'నాలుగు స్తంభాల మండపాలు' వున్నాయి.

ఈ ప్రదక్షిణ మార్గంలోనే తూర్పుదిక్కున ధ్వజస్తంభమండపం, అద్దాల మండపం, శ్రీకృష్ణరాయమండపం, రంగనాయకమండపం, తిరుమలరాయ మండపం నెలకొని వున్నాయి. వీటిలో కృష్ణరాయమండపం, అద్దాలమం డపం, రంగనాయకమండపం, తిరుమలరాయమండపం — వీటినిగూర్చి ఇందాకనే మనం తెలుసుకున్నాం కదా! ఇక మిగిలిన వాటిని గూర్చి ఇప్పుడు పరిశీలిద్దాం!

## 14. నాలుగుకాళ్ల మండపాలు

తిరుమలరాయమండపానికి పడమరగా సంపంగిప్రదక్షిణంలో ఆగ్నేయ మూలకు వున్న ఈ నాలుగుకాళ్ల మండపాన్ని చూడండి! ఎత్తైన నాలుగు

స్తంభాలతో నిర్మింపబ(డి)న ఈ మండపంలో జరుగుతున్న పూజల్ని భక్తులు అన్ని వైపుల నుండి చూడవచ్చు. ఇలాంటి మండపాలు, ఈ సంపంగి ప్రదక్షిణ మార్గంలో తక్కిన మూడు మూలల్లో కూడా నిర్మింపబడి వున్నాయి.

నేటివలె జనసమ్మర్దం అంతగా లేని ప్రాచీనకాలంలో, శ్రీస్వామివారి ఉత్సవాలు ఊరేగింపులు ఈ సంపంగిప్రదక్షిణమార్గంలో జరిగేవట! ఆ సమయంలో చంపకప్రదక్షిణంలో నాలుగుమూలల్లోవున్న ఈ నాలుగు స్తంభాల మండపాల్లో శ్రీస్వామివారు వేంచేసేవారట! ఆ సమయాల్లో అక్కడ పూజా నివేదనలు కూడా జరుపబడేవట!

ప్రస్తుతం ఈశాన్యమూలలో వున్న మండపంలో మాత్రమే, శ్రీకృష్ణాష్టమి పండుగ సందర్భంగా జరిగే శిక్యోత్సవం (ఉట్లపండుగ) నాడు మాత్రమే శ్రీకృష్ణస్వామివారు వేంచేపు చేయుబడి, పూజానివేదనలు, హారతులు జరుపబడుతూవున్నాయి.

సంపంగి ప్రదక్షిణంలో నాలుగు మూలల్లో గల ఈ నాలుగుమండపాలను క్రీ.శ. 1470లో విజయనగరచక్రవర్తి సాళువ నరసింహరాయలు తాను, తన భార్య, తన ఇద్దరు కుమారులు — ఈ నల్వురి పేరిట నిర్మించాడు. చంపక ప్రదక్షిణంలోని మూలల్లో వున్న ఈ నాలుగు స్తంభాల మండపాలు చూడటానికి ఒకే ఆకారంలో నిర్మింపబడినా, వీటి కొలతలు మాత్రం కొంత తేడా కలిగివున్నాయి. నైరుతి, వాయువ్యమూలల్లోని రెండు మండపాలు, 8' 6" చదరంగాను, ఆగ్నేయమూలలోని మండపం 11 అడుగుల చతురస్రంగాను, ఈశాన్యంలోని మండపం 12.3"x 11.6" పొడగు వెడల్పులు కలిగి నిర్మింపబడ్డాయి.

ఒకానొకప్పుడు ఈ ప్రదక్షిణ మార్గంలో వైభవోపేతంగా అంగరంగ వైభవంగా శ్రీనివాసప్రభువు ఊరేగుతూ, నాలుగు మూలల్లో కొలువు దీరుతూ ఆరగింపులతోపాటు ఆరతు లందుకొంటూ భక్తులననుగ్రహించటానికి వీలుగా సాళువనరసింహరాయలు నిర్మించిన ఈ నాలుగు మండపాలను, అవి చాటుతూవున్న నరసింహరాయల భక్తితత్పరతనూ శ్రీవేంకటేశుని కొండంత దయనూ కొని యాడుతూ ముందుకు నడుద్దాం.

*గోవిందా! గోవిందా!! గోవిందా!!!*

## 15. శ్రీవేంకటరమణస్వామి కల్యాణమండపం

సంపంగి ప్రదక్షిణంలో దక్షిణంవైపు మార్గంలో రేకులతో దీర్ఘచతురస్రాకారంగా కల్యాణమండపం నిర్మింపబడింది. దీన్నే 'శ్రీవేంకటరమణస్వామి కల్యాణమండపం' అంటారు.

ప్రస్తుతం ప్రతిరోజు కల్యాణోత్సవాలు ఈ మండపంలోనే జరుగుతున్నాయి. 'నిత్యకల్యాణం పచ్చతోరణం' అని ప్రసిద్ధికెక్కినట్లుగా తిరుమలలో నిత్యకల్యాణోత్సవాలతో నిత్యమూ పచ్చతోరణాలతో విలసిల్లేమండపం ఇది.

ఈ కల్యాణమండపంలో పడమటివారకు తూర్పుముఖంగా ఏర్పాటు చేయబడిన కల్యాణవేదికపై శ్రీమలయప్పస్వామివారికి, శ్రీదేవి భూదేవులకు ప్రతినిత్యం ఉదయం 11-12 గంటల ప్రాంతంలో కల్యాణోత్సవం జరుగుతుంది. దీన్నే 'నిత్యకల్యాణోత్సవం' అంటారు.

ఈ కల్యాణోత్సవాలు చాలకాలంక్రిందట విమానప్రదక్షిణంలోగల కల్యాణ మండపంలో జరుపబడేవి. భక్తజన సమ్మర్దం నానాటికి పెరగడంవల్ల కొన్నాళ్ల క్రిందటివరకు రంగనాయక మండపంలో జరుప బడుతుండేవి. ప్రస్తుతం సంపంగిప్రదక్షిణంలోవున్న ఈ మండపంలో కల్యాణోత్సవాలు జరుగుతున్నాయి.

ఈ మండపంలో కేవలం కల్యాణోత్సవాలేగాక పవిత్రోత్సవం, పుష్పయాగం, జ్యేష్ఠాభిషేకం మున్నగు సంవత్సరోత్సవాలు కూడా జరుపబడుతున్నాయి. ఈ కల్యాణమండపంలో జరిగే నిత్యకల్యాణోత్సవం, ఇంకా ఇతర ఉత్సవాలనుగురించి వివరంగా తర్వాత వర్ణించుకుందాం!

అదిగో! కల్యాణవేదికపై ఉభయనాంచారులతో కూడివున్న నిత్యకల్యాణ చక్రవర్తి! శ్రీనివాస ప్రభువు! కన్నులారా దర్శించండి!

కల్యాణ వేదికపై దర్శనమిస్తున్న ఈ నిత్యనూతన వధూవరులకు మనసారా చేతులెత్తి నమస్కరించుదాం!

*శ్రీమదిందిరా రమణ గోవిందా!! గోవింద!!!*

## 16. ఉగ్రాణం

ఉగ్రాణం అనగా కొట్టిడి. లేదా గిడ్డంగి.

సంపంగి ప్రదక్షిణ మార్గంలో పడమటి దిక్కున వున్న మండపాలు అన్నీ గిడ్డంగులుగా ఉపయోగపడుతూవున్నాయి. వీటిలో శనగపిండి, బెల్లం, చక్కెర, ఉద్దిపప్పు — ఇత్యాది సంభారాల నిల్వలు ఉంచబడుతుంటాయి. ఈ ఉగ్రాణ మండపంలో శనగపప్పును పిండి చేసే మరలు కూడావున్నాయి చూడండి. అలాగే బూంది కోసం శనగపిండిని కలిపే పెద్ద పెద్ద మిక్సీలు కూడా వున్నాయి. ఇలా వీటిని అవసరాలకొద్దీ వంటలకు, అలాగే చందనం, కర్పూరం, నెయ్యి వంటి వస్తువులను శ్రీస్వామివారి పూజా అభిషేకాలకు పంపిణీచేసే ఉగ్రాణం కార్యాలయం ఈ సంపంగి ప్రదక్షిణంలో వాయవ్యమూలకు వుంది.

## 17. విరజా నది

సంపంగి ప్రదక్షిణంలో ఉగ్రాణం ముందు వున్న ఈ చిన్న బావిని 'విరజానది' అని 'విరజాతీర్థం' అని అంటారు.

వైకుంఠంలోని దేవనది అయిన విరజానది శ్రీస్వామివారిపాదాలకింది నుండి ప్రవహిస్తున్నదని పెద్దలమాట. ఆ నదిలోని కొంత భాగమే ఈ బావి అని అంటారు.

ఈ విరజా తీర్థానికి చుట్టూ బావి మాదిరిగా చతురస్రాకారంగా పొడవైన చెక్కడపు రాళ్లతో నిర్మించారు. నాలుగువైపుల నేలమట్టానికి సమంగా నెలకొల్పబడిన ఈ రాళ్లకు లోపలి అంచుల్లో శిల్పాలు చెక్కబడి ఉన్నాయి. తూర్పువైపు శిలమీద వానరులమధ్య రామలక్ష్మణులు, పడమటిదిక్కు శిలమీద సీతారామలక్ష్మణులు, హనుమంత సుగ్రీవులు, దక్షిణంవైపు రాతిమీద కాళీయమర్దనం చేస్తున్న కృష్ణుణ్ణి శరణువేడుతున్న నాగకన్యలు, ఉత్తరంవైపున ఏనుగును ఆజ్ఞాపిస్తున్న వేంకటేశ్వరుడు, ప్రక్కన గరుడుడు, ఆ పక్కన గరుడవాహనుడైన వేంకటేశ్వరుడు - ఈ సుందరశిల్పాలు చెక్కబడ్డాయి.

ఈ విరజా(నది) బావి శిలలపై లోపలి అంచులమీద ఇలాంటి బొమ్మలు వున్నందువల్లే తిరుమల స్థానికులు దీనిని 'బొమ్మలబావి' అని అంటారు.

ఈ బండలపైన భూమి ఉపరితలం నుండి నాలుగు అడుగుల ఎత్తువరకు ఇటుకలతో గోడ నిర్మింపబడింది.

ఈ విరజాతీర్థంలో మునక లిడినట్లుగా భావించి తరిద్దామా! అలా మరొక్కసారి శ్రీస్వామివారిని స్మరింమదాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 18. పడి పోటు

ఈ సంపంగి ప్రదక్షిణ మార్గంలోనే ఉగ్రాణానికి అనుకొని ఉత్తరం వైపున పడమటినుంచి తూర్పునకు వ్యాపించి వున్న పొడవైన మండపమే 'పడిపోటు' (వంటశాల). ఈ వంటశాలలో శ్రీస్వామివారికి నివేదింపబడే లడ్డు, వడ, అప్పం, దోసె, పోళీ, సుఖియ, జిలేబి, తేన్‌తొళ (మురుకు) మొదలయిన పిండివంటలు భారీఎత్తున తయారు చేయబడతాయి.

ఈ పడిపోటులో ఆగ్నేయమూలనగల చిన్నమండపంలో 'పోటు తాయార్' అనే అమ్మవారి విగ్రహం తూర్పుముఖంగా వేంచేసి వున్నది.

ఈ పోటుదగ్గర వంటకు ఉపయోగపడే నిర్మలజలాలుగల బావి వున్నది. చూశారా! దీన్నే 'పోటుబావి' అంటారు.

ఈ పోటు మంటపానికి అనుకొని తూర్పున వున్నదే 'పూలఅర'.

## 19. పూల అర

ఇదిగో! ఇటుచూడండి. ఈ సంపంగి ప్రదక్షిణం ఆవరణలోనే 'పడి పోటు'నకు ఆనుకొని తూర్పు దిక్కున వున్న ఈ అర(గది)ను "పూల అర" అనీ "పుష్ప మండపం" అని అంటారు.

ఈ పుష్ప మండపంలో, శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తికి, ఉత్సవమూర్తులకు, ఆలయంలోని ఇతర మూర్తులకు సరిపడునట్లుగా అలంకరించేందుకుగాను ప్రతినిత్యం సుగంధ పరిమళాలు వెదజల్లే రంగురంగుల పుష్పాలతో మనోజ్ఞంగా వివిధ కొలతలతో పూలమాలలు కూర్చబడుతూ వుంటాయి.

తిరుమల శ్రీవారి ఆలయంలో ప్రతిరోజు ఉదయం 3-30 గంటలకు, సాయంత్రం 7 గంటలకు జరిగే శ్రీ స్వామివారి తోమాలసేవ (పుష్పా లంకరణసేవ)కు గాను ఈ అరలో పుష్పమాలికలు సిద్ధంచేయుబడతాయి. అంతమాత్రమే కాదు. నిత్యమూ జరిగే శ్రీస్వామివారి నిత్యకల్యాణోత్సవా లకు, ఊరేగింపులకు, ఉత్సవాలకు కూడ ఈ పూలఅరలోనే పూలదండలు సమకూర్పబడతాయి.

ఇలా తిరుమల శ్రీనివాసునికి, ఇంకా వివిధ మూర్తులకు నిత్యమూ అవ సర మయ్యే పూలమాలల్ని సమకూర్చే ఈ "పూలఅర"ను "యమునోత్తర" లేదా "యామునోత్తరై" అని కూడా అంటారు.

"యమునోత్తర" అనగా యమునాతీరం. శ్రీ స్వామి పుష్కరిణే యమునానది. ఆ తీరంలో వెలసివున్న శ్రీ వేంకటేశ్వరుడు సాక్షాత్తు ద్వాపరయుగం నాటి శ్రీకృష్ణుడు. కనుకనే ఈ "యమునోత్తర"లో శంఖచక్ర ధారియై, వేణుగానలోలుడైన శ్రీకృష్ణుని శిలా విగ్రహం రుక్మిణీ సత్యభామా సమేతంగా దక్షిణాభిముఖంగా ప్రతిష్ఠింపబడింది. సుమారు ఒక అడుగు ఎత్తువున్న ఈ విగ్రహ సౌందర్యాన్ని తనివితీరా చూచి ఆనందించండి.

అదిగో! ఆ శ్రీకృష్ణుణ్ణే ఇప్పటి శ్రీనివాసుణ్ణే అన్నట్లుగా ప్రతి సంవత్సరం శ్రీకృష్ణాష్టమి రోజున ఉట్లపండుగనాడు శ్రీ వేంకటేశ్వరుడు ఈ అరలోనికి వేంచేసి పూజా నివేదన లందుకొంటున్నాడు. శ్రీస్వామివారి వెంట మరొక పల్లకిపై శ్రీకృష్ణుడు కూడా ఈ 'యమునోత్తర' మండపానికి వేంచేసి పూజలందు కొంటాడు. ఇంతమాత్రమేగాక ఈ పూల అరకు మరో ప్రత్యేకత కూడా వుంది. దానిని కూడ విని తనివి చెంది తరించండి మరి!

పూర్వం (క్రీస్తు శకం 11వ శతాబ్దంలో) ఒకానొకనాడు శ్రీరంగక్షేత్రంలో భగవద్రామానుజులవారు (క్రీ.శ 1017-1137) తమ శిష్యులకు తిరుమలక్షేత్ర ప్రాశస్త్యాన్ని గూర్చి చెప్తూ, వేంకటాచలంలో వెలసివున్న శ్రీనివాసప్రభువు పుష్పాలంకార ప్రియుడనీ, అందువల్లే ఆ పర్వత శ్రేణులన్నీ అనాదిగా పుష్ప వనాలతో వెలుగొందుతున్నాయనీ కనుకనే తిరుమలక్షేత్రం "పుష్పమండపం" అని ప్రసిద్ధి పొందిందని వివరించారు. అంతేగాక, పన్నిద్దరాళ్వారులలో

సుప్రసిద్ధులై పరాంకుశదివ్యసూరులని పేరుపొందిన నమ్మాళ్వారులవారు కూడా "తిరుమల శ్రీనివాస ప్రభువు పుష్పాలంకార ప్రియుడని, అందువల్ల ఆస్వామివారికి పుష్పకైంకర్యం చెయ్యడం అత్యంత ప్రియమైన, పవిత్రమైన కార్యం" అని "తిరువాయ్ మొళి" అనే తమ గ్రంథంలో పేర్కొన్నారు. ఈ విషయాన్ని కూడా శ్రీరామానుజాచార్యులు వివరిస్తూ, తిరుమల క్షేత్రంలోఅప్పటికి సరిగా జరగని లేదా ఆగిపోయిన పుష్పకైంకర్య సేవను పునరుద్ధరించడానికి గాను శిష్యులను ప్రేరేపించారు. పిదప రామానుజుల ఆనతిమేరకు వారి శిష్యులైన అనంతాళ్వారు తిరుమలకు వేంచేసి, నిత్యమూ శ్రీవేంకటేశ్వరస్వామికి పుష్పకైంకర్యం చేస్తూవుండేవారు. అయితే అంతకుముందే చాలకాలంకిందట రామానుజులవారి పరమగురువు అయిన యామునాచార్యులవారు కూడ కొంతకాలం తిరుమలక్షేత్రంలో వుంటూ శ్రీస్వామివారికి పుష్పసమర్పణను చేశారని పెద్దలవలనవిని, అనంతాళ్వారులు, ప్రస్తుతం తాను చేస్తున్న పుష్పకైంకర్యాన్ని కూడా "యామునాత్తురై" అని వారిపేరుమీదుగానే ఏర్పాటుచేసి కొనసాగించినట్లుగా, "శ్రీ వేంకటాచల ఇతిహాసమాల" అనే గ్రంథంలో అనంతాళ్వారులే స్పష్టంచేసి వున్నారు. నేటికీ శ్రీనివాసునికి "యామునాత్తురై" పేరిటనే తిరుమలలో పుష్పకైంకర్యం కొనసాగుతూవుంది.

శ్రీవేంకటేశ్వరస్వామి పుష్పాలంకార ప్రియుడు, తిరుమలక్షేత్రం "పుష్పమండపం" అన్నప్రశస్తికి ఈ "పూలఅర" ప్రధానతార్కాణంగా మనకు దర్శనమిస్తూవుంది. "పుష్పమండపం" అని పేరొందిన తిరుమలక్షేత్రంలో భక్తులు ఎవరూ పూలు ధరించరాదు. ధరించకూడదు కూడ. ఇక్కడ ఇతరులు, పూలు ధరించడం నిషేధం. కుసుమాలన్నీ కొండలరాయని పూజకొరకే. అది క్షేత్ర సంప్రదాయం కూడా. అందుకే శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నిత్యమూ జరిగే పుష్ప కైంకర్యంలో, ప్రాచీనకాలంనుంచీ పెరిందేవితోట, అనంతాళ్వారుతోట, తాళ్లపాకంవారితోట, తరిగొండవెంగమాంబతోట, సురపురంవారితోట, రాంబగీచ...మున్నగు అనేకమైన పుష్పవనాలు తిరుమల పర్వతశ్రేణులలో నెలకొని పాలుపంచుకొన్నాయి. అందుకే శ్రీనివాసుని పరమభక్తురాలైన తరిగొండవెంగమాంబ "పుష్పజాతుల విష్ణుఁబూజింపగల

కొండ" అని తిరుమలకొండ ప్రశస్తిని పేర్కొన్నది. పైనపేర్కొన్న తోటల స్థలాలన్నీ నేడు నామమాత్రములై మిగిలివున్నాయి. అయినా ప్రస్తుతం శ్రీ వేంకటేశ్వరుని పుష్పకైంకర్యాన్ని "యామునాత్తురై" పేరిటనే తిరుమల తిరుపతి దేవస్థానం వారి పుష్పోద్యాన వనశాఖ నిర్వహిస్తోంది.

ఇప్పుడు మనం చూస్తూవున్న ఈ పూలఅర ఇటీవలికాలంలో లడ్డు, వడ వగైరా ప్రసాదాలను నిల్వవుంచే గదిగా ఉపయోగింపబడుతూవుంది. ప్రస్తుతం విమాన ప్రదక్షిణంలో శ్రీ యోగనరసింహస్వామి ఆలయ ప్రదక్షిణం మార్గంలో ఉత్తరం దిక్కునవున్న భాగాన్ని పుష్పఅరగా ఉపయోగించడం జరుగుతున్నది.

ఈ పుష్ప అరనుండి ఒక నిర్ణీత పద్ధతి ప్రకారం పూలమాలలు కూర్చబడి శ్రీస్వామివారి అలంకరణకు పంపబడతాయి. శ్రీస్వామివారి (మూలమూర్తి)కి నిత్యమూ జరిగే పుష్పాలంకరణలో ఎట్టి మార్పులు చేర్పులు వుండవు. కాకపోతే ఋతువులననుసరించి వచ్చే పూలు మారవచ్చు. తప్ప అలంకరణలో ఏ మార్పులు వుండవు. జరగవు. శ్రీస్వామివారికి ఉదయం, సాయంత్రం ఇలా రెండుమార్లు జరిగే "తోమాలసేవ"లో పుష్పాలంకరణ జరుగుతుంది. ఈ పూలఅరనుండి పంపబడుతూ, శ్రీవేంకటేశ్వరునికి అలంకరింపబడే పూలమాలల్ని గూర్చికూడ సంక్షిప్తంగా తెలుసుకుందాం.

శ్రీస్వామివారి మూలమూర్తికి అలంకరించే స్థానాలనుబట్టికూడ పూల మాలలకు స్థిరమైన కొన్ని పేర్లువుండడం కూడ మనం గమనించవచ్చు.

## శ్రీవారి మూలమూర్తిని నిత్యమూ అలంకరించేదండలు

### *1. శిఖామణి:*

కిరీటం మీదినుంచి రెండు భుజాలమీది వరకు అలంకరింపబడే ఒకే ఒకదండను 'శిఖామణి' అంటారు. ఇది 8 మూరల దండ.

### *2. సాలిగ్రామమాల:*

శ్రీవారి భుజాల నుండి ఇరువైపులా పాదాలవరకు వేలాడుతూవున్న సాలిగ్రామాల మాలలకు ఆనుకొని వేలాడదీస్తూ అలంకరింపబడే పొడవైన పూలమాలలు. ఇవి రెండుమాలలు. ఒక్కొక్కటి సుమారు 4 మూరలు.

*3. కంఠసరి:*

మెడలో రెండుపోర్వలుగా రెండు భుజాలమీదికి అలంకరింపబడే దండ ఒకటి. $3\frac{1}{2}$ మూరలు.

*4. వక్షః స్థల లక్ష్మి:*

శ్రీస్వామివారి వక్షః స్థలంలో వున్న శ్రీదేవి భూదేవులకు రెండుదండలు. ఒక్కొక్కటి $1\frac{1}{2}$ మూర.

*5. శంఖు చక్రం:*

శంఖుచక్రాలకు రెండు దండలు. ఒక్కొక్కటి ఒక మూర.

*6. కఠారిసరం:*

శ్రీస్వామివారి బొడ్డునవున్న నందక ఖడ్గానికి అలంకరించే దండ ఒకటి 2 మూరలు.

*7. తావళములు:*

రెండు మోచేతులకింద, నడుమునుండి మోకాళ్లపై హారాలుగా, మోకాళ్ల నుండి పాదాలవరకు జీరాడుతూ వ్రేలాడదీసే మూడుదండలు (1) మూడుమూరలు, (2) $3\frac{1}{2}$ మూరలు, (3) 4 మూరలు.

*8. తిరువడి దండలు:*

శ్రీస్వామివారి పాదాలపై చుట్టూ అలంకరించే రెండు దండలు. ఒక్కొక్కటి ఒక్క మూర.

ప్రతి గురువారం సాయంత్రం జరిగే "పూలంగిసేవ"లో మాత్రమే శ్రీస్వామివారి మూలమూర్తికి ఆభరణాలన్నీ తీసివేసి, పై పేర్కొన్న మాల లతో పాటు నిలువెల్ల స్వామివారిని విశేషంగా పూలమాలలతో అలంకరిస్తారు.

ఇవి గాక శ్రీవారి ఆనందనిలయంలోని వివిధ ఉత్సవ మూర్తులకు కూడా ఈ క్రింది విధంగా పూలమాలలు సిద్ధం చేయబడి సమకూర్చబడతాయి.

## ఉత్సవమూర్తులకు నిత్యమూ అలంకరింపబడే పూలదండల వివరాలు

| | |
|---|---|
| భోగశ్రీనివాసమూర్తికి | : ఒకదండ |
| కొలువు శ్రీనివాసమూర్తికి | : ఒక దండ |
| శ్రీదేవి భూదేవి సహిత మలయప్పస్వామికి | : 3 దండలు |
| శ్రీదేవి భూదేవి సహిత ఉగ్రశ్రీనివాసమూర్తికి | : 3 దండలు |
| శ్రీసీతారామలక్ష్మణులకు | : 3 దండలు |
| శ్రీరుక్మిణీ శ్రీకృష్ణులకు | : 2 దండలు |
| చక్రత్తాళ్వారుకు (సుదర్శనుడు) | : ఒకదండ |
| అనంత గరుడ విష్వక్సేనులకు | : మూడుదండలు |
| సుగ్రీవ అంగద హనుమంతులకు | : మూడుదండలు |

## ఇతర విగ్రహమూర్తులకు నిత్యమూ అలంకరించే పూలదండలు

| | |
|---|---|
| బంగారువాకిలి ద్వారపాలకులు | : రెండుదండలు |
| గరుడాళ్వారు | : ఒకదండ |
| వరదరాజస్వామి | : ఒకదండ |
| వకుళమాలిక | : ఒకదండ |
| భగవద్రామానుజులు (మూలమూర్తి,ఉత్సవమూర్తి) | : రెండుదండలు |
| యోగనరసింహస్వామి | : ఒకదండ |
| విష్వక్సేనులవారికి | : ఒకదండ |
| పోటుతాయారు | : ఒకదండ |
| బేడి ఆంజనేయస్వామికి | : ఒకదండ |
| శ్రీవరాహస్వామి ఆలయానికి | : 3 దండలు |
| కోనేటిగట్టు ఆంజనేయస్వామికి | : ఒకదండ (ప్రతి ఆదివారం మాత్రమే) |

ఇంతమాత్రమేగాక శ్రీస్వామివారి నిత్యకల్యాణోత్సవం - వసంతోత్సవం - ఊరేగింపులు - ఉత్సవాలకుగాను ప్రత్యేకంగా పూలమాలలు కూడ ఈ పూలఅరలో కూర్చబడతాయి.

శ్రీస్వామివారిని అలంకరించే మాలంకుగాను తిరుమలక్షేత్రంలో తులసి, చామంతులు, గన్నేరులు, సన్నజాజులు, మల్లెలు, మొల్లలు, మొగిలి, కమలం (తామర), కలువ, రోజాలు, గులాబీలు, సంపెంగలు, సుగంధాలు మామిడాకులు, తమలపాకులు, పచ్చి పసుపుచెట్లు, కనకాంబరం, మరువం, మాచీపత్రం, దవనం, బిలువం (మారేడు) ఇలా రంగురంగులతో సుగంధ పరిమళాలను వెదజల్లే ఎన్నో పుష్ప జాతులను, పత్రాలను శ్రీవారి పుష్పకైంకర్యంలో వినియోగిస్తారు.

ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండుపూటలా శ్రీస్వామివారికి జరిగే తోమాలసేవ (పుష్పకైంకర్యం)కు గాను ఈ పుష్పలరనుండి సిద్ధంచేయబడిన పూలమాలలను, జియ్యంగారులు తలపైపెట్టుకొని బాజాభజంత్రీలతో ఛత్ర చామర మర్యాదలతో వేదమంత్రోచ్చారణలతో ఊరేగింపుగా బయలుదేరి ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి విమానప్రదక్షిణంచేస్తూ శ్రీవారి సన్నిధిలో సమర్పించడం జరుగుతుంది

ఇంకా మరిన్నివిశేషాలు శ్రీవారి తోమాలసేవ (పుష్పకైంకర్యం) సమయంలో తెలుసుకుందాం.

ఇలా ఇంతటి విశిష్టతను కలిగివుండి ఎందరో పరమభక్తుల్ని స్మరింపజేస్తూ, నిత్యమూ శ్రీవారి పుష్ప కైంకర్యంలో పాలుపంచుకొంటూవున్న ఈ పుష్పమండపాన్ని (పూలఅరను) మనసారా కీర్తిస్తూ పుష్పమండపాధిపతి అయిన తిరుమల గోవిందుని నోరారా పిలుస్తూ భక్తికుసుమాలతో అర్చిద్దాం!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 20. పూల బావి

ఇదిగో! 'యమునోత్తర' పూలఅరకు ఎదురుగా అద్దాలమండపానికి కొద్దిగ ఉత్తరం వైపున ఒకబావి వుంది చూడండి. ఇదే "పూలబావి".

ఇంతకుముందే 'పూల అర'ను గురించి తెలుసుకున్నాం గదా. అందులో తిరుమల శ్రీవారి ఆలయంలో ఎన్నోరకాలైన పూలమాలలు, అలంకరణకు ఉపయోగింపబడుతున్నాయని కూడ మనం తెలుసుకున్నాం కూడ. మరి శ్రీస్వామివారికి సమర్పించిన తులసి, పుష్పం, పూలమాలలను ఈ క్షేత్రంలో

ఎవరికిని ప్రసాదంగా ఇచ్చే సంప్రదాయం లేదు. అందువల్ల ఆ పవిత్ర నిర్మాల్యాన్ని ఎవ్వరూ ఉపయోగించకుండా ఇదిగో ఈ బావిలో వేస్తారు. అందువల్లే దీన్ని "పూల బావి" అంటారు.

ఇదే 'భూతీర్థం' అని కూడ పిలువబడుతున్నది. పూర్వం ఈక్షేత్రంలో భూదేవిచేత ఏర్పరుపబడిన ఈతీర్థం కాలాంతరంలో నిక్షిప్తమై పోయింది. అనంతరకాలంలో శ్రీనివాసుని ఆనతిపై రంగదాసు (తొండమానుని పూర్వ జన్మ) అనే భక్తుడు ఒక బావిని తవ్వగా ఆ భూతీర్థం మళ్లీ వెలుగులోనికి వచ్చింది. రంగదాసు ఆ బావిలోని నీళ్లను వాడుతూ, శ్రీవేంకటేశ్వరుని పూజకై సంపెంగ చేమంతుల మొక్కలతో ఒక తోటను పెంచాడు. మళ్లీ అనంతర కాలంలో ఆ రంగదాసుడే తొండమాను చక్రవర్తిగా జన్మించగా, శ్రీవేంకటేశ్వరస్వామి గతజన్మలో అతను నిర్మించిన ఈ శిథిలమైన బావిని మళ్లీ పునరుద్ధరించమని ఆదేశించగా తొండమానుడు దానిని రాతితోకట్టి పునరుద్ధరించి శ్రీస్వామివారికి ప్రీతి పాత్రుడై వుంటూ, అవసరమైనపుడు ఆ బావిలోని ఒక రహస్యబిలం ద్వారా తిరుమలకు వచ్చి శ్రీనివాసుని దర్శించి వెళుతూ వుండినాడు.

ఒకప్పుడు యుద్ధంలో శత్రువులతో తరుమబడిన తొండమానుడు రహస్య బిలం ద్వారా పరుగు పరుగున వచ్చి శ్రీనివాసుని చేరినాడు. ఏకాంతసేవా సమయంలో శ్రీనివాసునితో వున్న వేళలో అభ్యంతర మందిరంలో తటాలున ప్రవేశించిన తొండమానుణ్ణి చూచి సిగ్గుతో శ్రీదేవి శ్రీస్వామివారి వక్షః స్థలంలోను, భూదేవి తొండమానుడు కట్టించిన ఈ బావిలోను దాగికొన్నారని వరాహపురాణాంతర్గత వేంకటాచలమాహాత్మ్యం తెలుపుతున్నది.

పిదప భగవద్రామానుజులవారు తిరుమలకు వేంచేసి వున్నప్పుడు ఈ భూతీర్థమనెడి బావిని చూచి, అందులో భూదేవి దాగి కొనుట అనెడి పురాణ ప్రవచనాన్ని బట్టి, ఆ బావిలోనే భూదేవిని ప్రతిష్ఠించి, తీర్థాధిపతిగా శ్రీనివాసునికి అర్చన నివేదనాదులు జరుగునట్లు ఏర్పాట్లు చేశారనీ, అంతే గాక ప్రతిరోజు శ్రీస్వామివారికి అలంకరింపబడి తొలగింపబడే నిర్మాల్యాన్ని (పూలమాలలు తులసి వగైరా) భూదేవికోసమే ఈ బావిలో వేసేట్లుగా

నిర్ణయించారని "శ్రీవేంకటాచల ఇతిహాసమాల" అనే గ్రంథం తెలుపుతున్నది.

అప్పటినుంచి నిత్యమూ పుష్పాలంకార ప్రియుడైన శ్రీనివాసునకు అలంకరించి తొలగించిన తులసి, పూలమాలలు , ఈ బావిలో సమర్పించటం జరుగుతున్నది. తిరుమలలో శ్రీస్వామివారి పుష్పాలను ఎవరికిని ప్రసాదంగా ఇచ్చే ఆనవాయితీ లేదు. కాని సంవత్సరంలో ఒక్కసారి మాత్రమే, అదీ తిరుచానూరులో జరిగే కార్తీకబ్రహ్మోత్సవ సమయంలో మాత్రమే, తిరుచానూరులో పంచమితీర్థం (చక్రస్నానం) రోజున, తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అలంకరించిన పూలమాలలు, పసుపుకుంకుమలు, పరిమళద్రవ్యాలు, చీర రవికలు, లడ్డులు, వడలు మున్నగు ప్రసాదాలు ఛత్రచామర బాజాభజంత్రీలు వగైరా సకల రాజోపచారాలతో వృష, గజ, తురగ భక్త బృందాలతో తిరుమలనుండి కాలినడకన తిరుచానూరుకు వెళ్లి శ్రీపద్మావతి అమ్మవారికి కానుకగా సమర్పిస్తారు. ఆ రోజు అమ్మవారికి వాటిని అలంకరించిన తర్వాత చక్రస్నానం జరుగుతుంది. ఇలా నేటికీ జరుగుతూవున్న సనాతన సంప్రదాయం ఇది. ఈ ఒక్కరోజు తప్ప మిగిలిన అన్ని రోజుల్లో శ్రీవారి నిర్మాల్యాన్ని ఈ బావిలోనే సమర్పించడం జరుగుతున్నది. అయితే ఇటీవలి కాలంలో తిరుమలలో శ్రీవేంకటేశ్వరునికి జరిగే సేవల్లోను, ఉత్సవాల్లోను పర్వదినాల్లోను, గురువారంనాడు జరిగే పూలంగి సేవల్లోను విశేషంగా పుష్పాలంకరణ జరుగుతున్నందువల్ల, విపరీతంగా పేరుకుపోతున్న ఈ నిర్మాల్యాన్ని తిరుమలపర్వతసానువుల్లో ఎవరూ తొక్కనిచోట జారవిడవటం జరుగుతూవున్నది.

ఈ పూలబావి పూర్వం మెట్లువున్న దిగుడుబావిగా వుండేది. తర్వాతి కాలంలో చుట్టూ రాతిగోడతో ఈబావి గుండ్రమైన వేదురుబావివలె పునర్నిర్మింపబడింది. ఇటీవల ఈ బావిపై ఇనుపకడ్డీలతడక (జల్లెడ)ను కప్పి వాటిపైన పూలకుండీలను ఏర్పాటు చేశారు. తిలకించండి!

ఇంతటి చరిత్రను కలిగి వుంటూ, భూదేవిని, శ్రీదేవిని, పరమ భక్తాగ్రేసరుడైన తొండమాను చక్రవర్తిని, భగవద్రామానుజుల వారిని, తిరుచానూరు శ్రీపద్మావతిఅమ్మవారిని స్మరింపజేస్తూ, శ్రీవారి పవిత్రనిర్మాల్యాన్ని

తనలో నిక్షిప్తం చేసికొంటున్న ఈ 'పూలబావి' వద్ద అందరం ఒక్కసారి పుష్పాలంకార ప్రియుడైన శ్రీనివాసునకు జే జే లు పలుకుదాం

జయము జయము శ్రీవేంకటేశునకు!

నిత్యజయము నిత్య కల్యాణమూర్తికి !!

## 21. వగపడి అర

ఇదిగో! ఇటు పదండి! ఈ "యమునోత్తర" పూల అరకు ఆనుకొని తూర్పు దిక్కున వున్న పొడవైన మండపమే "వగపడి అర". ఇది మహా ప్రాకారానికి ఆనుకొని లోపలివైపున ఈశాన్యమూలన అనుసంధానిస్తూ 1939వ సంవత్సరంలో నిర్మింపబడిన తిరుమల శ్రీవారి ప్రసాదాల గిడ్డంగి. ఈ గిడ్డంగి అరలు అరలుగా రెండు అంతస్థులు కలిగివున్నది చూశారా!

శ్రీవారి ఆలయంలో మూలవిరాణ్మూర్తికి ప్రతిరోజూ మూడుపూటలా అంటే పొద్దున, మధ్యాహ్నం, రాత్రి నైవేద్యం చెయ్యబడతుంది. ఇంతే గాక నిత్యకల్యాణోత్సవం, వసంతోత్సవం, పవిత్రోత్సవం, పుష్పయాగంవంటి ఉత్సవాల్లో సేవల్లో కూడ ప్రత్యేకంగా ఉత్సవమూర్తికి నివేదింపబడతాయి. ఇలా నివేదింపబడిన లడ్డూలు, వడలు, అప్పాలు, జిలేబీలు, మురుకులు (తేన్‌తొళ), పోళీలు (పూర్ణంభక్ష్యాలు), సుఖియలు (పూర్ణం కుడుములు), దోసెలు....... వగైరా పిండివంట ప్రసాదాలను నిల్వవుంచి వాటిని భక్తులకు విక్రయించే స్థలాలకు (కౌంటర్లు) లెక్కవంతున పంపిణీచేసే స్థలమే (అర) ఈ 'వగపడి అర'.

కల్యాణోత్సవం, వసంతోత్సవం మున్నగు ఆర్జితసేవలు చేయించే భక్తులకు కూడ వారివారి విడుదులకు (కాటేజీలకు) కూడా ఈ 'వగపడిఅర' నుంచే ప్రసాదాలు పంపబడుతూ వుంటాయి. తిరుమల శ్రీస్వామి వారికి నివేదన చెయ్యబడే ప్రసాదాలను గురించి మరోచోట వివరంగా తెలుసుకుందాం.

చూశారా! అటు భగవంతునికి ఇటు భక్తులకు ప్రసాదాల వితరణ ద్వారా చక్కటి అనుసంధానం చేస్తూవున్న 'వగపడిఅర'కు, అందులో భద్ర

పరుచబడిన ప్రసాదాలకు మనమంతా మనసారా నమస్కరించి ముందుకు నడుద్దాం!

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!*

*గోవిందా! గోవింద!!*

ఇంతటితో మనం 'సంపంగి ప్రదక్షిణం' లోని మండపాల విషయాలు, విశేషాలు చూశాం, తెలుసుకున్నాం గదా! ఇక 'విమానప్రదక్షిణం' లోనికి ప్రవేశిద్దాం! అందులోని విశేషాలు కూడ తెలుసుకుందాం! రండి! నడవండి మరి!

## 22. వెండివాకిలి

సంపెంగ ప్రదక్షిణం చేసికొని వచ్చినమనం ఇప్పుడు మళ్లీ ధ్వజస్తంభం దగ్గరికి వచ్చాం చూశారా!

ఇదిగో ఈధ్వజస్తంభానికి ఎదురుగా వున్న ప్రవేశద్వారమే 'వెండివాకిలి'. దీన్నే 'నడిమి పడికావలి' అంటారు. ఇది శ్రీస్వామివారి సన్నిధికి వెళ్లే రెండవ ప్రవేశద్వారమన్న మాట! స్వామివారిని స్మరిస్తూ ఈద్వారం లోనికి ప్రవేశిద్దామా!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ధ్వజస్తంభం దాటినతర్వాతవున్న ఈ రెండవప్రవేశద్వారగోపురం, మహాద్వారగోపురం కంటె కొంచం చిన్నది. ఈ గోపురం దృఢమైన నల్లరాతితో నిర్మితమైన చౌకట్టుపై నెలకొల్పబడింది. ఈ రాతిచట్రం కొంతలు తూర్పు పడమరలుగా 24 అడుగులు, ఉత్తర దక్షిణదిక్కులుగా 36 అడుగులు కలిగి, వీటి మధ్య 9.5 అడుగుల వెడల్పు గల ప్రవేశమార్గంతో ఒప్పుతూవుంది. ఈ ద్వారంపై అనేక శిల్పశోభితంగా నిర్మింపబడిన మూడు అంతస్థుల గోపురాన్ని, ఆ గోపురంపై ప్రతిష్ఠింపబడ్డ ఏడు బంగారు కలశాలను ఇంతకు ముందే మనం దర్శించుకొన్నాం కదా!

ఈ ప్రవేశద్వారంలో తూర్పుపడమరల్లో ఇరువైపుల సమాన దూరంలో రెండు రాతి ద్వారబంధాలు బిగింప బడినాయి చూడండి! ముందువైపు (తూర్పున) వున్న ద్వార బంధానికి ఎత్తైన చెక్కవాకిళ్లు అమర్చబడి వున్నాయి.

ఈ వాకిళ్లకూ, గడపలకూ, ప్రక్కల వున్నగోడలపై ప్రవేశమార్గంలో అంతటా వెండిరేకు తాపబడింది. కనులారా చూడండి! తెల్లగా మిరుమిట్లు గొలుపుతూ ఆనందం కలిగిస్తూవున్నది. అందువల్లే ఈ నడిమి పడికావలి ద్వారాన్ని "వెండి వాకిలి" అని అంటారు.

1929 అక్టోబరు 1 న నైజాం ఎస్టేట్‌కు సంబంధించిన "శ్రీరాం ద్వారక దాస్ పరభణీ" అను వారు ఈ వాకిళ్లకు వెండిరేకులతాపడం చేయించినట్లు ఈ వాకిళ్లలో ఒకదానిపై హిందీలోను, మరొక వాకిలిపై ఇంగ్లీషులోను రాయబడింది. గమనించండి!

ఈ వాకిళ్ల మీదా ఇంకా ప్రవేశ ద్వార మార్గంలో ప్రక్కలకున్న గోడలమీదా శ్రీనివాసకల్యాణం, మహంతుబావాజీ-శ్రీనివాసులపాచికలాట, శ్రీరామ పట్టాభిషేకం వంటి మనోజ్ఞమైన శిల్పాలు మలచబడ్డాయి తిల కించండి!

ఈ వెండివాకిలి గోపురానికి అనుసంధించి ఉత్తర-దక్షిణం 160 అడుగులు, తూర్పు పడమర 235 అడుగుల పొడవుతో 3 అడుగుల మందంతో 30 అడుగుల ఎత్తు రాతి ప్రాకారం నిర్మింప బడివుంది.

ఈ రెండవ ప్రవేశద్వారం, గోపురం, ప్రాకార కుడ్యాలు - క్రీస్తుశకం 12వ శతాబ్దంలో ప్రారంభింపబడి క్రమేణ అంచెలంచెలుగా నిర్మింపబడుతూ 13వ శతాబ్దానికి పూర్తి అయినాయని చారిత్రక పరిశోధకులు పేర్కొంటున్నారు. ఈ గోపురం, క్రీ.శ 1472-82 సంవత్సరాల మధ్యా పదిఏళ్లలోను, మళ్లీ ఇటీవల 1950-53 సంవత్సరాలమధ్య మూడేళ్లలోను సడలిన చోట్ల స్వల్పంగా మరమ్మత్తులు చేయబడి పునర్నిర్మింపబడింది.

ఇక ఈ గోపురాన్ని దాటి విమాన ప్రదక్షిణంలో ప్రవేశిద్దామా!

హరిః ఓం శ్రీవేంకటేశాయనమః

## 23. విమాన ప్రదక్షిణం

ఈ వెండివాకిలి దాటి లోపల ప్రవేశించగానే కానిపించే మార్గమే విమాన ప్రదక్షిణాపథం! ఇది శ్రీస్వామివారి ప్రధానాలయం చుట్టూ 235 అడుగుల పొడవు (తూర్పు నుంచి పడమరకు), 160 అడుగుల వెడల్పు

(దక్షిణ నుంచి ఉత్తరానికి)లు కలిగి దీర్ఘచతురస్రాకారంలో వున్న ప్రదక్షిణ మార్గం. ఇది రెండవ గోపుర ప్రాకారానికి శ్రీ స్వామివారి వైకుంఠ ప్రదక్షిణ ప్రాకారానికి నడుమ నెలకొన్న మార్గం. ప్రధాన ఆలయం చుట్టూవున్న ఈ ప్రదక్షిణమార్గం తూర్పున, పశ్చిమాన సుమారు 15 అడుగుల వెడల్పుతోను, దక్షిణంవైపు సుమారు 30 అడుగుల వెడల్పుతోను, ఉత్తరంవైపున సుమారు 20 అడుగుల వెడల్పుతోను విస్తరించివున్నది.

ఇది శ్రీస్వామివారి ప్రధాన గోపురమగు ఆనంద నిలయ విమానమునకు ప్రదక్షిణంగా వెళ్లేమార్గం కావున ఈ ప్రదక్షిణ మార్గాన్ని 'విమాన ప్రదక్షిణ' మని అంటారు.

నిత్యం తెల్లవారు జామున శ్రీ స్వామివారికి సుప్రభాతం జరుగుతూ వుండే వేళల్లో భక్తులు కొందరు పుష్కరిణిలో మునకలిడి తడివస్త్రాలతో ఆలయం ప్రవేశించి ఈ విమాన ప్రదక్షిణ మార్గంలో ఆలయం చుట్టూ అత్యంత భక్తి ప్రపత్తులతో సాగిలబడి పొర్లుదండాలు (అంగప్రదక్షిణం) చేస్తూ వుంటారు. అందువల్ల ఈ మార్గాన్ని "అంగ ప్రదక్షిణ మార్గం" అని కూడా అంటారు.

ఈ ప్రదక్షిణ మార్గంలో వెండివాకిలికి ఎట్టఎదుట పై భాగంలో శ్రీరంగనాథుడు, వరుసగా దక్షిణం వైపునుంచి ప్రదక్షిణంగా వెళ్లితే, శ్రీ వరదరాజ స్వామివారి ఆలయం, పోటు (ప్రధాన వంటశాల), బంగారుబావి, అంకురార్పణ మండపం, యాగశాల, నాణాల పరకామణి కావించేమండపం (ఒకప్పటి కల్యాణ మండపం), నోట్ల పరకామణి మండపం, చందనపు అర, విమాన వేంకటేశ్వరస్వామివారిదర్శనం, రికార్డుసెల్, వేదపారాయణం, సభ-అర, తాళ్లపాకం అర, సన్నిధి భాష్యకారులు, (శ్రీరామానుజుల సన్నిధి), శ్రీ యోగనరసింహ స్వామి ఆలయం, పరిమళపు అర, శ్రీవారి హుండీ, శ్రీ విష్వక్సేనులవారి సన్నిధి వున్నాయి. విమాన ప్రదక్షిణమార్గంలో చుట్టువున్న ఈ గుళ్లను "చుట్టుగుళ్లు" అంటారు. ఇప్పుడు మనం విమాన ప్రదక్షిణం చేస్తూ క్రమంగా వాటిని గూర్చి తెలుసుకుందాం! రండి! నడవండిమరి! ఈవెండివాకిలి దాటిన వెంటనే ముందుగా శ్రీ స్వామివారికి సాష్టాంగ నమస్కారాలు సమర్పిద్దాం!

*అడుగడుగుదండాల వాడా! గోవిందా!! గోవింద!!!*

# 24. శ్రీరంగనాథుడు

వెండివాకిలి ద్వారా లోనికి ప్రవేశించిన వెంటనే మనకు ఎదురుగా శేషశాయి అయిన శ్రీరంగనాథుడు దర్శనమిస్తూ వున్నాడు చూడండి! బంగారుపూతగల ఈ చిన్ని విగ్రహమూర్తికి పై భాగంలో శ్రీ వరద రాజస్వామి, క్రింది భాగంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూర్తులు కూడ చోటు చేసుకొన్నాయి. దర్శించండి! లోపల బంగారువాకిలికి ఎదురుగావున్న గరుడ మందిరానికి వెనుక భాగంలో ఏర్పాటు చేయబడిన ఈ మువ్వరి మూర్తులు, వైష్ణవులకు అత్యంత ప్రధానమైన శ్రీరంగం, కంచి, వేంకటాచలం అనే మూడు క్షేత్రాల ప్రాధాన్యాన్నిగూర్చి ప్రబోధిస్తూవున్నాయి.

వెండి వాకిలి ఎదురుగాను, గరుడాళ్వార్ మందిరానికి వెనుక భాగం లోను వున్న ఈ రంగనాథునికి ప్రక్కలా పైనా క్రిందవున్న భాగమంతా, క్రింది నుంచి పైవరకు 1991 సం॥ ఆగష్టు 1వ తేదీ గురువారం నాడు బంగారు మలాంచేసిన రాగిరేకులు తాపితం చేయబడినాయి. కళ్లుమిరు మిట్లు గొలుపుతున్న బంగారు మలాం కార్యక్రమాన్ని యు.బి.గ్రూపు అధినేత శ్రీ విజయమాల్యా 55 లక్షల రూపాయల వ్యయంతో చేయించారు.

ఈ రంగనాథుని సన్నిధి నుండే భక్తులు ప్రతిరోజూ తెల్లవారు జామున అంగప్రదక్షిణాన్ని (పొర్లు దండాల సేవ) ప్రారంభించి, విమాన ప్రదక్షిణం చుట్టి వచ్చి ఇక్కడే పూర్తి చేస్తారు. అసలు శ్రీ స్వామివారికి పొర్లుదండాలు అంటేనే మహాఇష్టమట! పొర్లుదండాలు పెట్టే భక్తుణ్ణి చూసి వేంకటేశుడు పొంగిపోతూ కోరిన కోరికలను తీరుస్తాడట. అందువల్లే పొర్లుదండాలవా డని ఈ స్వామికి ప్రసిద్ధి ఏర్పడింది. పొర్లుదండాలు (అంగప్రదక్షిణం) సేవను గూర్చి ముందుముందు చర్చించుకుందాం. ఇప్పుడు ఒక్కసారి మనందరంకూడా పొర్లుదండాలు పెడదామా!

*పొర్లుదండాలవాడ గోవిందా! గోవింద!!*

తదితర దర్శన వేళల్లో కూడా సాధారణంగా భక్తులంతా శ్రీవారి దర్శనానంతరం ఈ స్థలంలోనే స్వామి వారికి సాష్టాంగ నమస్కారాలు చేస్తూవుంటారు.

పూర్వం ఈ చోటనే గరుడగంభాలు ఉండేవి. భక్తులు శ్రీ స్వామివారికి కాయు కర్పూరాలు సమర్పిస్తూండేవారు. రాను రాను జన సమ్మర్దం అధిక మయినందువలన ఈ గరుడ గంభాలను క్రమంగా ధ్వజస్తంభం ముందుకు, ఆ తర్వాత మహాద్వారానికి ఎదురుగా బయట గొల్లభామ మండపం వద్దకు తరలించబడినాయి. ఈ గరుడగంభాలనే "అఖిలాండం" అని కూడా అంటారు.

ఈ స్థలంలో ఇంకో విశేషం వుంది! ఏమిటంటే వెలుపలికి వెళ్లి తిరిగి వచ్చిన శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఉత్సవమూర్తికి ఈ రంగనాథుని సన్నిధిలో కర్పూర హారతి ఇవ్వబడుతుంది.

ఈ తిరుమలేశుని సన్నిధిలో నున్న ఆ కావేటి రంగణ్ణి భక్తి ప్రపత్తులతో ఒక్కసారి స్మరిద్దాం!

*శ్రీ రంగ! రంగ!! రంగా!!!*

*కరుణాంతరంగా! కావేటి రంగా!!!*

మరొక్కసారి శిరసు పైకెత్తి, ఈ రంగనాథునికి పై భాగాన దర్శించండి! ఆహా! మూడు బంగారు కలశాలు శిఖరాన తళతళ మెరుస్తూవున్నాయి చూశారా! అవి గరుడాళ్వారు మందిర (గోపుర) కలశాలన్నమాట! గరుత్మంతుడు, మందిరం లోపల శ్రీ స్వామివారికి అభిముఖంగా కొలువై వున్నాడు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవకులలో అగ్రగణ్యుడైన ఆ గరుత్మంతుని అటు లోపలికి వెళ్లినప్పుడు దర్శిద్దాం!

ప్రస్తుతం గరుడ మందిరంపై నున్న మూడు బంగారు కలశాలకు నమస్కరిద్దాం! అవిగో బంగారు కాంతులీనుతున్న కలశాలు. చూడండి!

*గోవింద! గోవింద!! గోవింద!!!*

ఇక ముందుకు నడుద్దామా! రండి, నడవండి, ఇటు ఎడమవైపుకు తిరగండి!

## 25. శ్రీవరదరాజస్వామి ఆలయం

ఇదిగో! విమానప్రదక్షిణమార్గంలో వెండివాకిలికి దక్షిణంగా 9 అడుగుల దూరంలో పశ్చిమాభిముఖంగా శ్రీవరదరాజస్వామి ఆలయం వుంది. దర్శించండి!

ఈ ఆలయం 3 అడుగుల ఎత్తు రాతి అధిష్ఠానం మీద, అంతరాళం, గర్భాలయం అనే రెండు భాగాలుగా నిర్మింప బడివుంది. గర్భాలయంలో శంఖ చక్ర ధారియై చిన్మయహాసంతో నిలిచివున్న శ్రీ వరదరాజస్వామి వారి 5 అడుగుల నిలువెత్తు శిలా విగ్రహం అభయ ముద్రతో విరాజిల్లుతూ వుంది. కన్నులారా దర్శించండి! నమస్కరించండి! గర్భాలయంపై వేసరశైలిలో ఏకకలశం గల గోపురం నిర్మింపబడింది. తిలకించండి!

సుమారు 20 అడుగుల పొడవు, 15 అడుగుల వెడల్పు గల ఈ ఆలయంచుట్టూ భక్తులు ప్రదక్షిణం చేస్తూ శ్రీ వేంకటేశ్వరుని దర్శనానికి వెళ్లడానికి వీలుగా అనువైనరీతిలో ఈ వరదరాజస్వామివారిఆలయం, రెండవ ప్రాకారానికి లోపలివైపున ఖాళీస్థలం వుండేట్లుగా $2\frac{1}{2}$ అడుగుల దూరంలో నిర్మింపబడింది.

ఈ వరదరాజ స్వామివారికి ప్రతిదినం ప్రత్యేక పూజలు లేకపోయినా, మూడు పూటలా ప్రత్యేక నివేదనలు మాత్రం జరుపబడుతూవున్నాయి.

ప్రతి ఏడాది శ్రీవరదరాజస్వామి జయంతినాడుమాత్రం, ఈ స్వామి వారికి అభిషేకాదులు పూజా నైవేద్యాలు ఘనంగా జరుపబడుతూ వున్నాయి.

తిరుమల శ్రీస్వామివారి సన్నిధిలో ఈ కంచివరదుడు ఎప్పుడు ప్రతిష్ఠింపబడ్డాడో ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టమే మరి!

ఏదీ ఒక్కసారి ఈ కంచి వరదునికి కూడ జే జే లు పలకండి మరి!

జయ జయ వరదా! జయ జయ శ్రీకంచి వరదా!!!

ఇక ముందుకు నడుద్దామా !

ఇక్కడ కాస్త ఆగండి! మనంఅందరం ఇక్కడినుంచి ముందుగా ఆనంద నిలయంలోనికి వెళ్లి శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శించి వచ్చిన తర్వాత 'విమాన ప్రదక్షిణమార్గం' లోని మిగిలిన 'చుట్టుగుళ్ల'ను, ఇతర విశేషాలను గూర్చి తెలుసుకుందాం! సరేనా! రండి నడవండి మరి!

# 26. ఘంటా మండపం

ఇదిగో!... ఇటురండి! శ్రీవేంకటేశ్వరస్వామివారి ప్రధాన ఆలయానికి ముఖమండపంగా ఉన్న "ఘంటామండపం" లోనికి ప్రవేశిద్దాం రండి.

మనం ఈ మండపంలోనికి విమానప్రదక్షిణంలోని దక్షిణం వైపున, ఉత్తర దిక్కు ముఖంతో లోనికి అడుగిడుతున్న ఈ మండపం విశిష్టత ఎంత వర్ణించినా తక్కువ గానే ఉంటుంది మరి!

ఇదిగో దర్శించండి! బ్రహ్మాది సకలదేవతలు సనకసనందనాది సమస్త మహర్షులు, శ్రీస్వామివారి దర్శనానికై వేచి వుండే వాకిళ్లు! కనకమయ కవాటాలు అవిగో! కన్నులారా తిలకించండి.

ప్రస్తుతం మనమంతా బంగారువాకిలి, ముందుడున్న మండపంలో నిలిచి వున్నాం. అటు బంగారువాకిలి దాని ఎదురుగా ఇటు వున్న గరుడమందిరం - ఈ రెంటినీ అనుసంధానిస్తూ నిర్మింపబడిన ఈ మండపాన్ని 'మహామణి మంటపం' అనీ, 'ఘంటామండపం' అనీ, 'ముఖమండపం' అనీ అంటారు. 43'x40' కొలతలు గలిగిన ఈ మహామండపంలో నాలుగు వరుసలుగా మొత్తం 16 స్తంభాలు వున్నాయి. ఈ స్తంభాలపైన భూవరాహస్వామి, నృసింహస్వామి మహావిష్ణువు శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీ వరదరాజస్వామి ఇత్యాది శిల్పాకృతులు చెక్కబడి ఉన్నాయి. ఇటీవలికాలంలో మట్టూ ఇత్తడి కటాంజనంతో కూడిన వాకిళ్లు ఏర్పాటు చేయబడిన ఈ మండపాన్ని క్రీ.శ. 1417లో ఆగష్టు 25 నాటికి చంద్రగిరి వాస్తవ్యుడైన 'అమాత్య మల్లన' అనే విజయనగర సామ్రాజ్య మంత్రివర్యుడు నిర్మించి పూర్తిచేశాడు. ఇతనికే 'మాధవదాసు' అనే నామాంతరం కూడా ఉంది.

ఈ మండపంలో బంగారు వాకిలికి ఎదురుగా గరుడాళ్వారు మందిరం ఉంది. ఇందులో శ్రీవేంకటేశ్వరస్వామివారికి అభిముఖంగా నమస్కార భంగిమలో నిలుచొని ఉన్న 6 అడుగుల గరుత్మంతుని శిలామూర్తి ప్రతిష్ఠింపబడింది. దర్శించండి! ఈ గరుత్మంతుని గూర్చి తర్వాత తెలుసుకుందాం.

బంగారు వాకిలికి గరుడునికి మధ్య వున్న విశాలమైన ఈ మహామణి మండపంలో ప్రతిరోజు తెల్లవారుజామున 3 గంటల సమయంలో "కౌసల్యా సుప్రజారామా! పూర్వాసంధ్యా ప్రవర్తతే..." అంటూ శ్రీనివాసునికి "మేలు కొలుపులు" వినిపించే సుమధుర సుమనోహర సుప్రభాతపఠనం జరుగు తుంది. నిత్యమూ ప్రశాంతతో ఆధ్యాత్మికతతో భక్తులను మైమరపించే ఈ ఘంటామండపంలో ప్రతిరోజు తెల్లవారుజామున, బంగారు సింహాస నంలో వేంచేసివున్న శ్రీవేంకటప్రభువులకు ఆనాటి తిథి, వార, నక్షత్రాదిగ పంచాంగ శ్రవణం, ముందురోజు నాటి ఆదాయ వ్యయాలు...... ఇత్యాదిగా బంగారు వాకిలిముందు విన్పించ బడుతుంది. ఇదే "శ్రీనివాసుని కొలువు." ఈ కొలువునే "శ్రీనివాసుని దర్బార్" అని కూడా అంటారు. ఈ కొలువులో తిరుమలలో జరిగే నిత్యాన్నదాతల పేర్లుకూడా శ్రీవారికి విన్పించబడతాయి.

ఈ మండపంలోనే ప్రతి బుధవారంనాటిఉదయం భోగశ్రీనివాస మూర్తికి, శ్రీ మలయప్పస్వామికి, విష్వక్సేనులకు సహస్రకలశాభిషేకం, గురువారంనాడు రెండవ గంటాసమయంలో 'తిరుప్పావడ' అనే అన్నకూ టోత్సవం, మున్నగు సేవలు జరుపబడుతూ వున్నాయి.

ఇవేగాక, ఉగాది, ఆణివారఆస్థానం, దీపావళి, ఇత్యాది పర్వదినాల్లో ఈ మండపంలోనే గరుడాళ్వారుకు ఎదురుగా, ఉభయ దేవేరులతో కూడి ఉన్న శ్రీవేంకటేశ్వరస్వామిని, విష్వక్సేనులను వేంచేపు చేయించి కొలువు (ఆస్థానం) జరుపుతారు.

అలాగే శ్రీరామనవమి పండుగనాడు శ్రీసీతారామలక్ష్మణ హనుమం తులు, గోకులాష్టమినాడు శ్రీరుక్మిణీ, శ్రీకృష్ణులు ఈ మండపంలో వేంచేపు చేయబడి కొలువు జరుగుతుంది. ప్రస్తుతం ఇది శ్రీవారి ఆస్థాన మండపంగా ఉపయోగపడుతున్నది. ఈ బంగారు వాకిటి ముంగిట్లో జరిగే శ్రీవారి ఆస్థాన సేవలను గురించి, ఇతర సేవల గురించి వివరంగా తర్వాత చర్చించుకుందాం.

ఈ మండపంలోనే ఇటువైపు, అంటే బంగారు వాకిలికి దక్షిణం వైపున రెండు పెద్ద ఘంటలు చెక్కదూలానికి పెద్ద ఇనుప గొలుసులతో

వ్రేలాడ గట్టబడివున్నాయి. ఈ ఘంటలు శ్రీస్వామివారికి నివేదన జరిగే సమయాల్లో మోగింపబడతాయి. ఈ ఘంటలను మ్రోగించే పరిచారక విప్రుణ్ణి "ఘంటాపాణి" అంటారు. ఈ ఘంటల నాదాల తరంగాలు తిరుమల క్షేత్రం అంతటా వ్యాపించి తిరుమల కొండల్లోనూ కోనల్లోనూ మంద్ర గంభీరంగా శ్రుతిసుందరంగా ప్రతిధ్వనిస్తూ ఉంటాయి. ఈ ఘంటానాదం చెవిని బడ్డ ప్రతివ్యక్తికీ శ్రీస్వామివారి ఆరగింపు జ్ఞప్తికి వస్తుంది. తిరుమల క్షేత్రంలో ఈ నాటికీ ఈనాదం ఆగిన తర్వాతనే తమతమ భోజనాలకు ఉపక్రమించే భక్త జనులు ఎందరో ఉన్నారు.

విజయనగర చక్రవర్తులు చంద్రగిరిలో విడిదిచేసే సమయంలో శ్రీవారి నైవేద్య ఘంటానాదం వినబడేందుకు వీలుగా కొండల్లో ఘంటామండపాల్ని ఆయాచోట్ల ఏర్పాటుచేయించి అలా అంచెలంచెలుగా విన్పింపజేయబడిన ఘంటానాదాన్ని విన్న అనంతరమే అనగా శ్రీవారి నైవేద్యం ఐనదని తెలియవచ్చిన పిమ్మటనే తాము భుజించేవారట.

బంగారువాకిలి ముందున్న మండపంలో ఈ ఘంటలు ఉన్నందువల్లే దీనికి "ఘంటామండప" మని ప్రధానంగా పేరేర్పడింది. మాశారా!.

ఈ ఘంటలను తమిళంలో "మణి" అంటారట! అందువల్లే ఈ మండపం "తిరుమహామణి మంటపం" అనికూడ వ్యవహరింపబడుతూ వుంది.

ఇన్ని విధాలుగా పిలువబడుతూ ప్రతినిత్యం శ్రీస్వామివారి పూజా విశేషాల్లో ప్రత్యేక స్థానాన్ని పొందిన ఈ మండపంలో బంగారువాకిలికి ఎదురుగా "గరుడమందిరం" వుంది. అంతేగాక ఈ బంగారు వాకిళ్లకు ఉత్తరం వారకు శ్రీస్వామివారి "హుండీ" ఉంది. ఈ హుండీని గూర్చి శ్రీస్వామివారి దర్శనానంతరం వివరంగా తెలుసుకుందాం! ప్రస్తుతం గరుడమందిరాన్ని గూర్చి తెలుసుకుందాం.

## 27. గరుడ మందిరం

ఇదిగో బంగారువాకిలికి ఎదురుగా ఉన్న ఈ మందిరంలో శ్రీవేంకటే శ్వరస్వామి వారికి అభిముఖంగా నమస్కార భంగిమలో రెక్కలు విప్పుకొని

నిలిచిఉన్న గరుత్మంతుని శిలామూర్తి ప్రతిష్ఠింపబడింది. తిలకించండి! ఈ మూర్తి ఎత్తు సుమారు 6 అడుగులు ఉంటుంది.

క్రీ.శ. 1512 నాటి శాసనాల్లో ఈ గరుడమందిరం యొక్క ప్రస్తావన ఉంది. ఈ మందిరంపై మూడు బంగారుకలశాలు గల గోపురం నిర్మింప బడింది. ఈ గోపురాన్ని మనం ఇంతకుముందే వెండి వాకిట్లో నుంచి లోపలికి ప్రవేశిస్తూ చూశాం కదా! ఈ గరుడమందిరం వెలుపల, ప్రక్కల, వెనుక భాగంలో బంగారు పూతపూయబడిన రేకు తాపబడివుంది. సరిగ్గా ఈ గరుడాళ్వారు మందిరం యొక్క వెనుకభాగంలోని ప్రాకారకుడ్యంపై - అంటే వెండివాకిలికి ఎదురుగా అమర్చబడిన శ్రీరంగనాథుని బంగారు విగ్రహాన్ని మనం ఇంతకుముందే దర్శించుకొన్నాము.

ఈ ఆలయంలో నెలకొని ఉన్న మరికొన్ని గరుడ విగ్రహాల్లో "రాముల వారిమేడ" లో ఉన్న చిన్న పంచలోహ గరుడవిగ్రహం ముఖ్యంగా పేర్కొనదగివుంది.

అంతేగాక రంగనాయక మండపంలోని వెండి గరుడవాహనం, బంగారు గరుడవాహనం కూడా ఈ సన్నివేశంలో స్మరింపదగివున్నాయి. శ్రీవేంక టేశ్వర స్వామివారు ప్రతి బ్రహ్మోత్సవంలో బంగారు గరుడునిపై ఊరేగే 'గరుడసేవ' ఎంతో వైభవోపేత మయినఉత్సవం! ఆ వివరాలు తరువాత తరువాత తెలుసుకుందాం.

శ్రీస్వామివారి సమక్షంలో ఆజ్ఞకోసం నిత్యం ఎదురుచూస్తూ విప్పకొన్న విశాలమైన రెక్కలతో అనుక్షణం సిద్ధంగా వుంటూ నిలిచి వున్న స్వామిభక్త పరాయణుడైన ఈ పక్షిరాజును ఒక్కసారి మనసార స్తుతించి బంగారు వాకిట్లో ప్రవేశిద్దాం.

కుంకిమాంకిత వర్ణాయ కుందేందు ధవళాయ చ,
విష్ణువాహ! నమస్తుభ్యం పక్షిరాజాయ తే నమః.

ఇక బంగారువాకిలి లోపలికి ప్రవేశిద్దామా!

కాస్త ఆగండాగండి! బంగారువాకిట్లోకి ప్రవేశించేముందు, బంగారు వాకిలిని అహరహం కావలికాస్తున్న ఈ ద్వారపాలకులను గూర్చి తెలుసు కొని, వారి అనుమతిని పొంది లోపల ప్రవేశిద్దాం! సరేనా? నడవండి మరి!

# 28. జయ విజయులు

శ్రీవైకుంఠంలో వలెనే ఈ తిరుమహామణి మండపంలో బంగారువాకిలికి ఉభయ పార్శ్వాలలో నిలిచివుండి శంఖచక్ర గదాధారులై, ద్వారపాలకులైన జయవిజయులు వున్నారు చూడండి! ఈ పంచలోహ మూర్తుల ఎత్తు సుమారు 10 అడుగులు ఉంటుంది. ఈ విగ్రహమూర్తుల చుట్టూ కర్రతో నిర్మింపబడిన కటాంజనం ఏర్పాటు చెయ్యబడింది. బంగారు వాకిళ్లతో పాటు, ఈ జయవిజయుల కటాంజనాలకు కూడ బంగారు పూత పూయబడిన రేకులు తాప బడివున్నాయి.

శ్రీస్వామిసన్నిధిలో భయభక్తులతో జాగ్రత్తగా మెలగవలసిందని, బంగారు వాకిలికి దక్షిణపార్శ్వంలో జయుడు కుడిచేతి చూపుడు వేలుతోను, ఉత్తరం వైపు విజయుడు ఎడమచేతి చూపుడు వేలుతోను హెచ్చరిస్తున్నారు చూడండి! ఈ క్షేత్రంలో ధూళి దర్శనం లేదు. అంటే భక్తుడు ఉన్న ఫళంగా ఆలయంలో ప్రవేశించరాదనీ, తొలుత శ్రీస్వామి పుష్కరిణిలో శుచిగా శుభ్రంగా స్నానం చేసి అత్యంత పవిత్రంగా వుంటూ ఆలయంలో ప్రవేశించాలి జాగ్రత్త! అని హెచ్చరిస్తున్నారు ద్వారపాలకులు. చూడండి.

తిరుమల శ్రీవారి ఆలయంలో ఎక్కడాకానరాని స్థిరప్రతిష్ఠ (కదల కుండా) చేయబడిన ఇంత ఎత్తైన పంచలోహ సుందరమూర్తులు ఎప్పుడు ప్రతిష్ఠింపబడ్డారో ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టమేమరి!

అహోరాత్రాలు శ్రీవేంకటేశ్వరస్వామివారి సన్నిధిని ఏమరుపాటు లేకుండా కాపలా కాస్తూవున్న స్వామిభక్తపరాయణులగు ఈ జయ విజయులకు జేజేలు పలికి నమస్కరించి వారి అనుమతితో సాక్షాత్తు శ్రీమహావైకుంఠాన్ని తలపించే ఈ బంగారువాకిట్లో ప్రవేశిద్దాం!

*జయా! జయీ భవ!*

*విజయా! విజయీ భవ!*

*జయా! విజయా! దిగ్విజయీ భవ!*

*గోవింద! గోవింద!! గోవింద!!*

ఇక ఇప్పుడు శ్రీస్వామివారి సన్నిధిని సమీపించేందుకు ప్రధాన ప్రవేశద్వారమైన, ఈ బంగారువాకిలిని గూర్చి తెలుసుకుందాం!

## 29. బంగారు వాకిలి

ఇదిగో! ముందుగా ఈ బంగారు వాకిలిని బాగుగా దర్శించండి! శ్రీ వేంకటేశ్వర స్వామివారి సన్నిధికి వెళ్లటానికి అత్యంత ప్రధానమైన ద్వారం ఇదే! పచ్చని పసిడి కాంతులతో మెరుస్తూవున్న ఈ బంగారు వాకిలినుండే నేరుగా శ్రీస్వామివారిదర్శనం భక్తాళికి లభిస్తున్నది. తిలకించండి!

ఆహాహా! ఏమి భాగ్యం! ఏమానందం!! సాక్షాత్తు శ్రీ మహావైకుంఠంలో జయ విజయులు కాపలా కాస్తూవున్న బంగారువాకిళ్లే భూలోకవైకుంఠమని ప్రసిద్ధిచెందిన వేంకటాచలంలోని ఈ బంగారు వాకిళ్లు!! అన్న ప్రశస్తిని పొందిన ఈ బంగారు వాకిలి ముందర ప్రతిరోజు బ్రాహ్మముహూర్తంలో (తెల్లవారుజామున 3 గంటలకు) జరిగే సుప్రభాత (పఠనం)సేవ చాల ప్రాచీనకాలం నుండీ కొనసాగుతూ, అత్యంత విశిష్టతను సంతరించుకుంది.

బంగారు వాకిలి ప్రవేశమార్గంలోగల 6 అడుగుల వెడల్పుగల చెక్కడపు రాతి ద్వార బంధానికి రెండు పెద్ద చెక్కవాకిళ్లు బిగింప బడ్డాయి.

ఈ రాతిద్వారబంధానికి, వాకిళ్లకు, పక్కన జయ విజయుల కటాంజన మందిరాలకు కలిపి బంగారుపూతరేకు తాపబడింది. అందువల్లే దీనికి "బంగారు వాకిలి" అనే సార్థక నామధేయం అనాదిగా వ్యవహారంలో ఉన్నది.

ఈ బంగారువాకిలి ద్వారబంధానికి క్రిందా, పైనా, పక్కలా తీగలు, లతలు చెక్కబడ్డాయి.

పై గడపకు మధ్యలో క్రిందివైపుగా విచ్చుకొన్న పద్మం, అలాగే పై గడపకు వెలుపలివైపు ఏనుగులచే అర్చింపబడుతున్న పద్మాసనస్థ అయిన శ్రీ మహాలక్ష్మి దేవి ప్రతిమ మలచబడివున్నాయి.

ఇక ఈ ద్వారబంధానికి రెండు చెక్క వాకిళ్లు బిగింపబడ్డాయి. రెండు వాకిళ్లమీద చెక్కదిమ్మెలతో చతురస్రాకారపు గళ్లు ఏర్పాటు చేయబడి, ఒక్కొక్క గడిలో ఒక్కొక్క విష్ణు శిల్పం మలచబడివుంది చూడండి!

ఈ రెండు వాకిళ్లు మూసి వుంచినపుడు వరుసగా నాలుగు గడులు ఏర్పడతాయి. ఇలా వరుసకు నాలుగుగళ్ల వంతున వాకిలి పైనుంచి కిందివరకు అటువంటి ఎనిమిది వరుసలు వున్నాయి. అంటే ఈ రెండు వాకిళ్ల మీద వెరసి 32 గళ్లు ఉన్నాయన్నమాట!

పై నుండి మొదటి వరుసలో వున్న నాలుగు గళ్లలో, మొదటి గడిలో చక్రం, రెండవదానిలో కలియుగవైకుంఠవాసుడైన శ్రీ వేంకటేశ్వరుడు, ఇక మూడవ గడిలో వైకుంఠవాసుడైన మహావిష్ణువు కూర్చొన్న భంగిమలోను, నాల్గవ గడిలో శంఖం చెక్కబడి వున్నాయి.

రెండవ వరుసలో వున్న నాలుగు గళ్లలో వరుసగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపాలు మలచబడ్డాయి. ఆగమశాస్త్రానుసారంగా వీటిని పరంధాముడైన శ్రీ మహావిష్ణువు యొక్క "వ్యూహ రూపాలు" గా పేర్కొంటారు.

3,4,5 వ వరుసల్లో గల 12 గళ్లల్లో కేశవుడు - మొదలుగా దామోదరుడు వరకు గల ద్వాదశ మూర్తులను ఈ క్రింది క్రమంలో నెలకొల్పారు.

3 వ వరుస - 1. కేశవుడు, 2. నారాయణుడు, 3. మాధవుడు, 4. గోవిందుడు.

4 వ వరుస - 1. విష్ణువు, 2. మధుసూదనుడు, 3. త్రివిక్రముడు, 4. వామనుడు.

5 వ వరుస - 1. శ్రీధరుడు, 2. హృషీకేశుడు, 3. పద్మనాభుడు, 4. దామోదరుడు.

విష్ణువు యొక్క ఈ ద్వాదశ రూపాలు నిలుచున్న భంగిమలో వున్నాయి చూడండి!

ఇక చివరి మూడు వరుసల్లోని అంటే 6,7 వరుసల్లోని ఎనిమిది గదుల్లోను, 8 వ వరుసలోని ఒకటవ, నాల్గవ గదుల్లోను వరుసగా శ్రీ మహావిష్ణువుయొక్క విభవమూర్తు లైన దశావతారాలు చెక్కబడి వున్నాయి చూశారా! 8 వ వరుసలోని రెండవ, మూడవ గదుల్లో తలుపులు వేయటానికి వీలుగా చిలుకులు (గొలుసులు) ఓగింపబడ్డాయి. ఈ ఇనుప గొలుసులను క్రింది గడపకుగల ఇనుప కొండికి (కొక్కికి) తగిలించి పెద్దతాళం వేస్తారు. ఇదిగాక ఈ వాకిళ్లకు మధ్యభాగంలో మూడుచోట్ల మూడు గడియలువున్నాయి. ఈ మూడు గడియల్లో, పైదానికి క్రిందిదానికి దేవస్థానంవారి పెద్దతాళాలను వేస్తారు. మధ్యలో వున్న గడియకు శ్రీ

స్వామివారి అర్చకులు బీగాన్ని వేసి, తాళం చెవులను తమవెంట తీసికొని వెళ్తారు.

ఇంతేగాక ఈ వాకిళ్లకు గల చిన్న రంధ్రం ద్వారా వెలుపలినుండియే అర్చకులు, "కుంచెకోల" (కొడవలి వలె వంకరగా వుండే కడ్డీ) అనబడే యంత్రిక (పరికరం)తో వాకిళ్లకు లోపలి వైపున ఉన్న గడియను వేస్తారు. అలాగే బయటి నుండే బంగారువాకిలికి లోపలివైపు గడియను తీస్తారు. ఇలా బయటినుండే లోపలిగడియవేయటం, తీయటం వంశపారంపర్యంగా అర్చకస్వాములకు మాత్రమే తెలిసిన పరంపరాగతమైన రహస్యప్రక్రియ!

ఈ వాకిలికి "బంగారువాకిళ్లు" అనే వ్యవహారం చాలకాలం ముందు నుంచే ప్రశస్తిగాంచింది. క్రీ.శ. 15 వ శతాబ్దంలో తిరుమలను తొలిసారి దర్శించిన తాళ్లపాక అన్నమయ్య "కనకరత్నకవాట కాంతు లిరుగడ గంటి" నని, ఆ పసిడి టక్కులతల వాకిటి నుంచే కానవచ్చే తిరువేంకటాచలాధీశుని కన్నులారా దర్శించానని వక్కాణించాడు.

అనంతకాల గమనంలో ఈ వాకిలికి ఎన్ని పర్యాయాలు బంగారు రేకు తాపబడినదో తెలియదు కాని, 1884 లో మహంతు ధర్మదాసు బంగారు రేకు తొడుగు వేయించినట్లు తెలుస్తున్నది! ఆ తర్వాత 1958లో ఆనంద నిలయ విమాన మహాసంప్రోక్షణ సమయంలో ఈ వాకిలికి బంగారు మలాము వెయ్యబడింది.

అనాదిగా ఈ బంగారు వాకిళ్లలో బ్రహ్మేంద్రాది దేవతలు ఎందరు నడిచారో!.. ఎన్నిసార్లు నడిచారో! సనకసనందనాది మహర్షులు శ్రీవారి దర్శనానికి ఎన్నిమార్లు పడిగాపులు కాచారో! ఆళ్వారులు... కర్ణాటక హరిదాసులు... అన్నమాచార్యులు... తరిగొండ వెంగమాంబ... వంటి మహాభక్తులు, రాజాధిరాజులు, చక్రవర్తులు ఇలా అనంతకాల ప్రవాహంలో ఎందరో మహాభక్తులు, ఎందరెందరో భాగవతులు ఈ బంగారువాకిలి ముందు నిలిచి తరించారో!... ప్రవేశించి పరవశించారో! ఏ జన్మలో చేసికొన్న ఏ భాగ్యలేశం చేతనో మనకూ, ఆ మహనీయులు ప్రవేశించి తరించిన బంగారు వాకిళ్లలో ప్రవేశించే మహదవకాశం ఇప్పుడు లభించింది కదా! నిజంగా మన అదృష్టం ఇంతింత అని కొలువలేనిది! కొలువరానిది

కూడా! రండి! నడవండి! మన బతుకంతా బంగారునుపండించే బాలాజీని ఈబంగారు వాకిట్లో ప్రవేశిస్తూ కన్నులారా చూస్తూ లోనికి వెళదాం!

చూడండి! ఈ బంగారు వాకిలి నుండే నిలువెత్తు స్వామి, మణికిరీట మకర కుండలాలతో శంఖు చక్రాలతో వరద కటి హస్తాలతో చిన్మయ దివ్య దరహాసంతో ఎలా దర్శన మిస్తున్నాడో! కన్నులార్పక ఇక్కడినుంచే దర్శిస్తూ గోవిందలు పెడుతూ బంగారు వాకిలి గడపకు నమస్కారంచేస్తూ ఇంకా లోపల ప్రవేశిద్దాం రండి! నడవండి!

*ఏడు కొండలవాడా! వేంకటరమణా!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 30. స్నపన మండపం

ఇదిగో! బంగారువాకిలి దాటి లోపలికి ప్రవేశించిన వెంటనే కొద్ది చీకటిగా కనపడే 27 అడుగుల చతురస్రాకారం గల 'స్నపన మండపం' వుంది. చూశారా! ఈ మండపం మధ్యలో నాలుగు స్తంభాలున్నాయి. ఈ స్తంభాల మీద బాలకృష్ణ, యోగనరసింహ, శ్రీకృష్ణ కాళీయమర్దనం మొదలగు శిల్పాలు వున్నాయి. ఈ మండపాన్నే తమిళంలో "తిరువిలాన్ కోయిల్" అని అంటారు. అంటే బాలాలయమని అర్థం.

ఎప్పుడైనా, గర్భాలయం లోపల గాని, బయటగాని, మరమ్మత్తులు లేదా పునరుద్ధరణ కార్యాలు చేపట్టి నట్లయితే అలాంటి సందర్భాల్లో బాలాలయం ఏర్పాటు చేసి, శ్రీస్వామివారి మూలమూర్తి తేజస్సును మరొక విగ్రహంలో ప్రాణ ప్రతిష్ఠ చేస్తారు. క్రీ.శ.614లో పల్లవరాణి సమవాయి (పెరుందేవి) 'మనవాళప్పెరుమాళ్' అనబడే వెండి భోగశ్రీనివాసమూర్తిని మూలమూర్తికి నకలు ప్రతిమగా ఈ ఆలయానికి బహూకరించి, ఈ స్నపన మండపంలో ప్రతిష్ఠించి అభిషేకాదులు పూజలు నిర్వహించేటట్లు కట్టడి చేసిందట! ఆ సందర్భంలోనే ఈ స్నపన మండపాన్ని తిరువిలాన్ కోయిల్ (బాలాలయం)గా ఉపయోగించి వుంటారని పరిశోధకుల తలంపు.

కాని ఈమండపంలో నేడు ఎలాంటి అభిషేకాలు (స్నపనం) జరగడం లేదు. కాని ప్రతిరోజు శ్రీవేంకటేశ్వర స్వామివారికి తోమాలసేవ అనే పుష్పాలంకరణ సేవ జరిగిన తర్వాత, ఆ వెంటనే గర్భాలయంలో వున్న కొలువు శ్రీనివాస మూర్తి విగ్రహాన్ని ఇచ్చట బంగారు సింహాసనంపై వేంచేపు చేయించి కొలువు జరుపుతారు. ఆ కొలువు సమయంలో శ్రీస్వామి వారికి తిథివార నక్షత్రాది పంచాంగశ్రవణం చేయించి, ఆనాటి ఉత్సవ విశేషాలు, ముందునాటి ఆదాయం వగైరాలు భక్తి పూర్వకంగా విన్నవింప బడతాయి. ఈ కొలువు సమయంలో ఉపయోగించే బంగారు సింహాసనం అదిగో మనకు కుడివైపు కడ్డీల అరలో వుంది. దర్శించండి! ఇక్కడ ఒక్క విషయాన్ని గమనించండి! శ్రీస్వామివారి కొలువు సూర్యోదయానికి పూర్వమే (ముందుగా) అయితే ఈ స్నపన మండపంలోను, సూర్యోదయా నంతరమైతే బంగారు వాకిలి ముందుగల ఘంటా మండపంలోను కొలువు జరుగుతుంది

ఈ స్నపన మండపంలో బంగారు వాకిలికి ఇరువైపులా "శ్రీభాండార" మను పేర రెండుగదులున్నాయి. చూడండి! ఈ రెండుగదుల్లో, బంగారు వాకిలికి ఉత్తరం వైపు (కుడివైపు)న వున్న గదిలో హుండీ నుండి వచ్చిన ధనాన్ని నిల్వవుంచుతారు. ప్రతీరాత్రి కూడా శ్రీస్వామివారి ఏకాంత సేవా సమయం తర్వాత 'తీర్మానం' (పూజాకార్యక్రమాల ముగింపు) అనంతరం శ్రీస్వామివారి హుండీని విప్పి, దాన్ని బాగా బిగించి సీళ్లువేసి, బంగారు వాకిలి లోపల ఉత్తరం దిక్కున గల ఈ 'భాండారం'లో భద్రపరుస్తారు. అందువల్లే శ్రీవారి కానుకలను భద్రపరచే ఈగదిని "కానుకభాండారం" అని అంటారు.

ఇక ఇటు దక్షిణంవైపు (ఎడమవైపు)న మరోగదివుంది చూశారా!ఇం దులో శ్రీస్వామి వారి నగలు ఆభరణాలు, వజ్ర వైడూర్యాలు పొదిగిన శంఖు చక్రాది ఆయుధాలు........ఇలా ఎన్నో ఎన్నెన్నో అమూల్యమైన అలం కారాలను నవరత్నహారాలను భద్ర పరుస్తారు. అయితే మీకొక సందేహం రావొచ్చు. ఎల్లప్పుడూ, నిత్యమూ శ్రీస్వామివారు సర్వాభరణాలతో అలంకృ

తుదై వుంటాడు కదా! ఇవికాక ఇంకా ఎలాంటి ఆభరణాలు, నగలు ఈ గదిలో భద్రపరచడం జరుగుతుంది? అని. అందుకే వివరంగా చెప్తున్నాను జాగ్రత్తగా వినండి మరి!

శ్రీవేంకటేశ్వరస్వామివారి మూల మూర్తిని అలంకరించే ఆభరణాల అలంకరణ సేవా కార్యక్రమాన్ని "సమర్పణ" అంటారు. ఈ 'సమర్పణ' మూడురకాలు. 1. సదా సమర్పణ 2. విశేషసమర్పణ 3. మొజాతి సమర్పణ.

## సదా సమర్పణ

సదా సమర్పణ అంటే, నిత్యమూ శ్రీస్వామివారికి అలంకరింపబడి వుండే బంగారు కిరీటం, బంగారు కటిహస్తం, వరదహస్తం, ఖడ్గం, మకర కంఠి, లక్ష్మీహారాలు......ఇత్యాదులు. ఇవన్నీ చాలవరకు కేవలం బంగారుతో చేయబడిన ఆభరణాలు మాత్రమే. ఇవన్నీ ప్రధాన అర్చకుల ఆధీనంలో వుంటాయి. నిత్యమూ అలంకరింప బడి, అర్చకుల ఆధీనంలో వున్న ఈ నగల విలువ సుమారు కోటిరూపాయలకు మించి వుంటుంది.

## విశేష సమర్పణ

విశేష పర్వదినాలు లేదా రాష్ట్రపతి, ప్రధానమంత్రి వంటి దేశాధిపతులు ఈ పుణ్యక్షేత్రానికి వచ్చినపుడూ, విశేష ఉత్సవ సమయాల్లోను శ్రీ స్వామి వారికి అమూల్యములైన వజ్రకిరీటం, వజ్రాలు పొదిగిన శంఖ చక్రాలు, వైకుంఠ కటి హస్తాలు.....ఇలాంటివి. ఇవన్నీ వజ్రవైడూర్య మరకతమాణి క్యాది నవరత్నాలు పొదుగబడి తయారు చేయబడ్డ ఆభరణాలు. ఇవన్నీ ఆలయం "పారుపత్యదారు" అనే అధికారియొక్క ఆధీనంలో వుంటాయి. వీటి విలువ రెండు కోట్ల రూపాయలకు పైబడే వుంటుంది మరి!

## మొజాతి నగలు

బ్రహ్మోత్సవాలు మున్నగు ఉత్సవ సమయాల్లోను, ఆ యా ఆస్థాన సమయాల్లోను శ్రీస్వామివారి మూర్తులకు అలంకరింపబడే ప్రాచీనమైన

నగలు! గద్వాల రాజు, రాణి సమర్పించిన పతకాలు, మున్నగునవి ఈ తెగకు చెందుతాయి. ఈ నగలన్నీ ఆర్థికమైన విలువతో పాటు చారిత్రక విలువను సంతరించుకున్నవే. ఇవి తి.తి. దేవస్థానం కోశాగారం (ట్రెజరీ)లో భద్రపరచబడి వుంటాయి. ట్రెజరీ అధికారి అధీనంలో వున్న ఈ మొజాతి నగలు ఆ యా ఉత్సవసమయాల్లో శ్రీనివాసుని ఉత్సవమూర్తి (మలయప్పస్వామి) అలంకరింపబడతవి.

శ్రీవేంకటేశ్వర స్వామివారికి నిత్యమూ అలంకరింపబడే "సదాసమర్పణ" నగలన్నీ ప్రధాన అర్చకుని అధీనంలోనే, ఈ స్నపన మండపంలోని బీరువాల్లో భద్రపరుపబడతాయి.

ఇక విశేష సమర్పణ నగలన్నీ ఈ స్నపన మండపంలోని దక్షిణపు గదిలో భద్రపరుపబడి ఆలయ అధికారిఅయిన 'పారుపత్యదారు' అధీనంలో వుంటాయి. ఇక ఈ నగలను గూర్చిన వివరాలు ముమ్ముందు విశదంగా తెలుసుకుందాం! ఇదిగో ఈ నగలు భద్రపరచిన అరల దగ్గరికి కూడా ఎవరూ వెళ్లకుండా కిందినుంచి పైవరకు పెద్ద ఇనుపకడ్డీలతో వాకిళ్లు బిగింపబడినాయి చూడండి!

ఇదీ ఈస్నపన మండపం యొక్క విశిష్ట చరిత్ర!

నిత్యమూ కొలువు శ్రీనివాసమూర్తికి దర్బార్ జరిగే ఈ మండపం దాటి ముందుకు వెళితే వచ్చేదే "రాములవారి మేడ"! మనమిప్పుడు రాముల వారిమేడలో ప్రవేశిద్దాం. అలా ప్రవేశించే ముందుగా అందరమూ ఒక్కమారు శ్రీరామనామాన్ని స్మరింతాం!

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే,
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే.

## 31. రాములవారి మేడ

స్నపన మండపం దాటిన వెంటనే వచ్చే ఈ ఇరుకైన నడవనే "రాముల వారి మేడ" అంటారు. 12'x10' కొలతలు గల ఈ రాములవారి మేడ క్రీ.శ. 1262-65 కు ముందు లేనే లేదనీ, ఇది ఇప్పుడున్న వైకుంఠ (ముక్కోటి) ప్రదక్షిణ మార్గంలోని భాగంగా కలిసి వుండేదని పరిశోధకుల అభిప్రాయం.

స్నపన మండపం నుండి రాములవారి మేడలో ప్రవేశించడానికి 6 అడుగుల వెడల్పుగల రాతి ద్వారబంధం, దానికి బయటివైపు చెక్క కటాంజనపు తలుపులు - లోపలివైపు మామూలు చెక్క తలుపులు బిగింప బడి వున్నాయి. లోపలి తలుపులు మూసి బీగాలు వేయడానికి అనువుగా వాటికి చిలుకులు అమర్చబడినాయి.

రాములవారి మేడలో ఇరువైపుల ఎత్తైన అరుగులున్నాయి. దక్షిణం వైపు అరుగుమీద ఉత్తరాభి ముఖంగా రాములవారి సేవా పరివారమైన అంగద, హనుమంత, సుగ్రీవుల ఉత్సవ విగ్రహాలు వున్నాయి. అలాగే ఉత్తరం వైపు అరుగుమీద దక్షిణాభిముఖంగా శ్రీవేంకటేశ్వరుని సేవా పరివారమైన విష్వక్సేన, అనంత, గరుడుల ఉత్సవమూర్తులు కొలువైవున్నాయి.వీరినే నిత్యసూరులంటారు.

## రాములవారి సేవా పరివార దేవతలు

### 1. సుగ్రీవుడు

ఇతడు వానర రాజైనందువల్ల కిరీటాన్ని ధరించి, సర్వజగత్ప్రభువైన శ్రీరాములవారికి అంజలిఘటిస్తూ నిలిచివున్నమూర్తి సుగ్రీవుడు. శ్రీరామ నవమి మరునాడు దశమిరోజు శ్రీరామపట్టాభిషేకంలో ఈ సుగ్రీవుడు పాల్గొంటాడు.

### 2. అంగదుడు

వేంకటాచలంలోని శ్రీవేంకటేశ్వరునిలో శ్రీరాములవారి తేజస్సును దర్శించి "ఓహో వారే వీరా!" అని ఆశ్చర్యపోతూవున్న భంగిమలో వున్న యువరాజు అంగదుడు. యువరాజు కనుక ఈ మూర్తికి చిన్నటోపీలాంటి కిరీటం కూడా వుంది. చూడండి! శ్రీరామనవమి మరునాడు పట్టాభిషేకం ఆస్థానంలో పాల్గొంటారు.

### 3. ఆజాపాలక ఆంజనేయుడు

శ్వాస పారకుండా చేతిని అడ్డంపెట్టుకొని భయభక్తులతో వినయంగా నిలిచివున్న మూర్తి ఈ ఆంజనేయుడు. అందువల్లే ఈయన ఆజ్ఞా పాలక ఆంజనేయస్వామి. శ్రీరామనవమి ఆస్థానం, పట్టాభిషేకం వంటి సమయాల్లో ప్రధాన పాత్ర వహిస్తున్న మూర్తి ఈయన.

# శ్రీ వేంకటేశుని సేవా పరివార దేవతలు

## 1. అనంతుడు

శ్రీమహావిష్ణువునకు శయ్యగా సేవ చేస్తూన్న ఆదిశేషుడే ఈ అనంతుడు. వరదాభయహస్త ముద్రలతో తలపై నాగపడిగెలతో విరాజిల్లుతున్న పంచలోహమూర్తి అనంతుడు. బ్రహ్మోత్సవంలో మొదటిరోజు ధ్వజారోహణకు ముందు దిక్పాలురను ఆహ్వానించే గ్రామోత్సవంలో ఈ అనంతుడు పాల్గొంటాడు.

## 2. విష్వక్సేనులు

సర్వలోకసార్వభౌముడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి సర్వసైన్యాధ్యక్షులే ఈ విష్వక్సేనులవారు. వీరినే సేనమొదలియార్ అని కూడా పిలుస్తారు. శంఖ చక్రధారియై అభయ వరదహస్తాలతో విరాజిల్లుతున్న ఈ పంచలోహ మూర్తి అయిన సేనాపతి, శ్రీస్వామివారి ఉగాది, దీపావళి ఆస్థానం, ఆణివర ఆస్థానం మున్నగు ఆస్థాన సేవల్లో ప్రముఖ పాత్ర వహిస్తున్నాడు. శ్రీవారి ప్రతి ఉత్సవంలో అంకురార్పణకుగాను మృత్సంగ్రహణ కార్యంలో ఆధ్వర్యం వహిస్తాడు శ్రీవారి సేనాపతి అయిన విష్వక్సేనులు.

## 3. గరుడుడు

శ్రీస్వామివారి ఆజ్ఞను నెరవేర్చడానికి ఎప్పుడూ రెక్కలు విప్పుకొని సిద్ధమై సర్వసన్నద్ధమై నమస్కరిస్తూ నిలిచివున్న పంచలోహమూర్తి గరుడుడు. బ్రహ్మోత్సవం తొలినాడు దిక్పాలుర నాహ్వానించే గ్రామోత్సవంలో ఈ గరుడుడు పాల్గొంటాడు.

సుమారు $1\frac{1}{2}$ అడుగుల ఎత్తుగల ఈ పంచలోహ ఉత్సవమూర్తులన్నీ ఆ యా ఉత్సవాలలో ప్రధానపాత్ర వహిస్తూ వున్నాయి.

ప్రస్తుతం శ్రీవారి గర్భాలయంలోవున్న శ్రీ సీతా రామలక్ష్మణ స్వాముల వారి విగ్రహాలు ఒకప్పుడు ఇక్కడి అరుగులమీద వుండినందువల్లే ఈ గది 'రాములవారి మేడ' అని పిలువబడిందట! అయితే తర్వాతి కాలంలో ఆ విగ్రహమూర్తులను సన్నిధి లోపలికి తరలించడం జరిగిందని అంటారు. అయినా ఆ పేరు అలానే నిలిచివుంది. ప్రస్తుతం ఈ అరుగులమీద ఉండిన చిన్నవిగ్రహాలన్నీ కూడా బయట బంగారుబావివద్దగల అంకురార్పణ మండపంలోనికి తరలించబడినాయి. అక్కడ ఆ మూర్తులను దర్శిద్దాం. యాత్రికుల రద్దీ ఎక్కువగా వున్న రోజుల్లో రాములవారి మేడ గడప వెలుపలనుండే శ్రీస్వామివారి దర్శనం ఏర్పాటు చేస్తారు.

ఈ రాములవారి మేడకు నమస్కరించి శ్రీస్వామివారి శయన మండపంలో ప్రవేశిద్దాం.

రాములవారి మేడలో రాతి గడపను దాటి లోనికిప్రవేశిస్తే వుండేగది శ్రీస్వామివారి శయన మండపం. రాములవారి మేడకు శయన మండపానికి మధ్యన వుండే రాతి గడపకు బయటివైపు చెక్క కటాంజనపు వాకిళ్లు బిగింపబడి వున్నాయి. కాని ఈ తలుపు ఎప్పుడూ తెరచే వుంటుంది.

రాత్రి శ్రీ స్వామివారి ఏకాంతసేవా సమయంలో తాళ్లపాక అన్నమయ్య వంశీయు లొకరు ఈ రాములవారి మేడలోని నడవలో కూర్చొని తంబుర మీటుతూ స్వామివారికి లాలిపాటను పాడి వినిపిస్తారు.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 32. శయన మండపం

రాములవారిమేడ దాటి లోపల ప్రవేశించిన వెంటనే వున్న గదే శయనమండపం. శ్రీవేంకటేశ్వరస్వామివారు కొలువై విరాజిల్లుతూవున్న గర్భాలయానికి ముందువున్న అంతరాళమే (గది) ఈ శయన మండపం. $13\frac{1}{2}$ అడుగుల కొలతలు కలిగిన ఈ చతురస్ర శయన మండపాన్నే 'అర్థమండపం' అని కూడా అంటారు.

ఈ శయన మండపంలోనే ప్రతిరోజు రాత్రి శ్రీస్వామి (భోగ శ్రీనివాసమూర్తి) వారికి ఏకాంతసేవ(పవళింపు సేవ) జరుప బడుతుంది.

ఈ గదిలో వెండి గొలుసులతో వ్రేలాడ దీయబడిన బంగారు నవారు పట్టెమంచంమీద పట్టుపరుపు పరచి దానిపై భోగశ్రీనివాసమూర్తిని శయనింపజేస్తారు. అందువల్లే ఈ గదిని "శయన మండపం" అంటారు.

ప్రతిరోజు తెల్లవారుజామున సుప్రభాతానంతరం శ్రీస్వామివారికి జరిగే తోమాల సేవా (పుష్పాలంకరణసేవ) సమయంలో వైష్ణవస్వాములు ఈ శయనమండపంలో శ్రీస్వామికి ఎదురుగా నిలవబడి దివ్య ప్రబంధగానం చేస్తారు.

అలాగే ప్రతిరోజు తోమాలసేవానంతరం శ్రీవేంకటేశ్వరస్వామివారికి జరిగే సహస్ర నామార్చనసమయంలోను, అష్టోత్తర శతనామార్చన సమయాల్లోను, పండితులు ఈ శయనమండపంలో నిలబడి సహస్రనామావళిని చెప్తుండగా అర్చకులు, శ్రీస్వామివారికి లోపల అర్చన చేస్తారు. ప్రతి శుక్రవారం శుక్రవారాభిషేక సమయంలో కూడ వేదపండితులు ఈ మండపంలో నిలబడి శ్రీ సూక్త పురుషసూక్తాదివేదమంత్రాలు పఠిస్తుండగా శ్రీస్వామివారికి అభిషేకం జరుగుతుంది.

ప్రతిరోజు శ్రీస్వామివారికిజరిగే తోమాలసేవ, సహస్రనామార్చన, సమయాల్లోను, ప్రతి మంగళవారం, శ్రీస్వామివారికి జరిగే అష్టదళ పాదపద్మారాధన సమయంలోను, అలాగే ప్రతి శుక్రవారంనాడు జరిగే అభిషేక సమయంలోను పాల్గొనే ఆర్జితసేవా భక్తులను శ్రీస్వామివారికి ఎదురుగా ఈ శయనమండపంలోనుంచి వరుసగా ఒకరి వెనుక మరొకరిని బంగారువాకిలి వరకు కూర్చొనబెడతారు.

ప్రతిరోజు జరిగే సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చనసేవల్లోను, మంగళవారం జరిగే అష్టదళపాద పద్మారాధనలోను, బుధవారం సహస్రకలశాభిషేకం సేవలోను, గురువారం తిరుప్పావడసేవలోను, శుక్రవారాభిషేకంలో పాల్గొనే ఆర్జితసేవా భక్తులకు మాత్రమే ఈ శయనమండపంలో నిలవబడి శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శించడానికి అనుమతిస్తారు.

ఈ శయనమండపంలోనే - అంటే శ్రీస్వామివారి గర్భాలయం యొక్క గడప (కులశేఖరపడికి)కు ఇవతలే శ్రీనివాసునికి ఎదురుగా నైవేద్యాలు ఉంచబడతాయి. ఎట్టి పరిస్థితుల్లోను అన్నప్రసాదాలు, పిండివంటలు

కులశేఖరపడి గడపను దాటి లోనికి తీసికొని పోబడవు. వెన్న, పాలు, పండ్లు, పెసరపప్పు పణ్ణారం మాత్రమేకాక, ఉదయం తొలినైవేద్య సమయంలో నివేదింపబడే "మాత్రా" అనబడే మాత్ళదధ్యోదనం ఒక్కటి ఇవి మాత్రమే గర్భాలయంలోపలికి తీసికెళ్లి స్వామివారికి నివేదన చేస్తారు.

తిరుమల స్వామివారికి భోజనశాలగా, శయనశాలగా ఉపయోగపడుతూ వున్న పవిత్రమండపం ఇది. అమ్మలగన్న అమ్మ అలమేలుమంగమ్మ, ఆర్తులైన భక్తులకోరికలను విభుని చెవిన వేసి నెరవేర్చగల ఏకాంతసేవా దివ్య స్థలమై, సర్వజగాల నేలే సప్తగిరీశుని యోగనిద్రకు నిలయమై భక్తులహృదయ మందిరాల్లో స్థిరంగా వెలుగొందుతూవున్న ఈ శ్రీవారి శయనమందిరానికి నమ్రతతో నతమస్తకులమై నమస్కరిద్దాం!

*అలమేలుమంగపతీ! ఆనందనిలయవాసా!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఇదీ తిరుమలేశుని శయన మండపం యొక్క విశిష్టతా విశేషమూను. మరి! ఇంకా ముందుకు కదుల్దామా!

ఆగండాగండి! ఎలాంటి పరిస్థితుల్లోను మనం ముందుకు వెళ్లడానికి వీలులేదు. వెళ్లకూడదు కూడ. శ్రీస్వామివారి సేవా కైంకర్యపరులగు అర్చకస్వాములు, జియ్యంగారులు, తప్ప మిగిలిన ఎట్టివారును ఏవేళల్లోను శయన మండపాన్ని దాటి ముందుకు వెళ్లడానికి వీలులేదు. అంటే ఈ శయన మండపంనుండి మాత్రమే గర్భాలయం లోపల స్వయంభువై వెలసి, భక్తులపాలిటి కొంగుబంగారమై దర్శనమిస్తూవున్న శ్రీశ్రీనివాస ప్రభువులను దర్శించవలె. అదిగో! చూడండి!

ఒళ్లంతా కళ్లు చేసికొని కన్నుల కరవెల్లా తీరేట్లుగా రెప్పవాల్చక ఈ ఏడుకొండలరేడును ఆపాదమస్తకం తిలకిద్దాం! జీవితాలను పునీతం చేసికొందాం! అలా ధన్యతను పొందుదాం! ఇష్టార్థసిద్ధిని అందుకొందాం! అల్లదిగో!

శ్రీ వేంకటప్రభువుల ముఖార విందం! తెల్లని తిరునామాలు! మకర కుండలాల కాంతితో ప్రకాశిస్తూవున్న నునుపైన చెక్కిళ్లు! ఆహాహా!

ఏమా చిన్మయ చిరు దరహాసం! కడగంటిచూపులు (కటాక్ష వీక్షణాలు).
శ్రీనివాసుని ముఖారవిందాన్ని ఇలా స్తుతిద్దాం!

హైమోర్ధ్వపుండ్ర మజహన్మకుటం సునాసం
మందస్మితం మకరకుండల చారుగండమ్
బింబాధరం బహుళదీర్ఘకృపాకటాక్షం
శ్రీవేంకటేశ ముఖమాత్మని సన్నిధత్తామ్. అనంతాళ్వారు

ఇంకా ఆ జగత్ప్రభువు సర్వాభరణాలతో ఎలా వెలిగిపోతూవున్నాడో బాగా దర్శించండి! కోటిమన్మథ సదృశమైన కమనీయరూపంతో కొలువైవున్న కొండలరాయణ్ణి కన్నులార్పక చూడండి! వివిధవర్ణ రంజిత పుష్పహారాలతో వింత వింత కళలీనుతూతేజఃపుంజంగా అలరారుతూ కన్నులపండువుగా కొలువై వున్న ఆ హరిని తిలకించండి! పట్టుపీతాంబరాలతో మెరసిపోతూ వున్న దేవాధి దేవుడైన సప్తగిరీశుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని నఖ శిఖ పర్యంతం రెప్ప వాల్చక చూడండి.

కందర్పకోటి సదృశం కమనీయవేషం
ముక్తావళీ లలిత కంఠ ముదార హారమ్
పీతాంబర ద్యుతి విరాజిత దివ్యదేహం
శ్రీవేంకటేశ వపురాత్మని సన్ని ధత్తామ్.

ఈ స్వామివారిని ఏడుకొండలవాడని, వెంకటరమణుడని, తిరుమలప్ప అనీ, సంకటహరణుడనీ, వేంకటరమణుడనీ, శ్రీనివాసుడనీ, శేషాచలపతి అనీ, వేంకటాచలపతి అనీ గోవిందుడనీ ... ... ఇలా ఎన్నో పేర్లతో ... ... ఎన్నెన్నో పేళ్లతో భక్తులు ఆర్తిగా పిలుస్తారు. ఇలా ఆర్ద్రంగా మైమ రచి పిలువబడే అనంతకోటిబ్రహ్మాండనాయకుడైన తిరుమల స్వామివారు నిలిచి దర్శనమిస్తూవున్న గర్భాలయపు దివ్యస్థలాన్నే "ఆనందనిలయం"అని అంటారు.

మరి మనం ప్రస్తుతం నిలిచివున్న శయన మండపానికి గర్భాలయానికి మధ్య ఒకవెక్కడపురాతి ద్వారబంధం వుంది. ఇదే శ్రీవేంకటేశ్వరస్వామి వారికి అతిదగ్గరగా ముందువున్న మొదటి గడప. ఆ గడపకు పైనా, కిందా పక్కలా అంతటా బంగారురేకు తాపబడివుంది కదూ! ఈ గడపను

దాటితేనే శ్రీనివాసుని సన్నిధికి చేరుకోగలం! అయితే ఈ గడపను దాటి స్వామివారి సన్నిధికి - అంటే గర్భాలయంలోనికి ఒక్క అర్చకులు (పూజారులు) మాత్రమే వెళతారు. ఇలాంటి పరమ పవిత్రమైన గడప - అదే ఈ బంగారుగడప పేరేమిటో తెలుసా? దీనిని "కులశేఖర పడి" అంటారు. మరి ఈ కులశేఖరపడిని గూర్చి కాస్త వివరంగా తెలుసుకుందాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 33. కులశేఖరపడి

కులశేఖరుడు కేరళదేశానికి చెందిన మహారాజు. ఆయన వైష్ణవభక్తాగ్రేసరులైన పన్నిద్దరు ఆళ్వారులలో ఒకరు. ఈ కులశేఖరాళ్వార్ పవిత్రక్షేత్రమైన వేంకటాచలాన్ని ఉద్దేశించి అత్యంత భక్తి యుక్తులతో తమిళంలో పదకొండు పాశురాలను ప్రవచించాడు. ఒకానొక పాశురంలో

"పడియాయ్ కెడందు ఉన్
పవళవాయ్ కాన్‌బేనే"

అని ఆర్తిగా, ఆర్ద్రంగా ఆశిస్తూ కోరిక కోరాడు. "ఓ వేంకటేశా! స్వామీ! నీముందు రాతిగడపగా పడివుండినట్లైతే నీ ముఖార విందాన్ని నిత్యం చూస్తూ వుండవచ్చుకదా!" - అని ఈ పంక్తియొక్క భావం. తిరుమల స్వామిసన్నిధిలో రాతిగానైనా పడివుండే వాయనన్న కులశేఖరుని కోరికను తీర్చడానికన్నట్లుగా శ్రీస్వామి ముందువున్న ఈ గడప "కులశేఖరపడి" అనే పేరుతో ప్రసిద్ధి పొందింది.

పడి అనగా గడప - మెట్టు అని అర్థం. శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలో శ్రీస్వామివారి పాదాలముందర నిత్యమూ స్మరింపబడుతూ, సందర్శింపబడుతూవున్న ఈ కులశేఖరుడు ఎంతటి ధన్యుడో గదా!

భగవద్భక్తి ప్రపూరితమైన "ముకుందమాల"వంటి గ్రంథాన్ని రచించిన ఆ మహాకవిని, ఆ పరమ భాగవతాగ్రేసరుణ్ణి అనుక్షణం జ్ఞప్తికి తెస్తూవున్న ఈ కులశేఖరపడికి అందరం భక్తితో నమస్కరిద్దాం! ఎదురుగా ఈ గడప అవతలవున్న శ్రీస్వామివారిని గట్టిగా స్మరిద్దాం!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

పైనా, కిందా, పక్కలా ఇలా అంతటా ఈ బంగారురేకు తాపబడిన కులశేఖరపడిని దాటి ఇంకా లోపలికి వెళ్లాలనీ, శ్రీస్వామి సన్నిధిలోని విశేషాలను తెలుసు కోవాలని ఆసక్తి, జిజ్ఞాస వుంది కదూ! మనమంతా ఈ కులశేఖరపడి దాటి లోనికి వెళ్లలేక పోయినా, లోపలివిషయాలనూ, విశేషాలనూ అర్చకస్వాముల ద్వారా విన్నవాటినీ అనూచానంగా, సంప్రదాయసిద్ధంగా వినవస్తున్న విశేషాల్ని, వివరించుకుందాం! మీరందరూ ఈ కులశేఖరపడి ఇవతలే నిలబడి చేతులు జోడించి నమస్కరిస్తూ, కన్నులారా కరవుదీర చూస్తూ వీనుల విందుగా వినండి! మరి!

## 34. శ్రీస్వామివారి గర్భాలయం

కులశేఖరపడి అనే బంగారు గడపను దాటితే వున్నదే శ్రీవారి గర్భాలయం. శ్రీవేంకటేశ్వరస్వామివారు స్వయంభువుగా సాలగ్రామశిలా మూర్తిగా ఆవిర్భవించి నిలిచి వున్నచోటే గర్భాలయం. దీనినే "ఆనంద నిలయం" అంటారు.. ఈ ఆనందనిలయంపై ఒక బంగారుగోపురం నిర్మించ బడింది. దీనినే "ఆనందనిలయ విమానం" అంటారు.

శ్రీస్వామివారి గర్భాలయం (లోపలిభాగం) 12.9 అడుగుల చతురస్ర మందారం. శయన మండపం గోడలకన్న గర్భాలయం గోడలు రెండింతలుగా అంటే 7.2 అడుగుల మందాన్ని కలిగి వున్నాయి. ఆగమశాస్త్రం ప్రకారం ఈ గోడల మందం చాల ఎక్కువ అని చెప్పబడుతున్నది. అయితే ఈ గర్భగృహంగోడ 7.2 అడుగుల మందంకల ఒకేగోడ కాదనీ, శ్రీస్వామివారి చుట్టూవున్న ప్రాచీనమైన కుడ్యానికి అనుసంధించి, దానిచుట్టూ చాలకొద్ది ఖాళీస్థలంతో దానికి ఆనుకొని మరియొక గోడ చేర్చబడినందువల్లనే ఇంతటి మందమైన గోడ ఏర్పడిందనీ, లోపలి గోడకంటే దానికి ఆనుకొని కట్టబడిన వెలుపలిగోడ కొత్తదనీ పరిశోధకులు నిగ్గుతేల్చి చెప్పిన విషయం. పైగా ఈ వెలుపలి కొత్త గోడమీదే ఆనందనిలయ విమాన నిర్మాణం జరిగినట్లుకూడ భావిస్తున్నారు. ఈ ఆనందనిలయ విమాన నిర్మాణం క్రీస్తు శకం 1244-50 సంవత్సరాల మధ్యకాలంలో జరిగినట్లు, అంతకుముందు - అనగా వెలుపలిగోడ నిర్మాణం కాకపూర్వం, గర్భాలయం చుట్టూ ఒక ప్రదక్షిణ మార్గం ఉండేదని పరిశోధకుల నిశ్చితాభిప్రాయం.

అయితే కాలక్రమేణ ఆనందనిలయ విమాన నిర్మాణం కావించడం వల్లా తదనుగుణంగా శయనమండపం, రాములవారిమేడ - ఈ నిర్మాణాలు జరిగినందువల్లా ఈ ప్రదక్షిణ మార్గం మూసివేయబడిందట!

ఈ గర్భాలయంలో మధ్యన సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు, వైకుంఠంనుండి ఏతెంచి సాలగ్రామశిలామూర్తిగా 'శ్రీ వేంకటేశ్వరస్వామి' అనే నామధే యంతో చతుర్భుజుడై, వక్షఃస్థల మహాలక్ష్మిసమేతుడై నిలిచివున్న మూర్తిగా విరాజిల్లుతూ వున్నాడు! కన్నులార్పక తిలకించండి!

ఆనాటినుండి అత్యంత ప్రాచీనమైన వైఖానసాగమం ప్రకారం శ్రీ స్వామివారికి పూజలు, ఉత్సవాలు, సేవలు జరుపబడుతూ వున్నాయి. ఈ గర్భాలయంలో శ్రీ స్వామివారి మూలమూర్తి (మూలవిరాట్) కదలని ధ్రువమూర్తి. ఇంతమాత్రమేకాక చలప్రతిష్ఠతో (కదిలించగల) ఏర్పాటుచేయ బడిన ఉత్సవ, కౌతుక, బలి, స్నపన బేరాలని పిలువబడే శ్రీ వేంకటేశ్వర స్వామివారి మరి నాలుగు విగ్రహమూర్తులు విలసిల్లుతూ వున్నాయి. ఇవన్నీ పంచలోహ మూర్తులు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి పంచమూర్తులేకాక, శ్రీ సుదర్శన చక్రత్తా ళ్వార్, శ్రీ సీతారామలక్ష్మణులు, రుక్మిణీ శ్రీకృష్ణులు వీరందరి పంచలోహ ఉత్సవ ప్రతిమలు కూడ ఈ గర్భాలయంలో నెలకొని వున్నాయి.

ఇవిగాక ఈ గర్భాలయంలో శ్రీస్వామివారిసన్నిధిలో వివిధము లయిన పవిత్ర సాలగ్రామాలు కూడా నిత్యాభిషేకార్చనలను, నివేదనలను అందు కొంటూ వున్నాయి.

ఈ గర్భాలయంలోనే స్వామివారికి కుడివైపున ఆగ్నేయమూలకు, ఎడమ వైపున ఈశాన్యమూలకు "బ్రహ్మ అఖండం" అను దీపారాధనలు నిత్యమూ వెలుగుతూ వుంటాయి. తొట్ట తొలిగా వీటిని బ్రహ్మదేవుడు వెలిగించాడని ప్రతీతి!

ఇప్పుడు ఈ గర్భాలయంలో వెలసివున్న మూర్తుల నన్నింటిని గూర్చి ఇంకా వివరంగా తెలిసికొందాం! భక్తి ప్రపత్తులతో ఒక్కసారి గొంతెత్తి గోవిందుణ్ణి కీర్తించండి మరి!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 35. శ్రీ వేంకటేశ్వరస్వామి
## (మూల విరాణ్మూర్తి)

అదివో! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని అంతఃపురమందిరం! అల్లదివో అందరి పాలిటికి అందుబాటులోనున్న దేవాదిదేవుని నిలయం. అందరికీ పరమానందాన్ని పంచిపెడుతూవున్న ఆనందనిలయం! ఆ ఆనంద నిలయం మధ్యభాగాన దైవస్థానంలో తనకు తానే వ్యక్తమై అభివ్యక్తమై ఆవిర్భవించి నిలిచి వున్న పవిత్ర సాలగ్రామశిలా దివ్యమూర్తి శ్రీవేంకటేశ్వరస్వామి. చూడండి! దండిగా దర్శనిమస్తూ, మెండుగా మనందరినీ మైమరపిస్తూవున్న స్వామివారి దివ్యమంగళ విగ్రహాన్ని ఆపాదమస్తకం కన్నులపండువుగా కన్నులనిండుగా రెప్పలు వాల్చక తిలకించండి మరి!

అదివో! బంగారుపద్మపీఠం. ఆ పీఠంపై వున్న శ్రీవారి కనకపు పాదాలు... గజ్జెలు... అందెలు. ఆపైన ఘనపట్టు పీతాంబరం.. ఆ పీతాంబరం కుచ్చిళ్లపై జీరాడుతూ వేలాడుతున్న సహస్ర నామాల మాలలు. బొడ్డుదగ్గర సూర్యకరారి అనబడే నందకఖడ్గం! నడుమును బిగించివున్న ఒడ్డాణం! బంగారు మొలతాడు! అదివో వజ్ర ఖచిత వరదహస్తం! అదే కదా తనపాదాలే పరమార్థం అని చూపిస్తున్న వైకుంఠహస్తం! ఇదొ ఇటు ఎడమ వైపు తనను శరణువేడితే, సంసార సముద్రం మోకాళ్లబంటేలని ఒయ్యారంగా చూపుతూ వున్న కటి హస్తం. ఉరముపై కౌస్తుభమణి! నవరత్నహారాలు! వక్షఃస్థలంపై ఆసీనురాలై అనుగ్రహిస్తూవున్న వ్యూహలక్ష్మి సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి! అదివో! శ్రీదేవి భూదేవి పతకాల హారాలు! కంఠమాలలు! అదె బంగారు యజ్ఞోపవీతం! చేతులకు నాగాభరణాలు. ఆపైన భుజకీర్తులు! భుజాల నుండి పాదాలవరకు వేలాడుతూవున్న పవిత్ర సాలగ్రామ మాలలు! అదివో దర్శించండి. భక్తులకు అభయ మొసంగే శంఖ చక్రాలు! అదొ! నల్లనిమోము! అదే చెరగని, తరగని చిరుమందహాసం! నిగ నిగలాడే చెక్కిళ్లు! కర్ణాలంకారాలు! దొండపండువంటి పెదవులు! ఆ పెదవులకింద చుబుకం పైన చక్కనైన తెల్లని కప్పురపుచుక్క! ఆపైన సొగసైన నాసిక! తెల్లని నామం! భక్తులను కరుణిస్తూవున్న ఎడతెగని అంటుచూపులు! (అరవిరిసిన చూపులు)! అదిగో శిరసుపై అమరివున్న

నవరత్నాల మకుటరాజం! ఆపైని బంగారు మకరతోరణం!... ఇంతేనా!... ఇంకా ... ఇంకా ... ఆ మూర్తి నిలువెత్తుగా అలంకరింపబడ్డ సుగంధ సుమనోహర సుమ మాలలు!

ఓహ్! ఏమి అద్భుతం! ఏమేమి పరమాద్భుతం! ఎన్నెన్ని హారాలు!.. ఎన్నెన్ని అలంకారాలు!.. ఎన్నెన్ని మణులు! ఎన్నెన్ని మాణిక్యాలు! ఎంతెంత వైభవం! ఎంతెంత సోయగం! ఎంతెంత సొంపు!.. ఏమి సమ్మోహనం!.. ఏమి మైమరపు! ఎంతెంత అందం! ఎంతెంత ఆనందం.. ఎంతెంత పరమానందం! ఆహాహా! ఏదో తెలియని లోకాల్లో విహరిస్తూ ఆనందపుటంచుల్ని తాకుతూన్నట్లు వుందికదూ!

ఈ ఆభరణాలను అలంకరించుకొన్నందువల్ల ఆనందనిలయుడైన శ్రీ స్వామివారు అందంగా కనపడుతున్నాడా! లేక నిగమ నిగమాంతవేద్యుడైన ఈ స్వామివారిని అంటిపెట్టుకున్నందువల్లే ఆ నగలు నిగ నిగలతో వింత వింతలుగా వెలుగుతూ ప్రకాశిస్తూ వున్నాయా! అని ఆశ్చర్యాన్ని, అద్భుతాన్ని, ఆనందాన్ని కలిగించే వెలలేని, తులలేని, ప్రతిలేని నగలూ, నాణ్యాలూ, ఆభరణాలూ హారాలూ, అలంకారాలూ, ఏ భక్తులిచ్చారో కదా! ఎప్పుడెప్పుడిచ్చారో కదా! ఎందుకిచ్చారో కదా! అన్న సందేహ సంభ్రమాశ్చర్యాలతో ఉబ్బి తబ్బిబ్బై నిశ్చేష్టులయ్యారు కదూ!

తన సుందరరూపాన్ని చూచిన తక్షణమే మనకు ఇంతటి పరమోన్నత పరమానంద స్థితిని కలిగించిన ఈ పరంధాముణ్ణి, ఈ తిరుమల గోవిందుణ్ణి ఒక్కసారి గొంతెత్తి ఆర్తిగా పిలవండిమరి!

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఈ తిరుమల పెరుమాళ్లు ఒడలెల్ల ధరించిన ఈ బంగారు తొడుగులకు ఒక్కొక్కదానికి ఒక్కొక్క అద్భుతమైన చరిత్ర వుంది. ఒక్కొక్క నగవెనుకా ఒక నాణ్యమైన భక్తుని ప్రేమా, త్యాగం నిగనిగలాడతాయి. అదిగో మినుకు మినుకు మని మెరిసే రతనాల మెరుపుల్లో ఘనవేంకటేశుని భక్తప్రియుత్వం గోచరిస్తుంది. అదిగో! ఆ కొండలరాయని కర కంకణాల రవళిలో, ఆ స్వామివారి భక్తరక్షణ దీక్షాకంకణత్వం వినిపిస్తుంది. అదిగో ధగ ధగమని

మెరుస్తున్న వజ్రకిరీటం! ఎందరి భక్తుల పాపాల్ని దగ్ధం చేసిందో! అదిగో సర్రున తిరుగుతున్న సుదర్శన చక్రం! ఎందరి జీవితచక్రాల్ని సక్రమంగా గిర్రున తిప్పిందో! అల్లదివో పాంచజన్య శంఖం! ఎందరి పాపాత్ముల గుండెల్ని బద్దలు చేసిందో! ఆ ఆనందనిలయుడు ధరించిన ఆ నందక ఖడ్గం. అది ఎందరి ఆర్తిని పోగొట్టిందో! మరెందరి ఆపదలను తొలగించిందో! అదె దర్శించండి! బంగారు పాదపద్మాలు. ఎందరి పాపాల్ని కడిగి పరమోన్నత జీవితం ప్రసాదించాయో! ఎందరికి శాశ్వత వైకుంఠం ప్రసాదించాయో! ఎందరికి భవబంధాలు తెంచాయో! ఎవరి కెరుక! మూసిన ముత్తెము వలె ముసి ముసి నవ్వులతో ఏమీ ఎరగనట్టువున్న ఈ స్వామివారు ఎందరికి కాళ్లిచ్చాడో - ఎందరికి కళ్లిచ్చాడో. ఇంకెందరికి చేతులిచ్చాడో - మరెందరికి చేయూత ఇచ్చాడో! ఎందరికి కడుపు నింపాడో - మరెందరి కడుపును పండించాడో! ఎందరికి మాటలిచ్చాడో ... ఇంకెందరికి మాట నిలబెట్టాడో! ఎందరికి తెలుసు? ... మరెందరికి తెలుసు?... ఆ స్వామికే తెలియాల. ఆ స్వామికి మాత్రమే తెలియాల. ఆ స్వామికి ఒక్కనికి మాత్రమే తెలియాల... అంతే...అంతే..

కనుకనే వెల్లువలై పారిన కొండలరాయుని కరుణరసప్రవాహంలో ఆర్తిగా ఆర్ద్రంగా మునకలిడిన ఆర్తులు, అర్థులు జిజ్ఞాసులు, జ్ఞానులైన భక్తజనం, తమ మనసులనిండా, గుండెలనిండా బంగారుమేడలోని బ్రహ్మాండ నాయ కుణ్ణి నింపుకున్నారు. పదిల పరుచుకున్నారు. మనసా, వాచా, కర్మణా తమ, తనువులను మనస్సులను ఆ స్వామివారికే మీదు కట్టినారు. ఆ వరాలరాయనికి కృతజ్ఞతగా కానుకలు పెట్టుకొన్నారు. మురిపెంగా ముడుపు చెల్లించుకున్నారు. ముచ్చటగా ముత్యాలహారాలు సమర్పించు కున్నారు... ఇలా.. తాము మెచ్చిన రీతిలో... తమకు నచ్చిన తీరులో తిరుమలప్పనికి అలంకారాలు సమర్పించారు. ఆభరణాలు ఇచ్చారు. అదిగో... చూడండి....అనంతకాల గమనంలో... తన భక్తులు మెచ్చి ఇచ్చిన, హారాలను ఆభరణాలను తనువెల్ల అలంకరించుకొన్న ఆ శ్రీనివాసుడు దీటులేని అందగాడై, సాటిలేని శంఖు చక్రాల మొనగాడై ఎంత సింగారాలు ఒలక బోస్తున్నాడో! కన్నులారా తిలకించండి. ఎంత వయగారాలు పోతూ నగుమోముతో కనుపిస్తున్నాడో చూడండి.

ఆ సింగారాల్లో ఆ నయగారాల్లో. ఆ సోయగాల్లో ఆ సొంపుల్లో ఇనుప ముక్కల్ని ఆకర్షిస్తున్న సూదంటు రాయివలె.. మనందరినీ ఆకర్షిస్తున్నాడు. మన అందరినీ కూడా ఆకట్టుకుంటున్నాడు. చిన్నా, పెద్దా తేడా లేదు. ఆడా మగా తారతమ్యం లేదు. కుంటీ, గుడ్డీ, మూగా, చెవిటీ అన్న ఈసడింపు ఇసుమంతయినా లేదు. కుల మత, వర్గ, వర్ణ విచక్షణ అసలే లేదు. భాషా భేదం అంతకన్నా లేదు. ఆ కొండలరేడు అందరి కోరికలూ తీరుస్తాడు. అందరి మాటలూ వింటాడు. అందరి బాసలూ మాట్లాడుతాడు. అందరి ఊసులూ వింటాడు. కేవలం వినడమే కాదు. వారి వారి బాసల్లోనే మౌనంగా జవాబిస్తాడు. వారి వారి కోరికలను తీరుస్తాడు. అదిగో! దర్శించండి. దర్శిస్తూ ప్రార్థించండి! ప్రార్థిస్తూ.. మీ మీ కోరికలు కోరండి! అవి ఎలాంటి కోరికలైనా సరే. సిగ్గూ ఒడియం వదిలిపెట్టి చేయిచాపి అడిగి గొంతెత్తి ఘోషించండి. మనందరికి వరాలను ఇవ్వడానికే నిలిచివున్న స్వామి అదిగో! కన్నులనిండుగా ఆ దివ్యమంగళ విగ్రహం అందచందాల్ని ఆలోకించండి. ఆహాహా!

ఏ మా విగ్రహ సౌకుమార్యం ఏ మా మూర్తి సౌందర్యం!

శ్రీనివాస ప్రభువులవారిదివ్య సన్నిధిలో ఎంతసేపు నిలిచినా తనివి తీరదు! ఎంతసేపుచూస్తున్నా విసుగనిపించదు. ఎంతచూసినా ఎన్నిమార్లు చూసినా, ఇంకా, ఇంకా .... మళ్లీ, మళ్లీ చూద్దామనిపిస్తుంది. ఇంకాసేపు ఇంకొంచెంసేపు అంటూ ప్రతిభక్తుని మనస్సూ, శిరస్సు, కాళ్లూ, కళ్లూ, నిక్కి నిక్కి చూస్తూ శ్రీవేంకటేశ్వరుని దివ్య సమ్మోహనమూర్తి దర్శనానికి తహ తహ లాడుతునే వుంటాయి.

ఆ విగ్రహసౌందర్యాన్ని ఆపాదమస్తకం చూచినట్లే వుంటుంది. కాని వెలుపలికి వచ్చిన తర్వాత, ఎంత అదృష్టం చేసికొన్నామో కదా. ఒక్క క్షణంపాటు చూచినా శ్రీస్వామిదర్శనం బలే బాగా అయ్యింది. కాని శ్రీస్వామివారి దివ్యపాదపద్మాలు చూడలేదే!.. శ్రీవారి కిరీటం చూశాను కాని, అది వజ్రకిరీటమా! అయ్యో నేను గమనించలేదే! వజ్రకిరీటం చూశానా! ఏమో! ఏమో! అబ్బ! ఏమా ముఖ సౌందర్యం! తెల్లని పట్టె నామాలతో స్వామి ఎంత అందంగున్నాడో!.. ఇంకా శంఖ

చక్రాలు... కిరీట కుండలాలు... వైకుంఠ వరదహస్తాలు ఎంత కాంతివంతంగా కనపడ్డాయి కదా! నేడు శ్రీవారి వక్షఃస్థలమీద లక్ష్మీదేవి దివ్య దర్శనమిస్తూ అనుగ్రహించింది కదా... ఏది ఏమైనా ఈవేళ స్వామి కొత్త కొత్త అందాలతో దర్శనమిస్తూవున్నాడు కదూ... చిన్న పిల్లాడిలా కేరింతలు కొడుతూ అగుపిస్తున్నాడు కదూ! కాదు కాదు ఈ రోజు స్వామి గంభీరంగా కనపడుతున్నాడు... అంటూ ఇలా తనను దర్శించవచ్చిన భక్తులం దరికీ.. అపూర్వమైన దివ్యానుభూతులను, మైమరపులను, పరమానందాలను ప్రసాదిస్తూవున్న శ్రీవేంకటేశ్వర స్వామివారి మూలవిగ్రహమూర్తిని గూర్చిన వివరాలను, విశేషాలను ఇంకా కొంచెం విపులంగా తెలుసుకుందామా! ఏదీ మరొక్కసారి ఆ స్వామివారిని గట్టిగా కీర్తించండి మరి!

*అడుగడుగు దండాలవాడా! గోవిందా!*

*ఆపదమొక్కులవాడా! గోవిందా!! గోవింద!!!*

తిరుమలలోని ఈ బంగారుభవనం నట్టనడుమభాగాన అంటే ఆనంద నిలయంలోని మధ్యభాగంలో బ్రహ్మస్థాన మనబడే దివ్యస్థలంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారు అర్చారూపంతో స్వయంవ్యక్తమూర్తిగా చతుర్భుజాలతో నిలిచివున్నందున ఈ మూర్తిని "స్థానకమూర్తి" అంటారు. ఈ మూర్తి, స్థిరంగా (కదలక) వున్నందున "ధ్రువమూర్తి"అనీ "ధ్రువ బేరం" అనీ అంటారు. అంతమాత్రమే కాదు. ప్రక్కల దేవేరులు లేకుండా తానొక్కడే వక్షఃస్థల మహాలక్ష్మితో నిలిచి వున్నందువల్ల ఈ మూర్తి "స్థానక విరహమూర్తి" అని కూడ పిలువబడుతున్నాడు.

ఒక్కమాటలో చెపితే, వక్షఃస్థలంపై మహాలక్ష్మిని ఉంచుకొని, శ్రీ మహావిష్ణువు ఒక్కడే శ్రీవైకుంఠాన్నివిడిచి, కలియుగవైకుంఠమైన తిరుమల కొండల్లో కోనల్లో స్వయంవ్యక్తమై పుట్టుశిలారూపంతో తొలుదొల్త వెలసిన ఏకైక మూలమూర్తి. ఈ ఆలయంలోని మిగిలిన మూర్తులన్నీ అనంతర కాలంలో ఆ యా సమయాల్లో చేర్చబడినవి మాత్రమే. అందువల్ల తిరుమల ఆలయం ఏక బేరం (ఏకైకమూర్తి) ఆలయం, అనగా ఒకే ఒక్క మూర్తి కలిగిన ఆలయంగా మాత్రమే పేర్కొనబడుతున్నది.

ఈ పవిత్ర స్థలంలో శ్రీ స్వామివారు చతుర్భుజాలతో, ప్రకాశిస్తూ, పై కుడిచేతిలో సుదర్శనచక్రాన్నీ, పై ఎడమచేతిలో పాంచజన్య శంఖాన్నీ, అలాగే క్రింది కుడిహస్తం వరదహస్తం (వైకుంఠహస్తం)గానూ, క్రిందిఎడమ చేయి కటిహస్తంగాను నవదరించి, ఉరముపై శ్రీమహాలక్ష్మి విష్ణోన్ని కలిగివుంటూ, ఎడమవైపు వయ్యారంగా కొద్దిగా వంగినట్లుగా కన పడుతూ ఎడతెగని అరగన్నుచూపులతో చెరగని చిరుమందహాసంతో భక్తులను చల్లగా అనుగ్రహిస్తూ, దివ్యసందర్శనమిస్తూవున్న నయనమనోహరమూర్తి ఈ వైకుంఠనాథుడు!

కాని శ్రీ వేంకటేశ్వరుడు పై రెండుచేతుల్లో ధరించిన శంఖ చక్రాలు మొదట స్వామివారిమూలమూర్తి అసలుస్వరూపంలో లేవనీ, ఆయుధ రహితుడై వున్న వేంకటేశ్వరునకు అనంతరకాలంలో ఉండే భగవద్రామానుజులవారు కానీ, ఆ తర్వాతకానీ బంగారుపూత పూయుబడిన రాగిరేకుతో తయారు చెయ్యబడి మూలమూర్తికి అలంకరింపబడ్డవి మాత్రమేననీ చాల మంది చెప్పటం జరుగుతున్నది. అది నిజమే కావచ్చు. అయినా శంఖుచక్రాలు లేనంతమాత్రాన ఈ దివ్యమూర్తి శ్రీమహావిష్ణువు కాదని చెప్పడానికి వీలులేదు.

పద్మావతీం విశాలాక్షీం భగవానాత్మ వక్షసి
అరిశంఖ విహీనోఽసౌ కటిన్యస్త కరోత్తమః
దర్శయన్ పాణినైకేన దక్షిణేన వృషాకపిః
పదపద్మం సురారాధ్యం గతిం చ పరమాం నృణామ్
కటిన్యస్త కరేణాపి నిజపాదాబ్జ కామినామ్
నృణాం భవ పయోరాశిం కటిదఘ్నం ప్రదర్శయన్
విరాజతే వేంకటేశః సం ప్రత్యపి రమాపతిః

అనే వేంకటాచలమాహాత్మ్యంలోని ప్రస్తావన వల్ల "దయాస్వరూపిణి యగు శ్రీమహాలక్ష్మిని తన దివ్యవక్షఃస్థలంలో వుంచుకొని, భయాన్ని కలిగించే శంఖ చక్రాయుధాలను ధరించకుండా, పరమశాంత స్వరూపంతో వరద (వైకుంఠ), కటిహస్తాలతో మానవుల సంసారభయ దుఃఖాలను విశ్లేషంగా

పోగొడుతూ రమాపతి అయిన శ్రీ. వేంకటగిరి దేవుడు పరమానందాన్ని కలుగజేస్తూ వున్నా"డని స్పష్టమవుతున్నది.

అంతేగాక పూర్వం తొండమానుడికి, వసుదానుడికి (శ్రీ పద్మావతిదేవి సోదరుడు) జరిగిన యుద్ధంలో శ్రీవేంకటేశ్వరుడు తన శంఖు చక్రాలను తొండమానునికి ఇచ్చినట్లు, యుద్ధం పూర్తి అయిన తర్వాత, మరల వాటిని స్వీకరించడానికి నిరాకరించినట్లు కూడ వేంకటాచలమాహాత్మ్యం తెలుపుతూ వున్నది. కనుకనే శంఖ చక్రాయుధాలు లేకుండా అలాగే నిలిచివున్న ఈ తిరుమల శ్రీనివాసమూర్తికి అనంతరకాలంలో శంఖచక్రాలు అలంకరించబడినాయి.

అంతమాత్రమేగాక కొన్ని విగ్రహమూర్తులకు ఆయుధాలు వుండవచ్చును, లేదా లేకుండాకూడా వుండవచ్చునని వైఖానసాగమ శాస్త్రం సుస్పష్టం చేస్తున్నది. వక్షఃస్థలంలో లక్ష్మీదేవి కొలువైవున్నందువల్ల తిరుమలలోని ఈ మూర్తి సాక్షాత్తు శ్రీమహావిష్ణువే అని ధ్రువీకరింపబడుతున్నది.

## బ్రహ్మదేవుడూ కాదు

మీలో కొంతమందికి, తిరుమల స్వామివారు పద్మపీఠంపై నిలిచి వున్నందువల్ల ఈ స్వామి బ్రహ్మదేవుడేమో? అన్న సందేహం కలుగుతూ వుంది కదూ!

కాని పద్మపీఠంపై ఒక్క బ్రహ్మదేవుడు మాత్రమే నిలిచి వుండడు కదా! ఒకవేళ నిలిచివున్నా ఆ బ్రహ్మదేవునికి వక్షఃస్థలంలో శ్రీవత్స చిహ్నం వుండదుగాక వుండదు! అందువల్ల ఈయన బ్రహ్మదేవుడు కానేకాదు. పైగా ప్రతిరోజు సుప్రభాతానికి ముందుగా బ్రాహ్మీముహూర్తవేళలో బ్రహ్మదేవుడు కూడ స్వయంగా తిరుమలప్పను పూజిస్తాడని ప్రతీతి! అర్చకులు, ప్రతిరోజు బ్రహ్మదేవుడు ఈ స్వామిని పూజించటానికిగాను ఒక బంగారు పాత్రలో జలాన్ని వుంచుతారు. దీనినే తరువాత భక్తులకు బ్రహ్మతీర్థంగా ఇస్తున్నారుకూడ. అంతేగాక ఆ బ్రహ్మదేవుడు వేంకటేశ్వరునికి చేయించిన బ్రహ్మోత్సవాలు ఘనంగా ప్రతిఏటా జరుగుతూనే వున్నాయి. కనుక తిరుమలమీది ఈ మూర్తి బ్రహ్మదేవుడు కాదు గాక కాదు. అసలు బ్రహ్మ

దేవుని కోరికపైనే లీలామానుషుడైన శ్రీమహావిష్ణువు ఈ సౌమ్యరూపంతో వేంకటాచలపతి పేరుతో వెలసినాడు. అందుకే నిత్యమూ బ్రహ్మదేవునిచేత అర్చింపబడుతూవున్న ఈ తిరుమలస్వామివారిని మనమందరం అష్టోత్తర, సహస్రనామాలలో కీర్తింపబడినట్లుగానే ఇలా ప్రార్థించుదాం.

ఓం బ్రహ్మస్తుత్యాయనమః
ఓం బ్రహ్మరుద్రాది సంసేవ్యాయనమః
ఓం బ్రహ్మోత్సవ మహోత్సుకాయనమః
ఓం బ్రహ్మాది దేవదుర్దర్శ్య విశ్వరూపాయనమః
ఓం బ్రహ్మక్లుప్తోత్సవాయనమః
ఓం విరించితాఽభ్యర్థితానీతసౌమ్యరూపాయ నమః

## శివుడూ కాదు

అదిసరే. ఈ మూర్తికి శంఖ చక్రాలు లేవంటారు కదా! పైగా నాగా భరణాలుకూడా వున్నాయి. సంవత్సరంలో ప్రతి ధనుర్మాసంలో శివప్రీతికరమైన మారేడు దళాలతో (ఓలువం) తిరుమలస్వామికి అర్చన జరుగుతుంది కదా! అందువల్ల ఈ మూర్తి పరమశివునిది కావచ్చు కదా! అనే మరోసందేహం మీలో తొలుస్తున్నది కదూ! అయితే జాగ్రత్తగా వినండి మరి!

శంఖ చక్రాలు లేనంతమాత్రానా, శివుడు అని ఎట్లా నిర్ధారించగలం? చెప్పండి! పోనీ శివుడే అనుకున్నా వక్షఃస్థలంలో లక్ష్మీదేవి వున్నది కదా. కనుక ఇతను శివుడు కాదు. నాగాభరణుడు కదా!. అని అంటే నాగేంద్రుడయిన ఆదిశేషుడు విష్ణువునకు శయ్యా, పాదుకా, సేవకుడు కూడా. అంతేగాక పూర్వం వాయుదేవునికి శేషునికి జరిగిన ఘర్షణలో ఇక్కడికి ఎగిరి వచ్చిపడిన శేషుణ్ణి చేతిలోకి తీసుకొని అనునయించి, ఆ శేషుణ్ణి తాను ఆభరణంగా చేసుకుంటానని, ఆ శేషునిమీదే స్థిరంగా నిలిచి 'శేషాచలపతి'గా ప్రసిద్ధిపొందుతానని కూడా శ్రీ మహావిష్ణువు చెప్పాడని బ్రహ్మపురాణం స్పష్టం చేస్తోంది. అందువల్ల వక్షఃస్థలలక్ష్మితోవున్న ఈ నాగాభరణుడు శివుడు ఎంతమాత్రం కాదు.

సరే బాగుంది. కాని మరి మారేడుతో అర్చన జరుగుతున్నదికదా. బిల్వంతో శివునికే కదా అర్చన చేస్తారు. మరి ఈ విగ్రహం శివునిది ఎందుకు కాగూడదు? అని అంటారేమో! ఈ అభిప్రాయం కూడ సరియైనది కాదు. ఎంచేతంటే శ్రీమహాలక్ష్మి బిల్వవనస్థ. బిల్వవనాలయ. అందువల్లే ఇప్పట లక్ష్మికి ఆవాసమైన బిల్వంతో అర్చన జరుగుతున్నది. అంతేకాదు శివునికి అర్చనలో ఉపయోగించని "తులసి" ప్రత్యేకంగా తిరుమల మీది స్వామివారి సహస్రనామార్చనాదుల్లో ప్రధానంగా చోటు చేసుకుంది. తిరుమలస్వామివారు అత్యంత పుష్పప్రియుడు. మీదు మిక్కిలి తులసీ ప్రియుడకూడ. ఇంతేగాక ఈ క్షేత్ర అధిష్ఠాన దైవం శ్రీవేంకటేశ్వరుడు. కాగా ఈ క్షేత్రపాలకుడు శివుడు (రుద్రుడు) అని కూడ మనం తెలుసుకున్నాం కూడ. బ్రహ్మోత్సవాలకు గాను ఆ సమయంలో ఆలయం సంప్రదాయం ప్రకారం ప్రత్యేకంగా ఈశాన్య దిక్పాలకునిగా ఈశ్వరుడు ఆహ్వానింపబడుతూవున్నాడు. అందువల్ల ఈక్షేత్రంలో వెలసిన ఈ మూర్తి శివుడు కానే కాదు. ముమ్మాటికి వేంకటేశ్వరుడని పిలువబడుతున్న శ్రీమహావిష్ణువే! అందువల్ల పరమశివునిచేత కొనియాడబడుతూవున్న ఈ స్వామివారిని మనసార ప్రార్థిస్తూ అష్టోత్తర సహస్రనామావళులతో మనం కూడా గొంతు కలుపుదాం.

*ఓం శంకర ప్రియమిత్రాయనమః*

*ఓం వామదేవ ప్రియాయనమః*

*ఓం ఉపత్యకాప్రదేశస్థ శంకరధ్యాతమూర్తయేనమః*

*ఓం హరమోహక మాయావినే నమః*

*ఓం బ్రహ్మరుద్రాది సంసేవ్యాయనమః*

*ఓం ఈశ చాప ప్రభంజనాయనమః*

*ఓం సువర్ణముఖరీతీర శివధ్యాత పదాంబుజాయనమః*

## శక్తిదేవత కానేకాదు

అది కాదండీ! ప్రతి శుక్రవారమూ క్రమం తప్పకుండా ఈ మూర్తికి పసుపు మున్నగువాటితో అభిషేకం జరుగుతున్నందువల్ల, శక్తిదేవతే ఈ కొండపై ఇలా వేంచేసి వుండవచ్చునేమో!

అంతే కాదు. దానికి బలమైన కారణం ఇంకొకటుందండీ! అదేమంటే ఆనందనిలయవిమానం చుట్టూరా నాలుగుమూలల్లో ప్రాకారంపై "సింహం" బొమ్మలు వున్నాయి కదా, మరి ఆ సింహపు విగ్రహాలు దుర్గకు వాహనాలు కదండీ! అందువల్లే తిరుమలమీది ఈ మూర్తి దేవీ రూపమని భావించవచ్చు కదా! అంతేకాదు ఉత్తరాది వారు "బాలా త్రిపుర సుందరి" పేరుతో ఈ స్వామిని "బాలాజీ" అని పిలువడం జరుగుతున్నది. అందువల్ల ఈ మూర్తి స్పష్టంగా దేవీరూపమే. అని వాదించే వారు కూడ వున్నారు.

కాని ఈ వాదనకూడ సరి అయినది కాదనే చెప్పవచ్చు. ఎందుకంటే ప్రతిశుక్రవారం పసుపు మున్నగువాటితో అభిషేకం చెయ్యటం స్వామివారిని ఉద్దేశించి ఏమాత్రం కానే కాదు. స్వామివారి వక్షఃస్థలంమీది లక్ష్మీదేవిని గూర్చిమాత్రమే అభిషేకం జరుపబడుతున్నది. వక్షఃస్థలలక్ష్మికి శుక్రవారం నాడు అభిషేకం జరుగగా, ఇక సగం తడిసిన శ్రీస్వామివారికి అభిషేకం తప్పనిసరి అయ్యింది! అందువల్ల తిరుమలలో శుక్రవారాభిషేకం అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకుంది.

ఇక సింహాసనాలు, సింహ తలాటాలు, సింహం విగ్రహాలు శౌర్యానికి, గాంభీర్యానికి ప్రతీకలు! ఈ విష్ణాలకు శైవం, శాక్తేయం, వంటి ఆగమాలతో పాటు, వైఖానస ఆగమం ప్రాముఖ్యం ఇవ్వడంతోపాటు, ప్రత్యేకంగా వైఖానసం గరుత్మంతునికూడా అంగీకరించింది. అందువల్లే వైఖానసాగమరీత్యా పూజలు జరుగుతున్న తిరుమలలో ఆనంద నిలయం చుట్టూరా ప్రాకారంపై సింహాలతోపాటు గరుడుని విగ్రహాలు కూడా ప్రతిష్ఠింపబడ్డాయి. అందువల్ల తిరుమలమీది మూర్తి, శక్తిరూపమైన దుర్గ కానే కాదు.

మరి ఉత్తరాది వారు పిలిచే "బాలాజీ" పదాన్ని పరిశీలించి విచారించగా స్పష్టమయిన విషయం ఏమంటే "బాలాజీ" అన్న సంబోధనలో స్త్రీ దేవత అనే అర్థం లేనే లేదట. హిందీవారు స్త్రీ దేవతలను కాళీమాత, సంతోషి మాత, శారదామాత, పార్వతీమాత అనే పిలుస్తారట. "బాలాజీ వేంకటేశ్వర" అని కొన్నిచోట్ల హిందీవారు హనుమంతుణ్ణి గూర్చి సంబోధిస్తారట. ఇలా వేంకటేశ్వరుని పేరుతో పిలువబడే ఆంజనేయస్వామి ఆలయాలు అజ్మీర్, ఝాన్సీ, హరిద్వార్ మున్నగుచోట్ల వున్నాయని, తెలుస్తున్నది. అంతేకాక

ఉత్తరదేశంలో మరికొన్ని ప్రాంతాలలో సర్వవిధాలా ప్రజలను రక్షిస్తూ దేవుని మాదిరిగా పూజింపబడే నాయకులను "బాలాజీ" అని పేరుతో పిలుస్తారనీ, అనగా పాలకుడు, రక్షకుడు అనే అర్థంలో ఉపయోగింపబడుతున్నదని తెలుస్తున్నది. దీన్ని బట్టి తిరుమల మీది దేవత శక్తి కానేకాదనీ, సాక్షాత్తు విష్ణువేననీ రూఢిగా తెలియుచున్నది. అందుకే ఈ వేంకటేశ్వర స్వామిని ఇలా ప్రార్థిద్దాం.

ఓం దాక్షాయణీ వచ స్తుష్టాయనమః

## కుమారస్వామి కూడా కాదు

ఇంకా కొందరు ఈ స్వామివారు సాక్షాత్తు కుమారస్వామివారే. అందువల్లే తిరుమలమీద కోనేరును "స్వామిపుష్కరిణి" అని అంటారని... ఇలా ఎన్నోవిధాల ఎన్నెన్నో విధాల శంకించటం జరుగుతున్నది.

కాని ఈ అభిప్రాయం కూడ పొరపాటే. ఎందువల్ల అంటే ప్రపంచంలోని అన్ని పుష్కరిణులకు, కోనేరులకు స్వామివంటిది, ప్రభువు వంటిది ఈ తిరుమలమీది కోనేరు. కనుకనే "స్వామిపుష్కరిణి" అని ప్రసిద్ధికెక్కింది. ఆ పదంలోని 'స్వామి' శబ్దం కుమారస్వామికి సంబంధించినది కానేకాదు. తారకాసురసంహారం వల్ల కలిగిన బ్రహ్మహత్యా పాపాన్ని, సాక్షాత్తు కుమారస్వామివారే ఇచ్చోట తపస్సుచేసి, ఈ తిరుమల స్వామివారిచేత ఆ ఘోర పాపాన్ని నివృత్తి చేసుకున్నాడు. ఈ క్షేత్రంలో ఈయన తపస్సుచేసిన స్థలం 'కుమారధారాతీర్థం' అనికూడ ప్రసిద్ధిపొందింది. అందువల్లే ఈ స్వామివారు సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుడని పిలువబడే శ్రీ మహావిష్ణువు. అందుకే ఈ తిరుమలస్వామి నిత్యమూ ఇలా ప్రార్థింపబడడంలో ఆశ్చర్యం ఏమాత్రం లేదు.

ఓం కుమారాకల్ప సేవ్యాయనమః
ఓం కుమారధారా తీర్థస్థాయ నమః
ఓం కుమారధారికావాస స్కందాభీష్ట ప్రదాయినే నమః

# వక్షఃస్థల మహాలక్ష్మి
## (వ్యూహలక్ష్మి)

ఇదిగాక, ఇంకా, దూదిపింజను భస్మం చేసే మహాప్రళయాగ్నివలె అందరి వాదనలనూ, అభిప్రాయాలను వమ్ముచేస్తూ, ఈ వేంకటాచలపతి సాక్షాత్తూ శ్రీవైకుంఠం నుండి దిగివచ్చిన శ్రీమహావిష్ణువే! అని నిరూపిస్తూ వున్న తిరుగులేని ప్రత్యక్ష సాక్ష్యాన్ని, పవిత్రచిహ్నాన్ని అదివో! అల్లదివో! దర్శించండి!

భూలోక వైకుంఠమయిన ఈ వేంకటాచల శిఖరాలపై వాలిన దట్టమైన నీలిమేఘంలాంటి శ్రీనివాస ప్రభువు! ఆ నల్లని మబ్బులో (హృదయంలో) ఒక వింతైన మెరుపుతీగ దేదీప్య మానంగా, బంగారుమేని ఛాయతో ప్రకాశిస్తూవున్న శ్రీమహాలక్ష్మి! ఆమే అలమేలుమంగ! శ్రీవేంకటేశుని పట్టపురాణి! అదొ! కన్నులార్పకుండా చూడండి. అఖండంగా, అనంతంగా వేయి వెలుగులతో దర్శనమిస్తూవున్న ఆ మెరుపుతీగ (లక్ష్మీదేవి) వల్లే ఈ కారుమబ్బు (శ్రీనివాసుడు) ఇంతింత అని వర్ణించగరాని, వర్ణించలేని అందంతో భాసిస్తూ, ఎందరినో ఆకర్షిస్తోంది! దర్శించండి! ధన్యులుకండి!

అదిగో దివ్యదర్శనమిస్తూ, మనలను అందరినీ కూడా సంపూర్ణంగా అనుగ్రహిస్తూవున్న సప్తగిరీశునిహృదయరాణిని ... తిరుమలేశుని తిరు చానను ... అంటే తిరుచానూరు పద్మావతిఅమ్మవారిని....సర్వజగాల నేలే జగన్మాత అలమేలుమంగను ఇలా ప్రార్థిద్దాం.

*ఈశానాం జగతోఽస్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీం*
*తద్వక్షః స్థల నిత్యవాసరసికాం తత్‌క్షాంతి సంవర్ధినీమ్*
*పద్మాలంకృత పాణి పల్లవ యుగాం పద్మాసనస్థాం శ్రియం*
*వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్.*

ఆ తల్లి సమస్త లోకాలకు యజమానురాలు! ఆ అమ్మ సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు అయిన తిరువేంకట ప్రభువులకు అత్యంత ప్రియురాలు! ఆ జగన్మాత శ్రీనివాసుని క్షమాగుణాన్ని పెంపొందించే కరుణామయి! ఆమె నిత్యమూ పద్మాసనంపై కొలువై వుంటూ, సున్నితమైన తనచేతుల్లో తామర పుష్పాలను ధరించి అలంకారంగా దర్శనమిచ్చే అలమేలుమంగ! ప్రేమ,

జాలి, కరుణ మున్నగు సాటిలేని మేటి గుణాలతో ప్రకాశించే దయార్ద్ర హృదయురాలు! శ్రీ వేంకటేశుని హృదయంలో ఎల్లప్పుడూ విరాజిల్లుటకు మిక్కిలి ఆసక్తురాలు అయ్యి, నిరంతరం నిరంతరాయంగా అఖిలజగాల నేలుతూవున్న అలమేలుమంగకు నమస్కరిస్తూ వున్నాను.

కరుణామయి, ప్రేమ స్వరూపిణీ అయిన శ్రీమహాలక్ష్మి ఈ వేంకటాచల క్షేత్రంలో తిరమలేశుని హృదయ పద్మంలో "వ్యూహాలక్ష్మి"గాను, తిరుచానూరులో అర్చామూర్తియై శ్రీ పద్మావతిఅమ్మవారుగానూ, అలమేలుమంగగానూ భక్తులందరిచేత అర్చన లందుకొంటూ వున్నది. ఆరాధింపబడుతూ వున్నది.

'మాతర్నమామి కమలే! కమలాయతాక్షి!
శ్రీవిష్ణు హృత్కమల వాసిని! విశ్వమాతః'

అందువల్లే ఈ వేంకటాచలపతికి "శ్రీనివాసుడు" అనే మరో ప్రసిద్ధ నామం ఉంది. శ్రీ అంటే దయా స్వరూపిణీ, ప్రేమమయి అయిన శ్రీమహాలక్ష్మియే. ఆమెను నివాసంగా కలవాడే ఈ శ్రీనివాసుడు. తిరుమల శ్రీవారి హృదయంమీద ముందుకు చొచ్చుకొని వచ్చి ఆసీనురాలయింది అలమేలుమంగ! ఈ యమ్మ ఆయన వళ్లో ఊరికే కూర్చోలేదు. ఆ అమ్మ ముందుగా భక్తులందరి, బిడ్డలందరి ప్రార్థనల్ని, కోరికల్ని, కష్టాల్ని, వేదనల్ని, దుఃఖాన్ని ముందుగా తాను వింటుంది. ఆ వెంటనే ఆ తండ్రికి వినిపిస్తుంది. కేవలం వినిపించడమే కాదు. ఆ స్వామివారిని వత్తిడి చేస్తుంది. ఆమెను కాదనలేక, ఆమె మాటకు కట్టుబడి, ఆ శ్రీనివాసపరమాత్మ మనందరి కోరికలనూ తీరుస్తూ వున్నాడు. వరాలను గుప్పిస్తూ వున్నాడు. పాపాలను పోగొడుతూ వున్నాడు. దుఃఖాలను, కష్టాలను తొలగిస్తూ వున్నాడు. తద్వారా సకల సంపదలను ప్రసాదిస్తూ వున్నాడు.

అంతేగాక తిరుమల స్వామివారు ప్రతిరోజు వేదఘోషలతో ఇలా కీర్తింపబడుతూ వున్నాడు.

వక్త్రాబ్జే భాగ్యలక్ష్మీః కరతలకమలే సర్వదా దానలక్ష్మీః
దోర్దండే వీరలక్ష్మీ హృదయ సరసిజే భూతకారుణ్యలక్ష్మీః
ఖడ్గాగ్రే శౌర్యలక్ష్మీః నిఖిల గుణగణాడంబరే కీర్తిలక్ష్మీః
సర్వాంగే సౌమ్యలక్ష్మీః సర్వసామ్రాజ్య లక్ష్మీ ర్మయితు విజయతాం

ఇలా ఆపాదమస్తకం లక్ష్మీసుసంపన్నుడయిన శ్రీనివాసప్రభువు నాకు విజయం కలిగించుగాక! అని ప్రార్థింపబడిన ఈ శ్లోకంలో, శ్రీ మహాలక్ష్మీదేవి, ముఖ్యంగా ఆయన హృత్పద్మంలో 'ధూతకారుణ్య లక్ష్మి'గా దర్శనమిస్తూ వున్నదని ప్రముఖంగా స్తుతింపబడింది. ఇలా శ్రీమహాలక్ష్మీదేవి అనపాయినిగా శ్రీస్వామివారితో కూడ దర్శనమిస్తూ వున్నందువల్లే ఆనందనిలయుడు అందరివాడై అందరి ఆశలను, సునాయాసంగా నెరవేరుస్తూ, పరమార్థాన్ని ప్రసాదిస్తూ, ఆనందాన్ని కలిగిస్తూ ప్రసిద్ధిని పొంది వున్నాడు.

కనుకనే ఈ క్షేత్రంలో కొలువై దర్శనమిస్తూవున్న శ్రీవేంకటేశ్వరస్వామివారి మూలమూర్తి ఎంతటి ప్రధానదైవమో, ఆ మూర్తి హృదయంలో వేంచేసి వున్న శ్రీమహాలక్ష్మి అమ్మవారిమూర్తి అంతకంటె ప్రధానమై వెలుగొందుతోంది. తద్వారా ఈ స్వామివారు స్వయంగా కలియుగ మానవులందరికోసమే శ్రీ వైకుంఠంనుండి దిగివచ్చి ఇక్కడ అర్చామూర్తిగా వెలసి "కలౌ వేంకట నాయకః" అన్నబిరుదుతో వెలసిన సాక్షాత్తు "శ్రీమన్నారాయణ మూర్తే" అని తన ఉనికి ద్వారా, తన ప్రకాశం ద్వారా ముల్లోకాల్లో చాటుతూ వున్నది తిరుమలేశుని హృదయపట్టపురాణి పద్మావతీదేవి!

అందుకనే ప్రతిరోజు స్వామివారి మూలమూర్తికి తోమాలసేవ, అర్చన, నైవేద్యాలు అయిన వెంటనే, శ్రీవారి హృదయంలో వేంచేసివున్న అలమేలుమంగమ్మకు కూడ ప్రత్యేకంగా తోమాలసేవ, అర్చన, నైవేద్యాదులు జరుగుతున్నాయి. ఇక శుక్రవారాభిషేకం సరేసరి! వక్షఃస్థల లక్ష్మీదేవిని ఉద్దేశించి చేయబడుతున్న శుక్రవారంనాటిఅభిషేకం శ్రీస్వామివారికి కూడ తప్పనిసరిగా జరుగుతున్నది.

మరి మనందరం, అటు అయ్యవారితోపాటు, ఆయన గుండెలపై పదిలంగా చోటుచేసికొన్న అమ్మవారినీ దర్శించిన ఈ దివ్యాతి దివ్యమైన మధుర క్షణంలో, పిలిస్తే పలికే ప్రత్యక్షదైవంగా ఆపద్బాంధవునిగా, అనాథ రక్షకునిగా, అడుగడుగుదండాలవానిగా .. ఇలా ఎన్నో విధాల భక్తులచేత ఆర్తిగా, ఆర్ద్రంగా పిలువబడుతున్న శ్రీవేంకటేశ్వరస్వామివారిని ఇలా ప్రార్థిద్దాం.

శ్రీవత్సవక్షసం శ్రీశం శ్రీలోలం శ్రీకరగ్రహమ్
శ్రీమంతం శ్రీనిధిం శ్రీద్యం శ్రీనివాసం భజేஉనిశమ్

"అదివో ఆ దేవుడు వక్షఃస్థలంలో శ్రీవత్సం అనే గుర్తును కలిగి వున్నాడు!ఆ దేవదేవుడు సాక్షాత్తులక్ష్మీపతి! ఆ తిరుమలేశుడు లక్ష్మీదేవితో కలిసి విలాసాలతో మునిగి వుంటాడు! లక్ష్మీదేవిచేతిని కూడ గ్రహించినవాడు కూడ ఆస్వామే! ఇంకా తిరుమల శ్రీవారు సర్వవిద్యా పరిపూర్ణుడు, సమస్తైశ్వర్య సంపూర్ణుడు కూడా! అంతమాత్రమేకాదు. సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మిచేత ధ్యానింపబడుతూ స్తుతింపబడే శ్రీనివాసప్రభువును ఏదీ ఒక్కసారి ఆనందనిలయం ప్రతిధ్వనించేలా గోవిందా అంటూ పలకండిమరి!

*శ్రీలక్ష్మి వేంకటరమణ గోవిందా! గోవింద!!*
*శ్రీమద్రమారమణ గోవిందా!! గోవింద!!!*

సాక్షాత్తు శ్రీమహావిష్ణువు, శ్రీవైకుంఠవాసి వేంకటాచలంలో వెలసి వున్నందువల్ల 'వేంకటాచలపతి' అనీ, శేషాద్రి, గరుడాద్రి, వేంకటాద్రి, నారాయణాద్రి, వృషభాద్రి, అంజనాద్రి అనే ఏడుకొండలమధ్య వేంకటాద్రి మీద స్వామివారు నిలిచివున్నందువల్ల "ఏడుకొండలవాడ"నీ, 'సప్తగిరీశుడనీ', వక్షఃస్థలలక్ష్మితో దర్శనమిస్తూ అనుగ్రహిస్తున్నందున "శ్రీనివాసుడనీ"... ఇంకా..తిరుమలప్ప, వెంకటరమణుడు, సంకటహరణుడు, బాలాజీ, గోవిందుడు, శేషాచలపతి, వేంకటేశుడు...ఇలా ఎన్నో పేర్లతో ఎన్నెన్నో పేర్లతో ఎందరెందరో భక్తులచే పిలువబడే ఆ అలమేలుమంగపతి, ఎవరు ఎలా పిలిస్తే అలాగే, ఆ విధంగానే పలుకుతూ కోరికలు తీరుస్తూవున్న సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడు.

సాక్షాత్తు పరబ్రహ్మమూర్తి అయిన శ్రీమన్నారాయణుడు, ఈ కలియుగ వైకుంఠమయిన తిరుమలక్షేత్రంలో "శ్రీ వేంకటేశ్వరుడు" అనే పేరుతో దర్శనమిస్తూ వున్నందున, ఎవరు ఏ పేరుతో పిలిచినా, ఏ భాషలో పిలిచినా, ఎవరు ఎలా కీర్తించినా, పూజించినా...వారి వారి కిష్టమైన రూపాల్లో దర్శనమిస్తూ, వారి వారి కిష్టమైన రీతుల్లో పూజలందుకుంటున్నాడు. వరాలనిస్తూ వరాలరాయడని ప్రసిద్ధి పొందివున్నాడు. అంతేకాదు. సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడు.

**యే యథామాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్**

(గీ. 4-11 శ్లో.)

అని ఇచ్చిన దివ్య సందేశానికి, తార్కాణమే ఈ వేంకటాద్రికృష్ణుని దివ్యరూప ప్రదర్శనం!

అందుకనే శ్రీ వేంకటేశ్వరుని నందకాంశ సంభూతుడూ, పదకవితా పితామహుడూ అయిన తాళ్లపాక అన్నమాచార్యులు ఇలా కీర్తించాడు.

ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడ పిండంతే నిప్పటి అన్నట్లు

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుఁడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మం బనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులు శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవు డనుచు...

శ్రీమహావైకుంఠంలోని అనంతసూర్యకోటిప్రకాశమైన దివ్య ఆధ్యాత్మిక తేజస్సు భువికి దిగివచ్చి ఇక్కడ ఈ వేంకటాచలంలో కేంద్రీకృతమై వున్నందువల్లే ప్రతినిత్యం బ్రాహ్మీసుముహూర్త సమయంలో బ్రహ్మాది దేవతలు వచ్చి సేవిస్తూ వుంటారని ప్రతీతి!

అంతమాత్రమేకాదు. తిరుమల మీది మూర్తిని వైష్ణవులు, శైవులు, శాక్తేయులు, జైనులు, గాణాపత్యులు ఇలా ఎన్నో వైదికధర్మాల వారేగాక, హైందవేతరులైన, మహమ్మదీయులు, క్రైస్తవులు కూడ ప్రతినిత్యం శ్రీ వేంకటాచలపతిని దర్శిస్తూ ఇష్టార్థ సిద్ధిని పొందడం ప్రత్యక్షంగా కనపడుతున్న పరమసత్యం కూడా.

ఇలా ఇంతమందిచేత ఆకర్షింపబడుతూ దివ్యసౌందర్యం వెలారుస్తూ దర్శకులకు ఆనందాన్ని సమ్మోహనాన్ని కలిగిస్తూ వుండడమే గాక తిరుమలేశుని మూర్తిలో ఎక్కడా మరెక్కడా కాన రాని కానగలేని అద్భుత సౌందర్య తేజో విశేషం కేంద్రీకృతమైవుంది. అనంతతేజఃపుంజమని చెప్పబడే ఈ మూర్తిని ఒక్కక్షణం చూచినా, తనివి తీరదు, లేదా గంటల తరబడి చూచినా తనివి తీరదు. ఒక్కనిమిషం చూచినా, ఒక గంట చూసినా

వెలుపలికి వచ్చిన వెంటనే ఆ శతకోటి మన్మథాకారం భక్తుని మనోవీథి నుండి అదృశ్యమై మళ్లీ మళ్లీ అంటూ పునర్దర్శనానికి మనస్సు అర్రులు చాస్తూ ఎదురుచూస్తూ వుంటుంది.

అంతమాత్రమేనా! కాదు. కాదు. ఆయనను దర్శించవచ్చిన భక్తులందరికి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా దివ్యానుభవాన్ని ప్రసాదిస్తాడు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క వేళలో ఒక్కొక్క విధంగా గోచరిస్తాడు. ఉదయం పూట సుప్రభాత సేవలో కొందరికి ఆలయంలంతా తానే నిండివున్నట్లుగా విశ్వరూపం చూపిస్తాడు. మరికొందరికి చిన్న బాలునిగా, ఆనందంగా నవ్వుతూ కేరింతలు కొడుతూ వున్నట్లుగా దర్శనమిచ్చి మైమరిపిస్తాడు. కొందరికి యువకుడిగా, వృద్ధుడుగా, ఇంకొందరికి అలసి సొలసినట్లుగా, మరికొందరికి 'ఖబడ్దార్' అని హెచ్చరిస్తూ కోపంగా కనిపించి భయపెడతాడు. కొందరికి అప్పుడే విచ్చుకొన్న మల్లెమొగ్గ చందాన అందంగా కనపడతాడు. ఆత్మీయుణ్ణి నేనే నంటూ కొందరికి చేయి అందించినట్లుగా వుంటాడు. గురువారంనాటి ఉదయం జరిగే నేత్రదర్శనోత్సవంలో శ్రీనివాసుడు చాలా పొట్టివాడుగా అత్యంత గట్టివాడుగా దర్శనమిస్తూ నేత్రోత్సవం చేస్తూ ఆనందింపచేస్తాడు.

ఆనాటి రాత్రిజరిగే పూలంగిసేవలో నిత్యనూతన పెండ్లికొమరుడై పులకింపచేస్తాడు. ఇక శుక్రవారాభిషేకం సమయంలో వక్షఃస్థలలక్ష్మితో కూడా ఎలాంటి ఆచ్ఛాదనలు ఆభరణాలు లేకుండా పులుగడిగిన ముత్తెంలా దర్శనమిస్తూ నల్లని తుమ్మెద మైఛాయతో మురిపిస్తాడు స్వామి. ఆ అభిషేకదర్శనంతో జన్మ జన్మాంతరాల పాపాలు కడిగివేసినట్లుగా భక్తుని మనస్సు ఎనలేని ప్రశాంతతకు లోనవుతుంది. ఏదో తెలియని తన్మయత్వం చెందుతుంది. కోరికలు తీరినట్లుగా తృప్తి కలుగుతుంది. భక్తుల మనస్సుల్లోని కోరికలను ప్రసాదించినట్లుగా ఆ దివ్యమూర్తి ప్రత్యక్ష సన్నిధిలో ప్రతివ్యక్తి మనస్సు తన్మయిస్తుంది. మైమరపును పొందుతుంది. ఒక దివ్యాకర్షణకు లోనవుతుంది. అనంత తేజఃపుంజమైన ఆ శ్రీవేంకటేశునిమూర్తి ఎదురుగా, కలిగిన అంతుబట్టనిఆనందాన్ని 'ఇదీ' అని ఇదమిత్థంగా తేల్చి చెప్పలేని ప్రశాంతతను, ప్రతివ్యక్తి స్వయంగా ఎవరికి వారు అనుభవించాలే తప్ప

చెప్పటానికి వీలు కాదు. మాటలు చాలవు కూడ. ఆ సందర్శన క్షణంలో కలిగిన ప్రశాంతతను ఆనందాన్ని శాశ్వతం చేసుకుందామన్నా సాధ్యం కాదు గదా, ఆ వెంటనే విచిత్రంగా మైమరపు ఆవహించుకుంటుంది కూడ!... ఇలా శ్రీవేంకటేశ్వరునిమూలవిరాణ్మూర్తి తత్త్వం ఇలాంటిదీ అని అర్థం గానిదీ, అంతుబట్టనిదీను! ఇలా భూమండలంలో మరెక్కడా కానగరాని కానగలేని దివ్యమూర్తి భవ్యమూర్తి శ్రీ వేంకటేశ్వరుని మూల విగ్రహం.

ఇలా ఒక్క భక్తులకే కాదు. ఇక నిత్యమూ శ్రీవారి అర్చన నైవేద్యాదుల్లో సన్నిహితంగా పాల్గొనే అర్చక స్వాములకు కూడ ఆ మూర్తి పరమానందాన్ని పరమాద్భుతాన్ని పరమాశ్చర్యాన్ని కలిగిస్తూ వుంది. ఆభరణాల సమర్పణ వేళల్లో, పుష్పాలంకరణవేళల్లో, ఆ స్వామివారి పాదాలు, చేతులు, మెత్తగా, సుతిమెత్తగా స్పర్శకు తగులుతూ గగుర్పాటును కలిగిస్తుందట! అభిషేకానంతరం ఆ మూర్తికి విపరీతంగా స్వేదబిందువులు వస్తాయట! ఇలా వారి నిత్యానుభవంలో శ్రీ స్వామి విగ్రహం శిలగా తోచనే తోచదట! అప్పట శాశ్వతమైన అనంతమైన చైతన్యం విరాజిల్లుతూవున్నట్లు పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుడు దివ్య శరీరంతో నిలిచివున్నట్లుగానే గోచరిస్తుందట! అహో! అర్చకశిఖామణులు చేసికొన్న భాగ్యమెంతటిదో! ఎంతెంతటిదో కదా!

ఇలా అనంతకాల గమనంలో బ్రహ్మాది దేవతలు మొదలు సామాన్యమైన భక్తులవరకు అందరిచేతా సేవింపబడుతూ, పరిపరి విధాలుగా అనుభవింప బడుతూవున్న శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూల విగ్రహమూర్తి అత్యంత ప్రాచీనమైనదిగా, యోగులు, మహర్షులు, వేదవిదులు, పౌరాణికులచేత మాత్రమేగాక, శిలా, శిల్ప, భౌగోళిక శాస్త్రజ్ఞులచేత కూడ నిర్ణయింపబడి ధ్రువీకరింపబడింది.

1979 లో తిరుమలక్షేత్రంలో సుమారు 250 కోట్ల సంవత్సరాల నాటిదిగా శాస్త్రజ్ఞులచేత అంచనావేయుబడిన "అపూర్వశిలాతోరణం" కనుగొనబడింది. ఈ శిలాతోరణం శిలనుండే శ్రీ మహావిష్ణువు శ్రీ వేంకటేశ్వరునిగా అవతరించి వుంటాడని, ఆ శిలాతోరణం ఎత్తు, ఆలయంలోని మూలమూర్తి

ఎత్తు సరి సమానంగా వున్నాయని భౌగోళికశిలాశాస్త్రజ్ఞులు నిర్ణయించి నారు. అనగా వేదాల్లో, పురాణాల్లో ఈ వేంకటాచలక్షేత్రం, ఇందున్న శ్రీ వేంకటేశ్వరునిమూర్తి అతి ప్రాచీనకాలం నాటివని చెప్పబడినట్లుగానే భౌతికవాదులయిన శాస్త్రజ్ఞులు కూడా పై వాదాన్ని అంగీకరించినట్లయినది.

ఇంతటి ప్రాచీనమైనదిగా ప్రసిద్ధిపొందిన శ్రీ వేంకటేశ్వరుని మూల విరాణ్మూర్తి విగ్రహ సౌందర్యం, శిల్ప విన్యాసం ఏ వులికీ లోబడనిదీ, ఏ కళాకారుని అవగాహనకూ ఊహకూ అందనిదీ, అర్థం కానిదీను. ఆ కొండలరాయుని కొనదేరినముక్కు, అరగన్నులు, కన్నులరెప్పలమీది వెంట్రుకలు - శిరోజాలు - చేతివేళ్లు.. ఆభరణాలు ... అందాలు - సూక్ష్మమైన వంపులు సొంపులు ఇలా ఆమూలాగ్రం .... క్షణం క్షణం మార్పులకు లోనవుతున్నాయా అన్నట్లుగా గోచరిస్తూ, శిల్పశాస్త్ర నియమాలనూ, ఆగమశాస్త్ర పరిధులనూ అధఃకరిస్తూ వినూత్న పంథాలో అద్భుతావహంగా, ఆశ్చర్యజనకంగా స్వయంవ్యక్తమై, అభివ్యక్తమైనమూర్తి, తిరుమల దివ్యక్షేత్రంలోని శ్రీస్వామివారిమూలవిరాణ్మూర్తి!

కాని, కేవలం లౌకిక దృష్టితో చూచినట్లయితే, సాక్షాత్తు, భగవంతుడే, ఈ లోకంలో స్వయంగా అవతరించి, కొన్ని అద్భుతకార్యాలను నెరవేరుస్తూ వున్నాడు కదా!నిర్వహిస్తూ వున్నాడు కదా! అలాగే ఆ శ్రీ వైకుంఠంలోని సాక్షాత్తు శ్రీమహావిష్ణువే ఏనాడో... ఎప్పుడో తనకు తానే ఒకానొక అద్భుత శిల్పిగా అవతరించి ఈ వేంకటాచలక్షేత్రంలో తనదైన పరమాద్భుతరూపాన్ని వినూత్నంగా అత్యంత విశిష్టంగా అపురూపంగా 'న భూతో న భవిష్యతి' అన్నట్లుగా రూపొందించుకొని వుండవచ్చు నని మాత్రమే ఊహించి చెప్ప వలసిన దివ్య సౌందర్యం వెలారుస్తూ వున్న మేటి చక్కదనాల మూర్తి ఈ తిరుమల వేంకటేశభగవానుని మూలవిరాణ్మూర్తి!

తిరుమలలోని శ్రీస్వామివారి మూలవిరాణ్మూర్తి కేవలం "విగ్రహశిల్పం" అని చెప్పటంకూడా ఎంతమాత్రం సబబు కాదు. ఒకవేళ, ఆమూర్తి శిల్పమే అని అర్ధాంగీకారంగా ఒప్పుకున్నప్పటికీ, అదికేవలం భౌతికవాదులను, నిత్యశంకితులను సమాధానపరచుటకు మాత్రమేనని భావించవలసివుంది. సారాంశమేమనగా తిరుమల ఆనందనిలయంలో వేంచేసివున్న శ్రీవేంకటే

శ్వరస్వామి సాక్షాత్తుగా దివ్యశరీరంతో నయనాభిరామంగా నిలిచి దర్శనం ఇస్తూవున్న అనంత చైతన్యమూర్తి!

ఈ దివ్యసుందరమూర్తి కేవలం శిలగా, విగ్రహంగా భ్రమింపచేస్తూ ఏదీ గమనించనట్లుగా వుంటాడుగాని, అన్నీ చూస్తూవుంటాడు. నోరుతెరచి గట్టిగా మాటలాడడు కాని మౌనంగా జవాబిస్తాడు. వారి వారి భాష ల్లోనే మౌనంగానే మాటలాడుతాడు. పూర్వం, శ్రీవేంకటేశ్వరస్వామివారి అంతరంగిక భక్తుడు పరమభక్తుడైన తొండమాన్ చక్రవర్తి తెలియకచేసిన పొరపాటువల్ల, ఆ స్వామివారితో ప్రత్యక్షంగామాట్లాడే మహద్భాగ్యాన్ని మనం అందరంకూడా పోగొట్టుకున్నాం. అదెలాగ? అంటే

పూర్వం ఒకప్పుడు కూర్ముడు అనే విప్రుడు కాశీకి పోతూ, తాను తిరిగి వచ్చేంత వరకు తన భార్యాపిల్లల్ని కాపాడవలసిందని, తొండమానురాజుకు అప్పచెప్పాడు. ఆ రాజు వారికి ఒకపెద్ద భవనంలో సకల సౌకర్యాలు కలుగ జేసి భద్రతకై తాళం వేసివుంచాడు. తర్వాత ఆవిషయం మరపునకురాగా, ఆ భవనంలోని విప్రునికుటుంబం ఆహారం చాలక లోపలనే మరణించారు. పిదప, ఒక సంవత్సరానికి తర్వాత కాశీనుండి తిరిగి వచ్చిన బ్రాహ్మణుడు తనభార్యాపిల్లల్నిగూర్చి అడిగినాడు. ఆ విషయమే మరచిన తొండమానుడు వెంటనే భవనంలో అస్థికలుగా మిగిలినవారిని చూచి, భీతిచెంది, విప్రునితో మీకుటుంబంఅంతా మావారితో వేంకటాచలానికి శ్రీనివాసుని అభిషేకము నకు వెళ్ళారు. రేపు వస్తారని, అంతవరకు విశ్రాంతి తీసుకోవలసిందంటూ అసత్యం చెప్పి నమ్మబలికాడు. పిదప వేంకటాచలానికి పరుగెత్తి వెళ్లి శ్రీనివాసుని కాళ్లపైపడి శరణు వేడినాడు. అభయ మొసంగిన వేంక టేశ్వరుడు తనభక్తుడైనతొండమానుని ఘోరతప్పిదానికి చింతించి ఎంత పనిచేశావు రాజా!నీకు బ్రహ్మహత్యాపాపం చుట్టుకుంది. దానికి తప్పక నీవు బలిగావలసిందే. కాని నాకు పరమభక్తుడవైనందున నీకు అభయమిచ్చి వున్నందున నీ యీ బ్రహ్మహత్యాపాపాన్ని నివృత్తిచేస్తాను. అందుకు ప్రతిఫలంగా ఇకమీదట ఎవరికిని ప్రత్యక్షంగా గోచరించను. ఎవరితోను ప్రత్యక్షంగా మాట్లాడనుగాక మాట్లాడను. అంటూ శపథం చేస్తూ ఆ విప్రుని కుటుంబాన్ని బ్రతికించాడు.

అంతలో బ్రహ్మాదిదేవతలు వచ్చి శ్రీవేంకటేశ్వరునితో స్వామీ! ఈ కలియుగంలోని మానవులు బలహీనులు, అల్పాయుష్కులుకదా! వారిని ఉద్ధరించటానికోసమైనా కలియుగాంతంవరకు ఇక్కడే ఈ వేంకటాచల క్షేత్రంపై నిలిచి దివ్యసందర్శనాన్ని ప్రసాదిస్తూ వారికోరికలనన్నింటినీ తీరుస్తూ వుండవలసిందని ప్రార్థించారు. అందుకు శ్రీనివాసస్వామి అంగీకరిస్తూ దివ్యమూర్తిగా దర్శనమిస్తాను. కాని ఎవరితోను ప్రత్యక్షంగా మాట్లాడను. కాని మౌనంగానే జవాబిస్తాను. అందరికి కోరికలు తీరుస్తూ "కలౌ వేంకటనాయకః" అంటూ ప్రసిద్ధిని పొందుతానని అంటూ ఆనాడు అంటే సరిగ్గా కన్యామాసం శ్రవణానక్షత్రంరోజున దివ్యమైన సాలగ్రామ శిలామూర్తిగా ఆవిర్భవించినాడు. ఆనాడు బ్రహ్మదేవుని కోరికపై నిలిచిన శ్రీవేంకటేశ్వరస్వామివారికి, తొండమానుడు ఆలయగోపురాదులు నిర్మించాడు. బ్రహ్మదేవుడు ఆనందనిలయంలో రెండు అఖండ దీపాలను వెలిగించి, ఇవి కలియుగాంతం వరకు వెలుగుతుంటాయని చెప్పుతూ, పిదప శ్రీనివాసుని ఆనతిమేరకు పదిరోజులపాటు ఉత్సవాలు నిర్వహించాడు. అవే అనంతరకాలంలో బ్రహ్మోత్సవాలుగా ప్రసిద్ధికెక్కాయి. ఆనాటినుండి ప్రతి యేటా కన్యామాసంలో శ్రవణానక్షత్రంనాటికి ముగిసేట్లుగా పదినాళ్ళ పాటు నిరాఘాటంగా, నిరాటంకంగా బ్రహ్మోత్సవాలు ఘనంగా జరుపబడుతునే వున్నై.

అందువల్ల మనం అందరం ఎంతటి భాగ్యశాలురమో కదా! ఎందుచేతంటే ఆ శ్రీనివాసుడు, ఆ తిరుమలేశుడు మనందరితో గట్టిగా మాట్లాడకపోయినా ఆ బ్రహ్మాది దేవతల ప్రార్థనపై మనందరికీ ప్రత్యక్షంగా దర్శనంఇస్తూ వున్నాడు. ఎనలేనిఆనందాన్నికలిగిస్తూ ఆనందనిలయునిగా పేరుపొందడమేగాక, మనకోరికల నన్నింటినీ తీరుస్తూ కొండలంతవరాలను గుప్పించెడి దేవుడుగా నిలిచివున్న స్వామి ఈ ఏడుకొండలవాడు.

కలియుగవరదునిగా ఈ వేంకటాచలక్షేత్రంపై మానవులందరినీ, రక్షించడానికై శ్రీ వేంకటేశ్వరస్వామిగా ఆవిర్భవించి దివ్య సందర్శనమిస్తూ వున్న ఈ పవిత్ర సందర్భంలో మనపూర్వ పుణ్యావిశేషంచేత మనందరంకూడ తిరుమలేశుని సుందర దరహాసమూర్తిని దర్శిస్తూ ఆనందిస్తూవున్నాంకదా.

మరి ఈ మధురాతి మధుర క్షణంలో ఈ ఆనందనిలయం మాత్రమే కాక ఈ ఏడుకొండలూ కోనలూ ప్రతిధ్వనిస్తూ మార్మోగేలా మరొక్కసారి ఆ శ్రియఃపతిని ఆశ్రితపక్షపాతిని కీర్తిద్దాం

*కలియుగవైకుంఠవాసా గోవిందా! గోవింద!!*

*ఏడుకొండలవాడా! గోవిందా!! గోవింద!!!*

భక్తవత్సలుడు, భక్తపక్షపాతి, అత్యంత భక్తప్రియుడైన ఈ వేంకటేశ్వరుడు ఎవరికి ప్రత్యక్షంగా దర్శనం ఇవ్వనుగాక ఇవ్వను, ఎవ్వరితోను ప్రత్యక్షంగా మాట్లాడనుగాక మాట్లాడను అని శపథంచేసివున్నప్పటికీ తన ఈ శపథాన్ని మరవడమే కాక, చివరకు తనను కూడ మరచిపోయి, హద్దులులేని ఆవేశంతో, లేగదూడకోసం వెంపర్లాడుతూ పరుగెత్తే గోమాత వలె భక్తుల వెంటపడ్డాడు ఈ గోవిందుడు! ఎందరికో వెట్టిచాకిరి చేశాడు ఈ వైరిభాగుల వెంకన్న! ఎందరితోనో ఆటలాడినాడు, మాటలాడినాడు, తానూ మైమరచి ఆనందించాడు. భక్తుల్ని ఆనందింపచేశాడు. ఇలా ఎందరినో ఎందరెందరినో భక్తులను ఆకట్టుకొన్నాడు. కాదు కాదు ఆ భక్తుల భక్తి తీవ్రతకు తానే ఆకర్షింపబడ్డాడు ఈ తిరుమలేశుడు. ఆ యా సందర్భాల్లో ఆయా భక్తులతో జరిగిన మధురాతి మధురమైన అనుభూతులను తానుమరచిపోక, మరచిపోలేక, మరచిపోవటానికి సాధ్యంకాక, తన సుందర దివ్యదేహం పై శాశ్వతంగా వాటికి సంబంధించిన మనోహరమైన చిన్నెలను, వన్నెలను చిత్రించుకొన్నాడు. అంతమాత్రమేకాదు, ఈ తిరుమల స్వామివారు, ఆ యా వేళల్లో ఆ యా భక్తులు తనకు చేసిన సేవలు సపర్యలు శాశ్వతంగా గుర్తుండే విధంగా, తర్వాతి కాలాల్లో వారిని చిరస్థాయిగా స్మరించే విధంగా ఆయాభక్తులపేర్లతోనే వారివారి సేవలను నేటికీ ప్రశాంతధామమయిన ఆనందనిలయ మందిరంలో ఆ ఆచారాలను, ఆ అలవాట్లను పాటింప చేసుకుంటూ వున్నాడు. వాటిద్వారా ఎందరో భక్తుల వింత వింత గాథలు మనకు తెలుస్తూవుండడమేగాక అవి శ్రీవేంకటేశ్వరుని భక్తప్రియుత్వాన్నీ భక్త వాత్సల్యాన్ని చాటే దివ్యపతాకాలుగా ఆధ్యాత్మిక వినీలాకాశంలో శాశ్వతంగా రెపరెపలాడుతూ నేటికి పరమానందాన్ని కలిగిస్తూవున్నాయి.

అనంతకాలగర్భంలో దాగివున్న ఎన్నో ఎన్నెన్నో తిరుమలభక్తులగాథల్లో మనకు తెలియవచ్చినంతవరకు, మనకు అర్థమయినంత వరకు శ్రీని వాసపరంధాముని పరమదయాళుత్వాన్ని చాటే కొన్ని మధురఘట్టాల్ని స్మరించుకుందాం. వర్ణించుకుందాం. ముందుగా భక్తపారిజాతమై దర్శన మిస్తూవున్న శ్రీవేంకటేశ్వరుని ప్రస్తుతం మరొక్కసారి గట్టిగా కీర్తిద్దాం!

*భక్తవత్సల గోవిందా!*
*గోవిందా!! గోవింద!*

## శ్రీవారి పాదములు

అదిగో దర్శించండి! కన్నులారా, కన్నులనిండుగా తిలకించండి. బంగారు పద్మ పీఠంపై వెలుగొందుతూవున్న శ్రీస్వామివారి బంగారు పాదపద్మాలు! ప్రతిరోజూ బ్రహ్మేంద్రాది దేవతలు వేంకటాచల క్షేత్రానికి వస్తూ, మణిమయ కిరీటాలు ప్రకాశిస్తూవున్న తమశిరస్సులను వంచి నమస్కరించే శ్రీనివా సుని దివ్యపాదయుగళం! ఎల్లప్పుడూ కాలిఅందెల వరకూ సమర్పింపబడిన సుగంధభరితమైన సుమనోహరమైన వివిధరంగు రంగులపుష్పాలకు మరింత పరమళాన్నీ శోభనూ చేకూర్చి చూపరులకు ఆనందాన్ని కలిగించే శ్రీవేంక టేశుని పాదద్వయ సౌందర్యాన్ని రెప్పలువాల్చక తిలకించండి! ఈ పాదాలు రెండూ సరి సమానంగా ప్రకాశిస్తూ, ఎప్పుడు దర్శించినా, ఎన్నిమార్లు దర్శించినా ఎంతసేపు దర్శించినా తనివితీరకపోగా, ఇంకా ఎప్పటి కప్పుడు నిత్యనూతనంగా తొలిసారిగా దర్శించినట్లుగానే దివ్యానుభూతిని కలిగించి ఆనందింప జేసే ఆనందనిలయుని సువర్ణమయ పాదాలు అదిగో తృప్తి దీరా దర్శించి సేవించండి. సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీదేవి తన సున్నితమైన చిగురులవంటి చేతులతో, మెత్తగా సుతి మెత్తగా అత్యంత భయభక్తులతో, ప్రేమతో ఒత్తినా ఎర్రగా కందిపోయే ఏడుకొండలవాని పాదాల సౌకు మార్యాన్ని ఎవరికి వారు కన్నుల నిండుగా దర్శించి అనుభవించడం తప్ప, ఎంతని వర్ణించగలం! ఏమని వర్ణించగలం! అంతేకాదు భక్తులపాలిట కొంగుబంగారమై కలియుగ వైకుంఠమైన తిరుమలక్షేత్రంలో ఎందరెందరో నిత్యమూ, నిరంతరాయంగా దర్శిస్తూవున్న శ్రీనివాస ప్రభువుల దివ్యమైన

పాదపద్మాలనుగూర్చి ఋగ్వేదం "శ్రీమహా వైకుంఠంలోని శ్రీమహావిష్ణువు యొక్క దివ్యమైన తేనెల ఊటలే ఇవి" అని కీర్తిస్తూ వుండగా, ఔను ఔనౌను, అది ముమ్మాటికీ సత్యమైనమాట. అందరికీ దర్శనీయమైన, అనుభవయోగ్యమైన, శాశ్వతమైన సత్యమైన తేనెల ఊటలే నాపాదాలు. దర్శించండి, ధన్యులుకండి. అంటూ శ్రీ వేంకటప్రభువు స్వయంగా తన కుడిచేత్తో చూపిస్తూవున్న పవిత్ర పాదాలజంటను దర్శించండి! అంత మాత్రమేకాదు అలా శరణువేడినవారికి సంసార సముద్రం మోకాళ్లబంటే అని ఎడమచేత్తో చూపిస్తూవున్న తిరుమలేశుని పాదపద్మాలను దర్శించి కీర్తించండి.

శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే

అలాంటి దివ్యాతిదివ్యమైన శ్రీస్వామి వారి బంగారు పాదపద్మాలు ఎల్లవేళలా పుష్పాలతో తులసితో నిండివుంటాయి. ఉదయంపూట సుప్రభాత దర్శనంలో మాత్రమే ఎలాంటి పూలూ తులసి లేకుండా శ్రీనివాసుని బంగారు పాదాలను దర్శించవచ్చు. శ్రీస్వామివారి మూలవిరాణ్మూర్తి యొక్క నిజపాదాలు (శిలాపాదాలు) ఎల్లవేళలా బంగారుతో వేయుబడిన పాదకవచాలు తొడగబడివుంటాయి. ఒక శుక్రవారంనాడు అభిషేక సమయంలోగాని, లేక ఆ వెనువెంటనే జరిగే అభిషేకానంతర దర్శనంలోగాని మాత్రమే శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిజమైన (శిలాపాదాలు) పాదాలను దర్శించుకోవచ్చు. అప్పుడు తప్ప మిగిలినలన్నివేళలా శ్రీ స్వామివారి పాదాలు బంగారు పాదకవచాలతో విరాజిల్లుతూ వుంటాయి.

అయితే ప్రతిరోజు సుప్రభాతానంతరం, తోమాలసేవకంటే ముందుగా, శ్రీస్వామివారి ఈ బంగారు పాదకవచాలను, ప్రక్కకు తీసి, స్నానపీఠంపై ఉంచి ఆకాశగంగాతీర్థజలాలతో అభిషేకిస్తారు. వీటితోపాటు శ్రీస్వామివారి కౌతుకమూర్తి అయిన భోగ శ్రీనివాసునికి కూడ నిత్యాభిషేకం జరుగుతుంది. ఇలా ప్రతిరోజు ఏకాంతంగా జరుగుతుంది. ఏకాంతంగా జరిగే ఈ అభిషేకాన్ని ఇతరులు ఎవరు దర్శించడానికి వీలులేదు. కాని ప్రతి శుక్రవారంనాడు మాత్రం శ్రీవారి మూలమూర్తికి పచ్చకర్పూరం, పునుగు, జవ్వాది, చందనం మున్నగు సుగంధ ద్రవ్యాలతో కూడిన ఆకాశగంగా

జలాలతో అభిషేకం జరుపబడుతుంది. ఈ అభిషేకాన్ని తగిన రుసుమును చెల్లించి భక్తులు దర్శించి తరించవచ్చును. నిత్యాభిషేకంలో పాల్గొనే భోగ శ్రీనివాస మూర్తిని గూర్చి శ్రీవారి మూలమూర్తికి జరిగే శుక్రవారాభిషేక విశేషాలను గూర్చి మరోచోట వివరంగా వర్ణించుకుందాం.

ఇలా ప్రతిరోజు శ్రీవారిమూల విరాణ్మూర్తి బంగారు పాదాలకు మరియు భోగశ్రీనివాసమూర్తికి, అలాగే ప్రతి శుక్రవారంనాడు శ్రీవారి మూలమూర్తికి ప్రధానంగా జరిగే అభిషేకానికి గాను ప్రతిరోజు ఉదయం పూట ఆకాశగంగా తీర్థజలాలు తెస్తారు. ఈ తీర్థజలాలను వెండి బిందెల (కలశాలు)తో ఏనుగుపై ఎక్కి ఛత్ర చామర మంగళ వాద్యాలతో "ఆకాశగంగతీర్థం నుండి శ్రీవారి ఆలయానికి నేటికీ శ్రీవైష్ణవ భక్తుల చేత సంప్రదాయ బద్ధంగా తేబడుతున్నది. (ఈ ఆకాశగంగ తీర్థం తిరుమల శ్రీవారి ఆలయానికి ఉత్తరాన 5 కిలోమీటర్ల దూరాన నెలకొనివున్నది. బస్సు సౌకర్యంవుంది)

పూర్వం (క్రీస్తు శకం 11వ శతాబ్దం) తిరుమలనంబి అనే శ్రీవైష్ణవ భక్త శిఖామణి తిరుమలలో మొట్టమొదట ఈ తీర్థ కైంకర్యాన్ని స్వయంగా చేసేవారు. వీరినే శ్రీశైలపూర్ణులని కూడా అంటారు. వీరే భగవద్రామానుజులవారికి తిరుపతి అలిపిరిలో శ్రీమద్రామాయణ రహస్యాలను ఉపదేశించిన గురువులు. అంతేకాదు ఈ తిరుమలనంబి గురువులే కాక, స్వయంగా రామానుజులవారికి మేనమామకూడ. నేటికీ తిరుమల క్షేత్రంలో జరిగే శ్రీవారి బంగారుపాద, భోగ శ్రీనివాసమూర్తులనిత్యాభిషేకానికి, మూలవరుల శుక్రవారాభిషేకానికిగాను తిరుమలనంబి వంశీయులే ఆకాశగంగా తీర్థకైంకర్యంలో పాలుపంచుకుంటూ, తమ జీవితాల్ని ధన్యం చేసికుంటూవున్నారు.

ఈ శ్రీశైలపూర్ణులు సాక్షాత్తు శ్రీనివాసుని చేతనే "తాతా! తాతా!" అని పిలిపించుకొని, అభిషేక కైంకర్యంలో పాలుపంచుకొన్నందుకుగాను, ఆ శ్రీ వేంకటేశునిచేతనే వంశపారంపర్యంగా తీర్థకైంకర్యం భాగ్యాన్నిపొందిన భక్తవతంసుడు. ఆ భగవంతుడు ఈ భాగవతుని మధ్య జరిగిన మధుర ఘట్ట మెలాంటిదో తెలిసికొందమా, తెలిసికునేముందుగా తిరుమలస్వామివారిని ఇలా కీర్తిద్దాం.

*భక్తజనపారిజాతమా! గోవిందా! గోవింద!!*
*ఏడుకొండలవాడా! గోవిందా! గోవింద!!*

# తిరుమలనంబి

క్రీస్తుశకం పదవ శతాబ్దంలో ప్రసిద్ధ వైష్ణవక్షేత్రమయిన శ్రీ రంగంలో యామునాచార్యులు అనే వైష్ణవ భక్తవరేణ్యులు వుండేవారు. వారు శ్రీరంగనాథస్వామికి కైంకర్యసేవలు కొనసాగిస్తూనే, మరోవైపు తన శిష్యులకు శ్రీవైష్ణవ మత రహస్యాలను గూర్చి విశిష్టాద్వైతసిద్ధాంత ప్రాముఖ్యాన్ని ఉపదేశం చేసేవారు. ఒకనాడు ఆయన శిష్యులకు పాఠం చెప్తూ "పుష్పమండపమని ప్రసిద్ధిపొందిన శ్రీ వేంకటాచల క్షేత్రంలో శ్రీనివాస భగవానునికి అభిషేకతీర్థ, పుష్ప మాలాకైంకర్యాది సపర్యలు చెయ్యడం భగవత్ప్రీతికరమైన మహత్కార్యంగా పరాంకుశ దివ్యసూరులని పిలువబడే నమ్మాళ్వారులు పేర్కొన్నారనీ, అందువల్లే తానూ చాలా కొద్దికాలం మాత్రమే వేంకటాచలపతిసేవలో పాలుపంచుకొన్నాననీ, కాని అక్కడికి వెళ్లి చలికి, కీటకాల బారికి తట్టుకొంటూ శాశ్వతంగా తిరుమల స్వామివారికి పూలమాలన్ని తీర్థజలాల్ని సమర్పిస్తే ఆటు వైష్ణవ ఆళ్వారు శ్రేష్ఠులయిన నమ్మాళువారల అభిప్రాయాన్ని గౌరవించి పాటించిన మహద్భాగ్యం కలుగుతుందనీ అందుకు భగవంతుడు సంతోషిస్తాడనీ, తన అభిప్రాయాన్ని తెలియజేస్తూ తన శిష్యులవైపు ఆసక్తిగా చూశారు. ఈ విషయాన్ని విన్నవెంటనే శ్రీశైలపూర్ణులనే (తిరుమలనంబి) శిష్యుడు తాను అందుకు పూనుకొని నిరంతరం తిరువేంకటక్షేత్రంలో శ్రీనివాసుని కైంకర్యంలో పాలుపంచుకొంటానని విన్నవించి తిరుమల పుణ్యక్షేత్రాన్ని చేరుకొన్నారు.

తిరుమలలో ప్రతినిత్యం తిరుమలనంబి శ్రీస్వామివారి ఆలయంలో సపర్యలు చేస్తూ, శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూల విరాణ్మూర్తికి, ఉత్సవమూర్తులకు పూలమాలలు కట్టి ఇచ్చేవారు. ప్రతిరోజు తెల్లవారు జాముననే శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయానికి సుమారు పదిమైళ్ల దూరంలో వున్న పాపవినాశన తీర్థానికివెళ్లి, ఆ పవిత్రతీర్థ జలాలను ఒక మట్టి కుండలో నింపుకొని తలపై పెట్టుకొని, అత్యంత భక్తి ప్రపత్తులతో

భగవన్నామ సంకీర్తన చేసికొంటూ అభిషేక వేళకు ఆలయానికి వచ్చి సమర్పించేవారు. ఆలయంలోని శ్రీస్వామివారి అర్చకులు ఆ తీర్థజలాలతో ప్రతిరోజు శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తి యొక్క బంగారుపాద కవచాలకు, మనవాళ పెరుమాళ్ అని పిలువబడే శ్రీవారి కౌతుకమూర్తి భోగశ్రీనివాసమూర్తి వెండి విగ్రహానికి అభిషేకం చేసేవారు. ఇలా పరమభక్తులైన శ్రీశైలపూర్ణులు నిత్యమూ గురువుగారి ఆనతిని తు.చ. తప్పక పాటిస్తూ శ్రీవేంకటేశ్వరస్వామివారి కైంకర్యంలో జీవితాన్ని పునీతం చేసికొంటూ వుండినారు. ఇలా చాలా ఏండ్లు నిరంతరం ఏమాత్రం ఏమరుపాటులేక నిత్యజాగరూకతతో అత్యంత నిష్ఠతో, భక్తితో ఈ పరమభక్తాగ్రేసరుడు చేస్తున్న కైంకర్యసేవకు తిరువేంకటప్రభువు చాల సంతోషించినాడు. ఇతని భక్తి ప్రపత్తులను, దైవభక్తిని, ఆచార్యనిష్ఠను లోకానికి తెలియపరచడానికి పూనుకొన్నాడు తిరుమలేశుడు.

ఒకరోజు యథాప్రకారం తిరుమల శ్రీస్వామివారి ఆలయానికి సుమారు పదిమైళ్ల దూరంలో వున్న పాపనాశన తీర్థానికి వెళ్లి, ఆ పవిత్రతీర్థ జలాలు కలిగిన పూర్ణకుంభం (మట్టికుండ)తో, అభిషేక, ఆరాధన సమయం మించి పోకుండా వేగంగా నడకసాగిస్తూ తిరిగి వస్తూ వుండినారు తిరుమలనంబి. ఆ దారిమధ్యలో ఒకచోట శ్రీవేంకటేశ్వరస్వామివారు, విల్లంబులు ధరించి యువకుడైన బోయవాని రూపాన్ని ధరించి, తాతా! తాతా! అని పిలుస్తూ ఆయనవెంటపడ్డాడు. ఈ నిర్జనారణ్యంలో తనను "తాతా!" అని పిలుస్తున్న దెవరా! అని ఆగిచూచిన తిరుమలనంబికి స్ఫురద్రూపియైన కిరాతుడు కనపడ్డాడు. అందంగా కనపడుతున్న ఆ బోయవానిని చూస్తూ ఆశ్చర్యపోయిన తిరుమలనంబిని 'తాను చాలదప్పికతో వున్నాననీ, అందువల్ల, ఆ కుండలోని మంచినీళ్లతో తన దాహాన్ని తీర్చవలసిందని ఆ బోయవాడు వేడుకొన్నాడు. "ఒరే వ్యాధుడా! శ్రీనివాసుని ఆరాధన కైంకర్యాలకు వినియోగమయ్యే ఈ పవిత్ర జలాన్ని నీకు ఇవ్వనుగాక ఇవ్వను. అంతేగాదు. ఇప్పటికే ఆలస్యమై వేళ మించిపోతున్నది. నన్నుడ్డుపెట్టక దూరంగా వెళ్లు" అంటూ తిరుమలనంబి దైవసంభాషణవల్ల కలిగిన మరింత భక్తి పారవశ్యంతో మైమరచిపోతూ నడక సాగించారు.

తనను తిరస్కరించి వెళుతూవున్న తిరుమలనంబి వెనుకనే ఆ బోయ వాడుకూడ నడుస్తూ, తన బాణాన్ని ప్రయోగించి ఆయన నెత్తిమీది కుండకు చిన్న రంధ్రం చేసి, ఆ రంధ్రంలోనుంచి జలాన్ని ధారగ కారేటట్లు చేశాడు. తన దోసిట్లో ఆ నీటిధార పడేట్లుగా ఆయనవెనకనే నడుస్తూ దప్పిక తీర తాగినాడు ఆ మాయా కిరాతుడు. భక్త్యావేశంతో మైమరచి నడుస్తున్న తిరుమలనంబి కొంతదూరం వెళ్లిన పిదప తేలికలయిన కుండను గమనించి, ఆగి వెనుకకు తిరిగి నీటిని తాగుతున్న బోయువాణ్ణి చూచి, కోపంగా, "ఒరే కిరాతుడా! ఎంత పని చేశావురా! భగవంతునికి నివేదించే ఈ పవిత్రజలాలను తాగి, నా సేవా కార్యక్రమాన్ని భంగం చేశావు. పాపాత్ముడా! ఈరోజు నేను చేసే కైంకర్యానికి విఘ్నం కలిగించావే. మళ్లీ తీర్థం తేవటానికికూడ వేళమించిపోయిందే! స్వామీ! శ్రీ వేంకటేశా! ఈ దాసుణ్ణి క్షమించుస్వామీ!" అంటూ ఆర్తిగా ఆక్రందన చేస్తూ కన్నీరు కార్చారు.

అంత ఆ మాయాకిరాతుడు "తాతా! నీవు ఎంతమాత్రం చింతించవద్దు తాతా! ఈ దగ్గరలోనే వున్న కోనలో ఒక పవిత్ర తీర్థం వుంది. నావెంట రండి తాతా! చూపిస్తాను." అంటూ ఒక లోయులోనికి దారితీశాడు. కాని ఆ లోయలో ఎక్కడా నీరు కనపడనందున బోయువాడు తనబాణంతో ఆ కొండవాలును కొట్టగా అందుండి ధారగా స్వచ్ఛమైన జలం పెల్లుబికింది. "అదిగో! తాతా! ఆ జలాన్ని తీసికొని ఆలయంలో సమర్పించి, అభిషేక, ఆరాధనకైంకర్యాల్ని నిర్విఘ్నంగా కొనసాగించుకో! ఇకమీదట ప్రతిరోజూ ఈ జలాన్నే నా అభిషేకానికి సమర్పించుకోవలసింది" అంటూ ఆ బోయువాని రూపంలో వున్న వేంకటేశ్వరుడు అదృశ్యమయ్యాడు.

సంభ్రమాశ్చర్య ఆనందాలలో మునిగివున్న తిరుమలనంబి నిశ్చేష్టుడై పిదప తేరుకొని, సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుడే వ్యాధుని రూపంలో దర్శనమిచ్చి తనతో సంభాషించినాడు కదా అనుకొంటూ, శ్రీస్వామివారితో తనకు జరిగిన మధుర సన్నివేశాన్ని నెమరువేసికొంటూ, ఆకాశగంగా జలాన్ని స్వీకరించి ఆలయానికి వెళ్లి సమర్పించారు. అదే సమయంలో ఆనందనిలయంలోని శ్రీస్వామివారు, తన అర్చకస్వామిని ఆవేశించి, "ఓ

తిరుమలనంబీ! నీవు సమర్పించిన చల్లనైన దివ్యతీర్థంతో దారిలోనే నా దప్పిక తీరింది. సంతృప్తి కలిగిందయ్యా! ఇకమీదట శాశ్వతంగా నీవు సమర్పించే పవిత్ర ఆకాశగంగా జలాలతోనే మజ్జన మాడుట నాకు అత్యంత ప్రీతికరం" అంటూ అర్చకుని నోటిద్వారా లోకానికి తెలియజేసినాడు.

ఈ నిత్యారాధన, అభిషేక తీర్థ కైంకర్యం ద్వారా పరమభక్తాగ్రేసరుడైన శ్రీశైలపూర్ణులనే తిరుమలనంబియొక్క శరణాగతి ప్రపత్తులతో కూడిన భగవత్సేవను, ఆచార్యనిష్ఠను లోకానికి చాటడమేగాక, తద్ద్వారా తన భక్త ప్రియత్వాన్ని, భక్తానుగ్రహ దీక్షా కంకణత్వాన్ని శ్రీ వేంకటేశ్వరస్వామివారు స్పష్టంగా చాటుకొన్నాడు.

తిరుమలలో శ్రీవారిఆలయానికి మహా ప్రదక్షిణమార్గంలో దక్షిణ దిక్కున ఉత్తరాభిముఖంగా వున్న తిరుమలనంబిగారి చిన్న ఆలయాన్ని నేటికీ దర్శించవచ్చు. తిరుమలలో శ్రీవారి ప్రథమతీర్థకైంకర్యపరులుగా ప్రసిద్ధి కెక్కిన తిరుమలనంబి పూర్వం ఇచ్చోట తన కుటీరాన్ని ఏర్పాటుచేసికొని తన కైంకర్యాన్ని నిత్యమూ నిర్వహించేవారట. ఆనాటినుండి ఇప్పటివరకు ఈ నాటివరకు ఏరోజైనా, ఎప్పుడైనా పురవీధుల్లో ఊరేగినప్పుడు, ఈ తిరుమలనంబి ఆలయందగ్గర శ్రీస్వామివారు మొట్టమొదట హారతులందు కొంటాడు. ఆ తర్వాతనే దక్షిణమాడవీధినుంచే శ్రీవారిఊరేగింపు ముందు జియ్యంగారుల దివ్య ప్రబంధ పారాయణం ప్రారంభమవుతుంది. అంటే తిరుమలలో శ్రీస్వామివారి ఆరాధనా అభిషేక కైంకర్యాల్లో తిరుమల నంబి ప్రాధాన్యత స్పష్టమవుతూవుంది.

సాక్షాత్తు శ్రీనివాసునిచేత తాతా! అని పిలిపించుకొన్న తిరుమలనంబి అందరికీ తాతై, తర్వాతి కాలంలో "పెరియ తిరుమలనంబి" అంటే "పెద్ద తిరుమలనంబి" అనీ, శ్రీశైల మహాపూర్ణులనీ ప్రసిద్ధిని పొందారు.

పరమభక్తులైన ఈ తిరుమలనంబిగారు కేవలం శ్రీనివాసుని నిత్య సేవా కైంకర్యపరులు మాత్రమేగాక సంస్కృత, ద్రావిడ (తమిళం) భాషల్లో నిష్ణాతులైన గొప్ప పండితులుకూడ. శ్రీవైష్ణవ విశిష్టాద్వైతమతాన్ని సము ద్ధరించిన శ్రీ భాష్యకారులుగా పేరుపొందిన శ్రీభగవద్రామానుజులవారికి

గురుస్థానమధిష్ఠించిన ఐదుమంది గురువులలో ఈ తిరుమలనంబి ఒకరు. అంతేకాక తిరుమలనంబికి రామానుజులవారు స్వయానా మేనల్లుడు కూడ.

ఒకసారి భగవద్రామానుజులవారు శ్రీరంగంనుంచి దిగవతిరుపతి వచ్చిన సమయంలో వేంకటాచలక్షేత్రంమూలంలో అంటే అలిపిరిలో చింతచెట్టు కింద ఒక పెద్దగుండు ప్రక్కన తిరుమలనంబిగారిచేత శ్రీమద్రామాయణ రహస్యాల్ని తెలుసుకొనేవారు. ప్రతిరోజుఉదయం తిరుమలలో శ్రీస్వామి వారి మూలవిరాణ్మూర్తుల శ్రీపాదసేవా కైంకర్యాలు ముగించుకొని, తీర్థప్రసాదాలు స్వీకరించి తిరుమలనంబి తిరుమలక్షేత్రాన్ని దిగివచ్చేవాడు. ఒక్కసంవత్సరంపాటు తిరుపతిలో వాసమున్న భగవద్రామానుజులవారు శ్రీగోవిందరాజస్వామివారిని సేవించుకొని, అదే సమయానికి అలిపిరికి వచ్చేవారు. అలిపిరిలో తిరుమలనంబి రామానుజులకు రామాయణ రహస్యాల్ని ఉపదేశించేవారు. మళ్లీసాయంత్రానికి తిరుమల చేరుకొని శ్రీవారిని సేవించుకొనేవారు. ఇలా ఒక్కసంవత్సరకాలంలో, ఒక్కసారి చెప్పిన అర్థాన్ని మరోసారి చెప్పకుండా 18 మార్లు శ్రీమద్రామాయణ రహస్యార్థాల్ని భగవద్రామానుజులకు వివరించిన పండితవరేణ్యులు శ్రీశైలపూర్ణులు. ఇలా పారప్రవచనాలు సాగుతున్న దినాలలో ఒకరోజు తిరుమలనంబి "ఓ తిరుమల స్వామీ! వేంకటేశ్వరా! నీ పాదసేవాకైంకర్యం ఉదయం, సాయంత్రం మాత్రమే లభ్యమవుతున్నది. కాని ఈ పార ప్రవచనంవల్ల మధ్యాహ్నంపూట నీపాదసేవా భాగ్యం కలగడంలేదే!" అంటూ మనసులో ప్రార్థిస్తూ చింతించారట. ఆ రోజురాత్రే తిరుమలనంబికి కలలో శ్రీవేంకటేశ్వరుడు "ఓ తిరుమలనంబీ! ఏమాత్రం చింతించవద్దు. నీరామాయణం ప్రవచనాన్ని ఆపవద్దు. మధ్యాహ్నంపూట కూడ నీవు సేవచేసుకునేందుకువీలుగా మీరున్నచోటనే నాపాదాల దర్శనం కలిగిస్తాను." అంటూ మరునాడు వారు పాఠం కొనసాగించేచోట శ్రీవారి పాదపద్మాలు ప్రత్యక్షమయ్యాయట! అవే నేడు మనం అలిపిరిలో అందరం దర్శిస్తూవున్న తిరుమల శ్రీవారి పాదాలుగా చెప్పబడుతూ వున్నాయి.

ఇంతటి పరమభక్తుడైన తిరుమలనంబి జన్మస్థలంకూడ తిరుమల క్షేత్రమేనట! వారి జీవితాంతంవరకు శ్రీనివాసునికి సేవాకైంకర్యాదు

లను నిర్వహిస్తూ తిరుమలక్షేత్రంలోనే పరమపదం చేరుకొన్నారని చరిత్ర చెబుతున్నది.

తిరుమలనంబికి శ్రీనివాసుదు వ్యాధుని రూపంలో ప్రత్యక్షమై తీర్థాన్ని త్రాగిన రోజుకు గుర్తుగా ప్రతిసంవత్సరంకూడ ఆరోజును పురస్కరించుకొని ఒక ఉత్సవం జరుగుతూవున్నది. అదే "ఆకాశగంగా తీర్థోత్సవం". ఈ ఉత్సవాన్నే తమిళంలో "తన్నీరముదు ఉత్సవం" అంటారు. అంటే "అమృత జలోత్సవం" అని అర్థం చెప్పవచ్చు. ప్రతి సంవత్సరం వైకుంఠ ఏకాదశికి 11 రోజులు ముందుగా ప్రారంభమై, వైకుంఠఏకాదశికి తర్వాత 14 రోజులకు ముగిసేట్లుగా 25 రోజులపాటు తిరుమలలో శ్రీవారికి అధ్యయనోత్సవం జరుగుతుంది. ఈ అధ్యయనోత్సవం ముగిసిన మరునాడు తిరుమలనంబిగారి తిరుమంజన తీర్థకైంకరోత్సవం జరుగుతుంది. వంశపారంపర్యంగా ఆకాశ గంగాతీర్థకైంకర్యోత్సవంలో పాలుపంచుకొంటున్న తిరుమలనంబివంశీయులు ఆనాడు వెండికలశాలతో ఆకాశగంగతీర్థం తీసుకొనిరాగా, ఛత్రచామర బాజా భజంత్రీలతో బంగారు శ్రీపీఠంపై శ్రీస్వామివారు ఊరేగుతూ ఎదురేగి ఆ తీర్థకుంభములకు హారతులతో స్వాగతం పలికి శ్రీవారి ఏనుగుపై ఆల యంమహాప్రదక్షిణంగా ఊరేగింపబడుతూ, ప్రదక్షిణమార్గంలో పూజలందు కొంటూ చివరకు ఆలయంలో ప్రవేశించి ఆ కలశాలను సమర్పిస్తారు. గర్భాలయంలో అర్చకస్వాములు సుగంధ సమనోహార పుష్పాలతో నిత్యమూ విరాజిల్లే శ్రీనివాసుని మూలమూర్తి పాదపద్మాలను, బంగారుశఠారిని ఈ ఆకాశగంగాతీర్థంతో అభిషేకించి ధూపదీప చందనాలతో అర్చిస్తారు. పిదప మిగిలిన కలశాలను శ్రీవారికి పానీయంగా నివేదిస్తారు. పిదప తిరుమలనంబి వంశీయులను అర్చకస్వాములు చందన తాంబూలపురస్సరంగా సత్కరించి గౌరవిస్తారు. ఇలాగ భగవద్రామానుజుల కాలమునుండి ప్రతిసంవత్సరం ఆకాశగంగతీర్థతిరుమంజన కైంకర్య ఉత్సవం నేటికీ కొనసాగుతూవుంది.

ఇలా, పరమ నిష్ఠాగరిష్ఠులైన శ్రీవైష్ణవ ఆచార్యులచేతి పవిత్ర తీర్థాల్ని త్రాగటానికి ఎంతో ఆసక్తిని చూపిన శ్రీవేంకటేశ్వరస్వామివారు, ఒకానొక పామరుడైన అమాయకుడైన కుమ్మరివాని చేతి ఆహారాన్ని సయితం స్వీక రించడానికి అంతకంటె ఎక్కువ ఆసక్తినీ, ఆనందాన్ని కనపర్చాడు సుమా!

ఆ వివరాలేమిటో తెలుసుకునేముందుగా ఒక్కసారి భక్తవరదుడైన బాలాజీని బిగ్గరగా కీర్తిద్దామామరి!

*అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకా!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఇలా భక్తానుగ్రహశీలతకు అంకితమై నిత్యమూ తిరుమలనంబి వంశీయులచే సమర్పింపబడుతున్న ఆకాశగంగా జలాలతో అభిషేకింపబడుతూవున్న శ్రీస్వామివారి మూలవిరాణ్మూర్తి యొక్క శ్రీపాదపద్మాలక్రిందనే "విరజా నది" అనే దేవనదీ తీర్థం ప్రవహిస్తూవుందని ప్రతీతి!

ప్రతిరోజు ఉదయంపూట తోమాలసేవానంతరం తిరుమల శ్రీవారి మూలవిరాణ్మూర్తి పాదపద్మాలకు తులసిదళాలతో "ఓం వేంకటేశాయనమః, ఓం విరూపాక్షాయ నమః, ఓం విశ్వేశ్వరాయ నమః ....." అంటూ చివరగా "ఓం వేంకటాద్రి గదా ధరాయనమః" - అనే వేయి నామాలతో సహస్రనామార్చన జరుగుతుంది. ఈ వేయినామాలు బ్రహ్మాండపురాణాంతర్గతమైన శ్రీ వేంకటాచలమాహాత్మ్యం లోనివి...

తిరుమలలో ప్రతిరోజూ ఉదయం సహస్రనామార్చన పేరిట జరిగే ఈ ఆర్జిత అర్చనసేవలో తగిన రుసుమును చెల్లించి సుమారు ½ గంటపాటు శ్రీస్వామివారిని దర్శించవచ్చు. ఈ సేవావివరాలు, అవి జరిగే విధానం తర్వాత తెలుసుకుందాం.

[నిత్యము తిరుమలలో శ్రీవారికి జరిగే సహస్రనామార్చనలోని ఈ నామావళి; "ఓం విశ్వం విష్ణుః వషట్కారో... " అన్న విష్ణు సహస్రనామావళి - ఒక్కటి కానే కావు.]

ఆ తర్వాత మధ్యాహ్నంపూట, రాత్రి పూట, శ్రీవేంకటేశ్వరుని పాదపద్మాలకు తులసిదళాలతో వరాహపురాణాంతర్గతమైన శ్రీవేంకటాచల మాహాత్మ్యంలోని "ఓం వేంకటేశాయ శ్రీ వేంకటేశాయనమః, ఓం శేషాద్రి నిలయాయ శ్రీవేంకటేశాయనమః .... చివరగా ఓం శ్రీనివాసాయ శ్రీ వేంకటేశాయనమః" అనే (108) అష్టోత్తర శతనామావళితో అర్చన జరుగుతుంది. ఇలా ఉదయం, మధ్యాహ్నం, రాత్రి శ్రీవారిపాదాలకు అర్చన జరిగినవెంటనే, ఆ పాదాలమీది తులసిని తీసికొని శ్రీవారి వక్షఃస్థలంలోని

శ్రీమహాలక్ష్మిని "ఓం శ్రియైనమః, ఓం లోకధాత్ర్యైనమః .... చివరగా ఓం అబ్ధిజాయైనమః" అంటూ 24 నామాలతో (చతుర్వింశతి) అర్చిస్తారు.

ప్రతిసంవత్సరం ధనుర్మాసంలో మాత్రమే శ్రీవారి సహస్రనామార్చనాదుల్లో మారేడుదళాల్ని (బిల్వం) తులసికి బదులుగా ఉపయోగిస్తారు.

శ్రీస్వామివారి మూలవిరాణ్మూర్తి పాదపద్మాలను, ప్రతి మంగళవారంనాడు రెండవ అర్చనగా 108 బంగారు కమలాలతో పై అష్టోత్తర శతనామావళితో "అష్టదళ పాదపద్మారాధన" అన్న పేరుతో అర్చిస్తారు. ప్రతి మంగళవారం ఆర్జితసేవగా జరుపబడుతున్న ఈ అష్టదళపాద పద్మారాధనలో భక్తులు తగిన రుసుమును చెల్లించి దర్శించవచ్చు. వీని వివరాలు తర్వాత చర్చించుకుందాం.

శ్రీవారి పాదపద్మాలను సేవించటానికి ప్రతిరోజూ రాత్రి బ్రహ్మాది దేవతలు వస్తారని ప్రతీతి! అందువల్లే ఆలయం బంగారువాకిళ్లు మూసివేసే ముందుగా బ్రహ్మాది దేవతలు అర్చించేందుకు వీలుగా అర్చక స్వాములు శ్రీవారి పాదాలముందు బంగారు గిన్నెతో జలాన్ని వుంచుతారు. అంతేకాదు. శ్రీవారి పాదాలపై ఒక చందనపు ముద్దనుకూడ ఉంచుతారు. వీటితో శ్రీస్వామివారిని దేవతలు అర్చిస్తారు. సుప్రభాతానంతరం అర్చకులు ఈ తీర్థాన్నే బ్రహ్మతీర్థంగా భక్తులకు ఇస్తారు.

## శ్రీ వేంకటేశ్వరుని విందు

శ్రీవైకుంఠనాథుడైన శ్రీమన్నారాయణుడు సాక్షాత్తుగా దిగివచ్చి భూలోక వైకుంఠమైన వేంకటాచలక్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరునిగా కొలువై దర్శనమిస్తూ వచ్చిన నాటినుండి, ఎందరెందరో భక్తులతో మాటలాడినాడు ఆటలాడినాడు. మరెందరితోనో అనాదిగా ఆ స్వామివారు ఆటలాడిన ఆట లాడుతూవున్న, మాటలాడిన, మాటలాడుతూవున్న రసవత్తర సన్నివేశాలు అన్నీ భక్తులకు అందరికీ వీనులవిందును కలిగిస్తాయి. 'విందు' అనగానే పరమాశ్చర్యకరమైన వేంకటేశ్వరునివిందును గూర్చి ఒకానొక విషయం జ్ఞాపకం వస్తున్నది. అదేమిటంటే తిరుమలనంబి వంటి

పరమనిష్ఠాగరిష్ఠులైన శ్రీ వైష్ణవ ఆచార్యులచేతి పవిత్ర తీర్థాల్ని తాగటానికి ఎంతో ఆసక్తిని చూపిన శ్రీ వేంకటేశ్వర స్వామివారు ఒకానొక పామరుడైన నిరాడంబరభక్తుని మూకుడులోని సంకటి ముద్దను తినడానికి సయితం అంతకంటె ఎక్కువ ఆరాటాన్నీ, ఆసక్తినీ, ఆనందాన్నీ కనపర్చాడు సుమా! ఆ భక్తుడు ఇచ్చిన ఆతిథ్యాన్ని ప్రియాతి ప్రియంగా స్వీకరించి, ఆర్తిగా ఆనందంగా ఆరగించి, మనకందరికీ పుష్టినీ, తుష్టినీ, సంతుష్టినీ కలిగిస్తూవున్న వేంకటేశ్వరుని విందును గూర్చి వివరంగా తెలుసుకుందాం! తెలుసుకునే ముందుగా ఆ తిరుమల గోవిందుని నోరారా ఒక్కసారి కీర్తిద్దాం! మరి!

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## కురువనంబి

పూర్వం శ్రీస్వామివారు అర్చామూర్తిగా వెలసిన తొలినాళ్లలో, తొండమానుడు శ్రీనివాసునిపాద పద్మాలకు బంగారు తులసిదళాలతో సహస్రనామార్చన చేయించేవాడట. ఇలా ప్రతిరోజూ చేస్తూ "బంగారుతులసిదళాలతో సహస్రనామార్చన చేసే భక్తుడు ఎక్కడా వుండడు, లేడు కదా" అని గర్వపడ్డాడట. మరురోజు శ్రీవారి దర్శనానికి రాగా, తన బంగారు తులసి దళాలు పక్కకుతొలగి, ఆ పాదాలమీద "బంకమట్టిపూలు" కనిపించాయుట. విస్మయం చెందిన తొండమానుడు శ్రీస్వామివారిని ప్రార్థించగా "ఓయీ రాజా! నాకు అత్యంత ఆప్తులైన భక్తులు అనేకులు వున్నారు. అందులో భీముడనే కుమ్మరివాడు ఆలయానికి అవసరమైన కుండలు చేసికొంటూనే తన ఇంట్లోనే నన్ను కొయ్యబొమ్మగా ప్రతిష్ఠించి, భక్తిప్రపత్తులతో ఏమరక, వేళ్ల కంటిన మట్టిచేతనే పూలను చేసి పూజిస్తున్నాడు. అవే నీవిప్పుడు ఆనందనిలయంలో నా పాదాలమీద చూస్తున్న మట్టిపూలు తెలిసిందా. అతను ఇక్కడికి ఉత్తరంగా ఒక యోజన దూరంలో వున్నాడు. అతని మట్టిపూలే నాకు అత్యంత ప్రియమైనవి. కనుక నీవే నాభక్తుడవని అహంకరించడం తప్పు" అని మందలించినాడు.

వెంటనే తొండమానుడు రాజోచిత ఉపచారాలను వదలివేసి పాద చారుడై భీముని ఇంటికి వెళ్లి "మహాభక్తుడైన భీమునకు నమస్కారం" అని చెప్పి అలసటతో తెలివిదప్పిపడిపోయినాడు. అంతలో అక్కడ శ్రీనివాసుడు ప్రత్యక్షంకాగా కుమ్మరివాడు అనేక విధాల స్తుతించి, తన ఆతిథ్యం స్వీకరించమని ప్రార్థించాడు. శ్రీనివాసుడంగీకరించి "మట్టిమూకుడు"లో సంకటి తినగా, దేవతలు పుష్పవర్షం కురిపించారు. ఇంతలో స్వర్గం నుంచి వచ్చిన దివ్యవిమానంలో కుమ్మరి దంపతులు దివ్య శరీరాలతో వైకుంఠానికి వెళ్లారు. ఆనాడు కుమ్మరి భక్తుడివచ్చిన విందుకు గుర్తుగా ఆనాటినుంచి శ్రీవేంకటేశ్వరస్వామివారికి ప్రతిరోజు "ఓడు" అనే సగం పగిలిన మట్టి కుండలోనే నివేదన జరుపబడుతూ వుంది. ఆ కుమ్మర భక్తుడే పిదప 'కురువనంబి' అనీ 'కురవతినంబి' అనీ ప్రసిద్ధి కెక్కాడు.

చూశారా! తిరుమలేశుడు ఎంతటి భక్తప్రియుడో! కనుకనే తిరుమలను విడిచి పరుగెత్తుకుంటూ, మారుమూలపల్లెలోని కుమ్మరినంబి ఇంటికి వెళ్లి దర్శనమిచ్చి, మట్టి పెంకులో అతడిచ్చిన సంకటిని సంతృప్తిగా ఆరగించాడు. ఇంతమాత్రమేకాదు. ఆనాడు ఆ సామాన్య భక్తుడిచ్చిన ఆతిథ్యానికి గుర్తుగా బ్రహ్మాండనాయకుడైన శ్రీవేంకటేశ్వరుడు తన బంగారుమేడ (ఆనందనిలయం)లో ఇప్పటికీ, నేటికీ ప్రతినిత్యమూ కూడ మట్టిపెంకు (ఓడు)లోనే ఆరగించే నియమాన్ని పాటిస్తూ తన భక్త ప్రియత్వాన్ని చాటుకుంటూనే వున్నాడు. తిరుమల శ్రీవారికి ఎన్ని గంగళాల ప్రసాదాలు నివేదన జరిగినా, అవన్నీ కులశేఖరపడిగడపకు ఇవతలే ఉంచబడతాయి. కాని సగం పగులగొట్టబడిన మట్టిపెంకు (ఓడు, ఓటికుండ)లోని నైవేద్యం మాత్రమే ఆనందనిలయంలోనికి తీసికెళ్ల బడుతుంది. శ్రీస్వామివారు అందులోని ప్రసాదాన్ని అత్యంతప్రియంగా తృప్తిగా ఆరగిస్తాడు మరి! ఇందుకుగాను ఎప్పటి కప్పుడు కొత్తకుండలనే ఉపయోగిస్తారు. అందువల్లే తిరుమల స్వామి "తోమనిపళ్లాలవాడు" అని ప్రసిద్ధిచెంది, తద్ద్వారా, కుమ్మరభక్తుని స్మరింపచేస్తూవున్నాడుసుమా!

ఇలా అనంతకాలాంతరంలో ఎందరినో ఎన్నో విధాల తరింపజేసిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి పాద పద్మాలను గూర్చి స్మరించుకుంటూ దర్శించు

కుంటూ వున్నాం కదా! దర్శనంతోపాటు, శ్రీపాదసేవచేసి కొన్న ఎందరో మహనీయులనుగూర్చి తెలియ వచ్చినంతవరకు చర్చించుకుంటున్నాం కదూ ఏదీ ఒక్కసారి ఆ సప్తగిరీశుని, ఆశ్రిత భక్తవరదుని మనసారా కీర్తిద్దాం.

*ఏడుకొండలవాడా! వేంకటరమణా! గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# వెంకన్న లీలలు

ఈ వేంకటేశ్వరుడు ఒక వింతదొంగ. ఒక మాయగాడు. ఎల్లప్పుడూ పరాచికా లాడుతూ వుంటాడు. మాయలు చేస్తూవుంటాడు. తాను ఆనందిస్తూవుంటాడు. మనల్ని ఆనందింపచేస్తూ వుంటాడు. ఈ దొంగచేష్టలు ఈ మాయబుద్ధులు ఈనాటివా ఏమన్నానా! ద్వాపరయుగంలో నాటివి కదా. ఆనాడు అమాయకులైన గొల్లలచేత నోరారా తిట్టించుకు న్నాడు గోవిందుడు! తిట్టించుకోవడమేగాక దెబ్బలుకూడా తిన్నాడు ఆ గోపాలుడు! మాయలుచేస్తూ అలా తిట్టించుకోవడం అంటే బలేఇష్టం ఆ వెర్రి గోపాలునికి! దెబ్బలు తినడం అంటే కూడా బలే సరదా ఆ నల్లని కన్నయ్యకు! మరి ఆనాటి బుద్ధుల్ని అలాగే పుణికి పుచ్చుకున్నట్టి ఈ ఏడుకొండలమీది వెర్రి గోవిందుడు కూడా తక్కువవాడా! ఈ కలియుగంలో కూడా ఒక పరమభక్తుని (తిరుమలనంబి) చేత నోరారా తిట్టించుకొని మరీ తృప్తిగా నీళ్లు తాగాడు మరి! అంతమాత్రమేనా! కాదు కాదు. మరో భక్తుని దగ్గరికి మారు (మాయ) రూపంతో వెళ్లి వెట్టికి (కూలి లేకుండా) చాకిరీచేశాడు. కూలిడబ్బులు తీసుకోకుండా ఊరికే చాకిరీ చేశాడు. కూలిడబ్బులు లేకుండా ఊరికే చాకిరీ చేస్తే చేశాడు, కాని అలావెట్టికి పనిచేసినందుకు గాను, ప్రతిఫలంగా మొహంవాచేట్లు బాగా దెబ్బలుకూడా తిని గాయం చేసుకున్నాడు తిరుమల వెంకన్న! తన సుందర వదనార విందంపై ఆనాడు ఆ భక్తుడు చేసిన గాయం తాలూకు మచ్చను అందంగా పచ్చకర్పూరంతో తీర్చిదిద్దుకొని (ఫ్రేంకట్టినట్లు) మురిపెంగా నేటికీ ప్రదర్శిస్తూ తద్వారా, సమ్మోహనం కలిగించే తన దివ్యదేహానికి మరింత నిగ్గులు పెట్టుకుంటూ తన భక్త ప్రియత్వాన్ని చాటుకుంటూ వున్నాడు సుమా! మొగంపై వున్న ఆ మాయనిమచ్చను గూర్చి ముచ్చట

గొలిపే వింతగాథను తెలుసుకొనేముందుగా ఆనందనిలయునికి సాగిలబడి పొర్లు దండాలు పెడదాం!

*పొర్లుదండాలవాడా గోవిందా! గోవింద!!!*

## అనంతాళ్వాన్

పూర్వం శ్రీరంగక్షేత్రంలో భగవద్రామానుజులు (క్రీ.శ. 1017-1137) శ్రీ వైష్ణవ విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని శిష్యులకు ఉపదేశిస్తూ ఒకనాడు శరణాగతి, ప్రపత్తి మార్గాలతో కూడిన సేవాకైంకర్యాలను గురించి విశిష్టంగా తెలియజేశారు. ఇంకా, వారు, శ్రీరంగక్షేత్రం భోగమండపమనీ, కంచి త్యాగ మండపమనీ, వేంకటాచలక్షేత్రం పుష్పమండపమనీ ఇలా ప్రసిద్ధి పొందాయనీ, పుష్పమండపమైన తిరుమలక్షేత్రంలో అత్యంత పుష్పప్రియుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారికి పుష్పమాలాకైంకర్యం చెయ్యడం భగవత్ప్రీతి కరమని వివరిస్తూ, శాశ్వతంగా తిరుమలలో వుంటూ అక్కడి చలికి, వర్షానికి, కీటకాలకు ఓర్చుకొంటూ, తోటలను పెంచుతూ, వేంకటభగవాను నికి పుష్పమాలా సమర్పణం చెయ్యగలవారెవరైన వున్నారా? అంటూ తన శిష్యులను ప్రశ్నించారు. ఈ ప్రశ్నకు శిష్యులందరూ ఒకరి మొగాలొకరు చూసుకుంటూ నసుగుతున్న తరుణంలో అనందాళ్వాన్ (అనంతాచార్యులు) అనే శిష్యుడు లేచి చేతులు జోడించి 'గురువర్యా! నేను అందుకు సిద్ధంగా వున్నాను అనుజ్ఞ ఇవ్వండి' అంటూ వినయంగా పలికినాడు. వెంటనే రామానుజులు 'భళీ! అనంతా! నీవే నిజమైన మగవాడివి' (పురుషుడివి), (ఆణ్‌పిళ్లై) అని పొగడుతూ ఆశీర్వదించి తిరుమల వెళ్లు టకు అనుమతి నిచ్చారు. ఆనాటినుంచి అనంతాచార్యులు 'ఆనందాణ్ పిళ్లై' అనీ, "అనంతపూరుషుడు" అని ప్రసిద్ధి పొందినాడు.

గురువే తనపాలిటి దైవంగా తలంచిన ఆనందాళ్వాన్, రామానుజులవారి ఆజ్ఞను శిరసావహించి భార్యతోకూడ తిరుమల చేరుకొన్నాడు. అత్యంత నిష్ఠతో వివిధ రకాల పూలను సేకరిస్తూ శ్రీ వేంకటేశ్వర స్వామివారికి మాలాకైంకర్యం చేయటానికి బద్ధకంకణు డయ్యాడు. అప్పటికే వేంకటాచల క్షేత్రంలో వుంటూ శ్రీనివాసభగవానునికి తీర్థ కైంకర్యాల్ని చేస్తూవుండిన

వృద్ధులైన తిరుమలనంబిగారిచేత, తిరుమల మీది పుష్పవనాలను గూర్చి, శ్రీ వేంకటేశుని పుష్పప్రియత్వాన్ని గూర్చి అనంతాచార్యులు విన్నాడు. అంతమాత్రమేకాక, భగవద్రామానుజుల పరమగురువూ, తిరుమలనంబిగారి గురువూ అయిన యామునాచార్యులవారు కూడ కొంతకాలంపాటు శ్రీనివాసునిదివ్యసన్నిధిలో వుంటూ పుష్పమాలా కైంకర్యాన్ని నిర్వహించి ధన్యులయ్యారని కూడ అనంతాళ్వాను విని పరమానందపడ్డాడు. తన గురువులైన రామానుజాచార్యులవారి ఆదేశంచేత తాను చేస్తూవున్న ఈ పుష్ప కైంకర్యాన్ని, పరమ గురువులైన యామునాచార్యులవారి పేరుతోనే నిర్వహింప సమకట్టి తిరుమల శ్రీవారిఆలయం ఆవరణలోనే 'యమునోత్తర' అనే పుష్పమండపాన్ని ఏర్పాటు చేశాడు. ఆనాటి నుంచి ఆ "యామునోత్తర" పుష్ప మంటపంలోనే వివిధరకాలైన పూలదండల్ని కూర్చి అనంతాళ్వాన్ ఉదయం, సాయంత్రమూ, ఇలా ప్రతిరోజూ రెండుపూటలా జరిగే శ్రీ స్వామివారి తోమాలసేవకు గాను తాను శ్రద్ధగా తయారు చేసిన పూలమాలల్ని సమర్పించేవాడు. 'యమునోత్తరై' అని పిలువబడే ఈ పుష్పమండపం లేదా "పూలఅర"ను గూర్చి ఆ మండపంలో తయారుచేసే పూలమాలల్ని గూర్చి మనం ఇంతకుముందే సంపంగి ప్రదక్షిణం చేసిన తరుణంలో వివరంగా తెలుసుకున్నాం కూడ.

ఇలా ఎంతో ఆచార్యనిష్ఠతో, దైవభక్తితో తిరుమలేశుని సేవచేస్తున్న అనందాళ్వాన్, ఇంకా ఎక్కువగా వివిధ రకాలైన రంగు రంగులతో సువాసనలు విరజిల్లే పూలతో శ్రీవారికి కైంకర్యం చేయ సంకల్పించాడు. అందుకుగాను ప్రత్యేకంగా ఒక పుష్పోద్యాన వాటికను పెంచదలచినాడు. దానికి నాందిగా ఒక పెద్ద చెరువును నిర్మించ తలపెట్టి, తాను, తనభార్యతో మాత్రమే ఆ చెరువును తవ్వడానికి పూనుకున్నాడు. దైవం కోసం చేసే ఈ నిర్మాణంలో, ఇతరులెవ్వరి సహాయ సహకారాలను ఏమాత్రం కోరకుండా, అనంతాళ్వాన్, గర్భవతి అయిన భార్యతోకూడా దీక్షామగ్నుడయ్యాడు. ఆయన తిరుమల శ్రీవారి ఆలయానికి దక్షిణం దిక్కుగా కొద్ది దూరంలో పెద్ద చెరువును నిర్మించడానికి ప్రారంభించాడు.

ప్రతిరోజు ఉదయం పుష్పమాలాకైంకర్యాదులు ముగిసిన తదుపరి తీర్థ ప్రసాదాలు స్వీకరించినపిదప భార్యతోకూడ అనంతాళ్వాన్, గుంట తవ్వడానికి ప్రారంభించేవాడు. అతను గడ్డపార (గునపం)తో మట్టి తవ్వి గంపలకెత్తి ఇస్తూవుండగా అతనిభార్య ఆ మట్టిని దూరంగా పోస్తూ వుండింది. ఇలా ఈ కార్యక్రమం దీక్షగా కొన్ని రోజులు కొనసాగింది. చాలా వ్యయప్రయాసలతో, సడలని పట్టుదలతో, దీక్షతో కేవలం భార్యా భర్తలు మాత్రమే చేస్తూవున్న మట్టి పనిని చూసి సంతోషించిన శ్రీ వేంకటేశ్వరుడు, వారికి తానూ కొంతసహాయం చేయదలచినాడు. పన్నెండేళ్ల బాలునిగా అనంతార్యుని దగ్గరి కెళ్లి "అయ్యా నేనూ తమ పనిలో కొద్దిగా సహాయం చేస్తానండీ" అని పదే పదే వెంటబడి అభ్యర్థించాడు. ఆ మాయాబాలుని స్ఫురద్రూపానికి ఆశ్చర్యపోతూ ఆనందాళ్వాన్ "ఓ బాలకా! మేము ఈ పనిని మా గురువుగారి ఆనతిచే నిర్వహిస్తూవున్నాం. మేము చేస్తూవున్న ఈ దైవకార్యంలో ఇంకొకళ్లు పాలుపంచుకోవటం మాకు ఏమాత్రం ఇష్టంలేదు. అందులో కూలి డబ్బులు ఇవ్వకుండా, కేవలం సహాయాన్ని స్వీకరించడం అస్సలు ఇష్టం లేదు. అందువల్ల మా పనికి ఎలాంటి విఘ్నం కలిగించకుండా, మమ్మల్ని ఏమాత్రం విసిగించకుండా ఇక్కడి నుంచి వెంటనే వెళ్లిపో, తెలిసిందా" అంటూ తీవ్రంగా కసురుకున్నాడు. బాలుడైన ఆ బాలాజీ, అతని దృఢ దీక్షకు లోలోపల మరింత ఆనందించాడు. వీరికి ఎలాగైనా కొంతసేపైనా తోడుపడాలి అని అనుకున్నాడు.

ఇలా కొన్నిరోజులు చెరువు తవ్వేపని చురుగ్గాసాగింది. ఒకరోజు మధ్యాహ్నం పూట మండుటెండలో అనంతార్యులు మట్టిని తవ్వి గంపకెత్తి ఇవ్వడం, అతని భార్య ఆమట్టిని దూరంగా పోసి, మళ్లీ రావడం, ఇదేతంతు. నిండుచూలాలు అందులో ఎండ. చాలా నెమ్మదిగా, ఆయాసంతో నెమ్మదిగా అడుగులో అడుగు వేసికొంటూ దూరంగా మట్టి పోసిరావడం. భార్య పరిస్థితిని గమనించని అనంతాళ్వాన్ దృష్టి అంతా చెరువుపని మీదే. ఎప్పుడా చెరువు తవ్వటం పూర్తి అయ్యేది. ఎప్పుడెప్పుడా ఆ చెరువులో నీళ్లు వచ్చేది. ఎప్పుడెప్పుడా రంగురంగుల పూలు పూయించేది. ఎప్పుడెప్పుడా సువాసనలు గుబాళించే పుష్పాలు పండించేది. ఎప్పుడెప్పుడా వాటిని అందమైన

మాలలుగా తీర్చిదిద్దేది. ఎప్పుడెప్పుడా వాటిని ఆ శ్రీనివాసుని నిలువెల్ల అలంకరించేది. ఎప్పుడెప్పుడా పుష్పాలంకారంలో పులకింపజేసే ఆ ఘన వేంకటేశుని దివ్యమూర్తిని కన్నులారా దర్శించేది. ఇలా క్షణం క్షణం అనునిత్యం కొత్త కొత్త ఊహలతో ఆనందనిలయుని గూర్చిన అలంకారపు ఆలోచనలతో తలవంచి మట్టిని తవ్వడంలో నిమగ్నమై వుండినాడు పరమ భక్తుడైన అనంతాళ్వాను. ఈయన ఆలోచన ఇలా సాగుతోంటే ఆయనను మించింది ఆయన భార్య అన్నట్లు ఆయమ "భర్తే దైవం కదా భార్యకు. భర్తకు సేవ చెయ్యడమే భార్య యొక్కవిధి. అందులోను ఆనందనిలయుని అంతరంగిక భక్తుడు, ఆచార్య నిష్ఠకలిగిన భర్తకు సేవ చెయ్యడం, సాక్షాత్తు భూలోకవైకుంఠనాధుని సన్నిధిలో, ఆ దేవదేవుని సేవలో నిమగ్నమై జీవితాన్ని పండించుకుంటూ వున్న భర్తకు సేవచేసేభాగ్యం ఎందరికి లభిస్తుంది? ఎవరికి లభిస్తుంది? ఏ పూర్వపుణ్య విశేషంవల్లనో అది తనకు దక్కింది. అందువల్ల ఎంతకష్టమైనాసరే. ఎంతబాధ అయినాసరే. ఓపిక వున్నంత వరకు, ఒళ్లు ఓపినంతవరకు పని చేస్తాను. ఆపైన శ్రీ వేంకటేశుడే వున్నాడు. అనుకొంటూ తొమ్మిది నెలల గర్భ భారాన్ని మోస్తూ ఆయాసంతో మెల్లగా మెల్లమెల్లగా వేసే ప్రతి అడుగులోను అడుగడుగులోనూ, ఆ అడుగడుగు దండాలవాణ్ణి స్మరిస్తూ ఒక అవ్యక్తానందాన్ని మనసా వాచా కర్మణా జుర్రుకొంటోంది ఆ మహాఇల్లాలు.

ఇలాంటి సమయంలోనే ఆ లీలామానుషబాలుడు మట్టితట్టతో భారంతో అడుగులేస్తున్న అనంతాళ్వారుల భార్యకు ఎదురువెళ్లి "అమ్మా! ఆ మట్టిగంపను ఇటు ఇవ్వు. దూరంగా పోసి ఇస్తాను" అని మధ్యలోనే అందుకొన్నాడు. ఆమె ఆ పిల్లవాని చొరవకు అడ్డుచెప్పలేకపోయింది. ఇలా ఆయమ్మకు ఎదురువస్తూ త్వర త్వరగా మట్టిని దూరంగా పోస్తూ, ఖాళీ గంపల్ని అందిస్తూవుండినాడు. ఇలా చాలసేపు గడిచింది. మట్టిని తవ్వడంలో నిమగ్నమైన అనంతార్యులు, మరి కొంత సేపటికి తాను మట్టి తవ్వకముందే భార్య మట్టిగంప కోసం వేచి వుండడం ...ఆమె మట్టిని పోసి వెంట వెంటనే రావడం గమనించి తలెత్తి చూచి భార్యను కారణ మడిగినాడు. ఆయమ భయంతో బెదురు చూపులు చూస్తూ, ఆ

బాలుడు మధ్యలోనే ఎదురువచ్చి, చేస్తూవున్న సాయాన్ని గూర్చి చెప్పింది. అంతే అనంతాళ్వాను ఉగ్రుడై తవ్వుతున్న గుంటనుండి పెకివచ్చి "ఓరీ! బాలకా! నీ సాయం ఎవడికి కావాల్రా! మేము చేస్తూవున్న స్వామివారి కైంకర్యంలో నా భార్యను నమ్మించి, మోసంతో పాలు పంచుకుంటావ్రటా!" అంటూ తీవ్రమైన కోపంతో గునపాన్ని (గడ్డపారను) పైకెత్తి కొట్టడానికి ఆ కుర్రవాని వెంట పడ్డాడు. ఆ పిల్లవాడు భయంతో చేతిలోవున్న మట్టితట్టను అక్కడే విసిరేసి పరుగు లంకించుకున్నాడు. అయినా అనంతాచార్యులు ఆగలా. తరుముతూ ఆ పిల్లవాని వెంటబడ్డాడు. ఆ పరుగులో ఆ పిల్లవాడు చేతికి అందుతున్నట్టే వున్నాడు కాని జారిపోతూ వున్నాడు. దీంతో మరీ రెచ్చిపోయిన అనంతాళ్వాను తనచేతిలోని గడ్డపారను ఆ బాలునిపైకి విసిరివేశాడు. అంతే ఆగునపం బాలుని గడ్డానికి తగిలి నెత్తురు చిమ్మింది. బొట బొట కారుతున్న రక్తంతోనే ఆ బాలుడు పరుగెత్తుకుంటూ ఆనందనిలయంలో జొరబడి కనపడకుండా దాక్కున్నాడు. వెదకివేసారిన అనంతార్యుడు ఈ తిరుమల కొండపైన మళ్ళీ అయినా కనపడడా! కనపడక ఎక్కడికి పోతాడు కుర్రవెధవ. అప్పుడు వాని పనిపట్టవచ్చు అనుకుంటూ కోపాన్ని దిగమింగి వెనుదిరిగినాడు.

సూర్యాస్తమయమయినందువల్ల సాయంసంధ్యావందనాదులు ముగించుకొని పిదప శ్రీవారి దర్శనంకోసం ఆలయంలో ప్రవేశించినాడు అనంతార్యులు. ఆ సమయంలోనే ఆనందనిలయంలో శ్రీ స్వామివారి అర్చకుల మధ్య రేగిన ఒక కలకలాన్ని చూచి కారణమడిగినాడు. అర్చకస్వాములు శ్రీ వేంకటేశ్వరస్వామి వారి చుబుకం (గడ్డం) మీది గాయాన్నీ; ఆ గాయం నుండి ధారగా కారుతున్న నెత్తురునూ చూపెడుతూ ఆ గాయానికి పచ్చకర్పూరాన్ని కొద్దిగా అద్దుతూ, ఇది ఏ భక్తునితో ఆడిన లీలావినోద ఫలితమో అని సందేహాన్ని వెలిబుచ్చారు. అంతే అనంతాచార్యులవారికి పరిస్థితి అంతా త్రుటిలో అర్థమయ్యింది. ఆందోళనగా శ్రీస్వామివారి ముఖార విందాన్ని చూస్తూ, తాను చేసిన ఘోరమైన తప్పును క్షమించమని ప్రార్థిస్తూ ప్రాధేయపడినాడు. తిరుమలేశునిముఖంలో లీలగా ఆ మాయా బాలుని ముఖం గోచరించి, దోబూచులాడి చిరునవ్వులు చిందించింది.

అంతమాత్రమేగాక ఆ శ్రీ వేంకటేశ్వరస్వామివారు (మూలవిరాణ్మూర్తి) "ఓయి అనంతార్యా! ఎంతమాత్రం చింతించవలసిన పనిలేదయ్యా! నీవు చేస్తూవున్న సేవాకైంకర్యాలను లోకానికి చాటడానికి నేను చేసిన లీలా విశేషమే ఇది! నీవు నా చుబుకం మీద చేసిన గాయానికి గుర్తుగా "మాయని మచ్చ" ఏర్పడుతుంది. ఆ మచ్చపై నేటినుండి పచ్చకర్పూరపు చుక్కను చక్కగా అలంకరించుకుంటూ, తద్వారా భక్తులందరిచేతా నిన్ను స్మరింప చేస్తూ, అందరికి పరమానందాన్ని కలిగిస్తాను". అంటూ ఆనాటి నుండి ఆ పచ్చకప్పూరపుచుక్కతో తిరువేంకటప్రభువు, చిరునవ్వులు చిందించే తనముఖారవిందానికి మరింత మెరుగులు దిద్దుకుంటూ మనం దరికీ, ఒక వింతమైమరపును కలిగిస్తూవున్నాడు! మనకు అందరికీ ఒక వింత దివ్యానుభూతిని కలిగిస్తూ వున్నాడు! మానవులందరినీ తనమోము దర్శనంతో మురిపిస్తూ వున్నాడు! ఇలా ఎన్నోవిధాల.. ఎన్నెన్నో విధాల ఎందరినో ఎందరెందరినో ఆనందపరుస్తూ వున్న ఏడుకొండలవెంకన్న లీలల్ని మహిమల్ని తాళ్లపాక అన్నమాచార్యులు ఇలా కీర్తించినాడు.

*కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు*
*కొండలంత వరములు గుప్పెడు వాడు*

కుమ్మరదాసుడైన కురవరతినంబి
యిమ్మన్న వరములెల్ల నిచ్చినవాడు
దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కురవర్తి
రమ్మన్న చోటికి వచ్చి నమ్మినవాడు

అచ్చపు వేడుకతోడ ననంతాళువారికి
ముచ్చిలి వెట్టికి మన్ను మోచినవాడు
మచ్చిక దొలక దిరుమలనంబి తోడుత
నిచ్చ నిచ్చ మాటలాడి నొచ్చినవాడు.

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఆ తర్వాత శ్రీవేంకటేశ్వరస్వామివారి సంపూర్ణ అనుగ్రహానికి పాత్రుడైన అనంతాళ్వానులు త్వరగా చెరువును తవ్వటం పూర్తిచేశాడు. ఆ తటాకం చుట్టూ చక్కని పూలతోటను పెంచినాడు. తన గురువు గారైన భగవద్రామానుజులవారిని నిత్యం స్మరింపజేసే విధంగా, ఆ నందనోద్యానవనానికి "శ్రీరామానుజోద్యానవనం" అని పేరు పెట్టినాడు. వివిధ రకాలయిన సుగంధ సుకుమార సుమనోహర సువర్ణ పుష్పాలతో విలసిల్లే ఆ సుందర వనాన్ని నయనాభిరామంగా, ప్రకృతి రామణీయకంగా తీర్చిదిద్దినాడు. ఆనాటి నుంచి అనందాళ్వానులు ఆ చెరువుచుట్టూ పెంచిన పుష్పవనం పుష్పప్రియుడైన ఆనందనిలయుని పుష్పకైంకర్యంలో పాలుపంచుకోవడమే కాక తిరుమల దివ్యక్షేత్రానికే కొత్త కొత్త అందాల్ని చేకూరుస్తూ, ఒక ప్రధాన ఆకర్షణగా విరాజిల్లింది. అంతమాత్రమేకాదు ఈ అనంతాళ్వానుల తోట సాక్షాత్తు అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల విహారస్థలమై వర్ధిల్లింది. ప్రతిరోజు, ప్రతిరాత్రి శ్రీస్వామివారు అమ్మవారు కలసి ఆ ఉద్యానవనంలో సంచరిస్తూ, ఆ తోటలోని చెట్టుచెట్టునూ స్పృసించి పలకరించేవారట! పువ్వు పువ్వును ఆఘ్రాణించి ఆస్వాదించి ఆనందించేవారట! ఇలా శ్రీ లక్ష్మి వేంకటేశ్వరుల సరస వినోద విహార స్థలమైన ఈ నందనోద్యానవనం మరో రసవద్ఘట్టానికి వేదిక అయి అలరారింది! ఆ పూలతోటలో ఆనాడు జరిగిన రసవత్తరమైన సన్నివేశానికి గుర్తుగా, నేటికీ ప్రతి సంవత్సరం అదేరోజున శ్రీదేవి భూదేవులతో కూడిన శ్రీస్వామివారు ఛత్రచామర, బాజా భజంత్రీలతో వృషగజ, తురగ, భక్త బృందాలు ముందు నడుస్తుండగా, వేదమంత్రోచ్చారణలతో అనందాళువానుల తోటకు వేంచేస్తూ, తన భక్త ప్రియత్వాన్ని తెలియజేస్తూ, చాటుతూ వున్నాడు సుమా!

మరి ఆనాడు ఆతోటలో జరిగిన సుందర సన్నివేశం ఏమిటో!

అనందాళ్వానులు తాను, తనభార్య ఇద్దరూ కలసి ఎంతో వ్యయ ప్రయాసల కోర్చి నిర్మించిన 'రామానుజపుష్పవాటిక'లో రకరకాల రంగురంగుల పువ్వులను పండించేవాడు. ప్రతిరోజు ఆ తోటనుంచి ఏరి ఏరి సేకరించి కూర్చిన పూలమాలలన్ని శ్రీస్వామివారి ఆలయంలో సమర్పించేవాడు. ఆ పుష్పమాలల్ని ప్రీతిగా ఆపాదమస్తకం నిలువెత్తుగా అలంకరించుకొన్న

అందగాడు ఆనందనిలయుడు ఎప్పటికప్పుడు కొత్త కొత్త సోయగాలతో సొంపులతో ప్రకాశిస్తూ భక్తులకు మరింత అందచందాలతో దర్శనమిస్తూ మురిపించేవాడు.

తిరుమల కొండలో, అనంతార్యులవారి ఆలోచనలన్నీ ఆనందనిలయుని మీదే. ఆరామముగురించే. దినమంతా పూలతోట... పూలమాలలు ... పుష్పమాలాలంకరణల గూర్చే చింత. మరో ఊసులేదు. మరో ఉలుకులేదు. పలుకులేదు. శ్రీనివాసుని పాదాలకు ఏపూలు సమర్పిస్తే బాగుంటుందో! ఈ పూలదండలు వక్షఃస్థలంలోని అమ్మవారలకు బాగా నప్పుతాయి. శ్రీవారి కంఠసీమలో ఈ మాలల్ని అలంకరిస్తే అందంగా ఎందుకుండదు! సువాసనలు గుబాళించే ఈ సుమాలు సప్తగిరీశుని శిరోమణిపై (కిరీటంపైన) అమరిస్తే అబ్బ! ఆ అందమే వేరు. ఆచందమే వేరు... ఇలా రోజంతా అనేకానేకమైన అంతులేని ఆలోచనలతో మునిగి తన్మయుడై క్షణం క్షణం తనతోటలోని పూలగురించీ తాను కూరుస్తూవున్న పూలదండల గురించీ ఆ దండలను అలంకరించుకున్న అడుగడుగుదండాలవాని అందాన్ని గూర్చి స్మరించేవాడు అనందాళ్వాను.

నిత్యమూ ఇలాంటి ఆలోచనలతోనే తనతోటలో చెట్లకు పాదులు తీస్తాడు, పూలమొక్కల్ని తీర్చుతాడు. లతలను చక్కగా పాకిస్తాడు. చెరువు నుండి నీళ్లుతోడి పారిస్తాడు. కొత్త కొత్త చెట్ల నారులు చల్లుతాడు. ఏ మూల ఏమొక్క మారాకు వేసినా ఆయన మైమరచేవాడు. చిగిరించే చెట్లను చూచి ఆయన మనస్సుకూడ చిగిరించేది. ఆ చెట్ల చిటారు కొమ్మల్లో కనిపించే అరవిరి మొగ్గల్ని చూస్తూ ఆనందపడతాడు. వికసించి విరియబూసే రంగు రంగుల పువ్వుల్ని చూసి ఆయనా పులకించేవాడు. ప్రతి చెట్టును ప్రేమగా స్పృశించేవాడు. ప్రియంగా పలకరించేవాడు. ఆ తోటలోని ప్రతిచెట్టుతోను, తీగతోను మనసు విప్పి మౌనంగా మాట్లాడేవాడు. అనంతాళ్వానుల నేస్తాలన్నీ ఆ తీగలూ, ఆ చెట్లూ, ఆ మొక్కలూ. వీనితోపాటు అక్కడ తిరిగే కుందేళ్లూ, సీతాకోకచిలుకలు, రామచిలుకలు, కోకిలమ్మలు... ఇవే అతని దోస్తులు. ఇలా అనందాళ్వాను నిరంతరం శ్రమించి పండించి గుదికుచ్చిన పూలమాలల్ని అలంకరించుకున్న ఆనంద

నిలయుడైన శ్రీవేంకటేశ్వరుడు రోజుకొక్క విధంగా దర్శనమిచ్చేవాడు. పూటకొక రీతిగా గోచరించేవాడు. ఇలా ఆ గోవిందుడు వింత వింత మెరుపులతో మెరుగులతో మైమరపించేవాడు.

ఇలా సాగుతున్న తరుణంలో సంతోషించిన సప్తగిరీశుడు, తనకు సమర్పించిన, సమర్పిస్తూవున్న సుమనోహర సుమమాలల్ని చూసి, ఈ దండలే ఇంత అందంగావున్నాయి. ఇక అనంతాళ్వానులు పెంచుతున్న పూలతోట ఎంతరమణీయంగా వుంటుందో! చూచి తీరవలెనని సంకల్పించి నాడు. ఒకనాటి రాత్రి ఆలయంలో ఏకాంతసేవా కార్యక్రమాలు ముగిసిన తరువాత అర్చకస్వాములు బంగారువాకిళ్లను బిగించి వెళ్లిన తర్వాత ఆనంద నిలయుడు అలమేలుమంగతోకూడ అనంతాళువానుల తోటలో ప్రత్యక్షమై సంచరించినాడు. ఆ తోట తీరుతెన్నులకు పరవశించిపోయారు. వాళ్లు ఆ వనమంతా సరస సల్లాపాలతో విహరించారు. శ్రీనివాసుడు పులకించిపోతూ ప్రతిపువ్వును వాసన చూస్తాడు. మరి కొన్నింటిని ఆ పరంధాముడు పద్మావతిసిగలో తురిమి ఆనందిస్తాడు. అదిగో ఆ పుష్పం ఎంత బాగుందో! అంటూ గిల్లి వాసనచూస్తాడు. అలమేలుమంగ కొప్పులో అలంకరిస్తాడు. వాటిని తీసివేసి కొత్తవాటిని అలంకరిస్తాడు. కొన్నింటిని తానూ ధరిస్తాడు. మరి కొన్నింటిని అఘ్రాణిస్తాడు. అఘ్రాణించిన పూలను విసరివేస్తాడు. ఇక అమ్మవారుకూడా ఏమాత్రం అయ్యవారికి తీసిపోలా. ఆమె కూడా "అదో ఆ మొక్క ఎంత ముద్దుగా వుందో! ఇటు చూడండి. ఆ తీగ ఎంచక్కా అల్లుకుందో! ఈ పూలవాసన చూశారా, అబ్బ ఎంత గుబాళింపో! అంటూ ప్రతి మొక్క దగ్గరికి వెళ్లి పువ్వులను తెంచి తాను వాసన చూసి, తన స్వామికి అందిస్తుంది. ఇలా ఆ రాత్రిపూట ఆ తోట అంతా ఇద్దరూ చెట్టాపట్టాలేసుకొని తిరిగి తిరిగి తెల్లవారుజామున, సుప్రభాత వేళకు ఆ దివ్యదంపతులు ఆనందనిలయం చేరుకున్నారు.

తెల్లవారిన తర్వాత పుష్పసేకరణకై తోటలో ప్రవేశించిన అనందా ళ్వానుకు ఆనందం అడుగంటింది. మతి పోయి నట్లైంది. ఎక్కడ చూసినా నలిపివేసిన పువ్వులు ... వాడినపూలు ... విరిగిన కొమ్మలు ... వాలినమొగ్గలు తెగిపడిన ఆకులు ఉమిసిన తమలపాకుసారలు.

అంతే నిశ్చేష్టుడయిన అనంతార్యులు తోటంతా పరికించి చూచి చాల ఉగ్రుడయ్యాడు. ఊగిపోయినాడు. ఎవరో దొంగవెధవలు పూలుకోసుకొని వెళ్లారు. పూలు కోస్తే కోశారు. కాని ఇలా తోటంతా నాశనం చేశారే. చిందర వందరచేశారే. దుర్మార్గులు, దుష్టులు పాపాత్ములు పాపిష్టులు అని ఇలా మనసులో ఆక్రోసిస్తూ వారిని అనేక విధాలుగా నిరసించాడు. ఇలా చాలాసేపు తోటంతా కలయు తిరిగి చింతిస్తూ ప్చ్! అని నిట్టూర్పులు విడుస్తూ, తిట్టుకొంటూ ... ఎలాగయినా సరే ఈ దొంగవెధవల్ని పట్టుకోవాలి. కసిదీరా వాళ్లని తన్నాలి, అనుకొంటూ ఇక ఇప్పటినుంచి రాత్రిళ్లుకూడా తోటకు కావలి వుండాలి. లేనిచో ఈ పూలసమర్పణ కార్యం నిలిచిపోయే ప్రమాదం వుంది. అని ఆ రాత్రి నుంచే కంటికి కునుకు లేకుండా కంటిలో వత్తి వేసినట్లుగా తోటలో కాపు కాశాడు. అయినా ఫలితం లేకపోయింది. ఆ చోరాగ్రేసరులెవ్వరో అనంతార్యుల కన్నుగప్పి ప్రతిరోజు పూలను తెంచుతూనేవున్నారు. వాసన చూసి నలిపి పారవేస్తూనే వున్నారు. ఇలా ఎనిమిది రోజులు జరిగాయి. అయినా ఆ ముష్కరుల జాడ చిక్కలా. ఇలాంటి నిస్సహాయస్థితిలో నిర్వేదంగా అనంతార్యులు మరీ క్రుంగిక్రుద్ధుడయినాడు. ఏమిటీ కాలవైపరీత్యం! ఏమిటీ అన్యాయం! నేను ఒకరి శొంఠికిపోను చోద్యానికీ పోను. నాకా ఇలాంటి ద్రోహం జరిగేది? నేనేం చేసేది? నాకు ఏది దిక్కు? దిక్కులేనివారికి దేవుడే దిక్కన్నట్లు ఓ స్వామి తిరుమలేశా! నీవైనా ఈ దుష్టచర్యను అడ్డుకోరాదా! మా గురువుగారి ఆజ్ఞచేత నేను నీకు చేస్తున్న ఈ పుష్పమాలాకైంకర్యానికి ఎలాంటి విఘ్నం రాకుండా చూడవయ్యా స్వామీ! అని ఆర్తిగా ఆక్రోసించినాడు. ఆర్ద్రంగా కన్నీళ్లు పెట్టుకొని కొండదేవరను వేడుకొన్నాడు.

వేంకటేశ్వరుడు భక్తసులభుడు కదా! భక్తులు బాధపడితే భరించగలడా స్వామి! అనందాళ్వానుల ఆర్తికి కరిగి నీరైపోయిన కొండలరాయుడు. ఆ పరమభక్తుడు అహరహం చేస్తున్న పుష్ప కైంకర్యాన్ని, ఆచార్య భక్తిని లోకానికి తెలియజేయ నిశ్చయించినాడు. తొమ్మిదవనాటి రాత్రి కూడ ఓపికతో ఓర్పుతో మాటువేసి ఓ మూల నక్కి కాపువేశాడు. అనంతార్యులు. అర్ధరాత్రి సమయం ఏపుగా నిలువెత్తు పెరిగిన తులసి, పొదలమాటున

ఏదో కదలాడుతున్న దృశ్యం. ఆ పొదవైపు చెవులురిక్కించి వింటూ కళ్లు మిటకరించి చూస్తువున్న అనంతయ్యకు రెండు ఆకారాలు గోచరించాయి. ఆ రెండు రూపాలు స్త్రీపురుషులేమో! ఏ మాత్రం సందేహంలేదు. అదిగో ఆమె, అతను ఒకరి చెయ్యి ఒకరు పట్టుకొని వున్నారు. ఎవరో వీళ్లు సుందర సుకుమార శరీరులై వున్నారు! ఎంతవర్చస్వులు! అబ్బ ఎంతగుబాళింపు. ఈ సువాసనలు వీరివద్దనుండే వస్తున్నట్లువుంది. రాజ దంపతులేమో. అందుకే ఈ భోగం కావచ్చు. ఆc.. ఆc.. వీళ్లు ఎవరైతే నాకేమి? నాతోటను నాశనంచేసిన దొంగలు వీళ్లే. తోటను భంగం చేస్తున్న ముష్కరులు, చీకటి దొంగలు వీళ్లు. ఇక వీళ్లను ఏమాత్రం ఉపేక్షించకూడదు. నాకసిదీరా వీళ్లను చీవాట్లు పెట్టాలి. నోరారా తిట్టాలి. దొరికిన వీళ్లను విడవకూడదు. అంటూ ఉన్నఫళంగా గబాలున వారిరువురి మధ్యలో దూకి తనసంకల్లో వాళ్లచేతుల్ని ఇరికించుకున్నాడు. ఉన్నట్టుండి బలంగా పట్టుకున్న అనంతార్యుల పట్టునుండి విడిపించుకొనడానికి వాళ్లిద్దరూ గింజుకున్నారు. పెనగులాడినారు. వాళ్లిద్దరు ఆయనొక్కడు ఏంచేస్తాడు పాపం. ఆ గుంజులాటలో ఆ పెనుగులాటలో పురుషుడు పట్టు విడిపించుకొని పారిపోయాడు. గుడ్డికంటె మెల్లమేలు అన్నట్లు నీవు 'ఒక్కత్తెవయినా నాచేతికి చిక్కావు అంటూ అనంతాళ్వాను ఆ యువతిని చేతిని గట్టిగా పట్టుకొని "ఎవరు మీరు దేవతలా. మానవులేనా. రాజ దంపతులా! మీ వాలకాన్ని బట్టిచూస్తే గొప్పయింటి వాళ్లమాదిరే వున్నారు. మరి నాతోటను చిందరవందర చెయ్యడానికి మీకు సిగ్గుగాలేదు. మీ సరస విహారానికి నాతోటనే కనపడిందా! మీ శృంగారలీలకు నాపూలే కావలసి వచ్చాయా! ఎంత అపచారం! ఎంత అపచారం! సాక్షాత్తు ఆసిరిలచ్చిమగడైన ఆ సింగారమూర్తికి వినియోగమయ్యే పూలను మీరు వాసన చూసి నలిపి పారేస్తారా! ఎక్కడుంటారు మీరు! నీ మగని పేరేమిటి? నీమగడు నీ కోసమైనా రాడా! పెళ్లాం కోసం రాని మగడుంటాడా! అందులోను నీలాంటి అందమైన స్త్రీకోసం రాకుండా ఎక్కడికి పోతాడు?" ఇత్యాది అనేక ప్రశ్న పరంపరల్ని గుప్పిస్తూ బెదురుచూపులతోవున్న ఆ యువతితో

ఇన్ని రోజులుగా నాతోటను పాడుచేస్తున్న మిమ్మల్ని ఊరికేవదిలితే ఎలా? అంటూ ఆ తోటలో ఒక సంపెగమానుకు తీగలతో గట్టిగా బంధించాడు.

నాయనా! నీ బిడ్డలాంటిదాన్ని. నన్ను విడిచిపెట్టు. నామగడే నేను వద్దన్నా ఈ తోట బాగుందంటూ ఇక్కడికి తీసుకువచ్చాడు. నేనేంచేసేది తండ్రీ! మగడు చెప్పినట్లు మగువ వినాలగద. నా మగని పేరు నేనెట్లా చెప్పగలను? ఏ స్త్రీ అయినా తనపెనిమిటిపేరు ఉచ్చరిస్తుందా? నీకు తెలియనిధర్మం ఏముంది నాయనా! మరి నా భర్త ఎక్కడికి వెళ్లాడో ఎక్కడుంటాడో ఎట్లా చెప్పగలను. అతనొక మాయలగాడు. అతనొక దొంగ. ఓ పట్టాన ఆయన ఎవరికీ దొరకడు. నాకు ఆయనతో జత కలసినప్పటి నుంచి మాస్తూనేవున్నా ఆయన దొంగబుద్ధుల్ని. నీకు నన్ను అప్పచెప్పి పారిపోయిన ఆ మాయలోడు మళ్లీ వస్తాడని నేను అనుకోవడంలేదు. తండ్రీ దయపెట్టి నన్నొదిలిపెట్టు. నా మానాన నేను వెళ్లి పోతాను. అంటూ చేతులు జోడించి బ్రతిమలాడింది. అయినా అనంతాళ్వారు ఆమె వేడికోలు చెవినిబెట్టలేదు.

ఆమెను చెట్టుకు గట్టిగా కట్టివేసిన తర్వాత అనంతాళ్వాను ఆ ఆగంతుకుని కోసం తోట వెలుపలికి వెళ్ళి పరికించాడు. తోట బయట ఇంకా తచ్చాడుతున్న ఆ మగరాయని వెంటపడ్డాడు. ఆ పురుషుడు తోట నుంచి శ్రీస్వామివారి దక్షిణపువీధిలో ప్రవేశించి ఆలయానికి అప్రదక్షిణంగా పారిపోతుండగా అనంతాళ్వానులు కూడ అతన్ని తరుముతూ వెంటపడి నాడు. శ్రీవారి ఆలయంముందు, పుష్కరిణిదగ్గర, ఉత్తరమాడ వీధిలో, పశ్చిమ వీధిలో ఇలా పరుగెత్తుతున్న ఆ దొంగ మళ్లా అనంతాచార్యుల తోటను సమీపించి అదృశ్యమయ్యాడు. అనంతార్యులు కూడ పరిగెడుతూ ఆ ముష్కరుని కోసం వెదకి వేసారి తనతోటకు చేరుకున్నాడు. మళ్లీ చెట్టుకు కట్టివేయబడిన ఆయువతి, నన్ను వదలిపెట్టు తండ్రీ! అని వేడుకొంది. అయినా కనికరించని అనంతాళ్వాను, తెల్లవారనీ చూద్దాం! అంటూ కునుకుతీశాడు.

ఇంతలో తెల్లవారింది. అర్చకస్వాములు బంగారువాకిళ్లను తెరిచి శ్రీస్వామివారిని మేల్కొలిపినారు. శ్రీవారి వక్షఃస్థలం మీది "అలమేలు

మంగ" బంగారుప్రతిమ కానరాక ఆందోళన పడ్డారు. వెంటనే శ్రీ వేంకటేశ్వర స్వామివారు "అర్చకశిఖామణులారా! ఆందోళన చెందనవస రంలేదు. అలమేలుమంగ అనంతాళ్వానుల తోటలో బంధింపబడివుంది. మీరువెళ్లి సగౌరవంగా ఆమెను పిలుచుకొని రాగలరు" అంటూ పలికారు.

ఆ వెంటనే అర్చకులు ఛత్రచామర మంగళవాద్య పురస్సరంగా అనం తాళ్వానుల తోటకు వెళ్లి శ్రీస్వామివారి మాటలుగా అనంతాళ్వానులకు తెలియజేస్తూ, 'ఓ అనంతా! ఎంత భాగ్యశాలివయ్యా సాక్షాత్తు అమ్మవారినే బంధించిన పరమభక్తుడివి' అన్నారు. అయ్యో ఎంత అపరాధం చేశాను. అంటూ ముక్కుచెంపలేసుకొని అమ్మవారికి సాష్టాంగ నమస్కారా లాచ రించి, ఆయమను ఒక పూలగంపలో కూర్చోపెట్టుకొని ఆలయాని కేతెంచి నాడు. ఆలయంలో శ్రీనివాసుడు అనంతాళ్వానులను "మామా! అంటూ సంబోధిస్తూ నీ కూతురుని పూలపుటికలో పెట్టి నాకు సమర్పిస్తూ వున్నందున నీవు నాకు కన్యాదాతవైన మామగారివి" అంటూ పలికినాడు. ఆ పూలగంపలోని అమ్మవారు యథాప్రకారంగా బంగారు ప్రతిమయై శ్రీవారి వక్షస్థలాన్ని అలంకరించింది. శ్రీ స్వామివారు వస్త్రాలంకార చందన తాంబూలంతో అనంతార్యులను సత్కరించారు. ఆనాటి దివ్యగాథను స్మరింపజేస్తూ ప్రతిసంవత్సరం కూడ అదేరోజున ఇప్పటికీ, నేటికీ అంటే ప్రతి సంవత్సరం కన్యామాసంలో జరిగే బ్రహ్మోత్సవంలో ధ్వజావరో హణం రోజుకు మరునాడు ఆలయానికి అప్రదక్షిణంగా " శ్రీవారి బాగ్ సవారి ఉత్సవం" జరుగుతుంది. బాగ్ అనగా తోట అని అర్థం. ఈ బాగ్‌సవారి ఉత్సవాన్నే "పురిశైతోట ఉత్సవం" అంటారు. పురిశై అనగా మగవాడు, పురుషుడు అని అర్థం. రామానుజులవారు అనంతార్యులకిచ్చిన బిరుదు ఇది. ఈ బాగ్ సవారి ఉత్సవంరోజున శ్రీస్వామివారు ఒక్కరే ఆలయానికి అప్రదక్షిణంగా ఊరేగుతూ అనంతాళ్వానుల తోటకు వచ్చి పూజలందుకుంటాడు. అనంతరం శ్రీస్వామివారి పూలదండను అక్కడ వున్న అనంతాళువానుల బృందావనం మీది పొగడమానుకు సమర్పించి, శఠారిని సాయిస్తారు. పిదప తోట బయటికి వచ్చి శఠారిని లఘువుగా సంప్రోక్షిస్తారు. తర్వాత శ్రీస్వామివారు అప్రదక్షిణగానే మిగిలిన ఊరేగింపును

పూర్తి చేసుకొని ఆలయంలో ప్రవేశిస్తాడు. తోటలో బృందావనాన్ని తాకి శ్రీవారి పూలదండను శఠారిని సమర్పించిన అర్చకస్వామి పుష్కరిణికి వెళ్లి శుచిస్నాతులై ఆలయంలో ప్రవేశించి శ్రీవారి సేవలో పాల్గొంటారు.

ఇలా మరోమారు ప్రతి సంవత్సరం ఆడిమాసం (కర్కాటకనెల)లో పూర్వఫల్గునీ (పుబ్బ) నక్షత్రం "తిరువాయి(డి) పూరం" ఉత్సవం రోజున శ్రీస్వామివారు శ్రీదేవి భూదేవులతోకూడి ఆలయానికి ప్రదక్షిణంగా ఊరేగుతూ, తోటకేతెంచి యథాప్రకారం పూజలందుకొన్న పిదప పుష్పమాలలు, శఠారితో అనంతార్యుల బృందానంమీది పొగడ చెట్టును సత్కరించిన పిదప, ప్రదక్షిణంగా ఊరేగుతూ ఆలయం ప్రవేశిస్తారు. ఈ రోజే అనంతార్యులు పరమపదం చెందిన దినమనీ, ఆ బృందావనం నుంచి అనంతార్యులే పొగడ చెట్టుగా ఉద్భవించినారని పెద్దలు చెప్తారు. కాని ఈ రోజే గోదాదేవి (ఆండాళ్) పుట్టిన రోజు "తిరువాడిపూరం" కావడంకూడ విశేషం! యథా ప్రకారం, శఠారిని సంప్రోక్షించి అర్చకులు కోనేటిలో స్నానంచేసి ఆలయం ప్రవేశిస్తారు.

గురువులైన రామానుజులవారికంటె శిష్యులైన అనంతార్యులు 36 ఏండ్లు చిన్నవారు. క్రీ.శ. 1053 జన్మించిన అనంతాళ్వానులు సుమారు 84 ఏండ్లు జీవించి చివరకు తిరుమలలోనే శ్రీ స్వామివారి సన్నిధిలోనే పరమపదం చేరుకున్నారు.

ఇలా అనంతార్యులు పెక్కుకాలం శ్రీవారి పుష్పకైంకర్యంలో పాలు పంచుకొని, జీవితాన్ని పండించుకొన్న పుణ్యపురుషుడు. ఎన్నిమారులో ఎన్నెన్నిమారులో ఆ శ్రీనివాసుడు ఈ భక్తునితో పరాచికాలాడినాడు. ఆ పరంధాముడు ఈ పరమభక్తుడు వీరిరువురి మధ్య జరిగిన మధుర ఘట్టాలెన్నో తెలియ ఎవరితరము!

ఆనాడు అనంతార్యులు ప్రారంభించిన యామునాత్తురై పుష్ప కైంకర్యాన్ని నేటికీ అదే పేరుతోనే తి.తి. దేవస్థానం వారి పుష్పోద్యానవనశాఖ నిర్వహిస్తోంది.

కలియుగ భూలోక వైకుంఠమైన తిరుమల పుణ్యక్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామి (మూలవిరాణ్మూర్తి)వారికి, అనంతాళ్వానులు, తన పరమ గురువులయిన యామునాచార్యులవారి పేరుతో ఆనాడు ప్రారంభించిన

"యమునోత్తర" పుష్పకైంకర్యసేవ నేటికీ అదేపేరుతో కొనసాగుతూ వుండడంలోనే ఆనందనిలయుని భక్తప్రియత్వం సుస్పష్టమవుతూ వుంది.

పరమభక్తాగ్రేసరుడు, ఆచార్యనిష్ఠ, కైంకర్యదీక్షా కలిగివున్న ఈ అనంతాళ్వారులవారు నివసించిన గృహాన్ని తిరుమలక్షేత్రంలో శ్రీవారి ఆలయం మహాప్రదక్షిణ మార్గంలో సరిగ్గా నైరుతిమూలలో చూడవచ్చు. ఆ గృహాన్ని అనుకొని వున్న ఆనాటి తోట స్థలాన్నీ, ఆ తోటకు దక్షిణంవైపున అనగా వైకుంఠం క్యూ కాంప్లెక్సు భవనానికి ప్రక్కన విశాలమైన చెరువునూ మనం దర్శించవచ్చు. ఇదే అనంతాళ్వాను, తన భార్యతో కలిసి తవ్విన చెరువు. అందువల్లే ఈ చెరువును అనంతాళ్వారుచెరువు అంటారు. ఈ చెరువు సమీపంలో వున్న కాటేజీలను కూడ "అనంతాళ్వారుటాంకు కాటేజీలు" (ఏ.టి.సి) అని అంటున్నారు. ఈ చెరువులోని నీళ్లు యాత్రికుల నిత్యావసరాలకోసం వినియోగింపబడుతూవున్నాయి.

అనంతాళ్వానుల ఇంటి ప్రాకారంపైనా, తోటలోవున్న మండపంలోను, అనంతాళ్వానులు, ఆయన భార్య, కుమారుడు, సేవకుల శిల్పాలను దర్శించవచ్చు. ఇంతేగాక, ఆయన గృహానికి వెనుకగా ఆనుకొని వున్న ఒక దిగుడుబావిని మనం చూడవచ్చు, ఈ బావినీటినే తన అనుష్ఠానానికి, ఆరాధనలకు అనంతాళ్వానులు ఉపయోగించారు.

అనంతాళ్వానుల ఇంటికి వెనుకగా వున్న తోటలో అతిసమీపంలోనే ఆ పరమభక్తుని సమాధి (బృందావనం) మనకు కనబడుతుంది. ఈ బృందావనంలో నుండి పొగడమాను ఉద్భవించింది.

తిరుమల పర్వతసానువుల్లో చెట్టుగా, పుట్టగా, పిట్టగా అయివుండాలని ఆళ్వారులు అభిలషించినట్లుగా, అనంతాళ్వానులు, సమాధిలోనుండి పొగడ చెట్టుగా అవతరించినారని, పెద్దలు విశ్వసిస్తూ వున్నారు. ఆనాటినుండి శ్రీవారి ఆలయఅర్చకస్వాములు, ఆ బృందావనం మీది పొగడ మానునే అనంతార్యులుగా భావిస్తూ పుష్పమాలాసమర్పణ, శఠారి మర్యాదలు భక్తి పూర్వకంగా జరుపుతూ వున్నారు. ఇటీవల ఆ బృందావనం మీది పొగడమాను ఎండిపోయి, దాని పాదులోనే మర్రిచెట్టు మహావృక్షంగా వృద్ధి చెందుతూవున్నది.

ప్రతి సంవత్సరం రెండుమార్లు, శ్రీ వేంకటేశ్వరస్వామివారు ఒక్కడే ఒకమారు బ్రహ్మోత్సవాలు ముగిసిన మరురోజు బాగ్‌సవారిరోజున అప్రదక్షిణంగాను, మరొకమారు (తిరువాడిపూరంరోజున) దేవేరులతో కలిసి ప్రదక్షిణంగా వచ్చి ఈ తోటలోని శిలామండపంలో వేంచేసి, పూజలందుకొని సముచిత రీతిని అనంతార్యులను సంభావిస్తూ వున్నాడు. అంతేకాక ఏరోజైనా, ఎప్పుడైనా, బ్రహ్మోత్సవాల వంటి ప్రత్యేక ఉత్సవాలసమయంలో అయినాసరే ఆలయమహాప్రదక్షిణ మార్గంలో ఊరేగునప్పుడు నైరుతిమూలలో అనంతాళ్వానుల ఇంటిదగ్గర ఆనందనిలయుడు నిలిచి అనంతార్యులవారి కర్పూరహారతిని అందుకొన్న తర్వాతనే ముందుకు సాగుతాడు. ఇలా అనంతార్యులవారి హారతిని అందుకోవడమంటే ఆనందనిలయునికి పరమానందం మరి! నేటికీ అనంతార్యులవారి వంశీయులు ఈ హారతి కైంకర్యాన్ని కొనసాగిస్తూ ధన్యజీవితం గడుపుతూనే వున్నారు.

ఆనాడు అనంతార్యులు చేసిన గడ్డంమీది గాయాన్ని ప్రీతిగా, గర్వంగా అందరికీ స్పష్టంగా పచ్చకర్పూరంతో తీర్చిదిద్దుకొని తాను మురిసిపోతూ పరమపురుషుడైన శ్రీనివాసుడు మనల్ని మురిపింపజేస్తూ వున్నాడు గదా. ఆనాడు గాయం చేసిన గునపానికి (గడ్డపారకు)కూడ తగిన స్థానం ఏర్పాటు చేయబడింది. శ్రీస్వామివారి ఆలయ మహాద్వారంలో పడికావలి వాకిళ్లలోపల పైభాగాన ఉత్తరంవారకు ఆ గునపం కనపడేట్లుగా గోడపై ఎత్తున వ్రేలాడదీయబడివుంది. నేటికీ ప్రతి ఒక్కభక్తుడు ఆలయంలో ప్రవేశించే సమయంలోకాని, బయటికి వచ్చేసమయంలో కాని ఈ మహాద్వారం లోపల ఉత్తరం గోడకుపైభాగాన, ఆనాటి అనంతాళ్వారుల గడ్డపారను స్పష్టంగా దర్శించవచ్చు.

నిత్యమూ దివ్యపరిమళ భరితమైన పూలమాలల్ని సమర్పిస్తూ తిరుమల శ్రీనివాసప్రభువులవారి అలంకరణలోనే అహరహం జీవితాన్ని పండించుకొన్న పరమభక్తుడైన అనంతాళ్వానులు, కేవలం తిరుమలసానువుల్లో పుష్పాలు పూయిస్తూ మోటుగా కష్టాన్ని చేస్తూవున్న శారీరక ధృఢ గాత్రుడు మాత్రమే కాదు. సంస్కృతద్రావిడ వాఙ్మయ సరస్వతుల్ని సైతం తన కవితాకుసుమాలతో అర్చించిన కవి కృషీవలుడు ఈ అనంతాళ్వానులు.

హైమోర్ధ్వపుండ్ర మజహన్మకుటం సునాసం
మందస్మితం మకరకుండలచారుగండమ్
బింబాధరం బహుళ దీర్ఘకృపాకటాక్షం
శ్రీ వేంకటేశ ముఖమాత్మని సన్నిధత్తామ్.

"తెల్లని నామం, పాయని కిరీటం, సొగసైన నాసిక, తొలుకాడే చిరునగవు, మకరకుండలాల కాంతితో నిగనిగలాడే చెక్కిళ్లు, దొండపండులాగ కళకళలాడే పెదవులు, మిగుల నిడుదలై దయతో కూడివుంటూ కాంతులీనే కడగంటి చూపులు కలిగి ప్రకాశిస్తూవున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి ముఖారవిందం నిరంతరం నా మనస్సులో నిలిచివుండుగాత!!!

ఇలా భూలోక వైకుంఠమైన వేంకటాచలక్షేత్రంలో భువనమోహన సుందరుడై పిలిస్తే పలికే ప్రత్యక్ష దైవంగా భాసిస్తూవున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తుల ముఖారవిందాన్నీ, మన మనస్సుల్లో గాఢంగా నిలిచివుండేట్లుగా వర్ణించిన ఈ శ్లోకం అనంతాళ్వానులవారి భక్తికీ, పాండితీ పటిమకూ పరాకాష్ఠ! ఇంతమాత్రమేకాదు. తిరుమల శ్రీనివాసుని ఆలయచరిత్రను, ఉత్సవవిశేషాలను, కైంకర్యవివరాలనుగూర్చి తెలియజేస్తూ సంస్కృతభాషలో "శ్రీ వేంకటాచల ఇతిహాసమాల" అనే వచన గ్రంథాన్ని వెలయించిన రచయిత ఈ అనంతార్యులు. (ఈ సంస్కృతవచన గ్రంథాన్ని శ్రీమాన్ ఎన్.సి.వి. నరసింహాచార్యులు తెనిగించగా, తి.తి. దేవస్థానం పలుమార్లు ముద్రించింది కూడా.) అందువల్లే భగవద్రామానుజులవారికి ప్రియాతి ప్రియశిష్యులైన అనంతాళ్వానులు, ఆనందనిలయుని ఆలయ చరిత్రతోపాటు పెనవేసుకొన్న చిరంజీవి, చిరస్మరణీయులైన వైష్ణవభక్తాగ్రేసరులు.

అనంతార్యులు చెరువును తవ్వి పూలతోటను పెంచుతూ శ్రీ వేంకటేశునకు పుష్పకైంకర్యంచేస్తూవున్న తరుణంలోనే గురువులైన రామానుజులు మోకాళ్లతో తిరుమలకొండకు ఎక్కివచ్చి శ్రీనివాసపెరుమాళ్లను సేవించారు. ఆ సందర్భంలో ఏడుకొండలవాని పుష్పకైంకర్యంలో పాలుపంచుకొంటూవున్న అనంతార్యుల దివ్యారామాన్నీ అతని నిశ్చలభక్తినీ,

దృఢమైన దీక్షనూ, పరికించి పెక్కువిధాల ప్రశంసించి ఆశీర్వదించినారు. అంతేగాక అనంతాచార్యుల కోరికమేరకు భాష్యకారులైన రామానుజులు తన విగ్రహాన్ని తానే ఆలింగన చేసికొని తనకు ప్రతీకగా బహూకరించి సత్కరించినారు. పిదప అనంతాళ్వాను ఈ విగ్రహాన్నే శ్రీవారి ఆలయం లోనే విమానప్రదక్షిణ మార్గంలో "హుండీ"కి ఎదురుగా దక్షిణాభిముఖంగా ప్రతిష్ఠించారు. అంతేగాక, రామానుజులవారిపాదాలు కలిగిన శఠారికి "అనంతార్యులు" అని తన పేరును పెట్టడమేగాక, తాను పెంచి పెద్దచేసిన తోటకు "రామానుజ నందనవనం" అని నామకరణంచేసి గురుభక్తిని వినయ పూర్వకంగా చాటుకొన్న సచ్ఛిష్యశిఖామణి అనంతాళ్వానులవారు.

ఇంతమాత్రమేగాక "శ్రీరామానుజ చతుశ్శ్లోకీ" "శ్రీగోదా చతుశ్శ్లోకీ" అనే సంస్కృతస్తోత్రాల్ని రచించిన కవిశిఖామణి ఈ అనంతార్యులు.

మనం విమానప్రదక్షిణం చేస్తూ, అక్కడికి వెళ్లిన సందర్భంలో శ్రీ రామానుజులవారి విగ్రహరూపురేఖల్ని గూర్చి, వారుచేసిన తిరుమల ఆలయ సేవను గూర్చి వివరంగా తెలుసుకుందాం!

ఇలా అనాదిగా, తీవ్రమైన తమ భక్తిచేతా, అరమరికలులేని సేవచేతా భగవంతుడిని ఆకట్టుకొని లోబరచుకొన్న పరమభక్తులైన ఒక తొండమానుడు... ఒక కురువనంబి... ఒక తిరుమలనంబి.. అనంతాళ్వానులు.. ఇలా ఎందరెందరో ... వీరంతా గొప్పవాళ్లా! లేక ఆ భక్తులకు లోబడి వారితో ఆడుతూ పాడుతూ సంభాషిస్తూ తద్ద్వారా తన భక్తప్రియత్వాన్ని చాటుకొని పరవసించిన పరంధాముడయిన శ్రీ వేంకటేశ్వరస్వామివారు గొప్పవాడా!... ఏమో...ఏమో ఎవరికెరుక?.... ఏది ఏమైనా లీలావినోది అయిన తిరుమల శ్రీ వేంకటేశ్వరుని మహిమలు తెలియ ఎవరితరము?

కనుకనే పదకవితా పితామహుడూ; ఆనందనిలయుని అంతరంగిక భక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులు శ్రీనివాసుని మహిమలను గూర్చి ఇలా గానం చేస్తూ వున్నాడు.

## శంకరాభరణం

ఎటువంటివాడవో నీమహిమ
లెట్టు దెలియ వచ్చును.
నిటల లోచనుడు, అజుడు తెలియలేరు
నిన్నెట్లు దెలిసేరు మానవులు,

తిరుమలనంబి తా తాత యన్న నాడె
తెలిసెబో మీ పెద్దతనములు
కురువనంబిగారి చేతి బంకమట్టి పువ్వులు
కొన్ననాడె తెలిసె మీ భోగము
మఱియు ననంతాళువారి చెరువుగట్టు
మన్ను మోయగా తెలిసె మీనటనలు
గరుడ గంభముకాడ కాసు కొక్క వరమిచ్చి
గడియించ దెలిసె మీసంపద

తొండమాంజక్రవర్తికి సంపద
తొలుత నియ్యగా దెలిసె మీ యీవులు.

..........................................

అంటూ తిరుమలేశుని భక్తప్రియత్వం, పక్షపాతం, వరప్రదానగుణం ఈరీతిగా, ఈ తీరుగా వుంటాయని గెరగీసి చెప్పడం సాధ్యమయ్యే పని కాదనీ, అట్టి శ్రీనివాసునిలీలల్నీ, మహిమల్నీ నిటలలోచనుడయిన పరమ శివుడూ, నాలుగువేదాలను అలవోకగా వల్లెవేసే బ్రహ్మదేవుడూ సయితం తెలియలేనపుడు ఇక మానవులు ఏపాటి అర్థంచేసుకోగలరని తాళ్లపాక అన్నమయ్య అంటాడు.

## గోవిందుడు

ఈ ఏడుకొండలవాణ్ణి ఏ పేరుతో పిలిచినా పలుకుతాడుకాని, ఈ స్వామివారికి "గోవిందా!" అని పిలిస్తేనే ఎనలేని ఆనందం! గోవిందా! అనే పిలుపుతో ద్వాపరంయుగంలో తన నేస్తులతోటి గడిపిన రోజులు స్మరణకు వచ్చి ఈ స్వామి ఒకమైమరపునకు లోనవుతాడు! గోవిందా! అనే పిలుపే

భలేఇష్టమట తిరుమలేశునికి! ఎంచేతంటే గోవిందా! అని భక్తుల సంబోధన చెవుల బడగానే ఆనందనిలయుడు అనంతయుగాల్లో తానుపొందిన అన్ని పట్టాలకంటే ద్వాపరయుగంనాటి "ఆలకాపరి" "పసుల కాపరి" ఉద్యోగం చాలగొప్పది అని భావిస్తూ ఉబ్బి తబ్బిబ్బు అవుతాడంట! గోవిందా! అన్న పిలుపులో ఆ వెర్రి గోపాలునికి వేదనాదాలకంటెకూడ ద్వాపరంనాటి పిల్లనగోవిరవళి రమణీయంగా వినపడి పరమానందాన్ని పొందుతాడు! గోవిందా! అంటే చాలుట! ఎక్కడలేని ఆవేశం ఏడుకొండలవాడికి. ఎందుకంటే గోవిందా! అన్నపిలుపులో గోవుల, దూడల అంబారవాలు వీనుల విందుగా వినవస్తాయంట! "గోవిందా!" అని విన్న వెంటనే ఈ ఏడుకొండలస్వామికి పరవళ్లుతొక్కుతూ పారే యమునా జలాలు, ఆ నీళ్లల్లో ఈతలుగొట్టే జతగాళ్ల సరసాలు, యమునా తీరంలోని పచ్చిక బయళ్లు............ ఆ బయళ్లలో పచ్చికను మేస్తూవున్న ఆవులమందలు గుర్తుకువచ్చి మనస్సు ఉరకలేస్తుంది. గోవిందా! అని ఆర్తిగా పిలిస్తే, ఆ పిలుపులో ... ఎప్పుడో ఏనాడో వెర్రిగొల్లలు పిలిచినట్లుగా అనిపించి, అలనాడు వ్రేపల్లెలో యమునానది ఒడ్డున .... చెట్లనీడల్లో ... గొల్లపిల్లలతో లొట్టలేసుకుంటూ ఆరగించిన కమ్మని చద్దన్నం ముద్దలు... నోరూరించే ఊరగాయ రుచులు....... నోటినిండా, చప్పరించే వెన్నముద్దలు ఇవన్నీం జ్ఞాపకం వచ్చి మైమరచిపోతాడు. "గోవిందా!" అన్న పిలుపు విన్నవెంటనే, ఒకప్పుడు వత్సాసుర, బకాసుర శకటాసుర, ధేనుకాసురాది రాక్షసులను సంహరించి, కాళింగునివంటి మహావిషసర్పాలనుసయితం భంజించి వ్రేపల్లె వాసులను రక్షించిన మహాకార్యాలు జ్ఞాపకంవచ్చి, నేను ఉన్నానంటూ ఈ కలియుగవాసుల రక్షణలో కూడ సిద్ధంగా సర్వసన్నద్ధంగా నిలిచి వుంటాడట ఈ తిరుమల గోవిందుడు! కనుకనే పరమభక్తుడైన అన్నమయ్య కూడ.

*"భావములోనా బాహ్యాము నందును*
*గోవింద! గోవింద!! అని కొలువవో మనసా!"*

అని అడుగడుగునా ప్రబోధించినాడు

అనంతమైన యుగాల్లో అనంతమైనఅవతారాలు ఎత్తినా వాటిఅన్నింటి లోను, - అతిసామాన్యమైన అమాయకులైన గోపబాలురతో, గోపికలతో

తానూ ఒకడై చరిస్తూ, అందరికీ అందుబాటులోవుంటూ నిండుగా దయను చూపిన ద్వాపరయుగంనాటి గోపాలకృష్ణుడే ఆ గోవిందుడే నేడు వేంకటాద్రిమీది గోవిందుడై, ఆనాటి గో-గోపాలురకు మాదిరే అందు బాటులోవుంటూ మనలనందరినీ రక్షిస్తూ వున్నాడు. కాపాడుతూ వున్నాడు. నిండుగా మెండుగా కోరికలను తీరుస్తూ అనుగ్రహిస్తూవున్నాడు. మరి ఈ దివ్య క్షణంలో తిరుమలేశునికి అత్యంత ప్రియమైన పేరుతో పిలుస్తూ ఒక్కసారి కీర్తించండి మరి.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

నేడు ఈవేంకటాద్రిమీద మనకు దర్శనం ఇస్తూవున్న తిరుమల గోవిం దుడు ఆనాటి అలవాట్లను, అప్పటి ఆచారాలను తప్పక అనుసరిస్తూనే వున్నాడు.

తిరుమల గోవిందుడు ప్రతిరోజూ సుప్రభాత సమయాన లేచిన వెంటనే ఆవుపాలను ఆరగిస్తూ వున్నాడు. అప్పుడే, అప్పుడప్పుడే తీసిన "నవనీతం" అంటే వెన్నను తింటూ వున్నాడు. ఆ తరువాత మీగడ పెరుగును కలిపిన పెరుగన్నాన్ని ప్రియంగా, ఆత్రంగా ఆనందంగా నోరారా జుర్రుకుంటూ, కడుపారా తింటూ, మనల్ని ఆనందింపజేస్తూ వున్నాడు సుమా! ఇంత మాత్రమేకాదు. "ఇది ఏనాటి బంధమో! ఎన్నెన్ని జన్మలబంధమో! అన్నట్లు ఈనాడుకూడ ప్రతిరోజు వేకువజామున తొట్టతొలిగా బ్రహ్మాదిదేవతలకు సయితం అందుబాటులోలేని, కనీసం తలంపులోలేని దివ్యసందర్శన భాగ్యాన్ని, దివ్యమంగళ విగ్రహవిరాట్‌దర్శనాన్ని ఒక పామర భక్తునికి అనుగ్రహిస్తూ వున్నాడు. నేటికీ తొలిగా ఒక 'గోపాలుడు' శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్య మంగళమైన మూల విరాణ్మూర్తిని తొలిగా ప్రతిరోజూ దర్శిస్తూ వున్నాడు. ఆ భక్తుడు ఒక్కడే కాదు. ఆ భక్తుని సంతతికి, అంటే వంశపారంపర్యంగా, కలియుగాంతం వరకు మొదటి దర్శన భాగ్యాన్ని పొందినాడు. తిరుమల శ్రీవారి ఆలయంలో ఇప్పటికి అమలులో వుంది! ఎవరా భక్తుడు - ఇది ఎప్పటి వృత్తాంతం? తెలుసుకోవాలని వుందా? అయితే వినండిమరి! వినేముందు ఒక్కసారి గోవిందనామస్మరణ చెయ్యండి.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# తొలిదర్శనం!

తిరుమల పుణ్యక్షేత్రంలో ప్రతిరోజూ తెల్లవారుజామున సుప్రభాత సేవకు ముందుగా శ్రీవారి అర్చకులు, సుప్రభాతాన్ని పఠించే పండితులు, ఆచార్యులు, మేలుకొలుపుపాటలను వినిపించే అన్నమయ్య వంశీయులు, ఆలయఅధికారులు ..... సేవకులు..... ఇలా అందరూ శ్రీవారి బంగారు వాకిళ్లముందు చేరి సిద్ధంగా వుంటారు. ఇంతలో "సన్నిధి గొల్ల" అని పిలవబడే ఒక యాదవవ్యక్తి బంగారువాకిళ్ల తాళాలు తీసి, దివిటీ పట్టుకొని బంగారువాకిలిని కొద్దిగా తీసి ఆలయం లోనికి ప్రవేశిస్తాడు. అతని వెనుకనే అర్చకులు, పరిచారకులు ప్రవేశించిన వెంటనే బంగారు వాకిళ్లు మూసివేస్తారు. సుప్రభాతపఠన ప్రారంభ మవుతుంది. ఇంతలో ముందుగా ప్రవేశించిన 'గొల్ల' తొలిగా తిరుమలేశుని దర్శించుకుంటాడు. ఇలా ఏనాటినుంచో ఎప్పటినుంచో ప్రతిరోజూ మొట్టమొదట శ్రీవారి మూలవిరాణ్మూర్తుల దర్శన భాగ్యాన్ని అందుకుంటూవున్న వ్యక్తి "సన్నిధి గొల్ల". శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిలో సేవాభాగ్యాన్ని వరంగా పొంది, వంశపారంపర్యంగా అనుభవిస్తూవున్నవ్యక్తి కనుక ఇతనిని "సన్నిధి గొల్ల" అని వ్యవహరిస్తారు. శ్రీ వైకుంఠం నుంచి శ్రీ వేంకటేశ్వరస్వామి వారు తరలివచ్చి ఇచట వుండిన సమయంలో తొట్టతొలిగా శ్రీనివాసుని దర్శించిన పరమభాగ్యశాలి ఈ ఆవులకాపరి (సన్నిధిగొల్ల). ఈ పసులకాపరే శ్రీ వేంకటేశ్వరునిచేత వంశపారంపర్యంగా కలియుగాంతంవరకు శ్రీ వేంకటరమణుని దివ్యమంగళ మూలవిరాణ్మూర్తిని మొట్టమొదట దర్శించే మహద్భాగ్యాన్ని పొంది, నేటికీ అనుభవిస్తూవున్న వ్యక్తి ఈ "సన్నిధి గొల్ల". ఆనాళ్లలో ఈ ఆలకాపరి మొదట శ్రీ వేంకటేశ్వరుని ఎలా దర్శించాడు? ఎందుకు దర్శించాడు? .... అంటే .....

# పుట్టలో వెలసిన దేవుడు

శ్రీ మహావిష్ణువునకు అత్యంత ప్రీతికరమైన, ఇష్టమైన దివ్యస్థలాలు రెండు వున్నాయి. ఒకటి శ్రీ వైకుంఠం. రెండవది భూలోక వైకుంఠమయిన వేంకటాచలక్షేత్రం.

దివ్య ప్రశాంత ధామమయిన పరమ పదంలో అంటే శ్రీవైకుంఠంలో శ్రీదేవి భూదేవులు సేవిస్తూవుండగా శేషసాయిగా కొలువై వుంటాడు శ్రీమన్నారాయణుడు. అక్కడ వేంచేసివున్న సాక్షాత్తు దివ్యమూర్తి అయిన ఆ శ్రియఃపతిని, అక్కడికి వెళ్లగలిగిన బ్రహ్మాది దేవతలు, సనక సనందనాది మహర్షులు, నారదాది దేవర్షులు .... మాత్రమే దర్శించగలిగేవారు.

ఇక రెండవది కలియుగ వైకుంఠమయిన వేంకటాచలక్షేత్రం. శ్రీనివాసుడు తాను సంకల్పించినపుడు, భూలోక వైకుంఠమయిన ఈ దివ్యక్షేత్రంలో లీలా మానుష విగ్రహుడై సంచరిస్తూ తపస్సంపన్నులకు దేవతలకు మాత్రమే దర్శనమిస్తూ వుండేవాడు. లేనిచో అదృశ్యంగా తిరుగుతూ వుండేవాడు. అనగా శ్రీవైకుంఠం ఎంతటి ప్రాచీనమో ఎంతటి దివ్యస్థలమో అంతటి పరమ పవిత్రమయినదీ ప్రాచీనమయినది వైకుంఠ ధామమయిన ఈ తిరుమల పుణ్యస్థలం.

ఇలాంటి సమయంలో భృగువు మున్నగు మహర్షులు యాగంచేస్తూ, ఈ యాగఫలాన్ని ఎవరికి ఇవ్వాలి? ఇందుకు ఎవరు అర్హులు? అన్న మీమాంసలో పడ్డారు. చివరకు భృగువు యాగఫలానికి ఎవరు అర్హులో తేల్చడానికి పూనుకొంటాడు. మొదట బ్రహ్మదేవుని, శివుని దర్శించి, వారిరువురు యజ్ఞ ఫలానికి అనర్హులనివారిని నిర్ణయించి చివరకు శ్రీ వైకుంఠానికివెళ్లి శ్రీమహావిష్ణువును పలుకరిస్తాడు. ఆ స్వామివారు లక్ష్మీదేవితో సరస సల్లాపాల్లో మునిగివున్నందువల్ల భృగువు రాకను గమనించలేదు. దానితో తీవ్రంగా కోపించిన భృగువు తనపాదంతో శ్రీమహావిష్ణువు వక్షఃస్థలంపై తంతాడు. అంతటి మహాపాపం చేసినప్పటికి శ్రీనివాసుడు ఏమాత్రం కోపించక మహర్షిని అనునయించి పంపిస్తాడు. భృగుమహర్షి తాముచేసే యాగఫలానికి అర్హుడు శ్రీమహావిష్ణువే అని నిర్ణయించి వెళ్లిపోతాడు.

పిదప తనకు శాశ్వతస్థానమయిన శ్రీవారి వక్షఃస్థలంలో కాలితో తన్నిన మునిని ఏమాత్రం కోపించక, గౌరవించి పంపినందువల్ల లక్ష్మీదేవి అలిగి భూలోకం చేరుకొని కొల్హాపురంలో స్థిరపడుతుంది. లక్ష్మీదేవి లేని వైకుంఠం వెలవెలబోగా విరహంతో శ్రీనివాసుడు ఆమెను వెదుకుతూ భూలోకానికి వస్తాడు. ఎక్కడా లక్ష్మిని కానక విసిగి వేసారిన వేంకటేశ్వరుడు వేంకటా

చల పర్వతాన్ని చేరుకొని పుష్కరిణికి దక్షిణపువైపు ఒడ్డునవున్న చింతచెట్టు కింది పెద్ద పుట్టలో సేద దీరి ఆకలి దప్పులతో అలమటిస్తూ వుంటాడు. ఈయన పరిస్థితిని గమనించిన బ్రహ్మదేవుడు, శివుడు కొల్హాపురంలోని లక్ష్మీదేవికి తెలియజేస్తారు. ససేమిరా! ఒప్పుకొనని లక్ష్మీదేవిని కనీసం శ్రీనివాసునికి ఆకలి దప్పులు దీర్చడానికి ఒప్పిస్తారు.

బ్రహ్మదేవుడు గోవుగాను, శివుడు దూడగానూ, లక్ష్మీదేవి గోపస్త్రీగా మారి, వేంకటాచల పర్వత ప్రాంతాలకు చేరుకొంటారు. అప్పట్లో ఆ ప్రాంతాన్ని చోళరాజు పాలిస్తూ వుంటాడు. గోపాలిక అయిన లక్ష్మీదేవి చోళరాజు ఆస్థానానికి వెళ్లి, అసాధారణమైన, దేవతాంశ గలిగిన ఇటువంటి ఆవు దూడ మీ దగ్గరే వుంటేచాల బావుంటుంది అని వాటిని విక్రయించి వెళ్లి పోతుంది. ప్రతిరోజూ రాజుగారి పసులకాపరి, ఆలమందతోపాటు కొత్తగావచ్చిన ఆవు దూడలను, కూడ అడవికి తోలుకొనివెళ్లాడు.

మేతకు అడవికెళ్లిన కొత్తఆవు, పసులమందను వదలిపెట్టి గొల్లకాపరి కన్నుగప్పి అడవిలో పుట్టలో దాగివున్న శ్రీనివాసుని వద్దకెళ్లి పుట్టలో ధారగా పాలుకార్చేది. పుట్టలోని శ్రీనివాసుడు ఆ పాలను కడుపార త్రాగుతూ తృప్తిచెందేవాడు. పాలను కార్చిన తరువాత మళ్లీ యథాప్రకారం ఆవు మందలోచేరి చోళరాజుగారి గోశాలకు చేరుకొనేది. దేవతాకళ ఉట్టిపడే ఆవుపాలను తాగించాలని ఉవ్విళ్లూరిన మహారాణి గొల్లవాణ్ణి పురమాయించింది. పిల్లవానికి అవసరమైన పాలను మాత్రం ఆ కొత్తగోవు ఏమాత్రం ఇవ్వనందున రాణిగారు గొల్లవానిపై కోపించి, రాజుగారికి పిర్యాదు చేసింది. ఇలా రెండు మూడురోజులు కొనసాగగా, ఆ గొల్లవాడే ఆ గోమాతపాలను తాగుతున్నాడేమోననే సందేహంతో రాజుగారు వాణ్ణి దండించడమేకాక, స్తంభానికి కట్టించి కొరడాతో దెబ్బలు కూడ కొట్టించినాడు.

ఆ గొల్లవాడు లబోదిబోమంటూ "మారాజా! నన్ను కొట్టమాకండి! ధర్మప్రభువులు నన్ను సంపమాకండి నన్ను నమ్మండి రాజా నేను ఏ పాపం ఎరుగను. అయినా అది ఎందుకు పాలు ఇయ్యకుందో రేపు మాపటేల పొద్దుగూకే యాలకు ఎరికచేస్తా నన్ను కొట్టమాకండి. మారాజా ఈయాలకు నన్నొదిలేయండి" అంటూ కాళ్లా వేళ్లా పడ్డాడు. వెంటనే చోళరాజు "అలాగే

రేపు ఆవు పాలన్నా ఇవ్వాలి. లేదా కారణం అయినా చెప్పాలి లేకున్న నీకు మరణమే తథ్యం" అని తీవ్రంగా హెచ్చరించి భయపెట్టాడు.

మరునాడు పొద్దున ప్రాణభీతితో ఆ గొపాలుడు ఏమరుపాటు లేకుండా అన్ని పశువులతోపాటు జాగ్రత్తగా కొత్త గోవును తోలుకెళుతూ, దాన్ని గమనిస్తూ "ఈ ఆవు జూస్తే శానా బావుండాది. శానామంచిగా కనపడతాది. దేవతాపసరంలాగా శానా అందంగా సాచ్చాత్తు సరగం నుంచి దిగివచ్చినట్లు బొద్దుగా వుండాది. దీని పొదుగ్గూడ నిండుగ కనపడతాంది. పాలేమో ఒకచుక్కైనా కంటితో చూళ్లేదు. ఏందబ్బా! అనుకుంటూ గట్టిగా "తల్లీ! ఏందె తల్లీ! నేనేం పాపం జేసిన? ఓ గోమాలచ్చిమీ! నీవు ఇయ్యాల పాలియ్యకపోతే నాకు మరణ శిచ్చంట. నామీద కొంచం దయపెట్టి నన్ను రచ్చించు తల్లే. నీకు కోటిదండాలు మాతల్లే." అని స్వగతంగా మాట్లాడు కొంటూ దీర్ఘాలోచనలో పడతాడు. ఇంతలో మందను విడిచి అడవిలో ఎక్కడికో వెళుతున్న ఆవును వింతగా జూస్తూ, ఉలిక్కిపడి ఆలోచనలనుంచి తేరుకొని 'ఏందబ్బా దీని యవ్వారం. ఇది యాడికి పోతున్నట్లు? అయినా ఈరోజు దీని అంతు జూడాల్సిందే" అంటూ నల్లటి గొంగళిని కప్పుకొని, గొడ్డలిని చేతబట్టుకొని ఆవువెంట పొదలమాటున నడచినాడు.

యథాప్రకారం ఆవు మెల్లగా కొండలు గుట్టలు దాటుకుంటూ పుష్కరిణి సమీపంలో వున్న పుట్టను ఎక్కి దాని బొరియలో పాలను ధారగా కార్చ సాగింది. ఆ పసులకాపరి ఆశ్చర్యంగా చూస్తూ "ఏందబ్బా! ఇది శానా శానా ఇంతగా వుందే. చిత్తరంగా వుందే. ఒట్టి పుణ్ణానికి పాముపుట్టలో పాలు బోస్తుండాదే! పుట్టలో ఎవురుండారో! ఒకేల నాగరాజు అదే నాగేంద్రుడు పుట్టలో వుండాడేమో! మునులు రుసులు గూడ పుట్టలో గూకొని తపస్సు జేస్తరంట గద! అందుట్లో ఎవురైన మునీసరులున్నరేమో! ఎవురుంటే నాకేమి? అక్కడ బాగా దాణా మెక్కేది. ఇక్కడ వట్టి పున్నానికి పాలు గార్చేదా! దానికి నేం జచ్చేదా? బలే బాగుంది దీని యవ్వారం? ఇయాల ఈయావును ఇడిసి పెట్టగూడదు."అనుకొంటూ మెల్లగా మెల్ల మెల్లగా నక్కి నక్కి ఆవుదగ్గరికి వెళ్లి గొడ్డలిని ఎత్తి ఒక్కవేటు వేశాడు.

ఇంతలో అలికిడికి ఆవు బెదరి పక్కకు తప్పుకోగా, పుట్టలో దాగివున్న శ్రీవేంకటేశ్వరుడు గబాలునపైకి లేచాడు. అంతే ఉన్నపళంగా ఆ గొల్లని గొడ్డలివేటు శ్రీనివాసుని నుదుటికి తగిలి బొటబొట నెత్తురు జిమ్మింది. కారుతున్న నెత్తురును చేతితో అద్దుకుంటూ "ఓరీ! పాలు ఇస్తూ రక్షించే తల్లివంటి గోమాతనా గొడ్డలితో నరికేది దుష్టుడా!" అని గొల్లవాణ్ణి నిందిస్తాడు. ఆ పసులకాపరి గబాలున తన గొడ్డలివేటు తగిలి నెత్తురు చిమ్ముతున్న శ్రీనివాసుణ్ణి చూస్తూ దిక్కుతోచక దిమ్మెరపోయి "ఎంత నెత్తురు! ఎంత నెత్తురు! ఎంతపని చేసినాను ఎవరో మానుబావుడు అనుకొంటూ "సామీ! చమించు సామీ! అంటూ శ్రీనివాసుని కళ్ళలోకి చూస్తూ భీతిల్లి ఆక్షణంలోనే కిందపడి మృతి చెందినాడు.

వెంటనే ఆవు పరిగెత్తుకుంటూ చోళరాజు ఆస్థానానికి వెళ్లి కన్నీరు కారుస్తూ అంబా రవాలు చేసింది. ఈ పరిస్థితిని గమనించిన రాజు ఆందోళనతో ఆవు వెంటనడచి గొల్లవాడు చచ్చిపడియున్న పుట్టను చేరుకొన్నాడు. ఇంతలో పుట్టలో దాగివున్న స్వామివారు పైకివచ్చి "ఓరీ పాపాత్మా! నీవు చాల ఘోరకృత్యం చేశావు. అందుకు ఫలం అనుభవిస్తావు" అంటూండగా, "నేను ఏపాపం ఎరగను దేవా! అని రాజు పల్కగా శ్రీనివాసుడు "నీవు గోమాత పాలకోసం ఏపాపం తెలియని అమాయకుడైన ఈ గొల్లని కొరడాతో కొట్టించినావు. పైగా మరణశిక్ష కూడా వేశావు. అందువల్ల నీవు చేసిన దుష్టకార్యంవల్లే వాడు మరణభయంతో ఆవును కొట్టగా, అదినాకు తగిలింది. రాజ్యంలో ఎవరు ఏపాపం చేసినా రాజుదే బాధ్యత. కనుక నీవు తప్పక అనుభవించవలసినదే. నీవు ఈ క్షణం నుంచి పిశాచానివై సంచరించు" అంటూ శపించినాడు. అంత చోళరాజు వెంటనే "దేవాది దేవా నిన్ను దర్శించిన వెంటనే సమస్తపాపాలు తొలగిపోతాయే. మరి నీవే శపించటం ఏమిటి? దయతో నన్ను క్షమించవలసింది ఓ ప్రభూ!" అంటూ ప్రాధేయపడి సాష్టాంగపడినాడు. ఆశ్రితుల పాలిటి కల్పవృక్షం భక్తవత్సలుడైన శ్రీనివాసుడు కరుణించి "రాజా కొద్దికాలంలోనే ఆకాశ రాజు తన కూతురు పద్మావతిని నాకు ఇచ్చి పరిణయంచేస్తాడు. అల్లుడనైన

నాకు వివాహ సమయంలో ఒక బంగారు కిరీటాన్ని కానుకగా ఇస్తాడు. దాన్ని నేను ధరించిన వెంటనే నీ పిశాచరూపం తొలగుతుంది." అని పలికినాడు. వెంటనే చోళరాజు పిశాచమై వెడలిపోయినాడు.

పిదప అక్కడ మృతిచెంది పడివున్న గొల్లని సంతతివారితో శ్రీనివాసుడు "ఈ భూలోకంలో తొలిగా నన్ను దర్శించిన ఈ గొల్లని పూర్వజన్మ సుకృతం చాలగొప్పది. అందువల్ల నేటినుంచి కలియుగాంతంవరకు కూడ ప్రతిరోజు మొట్టమొదట నన్ను దర్శించే మహద్భాగ్యాన్ని ఈ గోపకుని సంతతికి కలుగునట్లు వరమిస్తూ వున్నాను." అంటూ పలికినాడు. ఆనాటినుంచి నేటి వరకు ఇప్పటివరకు ఆనాటి గొల్లవాని సంతతే వంశపారంపర్యంగా ఆనంద నిలయుని దివ్యమంగళ విరాణ్మూర్తిని ప్రతిరోజూ తొలిగా దర్శించుకుంటూ వున్నారు.

ఆనాడు వేంకటాచల క్షేత్రంలో తొట్టతొలిగా పుట్టలోవున్న శ్రీ వేంక టేశ్వరస్వామివారికి తన పాలధారలను కురిపించి ఆకలి దప్పులను తృప్తిగా తీర్చి, సేవలందించిన గోమాత పేరు "గౌతమీధేనువు". అని తిరుమల 'శ్రీవారి కైంకర్యరత్నావళి' అనే గ్రంథంలో పేర్కొనబడింది. నేటికీ ప్రతి రోజూ శ్రీవేంకటేశ్వరస్వామివారు సుప్రభాత సమయాన మేల్కొన్నవెంటనే తొలిగా ఆవుపాలను స్వీకరిస్తూ ఆనాటి గౌతమీధేనువు సేవను స్మరింప జేస్తూవున్నారు. ఆనాడు గోమాతరూపంలో పాలందించిన బ్రహ్మదేవునకు ప్రతిరోజూ బ్రాహ్మీముహూర్తంలో (తెల్లవారుజామున) బంగారువాకిళ్లు తెరవకముందే శ్రీనివాసుడు తనను సేవించుకునే మహద్భాగ్యాన్ని కలిగించాడు. అలానే ఆవువెంట దూడగావచ్చిన పరమశివునకు వేంకటాచలక్షేత్ర పాలకత్వాన్ని తిరుమలేశుడు ప్రసాదించినాడు.

ఈ ఆవూ దూడల వెంటవచ్చి, తొలిగా ప్రత్యక్షంగా తనను దర్శించిన ఆనాటి గొల్లవాని సంతతికి కలియుగాంతంవరకు ప్రతిరోజూ తొలిగా దర్శనంచేసుకొనే మహదవకాశాన్ని వరంగా అనుగ్రహించినాడు ఈ ఆనంద నిలయుడు. అలా నిత్యమూ మొట్ట మొదట తిరుమల శ్రీవేంకటేశ్వరుని దివ్యమంగళవిరాణ్మూర్తిని దర్శించుకొనేయాదవవ్యక్తి "సన్నిధి గొల్ల" అని పిలువబడుతూ బ్రహ్మాండనాయకునిబంగారుమేడ ముంగిట్లో అనేక

సేవలందిస్తూ జీవితాన్ని పునీతం చేసికొంటూ వున్నాడు. తిరుమల గోవిందునిసన్నిధిలో 'గొల్ల' అందిస్తున్న సేవ లేమిటో తెలుసుకునేముందుగా సామాన్యుడైన గోపాలుడు మొదలు బ్రహ్మాది దేవతల వరకు అందరికి అందుబాటులో వుంటూ, అందరిచేతా పూజలందుకుంటూ వున్న వేంకటాద్రి గోవిందుణ్ణి ఒక్కసారి భక్తిగా కీర్తిద్దాం.

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## సన్నిధి గొల్ల

'సన్నిధి గొల్ల' అని పిలువబడే యాదవుడు ప్రతిదినం బ్రాహ్మముహూర్తంలో తెల్లవారుజామున 2-30 గంటల సమయంలో నిద్ర మేల్కొని కాలకృత్యములు తీర్చికొని శుచిగా స్నానంచేసి, నొసటన తిరునామాలను (ఊర్ధ్వ పుండ్రాలను) ధరించి 'గోవింద! గోవింద!' అంటూ గోవింద నామాన్ని స్మరిస్తూ చేత చిన్నదివిటీ ('పొంజు' అంటారు) పట్టుకొని తిరుమల శ్రీవారి ఉత్తరమాడ వీధిలో వున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవాకైంకర్యపరులైన వైఖానస అర్చకస్వాముల 'తిరుమాళిగ' (అర్చకుల ఇల్లు)కు వెళ్లి, భక్తిపూర్వకంగా వారికి నమస్కరిస్తూ ఆ అర్చకస్వాములను ఆలయానికి ఆహ్వానిస్తారు.

## శ్రీవారి అర్చకులు

ఆ సమయానికే (తెల్లవారుజామున 2-30 గంటలకు) అర్చకులు ఒకరు లేదా ఇద్దరు కాలకృత్యాలు తీర్చికొని, శుచి స్నాతులై ద్వాదశ ఊర్ధ్వ పుండ్రాలను ధరించి సంధ్యావందనాది అనుష్ఠాన క్రియలను భక్తిపూర్వకంగా పూర్తిచేసికొని "కుంచెకోల" అనబడే పెద్దకొడవలి (ఇనుపకొక్కెం)లాంటి ఆకారం కలిగిన యంత్రికను (పరికరాన్ని) భుజంపై పెట్టుకొని తాళం చెవుల గుత్తిని తీసికొని మనసులో శ్రీవేంకటేశ్వరస్వామివారిని ధ్యానిస్తూ, మౌనంగా గోవిందనామాన్ని జపిస్తూ, ఎవరితో మాట్లాడకుండా మౌనదీక్షతో శ్రీవారి కైంకర్యానికి ఆహ్వానించవచ్చిన"సన్నిధి గొల్ల"ను అనుసరిస్తారు.

అత్యంతశుచిగా శుభ్రంగా మడితో శ్రీనివాసప్రభువులవారి అర్చనకు గాను తన వెంట బయలుదేరిన అర్చకవరులకు దారిలో ఎలాంటి ఇబ్బందులు కలుగకుండా, ఇతర వ్యక్తులు వారిని మైలపరచకుండా జాగరూకుడై గమనిస్తూ "శ్రీవారికైంకర్యపరులకు దారీ!" "సన్నిధి కైంకర్య పరులకు దారీ!" అని గట్టిగా హెచ్చరిస్తూ దివిటీ వెలుగులలో వారిని దేవాలయానికి పిలుచుకొనివస్తాడు 'సన్నిధి గొల్ల.'

ఈ వైఖానస అర్చక శిఖామణులు, దారిలో, శ్రీ భూవరాహస్వామివారి ఆలయ శిఖరానికి భక్తిపూర్వకంగా, ఆత్మప్రదక్షిణంచేస్తూ నమస్కరించి, మౌనంగా గొల్లను అనుసరిస్తూ శ్రీవారి ఆలయం మహాద్వారం (పడికావలి) వద్దకు చేరుకుంటారు. ఇలా అర్చకులు గొల్లవెంట పడికావలి దగ్గరకు వస్తూవుండగా, ఆలయ మహాద్వార గోపురానికి బయట ఎదురుగా వున్న మెట్లకు దక్షిణం వైపున మేడమీదవున్న "నౌబత్ ఖానా" (నగారామండపం)లో శ్రీవారి అర్చకుల రాకను తెలియజేయడానికన్నట్లు హెచ్చరికగా పెద్ద గుండ్రని పలకగంట (కంచుగంట)ను "టంగ్! టంగ్!..."అంటూ గట్టిగా మోగిస్తారు. అప్పుడు మహాద్వారం వాకిళ్లు తెరవబడతవి. ఈ ఘంటావాదనంతో ఆలయ సిబ్బంది జాగ్రత్తవహించి, అర్చకుల రాకను గమనిస్తూ దారిలో అడ్డు లేకుండా ప్రక్కకు తొలగుతుండగా, గొల్ల అందరినీ హెచ్చరిస్తూ ముందుకుపోతూవుండగా, అర్చకులు ప్రధాన ద్వార దేవతలకు మంత్రోచ్చారణ పూర్వకంగా నమస్కరిస్తూ ఆలయ ప్రవేశం చేస్తారు. ఆ తర్వాత శ్రీవారి కైంకర్యపరులు తమచేతిలోని "కుంచెకోల"ను తాళంచెవులను ధ్వజస్తంభం, దగ్గర క్షేత్రపాలకశిల (రుద్రునకు)కు భక్తితో తాకించి ధ్వజస్తంభం బలిపీఠాల దగ్గర సాష్టాంగ నమస్కారం చేసిన తర్వాత వాటికి ప్రదక్షిణంగా వెండివాకిలి (నడిమిపడికావలి) లోనికి వెళ్లి నేరుగా బంగారువాకిలి దగ్గరకు చేరి మౌనంగా గోవిందనామ జపం చేసికొంటూ వుంటారు.

## జియ్యంగారులు

అర్చకులను ఆలయానికి ఆహ్వానించి పిలుచుకొని వచ్చి, వారిని బంగారు వాకిలి దగ్గర విడిచిపెట్టిన తరువాత "సన్నిధి గొల్ల" అక్కడి నుంచి

నేరుగా ఆలయానికి ఎదురుగావున్న శ్రీబేడిఆంజనేయస్వామి ఆలయానికి ప్రక్కనవున్న శ్రీ పెద్దజియ్యంగారల మఠానికి వెళ్లి, అప్పటికే శుచిస్నాతులై ద్వాదశోర్ధ్వపుండ్రాలను ధరించి అనుష్ఠానాలను పూర్తిచేసి సిద్ధంగా వున్న జియ్యంగారిని, వారి పరిచారకుడైన "ఏకాంగి"ని ఆలయానికి ఆహ్వానిస్తాడు. వెంటనే ఆ వైష్ణవ ఆచార్యస్వాములు సిద్ధమై సన్నిధిగొల్ల ముందు నడుస్తూ వుండగా జియ్యంగార్ లేదా ఏకాంగి గొల్లను అనుసరించి ఆలయంలోని బంగారు వాకిలి దగ్గరకు చేరుకొంటారు.

## పేష్కారు

ఇంతలో శ్రీవారిఆలయం అధికారి అయిన పేష్కారుకూడా ఆలయానికి వేంచేసి బంగారువాకిలి వద్ద సిద్ధంగా వుంటారు.

## సుప్రభాతం పఠించే అధ్యాపకులు

సరిగ్గా ఆ బ్రాహ్మీముహూర్త సమయానికే సుప్రభాతం పఠించే అధ్యాపకులు ముగ్గురు లేదా నలుగురు వేదపండితులు శుచిస్నాతులై నొసటవ తిలకములను ధరించి భక్తి ప్రపత్తులతో బంగారువాకిలి వద్ద మండపంలో వేంచేసి సంసిద్ధులై వేచి వుంటారు.

## "మేలుకొలుపు సంకీర్తన"

అలాగే పదకవితా పితామహుడు, శ్రీవేంకటేశ్వరస్వామివారి అంతరంగిక భక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులవారి వంశీయులు ఒకరు చేతో తంబుర (దండె) పట్టుకొని 'మేలుకొలుపు' సంకీర్తన గానంచేయటానికి బంగారువాకిలివద్ద సిద్ధంగా వుంటారు.

## భక్తులు

ఇంతలో 'సుప్రభాతసేవ'కు నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులను వైకుంఠం క్యూ ద్వారా ఆలయంలోనికి ప్రవేశింపచేస్తారు. ఈ సుప్రభాత

సేవలో పాల్గొనడానికి వచ్చిన భక్తులు అందరూ కూడ బంగారువాకిలి ముందర దక్షిణంవైపున పురుషులు, ఉత్తరం వైపున స్త్రీలు.. వరుస్క్రమంలో నిలిచివుంటారు.

## బంగారువాకిళ్ల బీగాలు

ఇలాగ అర్చకస్వాములు, జియ్యంగార్లు, ఆలయఅధికారులు అధ్యాపకులు, తాళ్లపాకంవారు, సన్నిధిగొల్ల, సుప్రభాతసేవాపరులైన భక్తులు... వీళ్లందరూ బంగారువాకిలిముందర చేరి ఉత్సాహంగా, ఆసక్తిగా సిద్ధంగా వున్న సమయాన.

ముందుగా అర్చకులు తమదగ్గరవున్న "కుంచెకోల"ను బంగారు వాకిళ్ల కుగల చిన్నరంధ్రంద్వారా లోపలికిదూర్చి లోపలివైపు వేసివున్న గడియను అతినేర్పుగా బయటినుంచే తీస్తారు. ఇలా కుంచెకోల అనే యంత్రికతో(పరికరం)బంగారువాకిళ్లకు బయటినుంచే లోపలివైపు గడియ వేయడం, తీయడం అర్చకులకు మాత్రమే పరంపరాగతంగా సిద్ధించిన రహస్యప్రక్రియ. పిదప వాకిలికి మధ్యలో గడియకు వేసివున్న పెద్ద తాళాన్ని కూడా తమ దగ్గరవున్న తాళంచెవితో తీసి ప్రక్కన నిలబడతారు.

అటుతర్వాత "సన్నిధి గొల్ల" ఆలయ అధికారి అయిన 'పేష్కారు' వద్దగల తాళాలు కలిగి, సీలు వేయబడిన ఒక చిన్న సంచి (తిత్తి)ని తీసికొని అందరికి చూపించి, దానిని అందరిసమక్షంలో విప్పి, ఆ సంచిలో వున్న తాళం చెవులతో బంగారువాకిలికి వేసిన మూడు పెద్ద పెద్ద తాళాలను వాటిమీది సీళ్లు సరిగావున్నదీ లేనిదీ నిర్ధారించిన తర్వాతనే సన్నిధిగొల్ల ఆసీళ్లను తొలగించిన పిదప తాళాలను తెరుస్తాడు. అర్చకులు జియ్యంగారులు - ఆలయ అధికారులు - ఈ ముగ్గురి సమక్షంలో 'సన్నిధి గొల్ల' మాత్రమే బంగారువాకిళ్లకు వున్న తాళాలను తీస్తాడు. ఈ ముగ్గురిలో ఏ ఒక్కరు లేకపోయినా, బంగారువాకిలి తాళాలు తీయడంకాని, వేయడంకాని జరుగదు.

బంగారువాకిళ్లకు వేసి వున్న తాళాల నన్నింటిని తీసివేసిన 'సన్నిధి గొల్ల' చిన్న దివిటీని (పొంజు) చేతపట్టుకొని బంగారువాకిలిని కొద్దిగా తెరచి లోనికి ముందుగా తాను ప్రవేశిస్తాడు. ఆ వెనువెంటనే అర్చకులు బిగ్గరగా "కౌసల్యా సుప్రజారామ! పూర్వాసంధ్యా ప్రవర్తతే...." అంటూ సుప్రభాతాన్ని ప్రారంభిస్తూ గొల్లను అనుసరించి లోనికి ప్రవేశిస్తారు. ఆ వెంటనే జియ్యంగార్ లేదా ఆయన పరిచారకుడు అయిన "ఏకాంగి"గాని మహంతుమఠంవారు తెచ్చిన ఆవుపాలు, చక్కెర, వెన్న, తాంబూలం - ఈ వస్తువులు కలిగిన తట్టను స్వీకరించి లోనికి వెళ్లిన వెంటనే బంగారు వాకిళ్లు మళ్లీ దగ్గరికి మూయబడతవి. అర్చకస్వాములు ప్రారంభించిన సుప్రభాతాన్ని అందుకుంటూ బంగారువాకిళ్లముందు నిలిచివున్న పండితులు సుప్రభాత పఠనాన్ని కొనసాగిస్తారు. అలాగే అదే సమయంలో బంగారువాకిలి విడుపునకు ఆనుకొని తంబురమీటుతూ తాళ్లపాకంవారు 'మేలుకొలుపు' కీర్తన ఆలాపిస్తారు.

సన్నిధి గొల్ల... అర్చకులు.. ఏకాంగి వరుసగా లోనికి వెళ్లిన వెంటనే బంగారువాకిళ్లు దగ్గరికి వేస్తారు. లోపల 'సన్నిధి గొల్ల' తన చేతిలోని దివిటీ వెలుగులో అర్చకులను గర్భాలయంలోని శ్రీవారి సన్నిధి వరకు తీసుకొని వెళ్తారు.అర్చకులు రాముల వారిమేడకు వేసియున్న తలుపుతాళాలను తీసి శయనమండపంలోపల పానుపుపై వున్న భోగశ్రీనివాసమూర్తికి ప్రదక్షిణంగా వెళ్లి సన్నిధిలో ప్రవేశిస్తారు.

తన చేతిలోని దివిటీ వెలుగులు ప్రసరిస్తూ వుండగా, కులశేఖరపడి దగ్గరమాత్రమే నిలబడి ఆనందనిలయంలో వింత వింత వెలుగులతో ప్రకాశిస్తూ వున్న తిరుమల గోవిందుని తొలిగా సన్నిధిగొల్ల కన్నులారా దర్శించుకొంటాడు. సన్నిధి సమీపస్థలానికి వెళ్లినవెంటనే ఏకాంగి గొల్ల చేతిలోని దివిటీ తీసుకొని స్వామివారి సన్నిధిలో ... అంటే గర్భాలయంలోని దీపాలను వెలిగించి దివిటీని మళ్లీ గొల్ల చేతికిస్తాడు. అప్పుడు గొల్ల కులశేఖరపడినుండి బంగారువాకిలి వరకు లోపల గల దీపాలనన్నింటిని తన చేతిలోని దివిటీతో వెలిగిస్తాడు.

దీపాలు వెలిగించిన తర్వాత శ్రీవారి అర్చకులు శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూలవిరాణ్మూర్తి దగ్గరకు వెళ్లి శ్రీస్వామివారి పాదములను

రెండుచేతులతో చక్కగా తాకుతూ, శిరసువంచి నమస్కారం చేసికొని, మళ్లీ శయనమండపంలో పవ్వళించివున్న భోగ శ్రీనివాసమూర్తి సమీపానికి వచ్చి నమస్కరించి, రెండుచేతులతో చప్పట్లు చరచి శ్రీవారిని మేల్కొన వలసినదిగా ప్రార్థించి, భోగశ్రీనివాసమూర్తి వారిని శ్రీవారి మూలవిరాణ్మూర్తి సన్నిధిలో పాదముల చెంత (జీవస్థానం) వేంచేపు చేయిస్తారు. పిదప అర్చకులు పాదసేవ, హారతిచేసిన తరువాత శ్రీవారి నగలు, ఆభరణాలు, సన్నిధిలోపలి వెండి బంగారుపాత్రలు సరిగా వున్నదీ లేనిది తనిఖీ చేసుకొంటారు. అర్చకులు చేసుకొనే ఈ నగల ఆభరణాల తనిఖీని 'పాబూత్'గా చూసుకొనడం అంటారు.

## క్షీర నివేదనం

పిదప అర్చకస్వాములు ఆనందనిలయంలో కులశేఖరపడి వద్ద తెరవేసి, శ్రీస్వామివారికి దంతధావన జిహ్వారేఖన ఆచమనాది అనుష్ఠాన క్రియలు సమర్పించి తొలిగా మహంతు మఠంవారు పంపించిన ఆవుపాలను నివేదించి హారతి ఇస్తారు. శ్రీ వేంకటేశ్వరస్వామివారు భూలోకంలోని ఈ వేంకటాచలక్షేత్రంలో పుట్టలో దాగివున్న వేళలో తొట్టతొలిగా గౌతమీధేనువు (గోరూపంలో బ్రహ్మదేవుడు) సమర్పించిన క్షీరకైంకర్యానికి గుర్తుగా నేటికీ ప్రతిరోజూ తొలిగా సుప్రభాతవేళలో ఈ శ్రీనివాసస్వామి ఆవుపాలను స్వీకరిస్తూనే వున్నాడు. నివేదన అయిన ఈ క్షీరాన్ని తొలుత అర్చకులు స్వీకరించి తర్వాత జియ్యంగారికి, ఏకాంగికి ఆ తర్వాత "సన్నిధి గొల్ల"కు ఇస్తారు.

ఇంతలో బంగారువాకిలి బయట సుప్రభాత పఠనం, తాళ్లపాకవారి మేలుకొలుపు సంకీర్తన పూర్తవుతుండగా బంగారువాకిళ్లు ఒక్కసారిగా పూర్తిగా తెరవబడతాయి. ఆ సమయంలో అర్చకస్వాములు మహంతు మఠంవారు తెచ్చి సమర్పించిన నవనీతాన్ని (వెన్నను) శ్రీవారికి సమర్పిస్తూ బంగారు పళ్లెరంలో పచ్చకర్పూరంతో మంగళహారతిని ఇస్తారు. ఈ కర్పూర హారతి వెలుగుల్లో ఏడుకొండల వెంకన్న అందరికీ ఏవేవో తెలియని దివ్యానుభూతుల్ని పంచుతూ దివ్యదర్శనం ప్రసాదిస్తాడు. పిదప అర్చక స్వామి

శ్రీస్వామివారివద్ద రాత్రి, బ్రహ్మదేవుడు అర్చించడానికి వుంచిన బ్రహ్మతీర్థాన్ని, చందన శఠారుల్ని ముందుగా తాను స్వీకరించిన తర్వాత ఏకాంగివారికి ఇస్తాడు. ఆ తర్వాత "సన్నిధిగొల్ల"కు కూడ బ్రహ్మతీర్థ, చందనా శఠారుల్ని అనుగ్రహించి, ఆ తట్టలోని ప్రథమ తాంబూలాన్ని గొల్లకు ప్రసాదిస్తాడు. ఇలా నిత్యమూ ఆనందనిలయంలోని శ్రీవేంకటేశ్వరుల మూలవిరాట్టును, తొలిగా దర్శించడమేగాక, ఆ స్వామివారికి నివేదింపబడిన ప్రథమ తాంబూలాన్ని కూడ వంశపారంపర్యంగా, ఆజన్మాంతం అందుకొంటున్న భాగ్యశాలి, సేవాశీలి అయిన యాదవభక్తశిఖామణి ఈ "సన్నిధి గొల్ల."

తిరుమల ఆనందనిలయంలోని శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యమంగళ విరాణ్మూర్తిని ప్రతి నిత్యమూ తెల్లవారుజామున తొట్టతొలిగా దర్శించుకొంటూ ప్రథమతాంబూలాన్ని అందుకొనడమేకాదు. ఎప్పుడు ఏవేళ, ఏ ప్రత్యేకపూజల సందర్భంలో అయినా సరే వైఖానస అర్చక స్వాములను వారి ఇంటి నుండి (తిరుమాళిగ) ఆహ్వానించి సగౌరవంగా, భక్తి పూర్వకంగా ఆలయానికి పిలుచుకొని వచ్చే శ్రీవారి ప్రథమ కింకరుడు ఈ 'సన్నిధిగొల్ల'. ఆహాహా! ఈ యాదవభక్తశిఖామణి చేసికొన్నం పూర్వ పుణ్య విశేషం ఎంతటిదో! ఎంతెంతటిదో!!! తోమాలసేవ, ఏకాంతసేవ సమయంలో పారువేట ఉత్సవం మున్నగు ఉత్సవాల్లో కూడ ఈ సన్నిధిగొల్ల సేవలందిస్తూ వున్నాడు. వాటిని గూర్చి క్లుప్తంగా తెలుసుకుందాం.

## తోమాలసేవా సమయంలో

ప్రతిరోజు శ్రీ వేంకటేశ్వరస్వామి వారి మూలవిరాణ్మూర్తులకు రెండు మార్లు తోమాలసేవ ఘనంగా జరుగుతుంది. తోమాల అనగా తోటనుంచి వచ్చిన తులసి మాలలు పూలమాలలు అని అర్థం. వాటితో శ్రీవారిమూర్తిని అలంకరించే సేవనే తోమాలసేవ అంటారు. 'తోళ్' అనగా తమిళంలో భుజం. భుజాలనుంచి వేలాడదీసేమాలలు కనుక "తోమాల" అని కూడా అంటారు.

ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండుపూటలా, శ్రీవేంకటేశ్వర స్వామివారి మూలవిరాణ్మూర్తికి తోమాలసేవ ఘనంగా జరుగుతుంది. శ్రీవేంకటేశ్వరస్వామివారి మూల విరాణ్మూర్తికి తోమాల సేవకుగాను "యమునోత్తరై" అని పిలువబడే పుష్పఅర (పూలఅర)లో పూలమాలలు సిద్ధం చేయబడి వుంటాయి. ఈ పూలమాలలు ఆయా ఋతువుల్లో దొరికే మల్లెలు, సన్నజాజులు, మొల్లలు, రోజాలు, గులాబీలు, సంపెంగలు, సుగంధాలు, మొగలి, మరువం, మాచీపత్రం, దవనం, తులసి, చామంతులు గన్నేరులు ఇలా ఎన్నో ఎన్నెన్నో సుగంధ పరిమళ భరితమైన పుష్పజాతులతో, పత్రాలతో కావలసిన కొలతలలో మాలలు కూర్చి సిద్ధంచేయబడి ఒకపెద్ద సన్నని వెదురు గంపలో సిద్ధంగా వుంచబడతవి.

పిదప వైష్ణవ జియ్యంగార్లు లేదా వారి పరివారక సహాయకుడైన ఏకాంగికాని పూలమాలలు సిద్ధంగా కూర్చి వుంచబడిన యమునోత్తర (పూలఅర)కు వెళ్లి ఆ పూలగంపలను (పాత్రం) తెచ్చుటకు సిద్ధంగా వుంటారు. ఇంతలో "సన్నిధి గొల్ల" చిన్నదివిటీ, (పొంజు)తో 'యమునో త్తర'కు వెళ్లి ఆహ్వానిస్తాడు; ఏకాంగి అక్కడ సిద్ధంగా వున్న పూలమాలల గంపలను తలపైపెట్టుకొని సన్నిధిగొల్లను అనుసరించి వెళతాడు. 'సన్నిధి గొల్ల' దివిటీ చేతిలో పట్టుకొని, హెచ్చరిక చేస్తూ ముందు నడుస్తూ వుండగా, గుండ్రని పలకగంటను మోగింపబడుతు వుండగా సన్నడోలు, బూరాలు మోగింపబడుతుండగా ఛత్రచామర మర్యాదలతో ధ్వజస్తంభానికి ప్రదక్షిణంచేస్తూ ఆలయం లోపల వెండివాకిలి (నడిమిపడికావలి)లోపల ప్రవే శించి విమాన ప్రదక్షిణంచేసిన అనంతరం, సన్నిధిలో సమర్పిస్తారు. మిగిలిన వాయిద్యాలన్నీ ఛత్రచామరాలన్నీ బంగారువాకిలి దగ్గర నిలిచిపోగా, ఒక్క "సన్నిధి గొల్ల" మాత్రమే చేతి దివిటీతో ముందు నడుస్తూవుండగా ఏకాంగి బంగారువాకిట్లో ప్రవేశించి, చివరకు కులశేఖర పడిదాటి లోపలకు వెళ్లి శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలో ఆ పూలమాలలను సమర్పిస్తారు. 'సన్నిధి గొల్ల' కులశేఖరపడి గడప వరకు మాత్రమే వెళ్లి నిలిచిపోగా శ్రీవారిసన్నిధిలోనికి ఒక్క ఏకాంగి మాత్రమే వెళ్లి పూలమాలలను సమర్పించడం జరుగుతుంది.

ఇలా 'సన్నిధి గొల్ల' ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం రెండు వేళలా జరిగే తోమాలసేవా సమయంలో తాను స్వయంగా దివిటీ పట్టుకొని ముందు నడుస్తూ పూలమాలలు తెస్తూవున్న ఏకాంగి వారిని సగౌరవంగా పూల అరనుండి శ్రీవారిసన్నిధికి పిలుచుకొని వెళతాడు. ఇంతమాత్రమే కాదు.

ఇలా కేవలం పూల మాలలు, పూజాద్రవ్యాలు మాత్రమేకాదు. శ్రీవారి సన్నిధినుండి అనగా ఆనందనిలయంనుండి లోపల వున్న ఉత్సవమూర్తులను అర్చకులు బయటికి తెస్తూవున్నప్పుడుగాని, లేదా ఉత్సవానంతరం, బంగారు వాకిలివద్దనుండి సన్నిధిలోనికి తీసుకొని వెళుతూవున్నప్పుడుగానీ, ఈ 'సన్నిధి గొల్ల' "సన్నిధికిదారీ! 'శ్రీవారికి దారీ!' అంటూ చేతి దివిటీతో ముందు నడుస్తూ దారిలో విగ్రహమూర్తులను తీసుకొని వెళుతూవున్న అర్చకులకు ఎవరితోను ఎలాంటి ఆటంకం కలగకుండా, హెచ్చరిస్తారు.

## ఏకాంతసేవా సమయంలో

ప్రతిరోజు రాత్రి ఆనందనిలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి 'ఏకాంత సేవ' అనబడే పవ్వళింపు సేవ జరుపబడుతుంది. ఆ సమయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తుల పాదాలచెంత ఆనుకొని వున్న భోగశ్రీనివాసమూర్తిని (మనవాళ ప్పెరుమాళ్) కులశేఖ రపడి ఇవతల వున్న శయన మండపంలో వెండిగొలుసులతో వేలాడ దీసిన బంగారునవారుపట్టెమంచంపై పవ్వళింపజేస్తారు.

ఈ శయన మండపంలోని తూగుటుయ్యాలలోని మెత్తని పట్టుపరుపుపై భోగమూర్తిని శయనింపజేసే సమయంలో 'సన్నిధి గొల్ల' తన చేతిలోని పొంజు అనబడే దివిటీతో శ్రీవారు పవ్వళించే మంచానికి ముందుభాగంలో ఇరువైపులా రెండు దీపపు సెమ్మెలను వెలిగించి బయటికి వస్తాడు.

ఇలా ప్రతిరోజు రాత్రి ఏకాంతసేవా సమయంలో శయన మండపంలోని మంచానికి ముందు రెండు దీపపు సెమ్మెల్ని నిత్యమూ వెలిగిస్తూవున్న ఈ 'సన్నిధి గొల్ల' ఎంతటి ధన్యుడో! తిరుమల గోవిందునికి 'సన్నిధి గొల్లని'పై ఎంతటి పక్షపాతమో! ఇంతటి సేవాభాగ్యాన్ని పొందిన ఈగొల్ల, వేంకటాద్రి

గోవిందునికి ఎంతటి ప్రియుడో! ఈ తిరుమలగోవిందునికి, 'సన్నిధిగొల్ల'కు వున్న అనుబంధం ద్వాపరయుగంనాటి వ్రేపల్లె సంబంధమేమో!

అసలు ఆ స్వామివారు తాను ద్వాపరయుగంనాటి గోవిందుణ్ణి తానే నంటూ, ప్రతి రోజూ పొద్దున్నే నిద్రలేచిన వెంటనే పాలూ, వెన్నా జుర్రుకోవడమేగాక, ప్రతి గురువారంనాడు జరిగే 'నేత్రదర్శనోత్సవం'లో శ్రీ వేంకటేశ్వరస్వామివారు (మూలవిరాణ్మూర్తి) ఎలాంటి ఆభరణాలు లేకుండా కేవలం, దోవతితో పై వల్లెవాటుతో, మెడలో రెండుకంటెలతో నొసటన సన్నని నామంతో, బుగ్గన పచ్చ కర్పూరపు దిష్టి చుక్కతో, తలకు చుట్టూ సొగసుగా చుట్టుబడిన తలగుడ్డ (పరివీటం, పరివేష్ఠనం)తో, నిగ నిగలాడుతూవున్న నల్లనైన మేనితో చిరునవ్వులు చిందిస్తూ సాక్షాత్తు నల్లనికన్నయ్యే ఈవేంకటాద్రి గోవిందుడేమోననే ఆశ్చర్యాన్ని ఆనందాన్ని ఒక తన్మయత్వాన్నీ ఒక మైమరపును కలిగిస్తూ భక్తులకు దర్శన మిస్తాడు స్వామి. అందుకనే కొందరు భక్తులు ప్రతి గురువారంనాటి శ్రీవారి నేత్రదర్శనోత్సవాన్ని "గొల్లని వేషం" అనీ, "గోపాలుని వేషం" అని అంటారు.

ఇంతమాత్రమేకాదు. ప్రతిరోజు ఉదయం శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవరులకు జరిగే సహస్రనామార్చనలోనూ, మధ్యాహ్నం, సాయంత్రం .జరిగే అష్టోత్తర శతనామార్చనలోను, ఆ తిరుమలేశుడు ఆ ఆనందనిల యుడు సాక్షాత్తుగా ద్వాపరయుగంనాటి శ్రీకృష్ణభగవానుణ్ణి తానేనంటూ ఇలా అర్చింపబడుతూ వున్నాడు.

ఓం దేవకీ గర్భ సంభూతాయనమః
ఓం యశోదేక్షణ లాలితాయనమః
ఓం వసుదేవ కృతస్తోత్రాయనమః
ఓం నందగోప మనోహరాయనమః
ఓం నీలకుంతలాయనమః
ఓం పూతనాప్రాణ సంహర్త్రేనమః
ఓం తృణావర్త వినాశనాయనమః
ఓం గర్గారోపిత నామాంకితాయనమః
ఓం వాసుదేవాయనమః

ఓం గోపికా స్తన్యపాయినేనమః
ఓం బలభద్రానుజాయనమః
ఓం వత్సజితే నమః
ఓం వత్స వర్ధనాయనమః
ఓం క్షీర సారాశన రతాయనమః
ఓం దధిభాండ ప్రమర్దనాయనమః
ఓం నవనీతాపహర్త్రేనమః
ఓం వత్సాంతకాయ నమః
ఓం బకద్వేషిణే నమః
ఓం మహాజగర చండాగ్నయే నమః
ఓం శకట ప్రాణకంటకాయనమః
ఓం అక్రూర స్తుతి సంప్రీతాయనమః
ఓం కుబ్జాయౌవన దాయకాయనమః
ఓం కృష్ణాయనమః
ఓం కృష్ణాసఖాయనమః

ఇలా అర్చింపబడుతున్న ఆనందనిలయుడు, ద్వాపరయుగంనాటి శ్రీ కృష్ణుణ్ణే తానేనంటూ మనకు స్పష్టంచేస్తూ వున్నాడు మరి!

అంతేకాదు, పద్మావతి శ్రీనివాసులకల్యాణ సమయంలో, తాను వసు దేవునిపుత్రుడనీ, తన అన్నబలరాముడనీ, తన పేరుకృష్ణుడనీ, సంకల్పం చెప్పినట్లుగా, 'శ్రీవేంకటాచలమాహాత్మ్యం' స్పష్టంగా తెలుపుతూ వున్నది.

అందువల్లే ఆనాటి, ఆ ద్వాపరయుగం నాటి గతస్మృతులు మరవలేక, మరచిపోలేక, మరచిపోవడానికి సాధ్యంకాక ఈ తిరుమల గోవిందుడు, ప్రతి సంవత్సరం 'గోకులాష్టమి' నాటి ఉట్లపండుగ వేడుకల్లో, ఉత్సాహంగా పాల్గొంటూ వున్నాడు. అంతేకాదు ప్రతి సంవత్సరం జరిగే పారువేట ఉత్స వంలో ప్రత్యేకంగా "సన్నిధి గొల్ల"ను సంభావిస్తూ వున్నాడు శ్రీనివాసుడు.

## పారువేట ఉత్సవం సమయంలో

ప్రతిసంవత్సరం సంక్రాంతి మరునాడు శ్రీవేంకటేశ్వరస్వామివారు పంచాయుధాలు ధరించి, పారువేటకు బయలుదేరి ఆండాళ్‌నికి ఉత్తర

దిక్కునవున్న పారువేట మండపానికి వెళ్లి వేటలో పాల్గొంటాడు. మరొక పల్లకిపై తానే కృష్ణుణ్ణి అంటూ వెన్నముద్ద కృష్ణునిగా ఊరేగుతూ పారువేట మండపానికి స్వామి వేంచేస్తాడు. అక్కడ పారువేటవేడుకలన్నీ అయినతర్వాత, ఆ దగ్గరలోనే ఆ తోటలోనే విడిది చేసిన "సన్నిధి గొల్ల" స్థావరానికి శ్రీనివాసుడు స్వయంగా వెళ్లి, ఆ గొల్లలు నివేదించిన పాలు, వెన్న పండ్లు స్వీకరించి, వారికి తాంబూలాన్ని చందన శటారులను స్వామి అనుగ్రహిస్తాడు. ఇలా శ్రీనివాసుడు ఎప్పుడు పారువేటకు వచ్చినా, ఆ అన్ని సమయాల్లోను, సన్నిధి గొల్లను సత్కరిస్తూ ద్వాపరయుగంలో ఆ గొల్లలతో తనకున్న స్నేహబంధాన్ని, ప్రేమ బంధాన్ని చాటుకొంటూ వున్నాడు సుమా! ఆనాటి అమాయక గొల్లల ప్రేమపాశానికి బద్ధుడైన స్వామి ఎంతటి భక్తప్రియుడో! ఎంతటి భక్త వత్సలుడో! మనకు సుస్పష్టమవుతూవుంది. మరి ఇలాంటి శుభసందర్భంలో ఆ వేంకటాద్రి గోవిందుణ్ణి ద్వాపరయుగంనాటి గోవిందునిగా భావించి ఎలుగెత్తి ఏడుకొండలు మార్మోగేలా పిలుద్దాం.

*ఏడు కొండలవాడా! వేంకటరమణా!!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## భక్తులను విడిచివుండలేను

ఏడుకొండల మీద వెలసిన శ్రీ వేంకటరమణునికి శ్రీ వైకుంఠం కంటే కూడ భూలోక వైకుంఠమయిన తిరుమలక్షేత్రం అంటేనే మహా ఇష్టమట! ఎంచేతంటే ఈ కలియుగంలో ఇక్కడ నిరంతరం నిరాఘాటంగా, 'నీవే దిక్కు!' అంటూ ఎందరోభక్తులు తన పాదపద్మాలను ఆశ్రయించడానికి వస్తూ వుంటారు. తన దివ్యమంగళ విగ్రహ స్వరూపాన్ని కన్నులారా దర్శించి తరించడానికి ఆర్తిగా వస్తూ వుంటారు. అలా వారికి, ఎక్కడా ఎవ్వరూ దిక్కులేక దిక్కుగానక, తననే దిక్కని శరణాగతి, భక్తి ప్రపత్తులతో తనను నమ్ముకొని ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి పెద్ద పెద్ద కోరికలతో ఆశలతో వస్తూవుంటారు. అలా వాళ్లంతా తనకోసం రావడం ఆనంద నిలయునికి ఎక్కడలేని ఆనందం! వాళ్లంతా తనను కోరికలు కోరడం, తాను వరాలుఇవ్వడం ఆకొండలస్వామికి కొండంత ఉత్సాహం! అందువల్లే

ఆనందనిలయుడు తనకోసం వచ్చిన భక్తులందరికీ కూడా మహోదర్పంగా, హుందాగా, సునాయాసంగా, సుమందహాసం చేస్తూ వారి వారి కోరికలను తీరుస్తూవున్నాడు. వరాలను గుప్పిస్తూ వున్నాడు.

అందులోను ఈ కలియుగంలో నేనొక్కణ్ణి తప్ప మీకు వేరొక్కరు పెద్దదిక్కు లేనే లేదు. అంటూ శ్రీవేంకటేశ్వరస్వామి 'తననే శరణు వేడండి' అంటూ తన కుడిచేత్తో తన రెండుపాదపద్మాలను చూపుతూ వున్నాడు. అలా శరణు వేడిన వారిని తన అక్కున చేర్చుకుంటాననీ, ఆదుకొంటాననీ, ఆర్తులైనవారికి తన చేయిని ఊతనందించి ఊరట కలిగిస్తానని... ఇలా పరి పరి విధాల తన ఎడమచేయి (కటిహస్తం) భంగిమద్వారా భాష్యం చెపుతూ, ఏనాటినుంచో ఎప్పటి నుంచో భక్తులకోసం నిలువబడి వేచి వుంటూ, ఆ భక్తులు వచ్చినతోడనే చిరుమందహాసంతో ఆహ్వానిస్తూ, వారిని ఆనందపరుస్తూ తానూ మహానందపడుతూవున్న స్వామి ఆనందనిలయుడు. అందువల్లే –

వైకుంఠం వా పరిత్యక్ష్యే న భక్తాం స్త్యక్తు ముత్సహే
మేఽతి ప్రియా హి మద్భక్తా ఇతి సంకల్ప వానసి

'వైకుంఠాన్నయినా వదలివుంటానుగాని, తనను ఆశ్రయించిన భక్తులను మాత్రం ఒక్క క్షణమైనా విడిచి వుండలేను' అని శపథంచేసి ఈ భూలోక వైకుంఠంలో నిలిచివున్నస్వామి శ్రీనివాసుడు. కేవలం నిలిచి వుంటూ, ఆ భక్తుల కోరికలను తీరుస్తూ వుండడమే కాదు. ఆ భక్తులందరిలో తానూ ఒక్కడై తిరుగుతూ, ఆటలాడినాడు ఆనందించినాడు. పాడినాడు పరవసించినాడు. ఒక్కొక్క మారు ఆ భక్తులతో పరాచికాలాడినాడు. తిట్టించుకున్నాడు. దెబ్బలు కూడా తిన్నాడు. ఇలా ఆ భగవంతుడు తన భక్తులతో ఆడటం, పాడటం పాచికలాడటం, పరాచికాలాడటం. ఇవి ఒకనాటివా!... ఒక యుగానివా!..అనంతయుగాలలోని అనంతలీలల్లో, మన ఊహకు బుద్ధికి అందినవి, మనమతికి అర్థమయిన మహిమలను లీలలను, ఆసక్తిగా, ఆర్తిగా చర్చించుకుంటూ, ఆనందిస్తూ వున్నాంకదూ! అలాంటి వాటిల్లో..ఇదో!.. ఇది మరొక్కటి...అదేమంటే...

ఈ కలియుగంలోనే ఇటీవలి కాలంలోనే సాక్షాత్తుగా ఆనందనిలయు డయిన శ్రీస్వామివారు తన బంగారుమేడ నుండి బయలు వెడలి, తిరుమలక్షేత్రంలోనే ఒక పరమభక్తుని విడిదికి వెళ్లి పాచికలాడుతూ పర వసించినాడు మరి! ఒకప్పుడు ఆ భక్తునికి కలిగిన ఆపత్తులో ఆదుకొని ఆపద్బాంధవునిగా నిలిచిన స్వామి తిరుమలేశుడు. అంతేకాక ఆనాటి నుండి ఆ భక్తుడు పంపిన అవుపాలను, వెన్నను ప్రతిరోజూ తెల్లవారుజామున తొలిగా ఆరగిస్తూ ఆనందించి, ఆరగింపందుకుంటూ వున్నాడు. ఇది నేటికీ ఆనందనిలయంలో ఆమయిలోవుండి ఆ భక్తుని స్మరింపచేస్తూ వుంది. ఎవరా భక్తుడు?... ఏమిటా వృత్తాంతం? తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది కదూ! అయితే వెవులారా వినండిమరి! వినేముందు నోరారా ఒక్కసారి భక్తవత్సలుడైన బాలాజీని గట్టిగా స్మరిద్దాం.

*భక్తవత్సలా! గోవిందా!! గోవింద!!!*
*ఆపద్బాంధవ గోవిందా!! గోవింద!!!*

## శ్రీహథీరాం బావాజీ

భూలోకవైకుంఠంగా ప్రసిద్ధిపొంది నిరంతరం క్రొత్త క్రొత్త తేజస్సులతో వెలిగిపోతూ వున్న దివ్యక్షేత్రమయిన తిరుమలలో భక్తుల పాలిటి కొంగు బంగారమై కొలువైవున్న స్వామి ఏడుకొండలవెంకన్న. ఈ తిరుమలస్వామి వారు వెలసివున్న ఆనందనిలయానికి సరిగ్గా ఆలయానికి బయట ఆగ్నేయ మూలలో ఎత్తైన గుట్టపై ఒక పెద్ద దివ్యమైనభవనం దర్శనమిస్తూ వుంటుంది. ఈ భవనమే "మహంతుల మఠం" అని పిలువబడుతూవుంది. మహంతు అనగా సాధువు, సన్యాసి, అని అర్థం. ఈ మఠాన్ని స్థాపించిన మూలపురుడు "బావాజీ" అనే మహనీయుడు. పరమభక్తుడైన ఈయుననే "హథీరాంజీ!" అనీ, "హథీరాంబావాజీ!" అనికూడ గౌరవంగా, భక్తులు పిలుస్తూవుంటారు. ఉత్తర భారతదేశంలో ప్రచారంలోవున్న రామానంద సంప్రదాయానికి చెందిన పరమ వైష్ణవభక్తుడే ఈ హథీరాంజీ.

సుమారు 500 ఏండ్ల కిందట ఢిల్లీకి 24 మైళ్ల దూరంలో 'క్రేడల్ క్రేం' అనే గ్రామంలో రామానంద మఠం ఉండేది. ఈ మఠానికి

'అభయనందజీ' అనే సాధువు "మహంతుగా" (ఆశ్రమాధిపతి; గురువు) వుండేవారు. ఈ మహాపురుషుని శిష్యుడే 'బావాజీ'గా వ్యవహరింపబడే 'హథీరాంజీ'. గురువుగారి ఆజ్ఞ మేరకు శిష్యుడైన బావాజీ క్షేత్ర సందర్శనలు, తీర్థయాత్రలుచేస్తూ చివరకు వేంకటాచలక్షేత్రం చేరుకున్నారు. తిరుమల క్షేత్రానికి వచ్చిన బావాజీ ఇక్కడి క్షేత్రసౌందర్యానికి, తపస్సుకు అనువైన వాతావరణానికి ముగ్ధులయ్యారు. అంతమాత్రమేకాదు "కలౌ వేంకటనాయకః" అన్న ప్రసిద్ధిపొందిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి దయాగుణానికి, వరప్రదానానికీ, కీర్తిపతాకగా జగజ్జేగీయమానంగా నీలాకాశంలో ప్రకాశిస్తూ వున్న "బ్రహ్మాండనాయకుని బంగారుమేడ" కాంతులచేత ఆకర్షింపబడ్డాడు. శాశ్వతంగా ఇక్కడే నిలిచాడు. కోటి సూర్యప్రకాశంతో వెలుగుతూ నిత్యమూ కొత్త కొత్త కాంతులీనుతున్న ఆనందనిలయవిమాన బంగారు శిఖరాలు నిరంతరం కనపడేటట్లుగా, ఆలయానికి అతిసమీపంలోనే ఎత్తైన ప్రదేశంలో ఒక ఆశ్రమాన్ని ఏర్పాటుచేసుకున్నాడు. పరమరామభక్తుడైన ఈ బావాజీ, ఆ అయోధ్యారాముడే ఇక్కడ ఈ వేంకటాద్రిపై ఆనందనిలయరాముడై వెలిసినాడని భావించి ఆనందించినాడు. తీవ్రంగా ఉపాసించినాడు.

కేవలం ఆనందనిలయంలో మాత్రమే కాదు. ఆలయంబయట తిరుమల యాత్రచేసే ప్రతిభక్తునిలోనూ ఆ వేంకటాద్రిపతిని దర్శించి బావాజీ తన్మయుడయ్యేవాడు. అందువల్లే తిరుమల యాత్రికులకు, సాధువులకు సన్యాసులకు, అన్నదానాది కార్యక్రమాలు ఘనంగా నిరంతరం, భక్తిపూర్వకంగా నిర్వహించి సేవచేసేవాడు. ఇలా ఎలాంటి కోరికలు లేకుండా ఈ దివ్య క్షేత్రంలో మాధవసేవతోపాటు మానవసేవలో పాలుపంచుకొంటున్న పరమభక్తుడైన బావాజీకి పిలిస్తే పలికేవాడట వేంకటేశ్వరుడు. ఈయన చెప్పింది చేసేవాడట స్వామివారు. ఆరోజులలో తిరుమలయాత్రికులకు, ఒకటి స్వామివారి దర్శనం, రెండవది మహాయోగి అయిన మహంతు హథీరాం బావాజీ దర్శనం ప్రధాన కార్యక్రమాలుగా రూపుదిద్దుకున్నాయి. ఇంకొక దశలో శ్రీస్వామివారి దర్శనం కాకపోయినా పరవాలేదు. మహంతువారి ఆశీర్వచనం లభిస్తేచాలు సాక్షాత్తుగా ఆనందనిలయుని అనుగ్రహం దొరికినట్లేనని ఆనాటి భక్తులుభావించేవారంటే బావాజీవారి విశిష్ట వ్యక్తిత్వం, పవిత్రత, సాధుత్వం, భక్తి ఎలాంటివో తద్వారా స్పష్టమవుతవి.

ప్రతిరోజూ రాత్రి ఏకాంతసేవానంతరం తిరుమలక్షేత్రం అంతటా నిశ్శబ్దవాతావరణం అలుముకున్న వేళ సాక్షాత్తుగా ఆనందనిలయంనుండి శ్రీ వేంకటేశ్వరుడు బయలుదేరి అత్యంత భక్తుడైన బావాజీ విడిదికి వెళ్లేవాడు. సరససంభాషణలతో కాలాన్ని వెళ్ల బుచ్చేవాడు. అంతేకాదు. ఆ భక్తుడు, ఈ భగవంతుడు పణాలు ఒడ్డి, పాచికలాడేవారట! ఆ పాచికలాటలో వాదన ప్రతివాదనలు జరిగేవి! ఎంతవాదన ప్రతివాదనలు జరిగినా గెలుపు మాత్రం మహంతు బావాజీవారిదే! అలా భక్తునికి ఓడిపోయి, అణిగివుంటూ గెలుపుతో భక్తుడు ఆనందిస్తూ వుంటే చూచి ఆనందించడమే ఆనందనిలయుని వేడుక; ఇలా నిత్యమూ జరిగేది. బావాజీ శిష్యులకు, భక్తులకు లోపల ఏకాంతంగా బావాజీ ఎవరితోనో మాట్లాడుతున్నట్లుగా, మాటలు వినపడేవి. పాచికలాడుతున్నట్లుగా ఘల్లుమని ఇత్తడిపాచికల శబ్దాలు వినవచ్చేవి. కాని ఎవరికీ శ్రీనివాసుని దర్శనం మాత్రం అయ్యేది కాదు. ఈవార్త ఆనోట ఆనోట ఇలా తిరుమలక్షేత్రం అంతటా వ్యాపించి, యాత్రికులు, భక్తులు ఆలయ అర్చకులు, అధికారులు, మండలాధీశులు, సామంతులు.... ఇలా అందరికీ బావాజీవారిపై ఎనలేని భక్తిప్రపత్తులు ఏర్పడ్డాయి. అందువల్ల బావాజీ దర్శనం చేసుకున్న సామాన్య భక్తులు మొదలు మహారాజులదాకా ఆయనకు విరాళాలు ఇచ్చేవారు. ధనాన్ని సమర్పించేవారు. ఇలా దానాల ద్వారా విరాళాలద్వారా వచ్చిన ధనాన్ని మహంతుబావాజీ, తిరుమల క్షేత్రంలోనే తనమఠంలో సాధువులకు బైరాగులకు, యాత్రికులకు, భక్తులకు నిరంతరం, షడసోపేతంగా అన్నదానంచేసేవాడు. విందులు పెట్టేవాడు. తానుమాత్రం "రామపత్రం" అనే ప్రత్యేకమైన ఆకునుమాత్రం స్వీకరిస్తూ నిరాహారంగావుంటూ, తపస్సు చేసుకునేవాడు. సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వర స్వామివారి అనుగ్రహాన్నిపొందిన బావాజీవారి దర్శనంతో ఎందరో భక్తుల రోగాలుపోయేవి. రుగ్మతలు నశించేవి. కష్టాలు తీరేవి. సుఖాలు కలిగేవి.

ఇలా తానుమాత్రం నిరాహారంగా వుంటూ అందరికీ సంపూర్తిగా అన్నదానంతోపాటు తిరుమలేశుని భక్తులను ఆదుకొంటున్న బావాజీవారి కీర్తిప్రతిష్ఠలు బాగా వ్యాపించాయి.

ఇంతటి తపస్సంపన్నుడైన మహంతు బావాజీని చంద్రగిరి చక్రవర్తి గిరిధరరాయలు పరీక్షించదలచినాడు. "తిరుమల స్వామివారు మీతో ఆడుతూ, మాట్లాడుతూ వుంటాడనీ, పై పెచ్చు పాచికలాడుతూ పొద్దు పుచ్చుతూ వుంటాడనీ ప్రచారంలో ఉంది. అది నీలాంటి పిచ్చిబైరాగులు ఇలా ప్రచారంచేసుకొని భక్తులను మోసంచెయ్యడం డబ్బుపోగుచేసుకోడం పరిపాటి. కాని అదే నిజమైతే ఇదా! ఈ బండెడు చెరకును తిని, నీ శక్తిని రుజువుచేసుకో, లేదా తిరుమలక్షేత్రంనుంచి నిన్ను తరిమివేస్తా"నని బెదరించినాడు. ఆనాటి రాత్రి పశువులశాలలో బండ్లకొద్ది చెరుకు గడలను నింపి అందులో బావాజీని వుంచి తాళం వేశాడు. ఆ రాత్రే యథాక్రమంగా శ్రీ వేంకటేశ్వరస్వామివారు సాక్షాత్తుగా బావాజీతో పాచికలాడుతూ, ఆ పశువులశాలలో ఏనుగు రూపంలో అవతరించి ఆ చెరకును నమిలి తిన్నాడు. పశువులశాలకు తాళంవేసి బయట వున్న వారికందరికీ ఏనుగుఘీంకారాలు వినవచ్చాయి. వాకిలి సందులోనుంచి చూసినవారికి భయంకరమైన ఏనుగు కనపడింది. తెల్లారిచూస్తే ఏనుగులేదు. ఆ చెరుకులు లేవు. ఆయన మహిమకు అచ్చెరువందిన భక్తులు ఆనాటినుంచి "హథీరాంబావాజీ" అని భక్తిగా పిలిచేవారు. హథీ అనగా ఏనుగు. సాక్షాత్తుగా భగవంతుడే ఏనుగురూపంలో వచ్చి రక్షింపబడిన బావాజీ అనిఅర్థం. ఈలీలను చూచిన గిరిధరరాయలకు వైరాగ్యం కలిగింది. హథీరాం బావాజీకి శిష్యుడై "గిరిధరదాసు"గా మారాడు. ఈ చక్రవర్తి బావాజీకి శిష్యుడైనప్పటినుంచి విరాగులు అనీ, బైరాగులు అనీ పేరున్న మహంతుకు ఆయన శిష్యులకు 'విరాగిచక్రవర్తి' 'బైరాగిచక్రవర్తి' అని బిరుదులు కలగడమేకాక అప్పటినుండే రాజోచితమైన ఉపచారాలు ప్రారంభం అయ్యాయి. ఇంతమాత్రమేకాదు సింహాసనం (గద్దె), కిరీటం, నగరాలు, భేరీలు మోగించటం పల్లకీలు, ధ్వజాలు వగైరాలు ఏర్పాటయ్యాయి. అంతే కాదు. తిరుపతి, తిరుమలలో రాజవిడుదులుగా వున్న భవనాలు మహంతు మఠాలుగా మారాయి. లేదా మహంతు మఠాలు రాజమందిరాలవలె మహళ్లవలె నిర్మాణం చెయ్యబడ్డాయి. మహంతు హథీరాం బావాజీ, ఆనాటి నుండే తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారు ఆలయంలో అధికారికమైన పెత్తనంలేకపోయినా ఆలయ వ్యవహారాల్లో

ప్రధానమైన వ్యక్తిగా, మహాభక్తునిగా ప్రముఖపాత్ర వహించేవాడు. ఆనాటి నుంచే ప్రతిరోజు ఉదయాన మహంతు హథీరాం బావాజీ సుప్రభాతవేళలో నివేదనకుగాను శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అప్పుడే పిండిన ఆవుపాలను, నవనీతాన్ని (వెన్నను) పంపుతూ పచ్చకర్పూరం హారతిని సమర్పించేవాడు. ఆనాడు ఆ బావాజీ ఏర్పాటుచేసిన 'గోక్షీరనివేదన, నవ్యనవనీతహారతి' నిర్విఘ్నంగా మహంతు పేరుమీదనే జరుపబడుతున్నది. నేటికీ వీటిని మహంతు మఠంవారే సమర్పిస్తూ వున్నారు. ఆ తర్వాతి కాలంలో ఈ మఠాధిపతులంకువున్న శిష్యులవల్ల భక్తులవల్ల స్థిర చరాస్తులు విపరీతంగా పెరిగి పోయాయి. నానాటికి సంఘంలో అభివృద్ధిచెందుతూ ఒక సంస్థానం లేదా రాజాస్థానం హోదాలో స్థిరపడింది తిరుమలలోని మహంతులమఠం. ఇటు దక్షిణదేశ యాత్రికులకేగాక, ఉత్తరభారతంనుంచి వచ్చిన యాత్రికులకు ప్రధానమైన విడిదిగా వుండింది హథీరాంజీ మఠం.

ఇలా చాలాకాలం శ్రీవారిసేవలో జీవితం పండించుకొన్న మహంతు హథీరాంబావాజీ, వృద్ధాప్యంలో తిరుమల గోగర్భతీర్థం, ఆకాశ గంగ తీర్థాల నడుమ ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని ఏకాంతంగా, మౌనంగా నిరాహారంగా తపస్సుచేస్తూ వుండేవారు. ఒక్కొక్క వేళలో కొద్దితీయగా వున్న 'రామపత్రం' అనే ఆకునుమాత్రం బావాజీ భుజించేవారు. అదే ఆశ్రమంలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయాన్ని నిర్మించి ఆలయ ఆవరణలోనే అఖండంగా ఒక ధునిని (హోమగుండం) వెలిగించి, తపస్సుచేసుకొనే వారు. నానాటికీ పెరుగుతున్న భక్తులవల్ల తన తపస్సుకు భంగం కలుగుతున్నందువల్ల మహంతు బావాజీ ఒకానొక ఆశ్వయుజమాసం బహుళ త్రయోదశిరోజున తానే నిర్మించిన వేణుగోపాలస్వామివారికి, హోమగుండా నికి అతి దగ్గరలోనే సజీవసమాధి అయ్యారు. ప్రతిసంవత్సరం ఆరోజును పురస్కరించుకొని, అంటే నరకచతుర్దశి, దీపావళి పండుగకు ముందురోజు "శ్రీహథీరాంబావాజీవారిబర్సి" (సమాధి) పూజా ఉత్సవాలు వైభవంగా జరుపబడతవి.

ఆరోజు తిరుమల మహంతుమఠం నుంచి లడ్డుగోపాలకృష్ణుని (వెన్న ముద్ద కృష్ణుని) ఉత్సవవిగ్రహాన్ని ఊరేగిస్తూ మఠం నిర్వాహకులు

ఆకాశగంగతీర్థం సమీపంలోని వేణుగోపాలస్వామి ఆలయానికి వెళ్తారు. నేటికీ ప్రతిసంవత్సరం ఈ ఊరేగింపునకుగాను తిరుమల శ్రీవారి ఆలయంనుండి రెండు గొడుగులు, రెండు ఏనుగులు, మంగళవాయిద్యాలు మున్నగునవి మహంతువారిపై గౌరవసూచకంగా పంపబడతవి. అక్కడ శ్రీ వేణుగోపాలస్వామివారి మూర్తులకు, మహంతు హథీరాంబావాజీవారి సమాధికి అభిషేకాలు పూజలు ఘనంగా నిర్వహించబడతవి. మహంతుబావాజీ వారి సమాధిపూజలో భక్తులు, యాత్రికులు, తిరుమలస్థానికులు వేలాదిమంది పాల్గొంటారు. ఈ సమాధి ఉత్సవసందర్భంగా మహంతుమఠంలో విస్తృతంగా అన్నదానాన్ని నిర్వహిస్తారు.

తిరుమల శ్రీవారి ఆలయంలో ధ్వజస్తంభానికి ఎదురుగావున్న నడిమి పడికావలి (వెండివాకిలి) ప్రవేశమార్గంలోనే దక్షిణంవైపు గోడపై బావాజీ - వేంకటేశ్వరులు పాచికలాడుతున్న శిల్పం చెక్కబడింది. వీరి పక్కనే నిలబడి పాచికలాటను చూస్తూవున్న చంద్రగిరిరాజైన గిరిధరరాయుల (గిరిధరదాసు) శిల్పాన్ని కూడ మనం గమనించవచ్చు. ప్రవేశం ద్వారం, వాకిళ్లతోపాటు ఈ శిల్పానికి కూడ వెండిరేకు తాపబడింది. ఈ నడిమిపడి కావలి ప్రవేశద్వారం గోపురం క్రీ.శ. 1472 - 1482 మధ్య పునరుద్ధరింపబడింది. అంతేకాక తిరుమల మహంతుమఠంలోకూడ పాచికలాడిన స్థలంగా ప్రసిద్ధికెక్కిన చోట ఒకగద్దె (పీఠం)ను ఏర్పాటుచేసి, అక్కడా బావాజీవేంకటేశ్వరులు పాచికలాడుతూవున్న శిల్పం ఉంచబడివుంది.

## నవనీత హారతి

నేటికీ తిరుమల శ్రీవారి ఆలయంలో ప్రతిరోజు సుప్రభాత సమయంలో శ్రీస్వామివారికి గోక్షీర నివేదన, నవనీత హారతి జరుగుతాయి. ఇది మహంతుబావాజీ పేరుతోనే మహంతుమఠంవారు పంపిస్తూవుండగా నేటికీ జరగడం విశేషం. అదెలా జరుగుతోందంటే....

ప్రతిరోజు తెల్లవారుజామున తిరుమల మహంతుమఠంలోని ఒక సాధువు (సన్యాసి, బైరాగి) స్నానసంధ్యాదులు ముగించుకొని ద్వాదశ ఊర్ధ్వపుండ్రాలను (నామాలను) ధరించి భక్తిగా గోవిందనామస్మరణచేస్తూ అప్పుడే

పితికిన ఆవుపాలను, అప్పుడే తీసినవెన్న కలిగిన గిన్నెను పచ్చకర్పూర తాంబూలాన్ని వీటిని అన్నింటిని ఒక పళ్లెంలో వుంచుకొని, వాటిపై ఒక పట్టు వస్త్రాన్ని కప్పివుంచి, శ్రీవారి ఆలయానికి సుప్రభాతవేళకు బంగారు వాకిలివద్దకు తెచ్చి వేచి వుంటారు. సరిగ్గా సుప్రభాతవేళలో "కౌసల్యా సుప్రజారామ........." అని ప్రారంభించినవెంటనే సన్నిధిగొల్ల, అర్చకులతో పాటు, ఏకాంగి బంగారు వాకిలి లోపల ప్రవేశిస్తూ, మహంతుమఠం నుంచి తేబడిన పళ్లాన్ని తీసుకొనివెళ్తాడు. లోపల అర్చకస్వాములు, శ్రీస్వామివారికి మహంతు మఠంనుంచి వచ్చిన ఆవుపాలను నివేదించి తాంబూలాన్ని సమర్పించి నవనీత హారతిని ఇస్తారు. సుప్రభాతమంతా పూర్తి అయిన తర్వాత వరుసగా, తాళ్లపాకం, తరిగొండవారితోపాటు, మహంతుమఠం వారికి తీర్థ చందన, శఠారి మర్యాదలు జరుగుతాయి. ఇలా ప్రతిరోజు తెల్లవారు జామున తొలిగా జరిగే 'నవనీతహారతిమాత్రమేగాక, ప్రతిసంవత్సరం, శ్రీవారి ఆలయంలో జరిగే ఉగాది, శ్రీరామనవమి, ఆణివారాస్థానం, దీపావళివంటి ఆస్థానాల్లో, బ్రహ్మోత్సవంలో రథోత్సవంనాడు సయితం మహంతువారి తరుపున శ్రీస్వామివారు హారతులందుకొని ఆ భక్తుని పేరిట వచ్చిన సాధువులకు శఠారి మర్యాదలు జరుపుతూనే వున్నారు.

ఇక ప్రతి సంవత్సరం తిరుమల స్వామివారికి జరిగే పారువేట ఉత్సవం నాడు, పారువేటకు వెళ్లివచ్చిన తర్వాత ఆలయంచుట్టూ పురవీధుల్లో మహంతుమఠంవారి ఉభయంగా శ్రీస్వామివారి ఊరేగింపు సాగుతుంది. మహంతుతరుపున వచ్చిన వారికి చివరలో హారతి శఠారి మర్యాదలు జరుగుతున్నాయి.

తిరుమలలో పాపవినాశనం వెళ్లే దారిలో వున్న శ్రీవేణుగోపాలస్వామి వారిఆలయాన్ని, ఆ పక్కనే శ్రీస్వామిహాథీరాం బావాజీవారి సజీవ సమాధిని దర్శించవచ్చును. నేటికీ అక్కడికి వెళ్లిన భక్తులకు, బావాజీ స్వీకరించిన "రామపత్రం" అనే ఆకును ప్రసాదంగా ఇస్తారు. ఇది కొద్దిగా తీపిగా వుంటుంది. ఇచటవున్న శ్రీస్వామిహాథీరాం బావాజీవారి సమాధి, వేణుగోపాలస్వామిఆలయం మహంతుమఠం వారి ఆధీనంలో వున్నాయి. ఇక్కడ నిత్యమూ పూజలు జరుపబడుతూనే వున్నై.

శ్రీస్వామిహథీరాంబావాజీవారి మఠంశాఖలు తిరుమల, తిరుపతి లోనే కాక తిరుచానూరు, చిత్తూరు, వేలూరు, షోలింగర్, వృద్ధాచలం, తంజావూరు, మధుర, నాసిక్, పంచవటి, సుగూరు, బొంబాయి, భాగల్ కోట, గుజరాత్, అయోధ్యా, నాభా మున్నగుచోట్ల విస్తరిల్లినాయి. తిరుమల తిరుపతిలోని మహంతుమఠాల్లో కూడ శ్రీరామాలయాలు హనుమదాలయాలు వున్నాయి. వీటితోపాటు వందలాది సాలగ్రామాలను చూడవచ్చు. ఈ మఠాల్లో నేటికీ విశేషదినాల్లో ఉత్తరభారతంనుంచి వచ్చిన సాధువులకు బైరాగులకు అన్నదానం చేయబడుతున్నది. ముఖ్యంగా బంజారీలు, సుగాలీలు ఉత్తరదేశీయులైన అనేకులు హథీరాంజీ మఠంలో దిగటం, మహంతును దర్శించటం, ఆ తర్వాతనే శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శించడం సంప్రదాయంగా ఆనాటినుంచి కొనసాగుతూనే వుంది.

ఇలా వుండగా ఆంగ్లేయులకు పూర్వం తిరుమల, తిరపతి ఆలయాలు విజయనగరం, చంద్రగిరి, కార్వేటినగరం మున్నగు చక్రవర్తుల పాలనలో వుండేవి. ఆంగ్లేయులపాలన స్థిరపడ్డాక ఈస్టిండియా కంపెనీవారు, మద్రాసు రాష్ట్ర రెవిన్యూబోర్డు అధ్వర్యంలో ఉత్తరార్కాటు జిల్లా కలెక్టరు (1817 నాటి ఏడవ మద్రాసు శాసనాన్ని అనుసరించి) తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయాన్ని నిర్వహించేవాడు. ఇంతలో భారతదేశ మత విశ్వాసాల్లో, దేవాలయాల్లో, ధర్మసంస్థల్లో ఎలాంటి జోక్యం కలుగజేసుకోగూడదన్న చట్టాన్ని అప్పటి ఆంగ్ల ప్రభుత్వం అమలుపరచింది. దీనిప్రకారం అప్పటి కలెక్టరు ఈ తిరుమలలోని ఆలయనిర్వహణను చేపట్ట వలసిందిగా మైసూరు మహారాజావారిని, వెంకటగిరి సంస్థానాధీశుని అభ్యర్థించాడు. కాని వారు తమ సంస్థాన నిర్వహణల్లో మునిగి వున్నందువల్ల తిరుమల శ్రీవారిఆలయాన్ని నిర్వహించలేమను అభిప్రాయంతో నిరాకరించినారు. కాని భగవద్రామానుజుల కాలంనుండీ అప్పటివరకు ఆనాటివరకు తిరుమల, తిరుపతి ఆలయపూజల్లో ప్రధానపాత్రను నిర్వహిస్తూవున్న శ్రీ వైష్ణవ పీఠాధిపతులు, "పెద్దజియ్యంగార్, చిన్న జియ్యంగార్లు"పై ఆలయాల నిర్వహణను, పరిపాలించే అధికారాన్ని తమకు అప్పజెప్పవలసిందిగా కలెక్టరును కోరినారు.

కాని జియ్యంగార్లు ప్రతిరోజు తెల్లవారు జామునుంచి రాత్రివరకు నిత్యమూ జరిగే అనేక నిత్యోత్సవాల్లోను, వారోత్సవాల్లోను, మాసోత్సవాల్లోను, వార్షికోత్సవాల్లోను పూజల్లోను ప్రధానపాత్ర వహిస్తూ పర్యవేక్షిస్తూ వున్నందువల్లనూ, పైగా అన్ని పూజల్లోనువారి ప్రత్యక్షపాత్ర సంప్రదాయంగా నడుస్తున్నందువల్లా, అటు పూజలతోపాటు, ఇటు పరిపాలన సాగించలేరనే అభిప్రాయంతో వారి కోరిక తిరస్కరింపబడింది. అంతేకాక, వైష్ణవులైన జియ్యంగార్లలో "వడగల, తెంగల" అనే తెగలువుండి తమలో తాము కలహిస్తున్నందువల్లనూ కూడ తిరుమల ఆలయపాలన వారికి దఖలు పరచబడకుండా వారి అభ్యర్థన తోసిపుచ్చబడింది.

అప్పటికే తిరుపతి, తిరుమలలోనేగాక ఇంకా దేశమంతటా పలుచోట్ల మంచి స్థిరచరాస్థులు కలిగివుండడమేకాక, మీదుమిక్కిలి తిరుమల యాత్రికులకు అన్నదానం వంటి సేవాకార్యక్రమాల్లో పాల్గొంటూ ఒక ధర్మపీఠంగా, భక్తజనసేవాసంస్థగా పేరొందిన మఠంలోని మహంతులు, వైష్ణవ మతప్రచారకులే అయినందున, పైపెచ్చు ఈ మహంతుల్లో వడగల, తెంగలవంటి భేదాలు ఏవీ లేనందువల్లా, అటు ఉత్తరదేశీయులకు, ఇటు దక్షిణ దేశీయులకు సమన్వయాన్ని సాధించి, సేవలందిస్తూ వున్నందువల్లా క్రీస్తు శకం 1843 ఏప్రిల్ 21వ తేదీన అప్పటి కలెక్టరు 'సనద్' నివేదిక ప్రకారం తిరుమలలోని మహంతుకు వారి తదనంతర మఠాధిపతులకు తిరుమల తిరుపతి ఆలయాల నిర్వహణ బాధ్యతలను అప్పజెప్పటకు తీర్మానించారు.

## ఆణివార ఆస్థానం
## (16-7-1843)

అప్పటి తిరుమల మహంతుమఠం అధిపతి అయిన సేవాదాస్ జీ పేరుతో 1843 జూలై 10వ తేదీన "విచారణకర్తలు"గా ఉత్తర్వులు జారీ అయ్యాయి. 1843 జూలై 16వ తేదీన, సరిగ్గా దక్షిణాయన సంక్రాంతి రోజున అనగా ఆణివారం ఆస్థానం రోజున, ఆంగ్ల ప్రభుత్వంనుండి తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి యావదాస్తిని ఆభరణాలు, అలంకారాలు, కిరీటాలు, నగలు, నట్రా...వస్త్రాలు... పాత్రలు-ఉత్సవమూర్తులు... వాహనాలు... వాటికి

సంబంధించిన అన్ని రకాలైన వస్తువులతోపాటు... సంవత్సరాదాయ వ్యయాల లెక్కలతోపాటు సమస్తమూ ఆనాటి మహంతు అయిన సేవాదాసుజీకి దఖలు పరచబడినది.

మహంతు సేవాదాస్‌జీ మొట్ట మొదటి "విచారణ కర్తలు"గా నియమింపబడి, పరిపాలన అధికారం మార్పుజరిగిన 1843 జూలై 16 ఆణివార ఆస్థానం రోజు, తిరుమల శ్రీవారిఆలయ చరిత్రలో ఒక విశిష్ట ఉత్సవంగా, ఒక సువర్ణఘట్టంగా నిలిచింది. నేటికీ ప్రతిసంవత్సరం జూలై 16 ఆణివార ఆస్థానం రోజున దేవస్థానానికి సంబంధించిన మొత్తం తాళాల గుత్తిని దేవస్థానం ఉన్నతాధికారి అయిన కార్యనిర్వహణాధికారికి సమర్పించే ఆనవాయితీ అమలులో వుంది.

అప్పటినుంచి, ఆనాటినుంచి అనగా (16-7-1843) రోజునుండి తిరుమల తిరుపతి ఆలయాలనిర్వహణ, శ్రీస్వామిహాథీరాం బావాజీ శిష్య పరంపరలోని మహంతుల పాలనలోనికి వచ్చింది. వీరి అధికారముద్ర "విష్వక్సేనముద్ర" (సీలు).

మొదటి 'విచారణకర్త'గా దేవస్థానం పరిపాలన బాధ్యత స్వీకరించిన మొదటి మహంతు సేవాదాస్ జీ. వీరిపాలన సుమారు 21 ఏండ్లు కొనసాగింది. మహంతులు పాలన ఈవిధంగా సాగింది.

## శ్రీవారి సేవలో మహంతులు

క్రీ.శ. 1849 సౌమ్యనామ సంవత్సరంలో భాద్రపదశుద్ధ త్రయోదశీ గురువారం శ్రవణనక్షత్రంరోజున తూర్పున మార్కండేయతీర్థం, ఆగ్నేయంలో అగ్నితీర్థం, దక్షిణంలో యామ్యతీర్థం, నైరుతిలో వశిష్ఠ తీర్థం, పడమరలో వరుణతీర్థం, వాయవ్యంలో వాయుతీర్థం ఉత్తరాన కుబేరతీర్థం, ఈశాన్యంలో గాలవతీర్థం మరియు సరస్వతీతీర్థం. ఇలా 9 తీర్థాలు అష్టదిక్కుల్లో నిక్షిప్తమైవున్న శ్రీస్వామిపుష్కరిణిని మహంతు సేవాదాసు పునరుద్ధరించి అందులో శ్రీదేవి భూదేవి సమేత శ్రీవేంకటేశ్వరస్వామివారికి 'జలకేళి మంట పోత్సవం' (తెప్పోత్సవం) నిర్వహించినాడు.

మహంతు ధర్మదాసు తిరుపతిలోని శ్రీ కపిలేశ్వరతీర్థం పుష్కరిణిని దానిచుట్టూవున్న సంధ్యావందన మంటపాలను 10-2-1865 న రక్తాక్షి సంవత్సరం మాఘశుద్ధ పున్నమినాడు జీర్ణోద్ధరణ జేశాడు. వీరే 11-9-1878 లో బహుధాన్య సంవత్సర భాద్రపద పున్నమిరోజున తిరుమల శ్రీవారి పడికావలి గోపురాన్ని (మహాద్వార గోపురం) మరమ్మత్తులు చేశాడు. ఇతరమండపాల్ని కూడ నిర్మింపజేశాడు.

క్రీ.శ. 1900 లో దేవస్థానం విచారణకర్తగా పదవీస్వీకారం చేసిన మహంతు ప్రయాగదాసు 30-9-1908 లో తమ మఠం అధికారి అయిన రామలక్ష్మణదాసు పర్యవేక్షణలో శ్రీవారి ఆనందనిలయశిఖరంపై బంగారు కలశాన్ని ఏర్పాటు చేయించాడు. ఈ ఆనందనిలయ విమానమునకు అంతకు పూర్వం క్రీ.శ. 1260 నుండి ఐదుమార్లు బంగారుపూత పూయబడింది. ఈ వివరాలు తర్వాత తెలుసుకుందాం.

1900 నుండి 1933 వరకు 33 ఏండ్ల కాలము తిరుమల తిరుపతి ఆలయాలవిచారణకర్తగావున్న మహంతుప్రయాగదాసుకాలంలో తిరుమల శ్రీవారిఆలయం ఎంతో అభివృద్ధి చెందింది. తిరుమల యాత్రికులకు తిరుమలలోను, తిరుపతిలోను ధర్మసత్రాలు, కాలిబాటలో మెట్ల మరమ్మత్తులు, గాలిగోపుర నిర్మాణాలు, రహదారులు, యాత్రికుల పరిశుభ్రత, ఆరోగ్యం, వైద్య సదుపాయం, త్రాగునీరు, కాలిబాటలో విద్యుద్దీపాలు, తిరుపతిలోని పాత హూజూరు ఆఫీసు నిర్మాణం, మద్రాసులోని దేవస్థానం ముద్రణాలయం ఏర్పాటు, వెల్లూరులో, తిరుపతిలో హైస్కూళ్లు, వేదపాఠశాల, ప్రాచ్యకళాశాల, ఆయుర్వేద పాఠశాల, దేవాలయాల శిలాశాసనాల పరిశోధన, ముద్రణ, శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ఆభరణాలు, కిరీటాలు, మున్నగునవెన్నో మహంతు ప్రయాగదాస్ నిర్వహణలో జరిగాయి.

తిరుమలలోను, మార్గంలోను యాత్రికులు సంచరించుటకు వీలుగా వాషింగ్‌టన్‌లైట్లు ఏర్పాటు, తిరుమలలో యాత్రికుల చంటిపిల్లలకు ఉచితంగా ఆవుపాల వితరణ, విద్యార్థులకు ఉచిత భోజనసౌకర్యం వంటి ఎన్నో సేవలను చేశారు.

అయితే దేవస్థానం నిధులను దుర్వినియోగం చేసినట్లుగా పూర్వపు మహంతులపై అభియోగాలు వున్నందున దీనిప్రభావం ప్రయాగదాస్ పై కూడ పడింది. అంచేత అప్పటి మద్రాసు గవర్నరు తిరుమల తిరుపతి ఆలయాల నిర్వహణకుగాను ఒక ధర్మ కర్తలమండలిని ఏర్పాటుచేసి, మహంతుకు ఏలాంటి అధికారం లేకుండా చేశాడు. దానితో 1933 నుండి మహంతుల పాలన సమాప్తమయ్యింది.

| | | నుండి - వరకు | |
|---|---|---|---|
| 1. | మహంతు సేవాదాస్ జీ | 1843 - 1864 | 21 ఏండ్లు |
| 2. | మహంతు ధర్మదాస్ జీ | 1864 - 1880 | 16 ఏండ్లు |
| 3. | మహంతు భగవాన్‌దాస్ జీ | 1880 - 1890 | 10 ఏండ్లు |
| 4. | మహంతు మహావీర్‌దాస్ జీ | 1890 - 1894 | 4 ఏండ్లు |
| 5. | మహంతు రామకృష్ణదాస్ జీ | 1894 - 1900 | 6 ఏండ్లు |
| 6. | మహంతు ప్రయాగదాస్ జీ | 1900 - 1933 | 33 ఏండ్లు |
| | మొత్తం | | 90 ఏండ్లు |

ఎన్నో ఒడిదుడుకులకు లోనైనా నిఖార్సుగా 90 ఏండ్లపాటు (1843-1933) తిరుమల - తిరుపతి ఆలయాలపాలన మహంతుల పర్యవేక్షణలో అవిచ్ఛిన్నంగా సాగింది.

నేటికి శ్రీవారిఆలయంలో మహంతులపాత్ర నామమాత్రంగా మిగిలి వుంది. ప్రతిరోజు సుప్రభాతసమయాన గోక్షీరనివేదనం, నవనీతహారతి తిరుమల మహంతుమఠం నుంచే శ్రీవారికి సమర్పింపబడుతూవుంది. ఇవేగాక శ్రీవేంకటేశ్వరస్వామివారికి సాలీనా జరిగే ఉగాది, శ్రీరామనవమి ఆణివార ఆస్థానంవంటి ప్రతి ఆస్థానంలోను, కొలువులోను కేవలం హారతి, శఠారి మర్యాదలు మాత్రమే మహంతుమఠంవారు పొందుతూ వున్నారు. నేటికీ కోట్లాది స్థిరచరాస్థులు కలిగివున్న మహంతుల మఠం నేడు ఆంధ్ర ప్రదేశ్ దేవాదాయశాఖ ఆధీనంలో వుండి, పర్యవేక్షింప బడుతూవుంది.

## తిరుమల వేంకటేశ్వరుడు - తరిగొండ వేంగమాంబ

వినరన్న నే జూచు వేంకటేశ్వరుడు
మిన మిన మని చాల మెరసేటిదేమొ

గట్టిగా తలమీద గదియించి, దాని
చుట్టు పూదండలు చుట్టుకున్నాడు

లలిమించు మొసలి పిల్లలవంటివేమొ
తళుకుగా చెవులకు తగిలించినాడు

పచ్చ పచ్చటిదేమొ బహుశాన మేన
అచ్చుగా నందందు అతికించినాడు.

గల్లని కూశేటిగట్లు శ్రీపాద
పల్లవములందు ధరియించినాడు.

గుండూటి దొక్కటి కూసేటి దొకటి
రెండుచేతుల ధరియించియుండాడు

ఎడమచేతను కత్తి యురవంద దట్టి
కుడిచేత ధరణిపై గురిపెట్టినాడు

నల్లని మెయిలువర్ణము గలవాడు
తెల్లనై తగు పట్టెతిరుమణివాడు

కలికి చూపుల గొప్ప కన్నులవాడు
మొలకనవ్వులవాడు ముద్దులవాడు

పసపు బూసిన పాతపై హొయల్ మీర
విసువక వలెవాటువేసి వేడుకను.

తిరుమల దివ్యక్షేత్రంలో కొలువైవున్న ఆనందనిలయుడు అదివో! దర్శిం చండి! కన్నుల కరవెల్ల తీరునట్లుగా నిలువెల్ల కన్నులు చేసికొని దర్శించండి!

అదిగో! గజ్జెలు, అందియలు గల బంగారు పాదాలు. నిగనిగకాంతులతో మెరయు బంగారుదోవతి. దానిపై ఓగించికట్టిన నందకఖడ్గం! మొలనూలు. వరదహస్తం! కటిహస్తం, శంఖచక్రాలు! వక్షఃస్థలంపై ధరించిన మణికౌస్తుభం! మెడలో కంటె హారాలు, భుజకీర్తులు, నొసటన సింగారంగా మెరుస్తూ వున్న తెల్లని పచ్చకప్పూరపు నామం! ఇలా మణికిరీట మకరకుండలాలతో శంఖచక్రాలతో వరదకటి హస్తాలతో, చిన్మయదరహాసంతో దర్శనమిస్తూ వున్న శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యమంగళ విగ్రహమ్మూర్తిని రెప్పలార్పక దర్శించండి.

ఓహోహో! ఏమివైభవం! ఏమివైభోగం! ఏమి అందం! ఏమి చందం! ఏమిసొంపు. ఏమి సోయగం! ఏమి వైమరపు! ఏమి తన్మయత్వం ఇలా భువనమోహన సుందరుడైన బ్రహ్మాండనాయకుడు ఎందరికో తన దివ్యమంగళవిగ్రహదర్శనాన్ని అనుగ్రహిస్తూ వున్నాడు. ఎందరినో .... ఎంద రెందినో ఎన్నెన్నో విధాల ఆకర్షింపజేసుకుంటూవున్నాడు. ఎందరినో తన దగ్గరకు రప్పించుకుంటూ వున్నాడు. అలా వచ్చినవారు అందరిలో ఆనంద నిలయుని చిరుమందహాసానికి మరులుగొన్న వారు కొందరు. మకర కుండలాల కాంతితో నిగనిగలాడుతూవున్న చెక్కిళ్ల చక్కదనానికి చిక్కిన వారు మరికొందరు! తెల్లనైన నామాలసొంపుకు సోలినవారు ఇంకొందరు! ఆస్వామివారి కడకంటి చూపులకు కరిగిపోయినవారు మరికొందరు! పై చేతుల్లో శంఖచక్రాలను ధరించి కింది కటివరదహస్తాల సొంపైన భంగి మలో నిలిచిన స్వామివయ్యారానికి వశులైనవారు మరెందరో! జన్మజన్మాల పాపపంకిలాన్ని దర్శనమాత్రం చేతనే పునీతంచేసే దివ్యపాద ద్వయ సౌందర్యానికి దాసులై వచ్చినవారు ఇంకెందరో! ఇలా ఒక్కటేమిటి! ఒక్కరేమిటి! ఆస్వామివారిని, నిలువెత్తుగా అణువణువుచేత సమ్మోహింప బడి, నిరంతరం, దేవతలు, యక్షకిన్నర గంధర్వాదులు... మానవులు తిరుమలయాత్ర చేస్తూనేవున్నారు. కన్నులారా కన్నులనిండా శ్రీనివాసుని సమ్మోహన రూపాన్ని దర్శిస్తూనే వున్నారు. ఆ దివ్య సుందరరూపాన్ని చూడటానికి రెండుకన్నులు చాలక, ఆ అద్భుత తేజోరూపాన్ని ఒకేసారి

ఎందుకంటే ఎంతటిగొప్పదానశీలురకైనా, దాతలకైనా, వారి దయాగుణమును గూర్చిన ప్రచారం అత్యవసరంకూడ. ఆయా మహనీయులకు కీర్తికాంక్షలేకపోయినా వారి వారి దానగుణాలు, లక్ష్యాలు సంకల్పాలు సిద్ధించాలంటే తప్పక వారిని గురించి ప్రచారం చెయ్యవలసిందే. సాగవలసిందే. అప్పుడే యాచకులు, ఆర్తులు, అవసరంవున్నవారు ఆ యా దానశీలురవల్ల సంతృప్తి చెందుతారుకూడ.

అలాగే కొండలంతటి వరాలను గుప్పించెడి కొండలరాయడైన మన శ్రీ వేంకటేశ్వరస్వామి గొప్పదాత! కోరుకున్నవారి పాలిటి కొంగుబంగారం కూడ!

శ్రీ శ్రీనివాసః పరదైవతం నః
శ్రీ శ్రీనివాసః పరమంధనం నః
శ్రీ శ్రీనివాసః కులదైవతం నః
శ్రీ శ్రీనివాసః పరమా గతిర్నః

వృష శైలాధిప ఏవ దైవతం నః
వృషభాద్రీశ్వర ఏవ దైవతం నః
ఫణిశైలాధిప ఏవ దైవతం నః
భగవాన్ వేంకట ఏవ దైవతం నః

సర్వలోకాల్లో సర్వకాలాల్లో సర్వ ప్రదేశాల్లో పై విధంగా కీర్తింపబడిన శ్రీస్వామి వారిని మాత్రం, తమ తెలుగు నేలలో కొలువైవున్నా తెలుగువాళ్లు గుర్తించలేదేమో! తెలుగువారి ఇలవేలుపుగా, ఇలువేలుపుగా స్థిరపడిన తిరుమలేశుడు తెలుగువారికి చాలమేలు చేయదలచుకొన్నాడు. అందుకే ఆనందనిలయుడు అత్యంత ఆనందంగా అత్యంత ఉత్సాహంగా తననుగూర్చి ప్రచారం చేసుకోదలచినాడు.

"మరి తనను గూర్చి ప్రచారం చెయ్యడానికి ఎవరిని నియోగిస్తే బాగుంటుంది. పైగా తనకు అత్యంత సన్నిహితంగా మెలిగేవారిని, ఆంతరంగికంగా మసలేవారిని మాత్రమే నియోగిస్తే తనను గూర్చి చక్కగా ప్రచారం చేస్తారు. అప్పుడుమాత్రమే తెలుగువారికి మేలుచెయ్యవలెననే తన సంకల్పం చక్కగా సిద్ధిస్తుంది" అని అనంతకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీనివాసుడు

భావించినాడు. అంతే సర్వజగత్ప్రభువు అయిన తిరుమల శ్రీనివాసుడు తనకు అనంతయుగాల్లో తనకు అత్యంత సన్నిహితంగా, సర్వ వేళల్లో అంతరంగికంగావుంటూ ప్రీతిపాత్రమై మసలుతూవున్న సూర్యకతారి అనబడే నందక ఖడ్గంవైపు సాలోచనగా చూశాడు.

యుగ యుగాల్లో జగన్నాటక సూత్రధారి అయిన సప్తగిరీశుని సంకల్పాన్ని చూపులతోనే ఇట్టే పసికట్టి గురుతించడంలో సానపెట్టబడిన ఆ శ్రీవారిఖడ్గం, ఆ కఠారి, అదే ఆనందకం "చిత్తం! ప్రభూ! చిత్తం!" అంటూ శ్రీస్వామివారి ఆలోచనను ఆచరణలో పెట్టడానికి పూనుకొని తిరుమల క్షేత్రం నుంచి కదిలింది. ఆ తిరువేంకటాద్రినారాయణుని దివ్యమైన నాభి ప్రదేశంలో అలంకరింపబడిన ఖడ్గరాజం అయిన నందకం చిన్నగా తిరుమల నుండి బయలుదేరి తెలుగునాట నడిబొడ్డున తాళ్లపాకలోని పుణ్యదంపతులు నారాయణసూరి లక్కమాంబలగర్భంలో ప్రవేశించింది. తిరుమల శ్రీవారి సూర్యకతారే రూపుదాల్చి అన్నమయ్యగా అవతరించింది. ఆ నందకమే పరమగానాన్ని పలికిస్తూ అందరినీ పరవసింపజేసే అన్నమయ్య గళమై అలరారింది! ఆ ఖడ్గమే పదకవితలనే అమృతకావ్యాల్ని కురిపించే అన్నమాచార్యుల ఘంటమై అమరింది!

సాక్షాత్తుగా శ్రీమహావైకుంఠంలో శేషశాయి అయిన శ్రీమహావిష్ణువు భువికి దిగివచ్చి కోరి కోరి తెలుగువారినేలలో (వేంకటాచలంలో) కొలువై వుంటూ దివ్యదర్శనాన్ని ప్రసాదించడం ఒక అంతులేని ఆశ్చర్యం అయితే, ఇక ఆ స్వామివారి "నందక ఖడ్గం" ప్రత్యేకంగా తెలుగువారిని ఉద్ధరించడం కోసమే, రక్షించడంకోసమే, సన్మార్గంలో అంటే "అదివో అల్లదివో హరివాసము..." అంటూ సప్తగిరుల మార్గంలో ముందుకు వెళ్లేట్లు చెయ్యడంకోసమే, తెలుగునాట తెలుగువాడిగా అవతరించడం మరెంతటి పరమాశ్చర్యమో! పరమాద్భుతమో! పరమానంద దాయకమో! మరి అందుకు తెలుగుప్రజ చేసికొన్న మహద్భాగ్యమెంతటిదో! తెలుగువారు తరతరాలుగా ఒనరించిన తపస్సు ఎంత పరమోన్నతమైనదో! ఎవరికెరుక! అందుకే ఈ శుభసందర్భంగా శ్రీవారి నందకాయుధాన్ని ఇలా ప్రార్థించి నతమస్తకుల మవుదాం.

*రక్షోఽసురాణాం కఠినోగ్రకంఠ*
*చ్ఛేదక్షర చ్ఛోణిత దిగ్ధ ధారమ్*
*తం నందకం నామ హరేః ప్రదీప్తం*
*ఖడ్గం! సదాహం శరణం ప్రపద్యే!*

అదిగో నమస్కరించండి! అనంతకాలగమనంలో శ్రీస్వామివారి లక్ష్యమైన దుష్టశిక్షణ శిష్టరక్షణాకార్యక్రమాల్లో పాలుపంచు కొంటూ రాక్షసుల, శత్రువుల కంఠాల్ని తెగ నరకుతూ, రక్తధారల్ని కురిపిస్తూ వున్న నందక ఖడ్గరాజమా! శరణు! శరణు!!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ప్రస్తుతం ఆనందనిలయుని నందకం రూపురేఖలు మారినా, ధ్యేయం మారినా ఆ కఠారి వాడీ వేడీ, అన్నమాచార్యులవారి మధురగళంలో చోటు చేసుకొని సునిశితమైన తెలుగుపదకవితల్ని ఎలుగెత్తి చాటింది. ఆ కొండల రాయని కొనదేరిన ఖడ్గం యొక్క పదునూ, తీక్షణత, ప్రతిభక్తునిగుండెను మీటుతూ మనసును పరవశింపజేసి మరులు గొలుపుతూ, తిరుమలేశుని దివ్యమంగళమూర్తి దర్శనానికి అర్రులు చాచేట్లుగా సంకీర్తనామృతాన్ని చిలికించిన అన్నమయ్యలేఖినియై వర్ధిల్లింది.

అప్పటి నందకం అనంత కాలగమనంలో జరిగివున్న దాగివున్న తిరువేంకటప్రభువుల దుష్టశిక్షణా, శిష్టరక్షణా కార్యక్రమాల్ని లీలల్నీ మహిమల్నీ ప్రత్యక్షంగా అతి సన్నిహితంగా దర్శించింది. అంతమాత్రమేకాదు. ఆ కార్యక్రమాల్లో స్వయంగా పాలుపంచుకుంది. మరి ఈనాటి నందకమో! (అన్నమయ్య) అప్పుడు స్వయంగా పాలుపంచుకొన్న దర్శించినవాటికన్నింటికి అక్షర రూపంగా ఎలుగెత్తి ప్రత్యక్షసాక్ష్యం పలుకుతూవుంది.

శ్రీ వేంకటేశ్వరభక్తి ప్రచారోద్యమ లక్ష్యంతో, ధ్యేయంతో అవతరించిన నందకాంశ సంభూతుడు తాళ్లపాక అన్నమాచార్యులు, నందకాయుధధారి, ఆనందనిలయుడైన శ్రీ వేంకట ప్రభువులవారి అనుగ్రహాన్ని తాను సంపూర్తిగ పొందినాడు. తానొక్కడు మాత్రమే ఆ కోనేటిరాయుని కృపను ఆశించలేదు. ఆయన అనుగ్రహాన్ని లోకులందరూ పొందాలి. తిరుమలేశుని దయను తెలుగుప్రజయావత్తూ చూరగొనాలి. అదే అన్నమయ్య ఆరాటం.

కనుకనే అన్నమయ్య వేంకటేశ్వరభక్తిప్రచారోద్యమంలో తిరుమల మొదలు కొని ఊరూరా, వాడ వాడలా, తిరిగి 'దేవుడు మెచ్చునట్లుగ, లోకము మెచ్చునట్లుగ త్రికరణశుద్ధిగ వేంకటేశ్వరునిపై పదాలను అల్లి ప్రచారం చేసినాడు. ఆయా ఊళ్లలోని దేవుళ్లను వేనోళ్ల కీర్తించినాడు. ఆ దేవుళ్లల్లో కూడ వేనామాల వెన్నుని దర్శించి' వినావేంకటేశం ననాథో ననాథః" అని ఏకత్వంలో భిన్నత్వాన్ని భిన్నత్వంలో ఏకత్వాన్ని నిరూపించి ఉపదేశించినాడు.

తాను సంచరించిన ప్రతిచోటా ప్రతి పేటా, ప్రతికోటా ప్రతి వీధీ, వాడా వేంకటేశ్వరుని గూర్చి...

"పరమాత్ముడు పరమపురుషుడు
పరికింపగ కృపాలుడు
తిరువేంకట విభుడుకాక
దేవుడు మరి కలడా"

అంటూ వివరించి చెప్పుతూ, అందులకే

"భావములోనా బాహ్యామునందును
గోవింద గోవింద యని కొలువవో మనసా"

అని అన్నమయ్య అడుగడుగునా లోకులను ప్రబోధించినాడు. తిరు వేంకటనామము వెల సులభము ఫల మధికము, అని కొనియాడి ప్రచారం చేసినాడు. ఈ తిరుమల హరిని కొలువని కొలువులు అడవిగాచిన వెన్నెలలనీ, ఈ అచ్యుతునిగూర్చి వినని కథలు భువిలో గజస్నానాలనీ, కలియుగ వైకుంఠుని గూర్చి పొగడని పొగడ్తలు బూడిదలోపోసిన పన్నీరులనీ, కొండల రాయని కోరని కోరికలు అందనిమానిపండ్లని, తిరుమలేశుని తెలియని తెలివి ఏదైతే వుందో అది నట్టనడి ఏటిలోని పైరులనీ, కేశవుని ఒల్లని బదుకులు ప్రవాహంలో కలిపిన చింతపండువంటిదనీ, గోవిందునికి మొక్కని మొక్కులు గోడలేనిగాలి చిత్రాల వంటివనీ హెచ్చరిస్తూ, తిరుమలస్వామిని గూర్చి అడుగడుగునా భక్తులకు తెలియజేసినాడు అన్నమయ్య —

"కలడా ఇంతటి దాత కమలనాభుడేకాక
కలడన్నవారిపాల కలిగిన దైవము

అని వేంకటాచలపతిని గూర్చి ఎలుగెత్తి చాటుతూ, ఓ భక్తులారా కలుషాలతో నిండివున్న ఈ కలియుగంలో మీకందరికి సర్వవేళల్లో సర్వ ప్రదేశాల్లో, సర్వావస్థల్లో రక్షణ కల్పించే పెద్దదిక్కు హరినామము తప్ప మరి లేనేలేదు. అంటూ ఆకటి వేళల్లో, అలపైన వేళల్లో, కొరమాలివున్నవేళ, కులము చెడినవేళ, వొరులచే చిక్కి చెరలోవున్నవేళ, వొరపైన హరినామము ఒక్కటే గతి, వేరేదారి లేనే లేదు! ఆ నామాన్ని మరిస్తే, దారే లేదు.

ఆపదవచ్చినవేళ, ఆరడిబడినవేళ, పాపపువేళ, భయపడినవేళ వోపినంత హరినామం చెయ్యడమే గతి దప్ప, ఇతరత్రా ఎంత పొరలినా ఏమాత్రం లాభం లేనే లేదు.

సంకెళ్లబెట్టిన వేళ చంపబిలిచినవేళ, అప్పులవారు ఆరడిపెట్టినవేళ వేంకటేశుని నామమొక్కటే నిన్ను విడిపించగలదుగాని, మంకుబుద్ధితో మాపుదాకా ఇతరత్రా ప్రయాస పడినా మరి దారి దొరకనే దొరకదు అంటూ అన్నమయ్య "ఓ కలియుగ మానవులారా! భక్తులారా! అదిగో అటు చూడండి, మీ కన్నులెదుటే కనుపిస్తూ వున్న వైకుంఠం."

కట్టెదుర వైకుంఠము కాణాచయన కొండ
తెట్టెలాయ మహిమలే తిరుమలకొండ

అంటూ వేంకటాచల శిఖరాలకు దారిచూపించినాడు. అంతేకాదు. అది కేవలం రాళ్లు రప్పల మయం కాదు. గుండ్లూ గుట్టల మయం కానే కాదు. సాక్షాత్తు శ్రీ వైకుంఠమే ఈ తిరుమల అంటూ స్పష్టం చేసినాడు.

ఏడుకొండలమీద, ఆనందనిలయ మనే బంగారుమేడలో కొలువై దర్శనమిస్తూ వున్న అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుణ్ణి వర్ణిస్తూ ఒక్కచోట అన్నమాచార్యులు "చేరి కొలిచిన వారి చేతిలోని కుంచ (కొలపాత్ర) మట! కోరి నుతించిన వారిపాలి కొంగుపైడి! మేరమీరి దలచువారి మేటినిధానం! సారమైన విజ్ఞానులకు సచ్చిదానందుడు! కావలెననేవారికి కామధేనువు! మరి సేవచేసేవారికి అరచేతి చింతామణి! నీవే గతి అన్నవారికి నిఖిల రక్షకుడు! శరణువేడే వారికి భాగ్యరాశి! పూజించేవారికి నిజమైన పరతత్త్వం! అన్నిటా దాసులకు ఏలిక! ఇహ పరాలలో కాచుకొని ఇచ్చే ఫలదాయకుడు ఈ తిరుమల గోవిందుడు." అంటూ తేట తెల్లం చేసినాడు. అంతేకాదు.

అన్నివేళల్లో శ్రీ తిరుమలస్వామివారికి జరుగుసేవల్లో, ఉత్సవాల్లో పాలు పంచు కొన్నాడు. సుప్రభాతవేళల్లో సప్తగిరీశునికి మేలుకొలుపులు పాడినాడు. శోభాయమానంగా అలమేలుమంగా వేంకటేశ్వరుల కల్యాణాన్ని చేయించాడు. శ్రీదేవికిని దేవునికి తెప్పోత్సవం చేయించాడు. ఊరేగింపులు నిర్వహించి నాడు. ఇతరులచే నిర్వహింపజేసినాడు. ఇలా భక్తకోటికి కొంగుబంగారమై దర్శనమిస్తూవున్న తిరుమల కోనేటిరాయునికి నిత్యమూ జరిగే సుప్రభాతం మొదలు ఏకాంతసేవ వరకు జరిగే పూజాకార్యక్రమాల్లో పాల్గొని శ్రీస్వామి వారి వైభవాన్ని గూర్చి పాడి పరమగానాలుగా భక్తలోకాని కందించినాడు అన్నమాచార్యులు.

ప్రతిరోజు తిరుమల దివ్యక్షేత్రంలో శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయ దినచర్య తెల్లవారుజామున 3 గంటలకు శ్రీవారి సుప్రభాత పఠనంతో ప్రారంభమవుతుంది. అదే సుప్రభాతసేవ.

అర్చకస్వాములు, సుప్రభాతాన్ని పఠించే వేదపండితులు, తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయులు, ఆలయఅధికారులు, సుప్రభాత సేవలో పాల్గొనే భక్తులు ఇలా వీరందరూ, ప్రతిరోజు తెల్లవారుజామున 2-30 గంటలకు పవిత్ర బ్రాహ్మముహూర్తంలో, అత్యంత ప్రశాంతంగా అత్యంత ఆహ్లాదంగా మనోహరమై చల్లదనంతో తనువుల్నీ మనస్సుల్నీ మైమరిపిస్తూ వున్న శుభవేళలో అపరవైకుంఠమని ప్రసిద్ధికెక్కిన బంగారువాకిళ్ల ముందు చేరి; శ్రీస్వామివారిని మేలుకొలపడానికి సిద్ధమై, భక్తి ప్రపత్తులతో వినమ్రులై నిరీక్షిస్తూ వున్న వేళ! ఆనందనిలయుని నిలువెత్తు దివ్యమంగళ విగ్రహమూ ర్తిని దర్శించటానికై అర్రులు చాస్తూ భక్తులు ఆత్రంగా బారులు తీరినవేళ! అలాంటి దివ్యమైన సన్నివేశంలో తొలిగా ఆలయ అధికారుల జియ్యంగారుల, అర్చక స్వాముల పర్యవేక్షణలో 'సన్నిధిగొల్ల' బంగారు వాకిళ్లకు ఉన్న పెద్ద పెద్ద తాళాలను తీస్తాడు. పిదప అర్చకస్వామి, తమదగ్గరవున్న 'కుంచెకోల' అనె కొడవలి లాంటి ఆకారంలోవున్న ఇనుపకడ్డీతో (యంత్రిక) బంగారు వాకిళ్లకు వున్న చిన్న రంధ్రంలో దూర్చి లోపలివైపు వేసిన గడియను తీస్తారు. పిదప సన్నిధిగొల్ల బంగారువాకిళ్లను కొద్దిగా తెరచి తొలిగా తాను లోపల ప్రవేశిస్తాడు. ఆ వెనువెంటనే అర్చకస్వామి "కౌసల్యా సుప్రజా రామా!..."

అంటూ బిగ్గరగా శ్రీవారి సుప్రభాతాన్ని ప్రారంభిస్తూ, గొల్లతోపాటు లోపల ప్రవేశించి వెంటనే వాకిళ్లు మూసివేస్తారు. ఆ వెంటనే అర్చకులవెంట జియ్యంగారులు పరిచారకులు, అర్చకస్వామి ప్రారంభించిన సుప్రభాతాన్ని బంగారువాకిలి ముందు సిద్ధంగావున్న వేదపండితులు అందుకొని సుప్రభాతాన్ని శ్రుతి శుభగంగా, ప్రారంభించి హృదయంగమంగా సుస్వరయుక్తంగా పఠిస్తారు.

## మేలుకొలుపు

సరిగ్గా ఇదే సమయంలో, బంగారు వాకిళ్లకు విడుపున ఆనుకొని ఒక చేత్తో తంబురను (దండె) మీటుతూ, ద్వాదశోర్ధ్వ పుండ్రాలతో (నామాలతో) నల్లనైన సొంపైన దివ్యదేహంతో ప్రకాశిస్తూ వున్న ఒకవ్యక్తి, బంగారువాకిళ్లలోపల గర్భాలయంలో కొలువైవున్న శ్రీ వేంకటనాథులను.

మిన్నక వేసాలు మాని మేలుకోవయ్యా
సన్నల నీ యోగనిద్ర చాలు మేలుకోవయ్యా!

*ఆవులు పేయలకుఁగా నఱచీఁ బిదుకవలె*
*గోవిందుడ! యింక మేలుకొనవయ్యా!*
*ఆవలీవలి పడుచు లాటలు మరిగివచ్చి*
*త్రోవ గాచుకున్నారు ప్రొద్దున మేలుకోవయ్యా!*

*పిలిచీ నందగోపుడు పేరుకొని యదె కన్నుఁ-*
*గొలుకులు విచ్చి మేలుకొనవయ్యా!*
*అలరిన శ్రీవేంకటాద్రి మీఁది బాలకృష్ణ!*
*యిల మా మాటలు వింటి విఁక మేలుకోవయ్యా!*

అంటూ భూపాళరాగంలో మేలు కొలుపులను పాడుతూ మనకు దివ్యదర్శనం ఇస్తూ మనకు గోచరిస్తారు. ఇలా నిత్యమూ ప్రతిరోజు, బంగారువాకిళ్ల చెంత.

*శ్రీకర! వేంకట క్షితిధరావాస!*
*నాకేశ నుత! రమానాథ! మేల్కొనుము.*

18. వసుదేవ దేవకీ వరగర్భ జాత!
కిసలయాధర! రామకృష్ణ! మేల్కొనుము!

తపము పెంపున యశోదానందులకును
కృపతోడ శిశువైన కృష్ణ! మేల్కొనుము!

అటిముటి శకటాసురాంగంబులెల్ల
విటుగ దన్నిన యదువీర! మేల్కొనుము!

సుడిగాలి రక్కసు స్రుక్కంగ బట్టి
కెడపిన యదుబాలకృష్ణ మేల్కొనుము!

అంటూ శ్రీస్వామివారిని మేల్కొలుపుతూ సాక్షాత్తు 'హరి యవతారంగా' భక్తులకు దర్శనమిస్తూ కన్నులపండువు చేసే మహనీయుడే తాళ్లపాక అన్నమాచార్యులు. నేటికీ ప్రతినిత్యమూ, తాళ్లపాక అన్నమయ్య వంశీయులే మనకు మేలుకొలుపులు పాడుతూ దర్శనమిస్తారు.

## జోలపాట

ఇలా ఒక్క సుప్రభాతవేళలో మాత్రమే కాదు. ప్రతిరాత్రి చివరగా మళ్లీ బంగారు వాకిళ్లు మూసివేసేముందుగా, మళ్లీ అఖిల జగాల నేలే ఆనందనిలయుడు బంగారు తూగుటుయ్యాలలో యోగనిద్రకుపక్రమించే సమయంలో

జోవచ్యుతానంద! జో జో ముకుంద!
రావె పరమానంద రామగోవింద!

అంటూ శ్రీవారికి జోలపాడుతూ, లేదా లాలిపాడుతూ, బంగారు వాకిలిలోపల రాములవారిమేడ నడవన దర్శనమిస్తాడు అన్నమాచార్యులు. ఈ శుభసమయంలో మనల్ని నిండుగా మెండుగా అనుగ్రహించి ఆశీస్సులందించవలసిందని ప్రార్థించి ముందుకు సాగుదాం.

హరి యవతార మీతడు అన్నమయ్య
అరయ మాగురు డన్నమయ్య

ఇలా ఈనాటికీ ప్రత్యక్షంగా శ్రీవేంకటేశుని సేవలో వంశపారంపర్యంగా పాలుపంచుకొంటూ వున్న అన్నమయ్య అవతరించిన దివ్య సన్నిధానం తాళ్లపాక.

## తాళ్లపాక

"ఏడుకొండలు"గా ప్రసిద్ధి పొందిన శేషాచల శిఖరాలకు చుట్టూ ఎన్నో పుణ్యభూములు.... మరెన్నో దివ్యస్థలాలు నెలకొని వున్నాయి. అలాంటివాటిలో "పొత్తపినాడు" పెట్టిందిపేరు. వేంకటాచలానికి సరిగ్గా వాయువ్య మూలలో నెలకొన్న నిక్కమైన అందాలసీమ పొత్తపి నాటిసీమ. ఆ పొత్తపినాటిలో పరమాత్ముని దివ్యహస్తం నుండి జాలువారిన మనోహర వర్ణచిత్రమా అన్నట్లు తిలకించినదే తడవుగా తరింపచేసేపల్లె. అదే తాళ్లపాకగ్రామం.

ఆ ఊరికి ఒకవేపున దట్టంగా పరచిన తివాసీలా పచ్చనిపంట పొలాలు. ఆ పొలాల్లో పాడుకొంటూ పని చేసికుంటూ వున్న పల్లెజనం. మరొకవైపు గట్టున వున్న తాటితోపును, కొబ్బరి చెట్లను.. వినీలాకాశాన్నీ ప్రతిబింబిస్తూ అద్దంలా మెరుస్తూవున్న పెద్ద చెరువు. ఆ చెరువుగట్టున మరి కొంతదూరంలో ఒకగుడి. ఆ గుడి గోడలను, గోపురాన్ని పరిశీలనగా గమనిస్తే ఆ గుడి చాల పాతదిగానే తోస్తుంది. ఆ గుళ్లో రెండడుగుల పీఠంపై శ్రీ చెన్నకేశవస్వామి నిలువెత్తు విగ్రహం! పక్కనేవున్న చమురు దివ్వె వెలుగులో కొత్తకాంతులు వెదజల్లుతూ ఆనాడు మరింత సౌందర్యాన్ని వెలారుస్తూ వున్నాడు. శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి.

జనమేజయమహారాజు ప్రతిష్ఠగా ప్రసిద్ధిచెందిన ఆ తాళ్లపాక చెన్నకేశవుణ్ణే ఆశ్రయించి, ఆరాధించి ఆనందమయంగా జీవితాల్ని పండించుకునే పండితవంశం ఆ ఊళ్లో ఒకటుండేది. అప్పట్లో ఆవంశంలో విఠలయ్య, ఇటు చెన్నకేశవుని పూజతోపాటు, లౌకికమైన వ్యవసాయాన్ని చేస్తూ సంసారాన్ని జోడెద్దుల బండిగా నడుపుతూవుండేవాడు. ఆ విఠలయ్యకు లేక లేక ఒక పుత్రుడు పుట్టాడు. తనపితామహుని పేరు తనకు పెట్టి నట్లుగానే తన గారాల కొడుకుకు "నారాయణయ్య" అని తన తండ్రిపేరు పెట్టి అల్లారు ముద్దుగా గోముగా పెంచాడు. పండిత పుత్రుడన్నట్లుగానే నారాయణయ్య

తండ్రిచేసిన గోమువల్ల ఓనమాలు దిద్దడు. అమరకోశం వల్లించడు. అసలే మందబుద్ధి. ఆపైన మంకుపట్టు. తన ప్రేమే తన కొడుకును ఇలా చేసిందేమో అని ఆలోచించిన విఠలయ్య తాళ్లపాకకు దగ్గరలోవున్న ఊటుకూరు లోని ఒక అయ్యవారివద్ద నారాయణయ్యను చదువుకోసం చేర్చాడు. ఆ గురువుగారు సాక్షాత్తు విశ్వామిత్రుడల్లే మహాకోపిష్టి. చూస్తేనే విద్యార్థులు జడుసుకునేవారు. చండశాసనుడైన ఆ గురువువద్ద నారాయణయ్య చదువు వచ్చినది కాస్తా మర్చిపోయాడు. పైగా శిక్షలు ఎక్కువయ్యాయి. ఊతబెత్తాలతో వళ్లు హూనమయ్యేట్లు చీరేవాడు. కోదండం (దూలానికి వేలాడదీయడం) చేసేవాడు. ఎండలో నిలబెట్టేవాడు. ఇలాంటి అనేకమైన శిక్షలతో నారాయణయ్యకు ఉన్నమతి కాస్తా పోయింది. భయపడి ఊరికి పోతే తండ్రి చీరేస్తాడు. మరి ఇక్కడో నరకయాతన. పాపం పసివాడైన నారాయణయ్య పరిపరి విధాలుగా ఆలోచించి చచ్చిపోవడం ఒక్కటే దీనికి పరిష్కారం అని దృఢంగా నిర్ణయించుకున్నాడు. అయితే ఎలా చావడం?

ఆ ఊటుకూరు పల్లె పొలిమేర (సరిహద్దు)లో చింతలమ్మగుడివుంది. ఆ గ్రామదేవత గుడిపక్కనే ఒక పెద్దపుట్టలో భయంకరమైన కాలసర్పం వుందని అప్పట్లో ప్రచారం వుండేది. పైగా చూచినవాళ్లు ఒకరిద్దరు వున్నారనీ దాన్ని చూస్తేనేచాలు ప్రాణం పోతుందనీ, ఇక అది కరిస్తే బతికి బట్టకట్టడం హుళక్కి అని అందరూ ఆ పామును గురించి చెప్పుకొనేవాళ్లు. ఈ విషయాన్ని విన్న నారాయణయ్య ఒకనాటి అర్ధరాత్రి నేరుగా పొలిమేరలో వున్న చింతలమ్మగుడి దగ్గర వున్న పుట్టదగ్గిరి కెళ్లాడు. గుండెను రాయిగా చేసుకొని ఆ పాముతో కాటువేయించుకొని చచ్చిపోవాలని నిశ్చయించి ఆ పాము పుట్టలో చేయి పెట్టి కళ్లు మూసుకొని కూర్చున్నాడు. పాము కరుస్తుంది. కాటువేస్తుంది అని అనుకొంటూ ఎదురు చూస్తున్నాడు నారాయణయ్య. కాని పాము రాకపోగా తనముందు ఆ నడిరాత్రి ఒక స్త్రీ ఎదుట నిలిచింది. ఆమె ఆ గ్రామదేవత చింతలమ్మ. పిల్లవాడైన నారాయణయ్యను నీవు ఎవరు ఎందుకింత దుస్సాహసం చేస్తున్నావు నాయనా! అని అడిగింది. నారాయణ్య గట్టిగా ఏడుస్తూ తనమందబుద్ధిని గూర్చి, అయ్యవారు పెట్టే శిక్షలను గూర్చి వివరించి, ఇక ఆ బాధలను భరించలేక ఇలా పుట్టల్లో చెయ్యిపెట్టానని చెప్పాడు. అంత ఆ దేవత నారాయణయ్యను

బుజ్జగించి, అబ్బాయీ! నీవు ఏమాత్రం చింతించవద్దు. మీ వూళ్లో చెన్నకేశవస్వామికి ప్రదక్షిణంచేస్తే నీకు అన్ని విద్యలు ఇట్లే సిద్ధిస్తాయి. పైగా నీకు మూడో తరంలో శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహంవల్ల పరమ భక్తుడు నీకు మనవడుగా పుట్టి జగదేకవల్లభుని అవతారంగా కీర్తినందుతాడు. అని ఆశీర్వదించి పంపింది. ఆ రాత్రికి రాత్రే బాలుడైన నారాయణయ్య తాళ్లపాకను చేరుకుని చెన్నకేశవుణ్ణి పూజించి, ప్రదక్షిణలు చేశాడు. ఆ స్వామిదయవల్ల అన్ని విద్యలూ ఇట్లే అలవడినాయి. పెరిగి పెద్దవాడైన ఆ నారాయణయ్యకు కలిగిన బిడ్డే నారాయణసూరి. ఇతని అర్ధాంగి సాక్షాత్తు లక్ష్మీదేవిగా పేరొందిన లక్కమాంబ.

నారాయణసూరిదంపతులకు చాలాకాలం వరకు సంతానం కలుగ లేదు. బిడ్డల కోసం అర్రులుచాచిన నారాయణసూరి, లక్కమాంబలు వంశము నుద్ధరించే కొడుకుకోసం తిరుమలయాత్ర చేశారు. పసుపుబట్టలతో దీక్షగా యాత్రకు బయలుదేరిన నారాయణ సూరి దంపతులు తిరుమలలోని కోనేట్లో స్నానం చేశారు. తొలిగా శ్రీ ఆదివరాహస్వామిని సేవించారు. పిదప శ్రీవారి ఆలయంలో ఆ దంపతులు అడుగడుగు దండాలు పెడుతూ ప్రవేశించారు. బంగారు వాకిట్లో ప్రవేశించారు. బంగారు కొండ అయిన ఏడుకొండలవాని నిలువెత్తు దివ్య మంగళ విగ్రాణ్మూర్తిని.

*కాంచన పాదముల్ గజ్జెలు నందియల్*
*గదుమించు మొల జంద్రకావిదట్టి!*
*పీతాంబరము మీఁద బిల్లల మొలనూళ్లు*
*బిగియించి కట్టిన పెనుకటారి!*

*వరదాన కరము నుజ్జ్వల కటిహస్తము*
*పటు శంఖ చక్రోరు బాహుయుగము*
*నొఱపైన నాభియు నుదరబంధ మురంబు*
*నలమేలు మంగతో హారములను*

*శిరసుమకుటంబు దిరుమణి చిత్ర మకర*
*కుండలంబులు గల మిమ్ము గోరి తలతు*

కలిత లక్ష్మీశ సర్వజగన్నివేశ
విమల రవికోటి సంకాశ! వేంకటేశ!!

అని కన్నులారా దర్శించుకొని సేవించుకున్నారు. తమ కోరికను విన్నవించుకొన్నారు. పిదప విమానప్రదక్షిణం చేస్తూ వచ్చి గరుడగంభం వద్ద అఖండ దీపాల్ని వెలిగించి సంతానంకోసం ఆ దంపతులిద్దరూ వరపడినారు. అలా సాష్టాంగంచేస్తూవున్న సమయంలోనే వారిరువురికి నిద్ర ఆవహించి స్వప్నం కలిగింది. ఆ కలలో శ్రీస్వామివారు చిరుగజ్జియల నందక ఖడ్గాన్ని వారికి ప్రసాదించాడు.

ఆ క్షణంలోనే మేల్కొన్న ఆ దంపతులిద్దరూ ఆశ్చర్యంతో తమ కోరికను కొండలరాయుడు అనుగ్రహించాడని ఆనందంతో ఆనందనిలయుని అనేకవిధాల సేవించుకొని తాళ్లపాక చేరుకొన్నారు. పిదప కొద్దికాలానికే వేంకటేశుని వరం వల్ల లక్కమాంబ గర్భవతి అయింది.

నవమాసాలు జరిగిన పిదప వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు విశాఖ నక్షత్ర సమయంలో క్రీ.శ. 1408 మే 9వ తేదీన మూడు గ్రహాలు ఉచ్ఛస్థితిలో సంచరిస్తూ వుండగా, అత్యంత శుభప్రదమైన వేళలో లక్కమాంబ ఒక పండంటి మగబిడ్డను ప్రసవించింది.

## తాళ్లపాక అన్నమయ్య

తిరుమలప్పనిఖడ్గమైన నందకాంశంతో జన్మించిన ఆ పిల్లవానికి "అన్నమయ్య" అని నామకరణం చేశారు తల్లిదండ్రులు.

తిరుమలప్పని వరప్రసాదంతో లేకలేక కలిగిన అన్నమయ్యనుచూచి తండ్రి నారాయణసూరి, తల్లి లక్కమాంబలు మురిసి పొయ్యేవారు. అన్నమయ్య మెల్లగా మెల్లమెల్లగా వేసే ప్రతి తప్పటడుగునూ ముద్దుగా చూస్తూ అన్నప్పా! అన్నయ్యా! అన్నమయ్యా! రా! రా! ఇటు రా! అంటూ ఆడిస్తూ ఆనందించేవారు. ఇది వెంకటేశునిముద్ద, ఇది అలమేలుమంగమ్మ ముద్ద అంటూ గోటిముద్దలు పెడ్తే కిలకిలా నవ్వుతూ తినేవాడంట అన్నమయ్య. ఇలా బువ్వ తినాలన్నా లాల పోసుకోవాలన్నా, బజ్జుండాలన్నా అన్నమయ్యకు వెంకన్నపాటలు, మాటలు వినడం తప్పనిసరి. వినిపిస్తేనే ఆయా పనులు బుద్ధిమంతునిలా చేసేవాడు.

ఇలా అడుగడుగునా అనుక్షణం ఆనందనిలయుని నామాన్ని పలుకుతూ, వింటూ, పెరిగి ఐదేండ్లవాడైన అన్నమయ్యకు తండ్రి ఉపనయనంచేశాడు. అప్పటినుంచే అన్నమయ్యకు అన్ని విద్యలు అలవోకగా అలవడ్డాయి. తల్లి భారత భాగవతరామాయణ కథలను విన్పించేది. తల్లి ఒడిలో విన్నవాటిని అన్నమయ్య తాను మెచ్చిన రీతిలో పాటలు కట్టి పాడుతూ పరవసించి విందులేసేవాడు. తనకు నచ్చిన తీరులో గీతాలు ఆలాపిస్తూ గెంతులేసే వాడు. అది విన్నవారంతా అబ్బుర పడేవారు. అసలు అన్నమయ్య పలికిన ప్రతి మాటా అమృతకావ్యమై అందరినీ అలరించేది. పాడిన పాటెల్ల పరమ గానమై పరవసింపజేసేది. పొద్దస్తమానం అన్నమయ్య కూనిరాగాలు తీస్తూ పొలగుళ్లచుట్టూ తిరుగుతూండేవాడు. గోపురాల్లో కాలం వెళ్లబుచ్చే వాడు. పొలాలగట్లమీదా గెంతులేస్తూ కన్పించేవాడు. వేళకు ఇంత తినడం పాత దండెపట్టుకొని పాడుకుంటూ సోమరిగా కన్పించే ఎనిమిదేండ్ల అన్నమయ్యను చూచి తండ్రి కోప్పడ్డాడు. దాయాదులు విసుక్కున్నారు. వదినగారలు సూటిపోటి మాటలన్నారు. అది పెద్దదైన సమిష్టి కుటుంబం. తోడికోడళ్లు. ఆ తోడికోడళ్లకు కోడళ్లు. ఆ ఇంట్లో ఒకరంటే ఇంకొకళ్లకు పడదు. అందునా ఆడవాళ్లకు మరీను. ఇది సహజమేకదా! అందుకే అత్తమీద కోపం దుత్త మీద చూపినట్లుగా లక్కమాంబమీదకోపం అన్నమయ్యమీదికి మళ్లింది. కయ్యానికి ఏదో ఒక కారణందొరకాలె అంతె. ఇంట్లో అందరూ అన్నమయ్యను కసురుకున్నారు.

పొట్టపగల తినడం, పొద్దు గూకులు పొలాలెంబడి తిరగడం తప్ప వేరే పనేముంది? అని అన్నలు కోప్పడ్డారు. ఔను! అలా సోమరిగా గాలికి గెంతకపోతే, ఇంద ఈ కొడవలి తీసుకో పొద్దట్నుంచి పసువులకు గడ్డే లేదు. పొలం వెళ్లి గడ్డి తీసుకురా! అంటూ వదినలు రుసరుసలాడుతూ కొడవలిని చేతికిచ్చారు. చేనులోకూడ కూనిరాగాలు వదురుకుంటూ వుండొద్దు. తొందరగా తెమిలి గడ్డి కోసుకోనిరా అంటూ మరికొందరు ఈసడించుకున్నారు. ఏదో వ్యథ. ఇదీ అని తెలియరాని బాధ అన్నమయ్యను ఆవహించింది.

ఎనిమిదేండ్లయినా నిండీ నిండని అన్నమయ్య ఆ పెద్దలమీది భక్తికన్నా, భయంతో ఈసురోమంటూ కొడవలి చేతబట్టి చేనువైపు అడుగులేస్తూ "ఛీ ఛీ ఏమిలోకం! పాడు లోకం! నాకు తెలియకుండానే నా నోటెంబడి రాగాలు వస్తున్నాయి. నేనేం జేసేది. స్వామీ! వెంకటరమణా! నీ మీది పాటలు, మా ఇంటిల్లిపాదీ భరించలేకున్నారు. ఆహా! ఆ పిట్టలు చూడూ! ఎంచక్కా కూస్తూ స్వేచ్ఛగా ఎగురుతున్నాయో! నేను పాడితే మెచ్చుకోక పోతేపాయె. చీవాట్లతోపాటు ఈ బలవంతపు పని అంటగట్టారు". అని ఆలోచిస్తూ, అన్నట్లు మరిచాను. తొందరగా రమ్మన్నారు. ఆలస్యమైతే దెబ్బలు తప్పవు. ఆఁ ఇక్కడ గడ్డి ఎత్తుగా పెరిగింది. కోసుకుంటాను అని అన్నమయ్య పర పర గడ్డి కోసుకున్నాడు. కొంచంసేపు కోసిన తరువాత ఈ గడ్డి చాలదేమో, ఇంకొంచం కోసుకుంటా అనుకుంటూ మళ్లీ పరపరమని కోస్తుండగా ఎడమచేతివేలు తెగి రక్తం కారుతూ కళ్లబడింది అంతే చేతిలోని కొడవలి పక్కన విసరివేసినాడు అన్నమయ్య.

అబ్బా నెత్తురు! నెత్తురు! అమ్మో వేలు తెగింది. అంటూ బాధ పడుతూ వీరికి ఎన్నటి చుట్టాన్నినేను, వీళ్లు ఏనాటి బంధువులు. ఈ బంధుత్వం చుట్టరికం అంతా మిథ్య! అనుకుంటూ కొన్ని క్షణాల తర్వాత అన్నమయ్య పొలంలో నిలబడి దూరంగా కనపడుతున్న తన ఊరివైపు నిర్లిప్తంగా చూస్తూ —

*"తగ బంధులా తనకు దల్లులును దండ్రులును*
*వగల బెట్టుచు దిరుగువారే కాక*
*అంతహితులా తనకు నన్నలును దమ్ములును*
*వంతువాసికి బెనఁగువారే కాక...."*

అనుకున్నాడు మనస్సు ఉద్రేకంగా ఊగిపోయింది. పరిపరివిధాల పరితపించిపోయింది. ఇంతలో అటువైపు

*అడుగడుగు దండాలవాడ గోవిందా!*
*ఏడుకొండలవాడా! వెంకటరమణా!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

అంటూ భజనలుచేస్తూ తిరుపతి యాత్రకు వెళ్తున్న విచిత్ర వేష ధారులైన భక్త బృందం కంట పడిది. పరమభక్తులైన సనకసనందనాదులవలె వున్న ఆ బృందంవైపు తనబాధను మరచిపోయి అన్నమయ్య కన్నార్పకుండా ఆసక్తిగా చూసినాడు. వాళ్లంతా తననుచూపి చిరునవ్వు చిందించారు. ఆ నవ్వుల్లో అన్నమయ్యకు అనంతార్థాలు పొడసూపినాయి. నాయనా! మేము వెళుతున్న ఈ మార్గమే సత్యమైనదీ నిత్యమైనదీ కూడా! నీవుకూడా మమ్ములను అనుసరించిరా అని వారంతా తనను పిలిచినట్లయింది. అంతే అన్నమయ్య నొప్పి ఎటుపోయిందో ఎప్పుడుపోయిందో తెలియదు. మనసు ఆనందడోలికల్లో ఊగింది.

"తల్లియుఁ దండ్రియు దైవంబు గురువు
నెల్ల సంపదలునై ఎల్ల చందముల
నన్ప్రోచు శేషాద్రినాథుని గొలిచి
మనియెద ననుచు......"

హృదయాన్ని పదిలంచేసుకున్నాడు. తనకు తెలియకుండానే, తన ప్రేరణ లేకుండానే అడుగులు ముందుకుసాగినై. బాలుడైన అన్నమయ్య వారిలో ఒకడుగా భజన చేసుకుంటూ తిరుమలక్షేత్రం మార్గాన నడిచాడు.

ఆ గుంపుతోపాటు అన్నమయ్య ముందుగా దిగువ తిరుపతి చేరుకున్నాడు. అందరితోపాటు తిరుపతిగ్రామదేవత అయిన 'గంగమ్మ'ను దర్శించినాడు. ఇంతలో ఆ గుంపులోని ఒకరు దిగువ తిరుపతి అంటే ఇదేనా? అని అడిగాడు. అందులో ఒకపెద్దాయన "అవును నాయనలారా! ఇదే దిగువతిరుపతి. దీనినే 'శ్రీపదపురి' అంటారు. అంతేకాదు. అదో! కనిపించేదే శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయ గోపురం. ఆ స్వామివారి పేరుతోనే ఇది 'గోవిందరాజపట్నం' అని కూడ అంటారు. అదిగో అటువైపుచూడండి. ఆ పర్వతశ్రేణి! అవే ఏడుకొండలు. ఆ కొండలపై కోరినవారికి కోటి వరాలను ప్రసాదించే కొండలరాయుడు కొలువుదీర్చి వున్నాడు. మనమంతా అక్కడకువెళ్లి ఆ వేంకటేశ్వరుణ్ణి దర్శించితరిద్దాం. త్వరగా నడవండిమరి" అంటూ ముందుకు నడిచారు. ఇదంతా అన్నమయ్య చెవులు రిక్కించి విన్నాడు.

ఓహో! ఇది గోవిందరాజపట్నమా! అది శేషాచలపర్వతమా! మా అమ్మ చెప్తూవుండేది కదా! అచ్చంగా పెద్దపాములాగా పడిగెలతో ఎంత అద్భుతంగావుంది. అనుకుంటూ అన్నమయ్య భజన చేసుకుంటూ ఆడుతూ పాడుతూ అందరితో కలసి తిరుమల కొండను ఎక్కడానికి పూనుకున్నాడు. మొదట అలిపిరిలోవున్న శ్రీ వేంకటేశ్వరుని పాద పద్మాలను సేవించినాడు. ఆ పక్కనే వున్న నరసింహస్వామిని దర్శించినాడు. పిదప తలయేరుగుండు ... చిన ఎక్కుడు... పెద ఎక్కుడు... గాలిగోపురం ముగ్గుబావి... కర్పూర కాలువ.... ఇలాగ కొండల్లో కోనల్లో అన్నీ కన్నులారా తిలకిస్తూ నోరార గానం చేస్తున్నాడు. ఆ లోయలన్నీ తనగానంతో ప్రతిధ్వనిస్తూ వుండగా, పక్షుల కిలకిలరావాలు తనపాటకు వంత పాడుతున్నట్టనిపించేది. కొంచంసేపు తనపాటనాపి ఆ పిట్టలరాగాల హొయలను గమనించేవాడు. అచ్చటచ్చట మేతమేస్తూ చెంగున ఎగిరే జింకలు, దుప్పులు కనపడుతుండగా ఆనందంగా చూచేవాడు. బెదురుతూ తిరుగాడే కుందేళ్లను కూడ చూస్తూ వింత అనుభూతులకు లోనై పరవసించిపోతూ వున్నాడు అన్నమయ్య.

వెంటవున్నవారు ఇతన్ని గమనించకుండానే ముందుకు సాగిపోయి నారు. ఎర్రటి ఎండ తీవ్రంగావుంది. పాపం అన్నమయ్య ఒక్కడు వెనుక బడినాడు. బాగా అలసినట్టున్నాడు. ఒక్కడే అదుగులో అడుగువేసుకుంటూ కాళ్లీడ్చుకుంటూ అవ్వాచరికోన దాటినాడు. ఇక మిగిలింది మోకాళ్ల పర్వతం. చుట్టూ చూచాడు. "అరే! ఎవరూ లేరే! అందరూ ఎప్పుడో నన్ను దాటివెళ్లి నారే. ఎండ ఎక్కువగా వుంది. దప్పికగా వుంది. ఆకలిగా కూడవుంది. అబ్బ! మెట్లు ఎంత ఎత్తుగా వున్నాయి. మా అమ్మ చెప్పిన మోకాళ్లపర్వతం ఇదేనేమో! ఎన్నిమెట్లు వున్నాయో! ఎంతదూరముందో స్వామివారిగుడి. నేను ఇదే తొలీత కొండకురావడం. తొందరతొందరగా మెట్లు ఎక్కుతాను. ముందువెళ్లే గుంపులో కలిస్తే బాగుంటుంది. వాళ్లెంతదూరంలో వున్నారో!" అనుకొంటూ బిగ్గరగా

*ఏడుకొండలవాడా! వేంకటరమణా*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

అని గోవిందనామఘోష పెడుతూ అన్నమయ్య రెండుమెట్లు ఎక్కాడు. కళ్లు బైర్లుకమ్మినట్లయింది.

అరెరె! ఇంతలో నాకేమయింది. కళ్లుతిరుగుతున్నాయి. అమ్మో! అయ్యో! నన్ను ఎవరో కిందికి తోస్తున్నట్లుంది. కిందపడిపోతున్నా. రక్షించండి! రక్షించండి! కన్నులు మూసుకపోతున్నాయి. వళ్లు తూలి పోతుంది. కాపాడండి! కాపాడండి! అని అరుస్తూ అన్నమయ్య స్పృహలేకుండా కూలబడ్డాడు.

కొంచం సేపయింతర్వాత 'అన్నమయ్యా! లే లే! నాయనా! ఓ అన్నయ్యా! తొందరగా లేచి కూర్చో నాయనా!! అనే పిలుపుతో అన్నమయ్యకు మెలకువ అయ్యింది.

నే నెక్కడున్నాను. ఎంతసేపయింది నే నిలాగపడి. నిద్రపొయ్యానా? ఇంతకు ఎక్కడ పడినాను. ఎవరో పిలుస్తున్నట్లుంది. పేరు పెట్టి పిలుస్తున్నారు. పిలుపు వినపడుతున్నది కాని మనుషులెవరు కనపడ్డం లేదే. ఇది భ్రమా! ఆకలితో నాకు కలుగుతున్న మతిభ్రమ కాదు గదా! అని అన్నమయ్య ఆలోచిస్తూండగా మళ్లా

'అన్నా! లే నాయనా! ఇటుచూడు' అన్న పిలుపు మధురాతి మధురంగా వినపడింది.

అరే! మళ్లీ అదే పిలుపు. ఎవరో స్త్రీ పిలుస్తున్నట్టువుంది. ఆ పిలుపులో ఎంత ఆత్మీయత వుంది. అరమరికలు లేకుండ హృదయంలోంచి, మనసులోంచి పలకరిస్తున్నట్లుగా ఆనందం కలుగుతున్నది. అనుకుంటూ అన్నమయ్య ఆత్రంగా చుట్టూ కలయచూశాడు. అంతా అగమ్యగోచరంగా వుందే! చుట్టూ ఎవరూ కనపడ్డంలేదే. అనుకుంటూ గట్టిగా 'అమ్మా! ఎవరు నీవు. మా అమ్మ లక్కమాంబవలె ఆప్యాయంగా పలకరిస్తున్నావు. నీ చల్లని పలకరింపు వినపడుతున్నదికాని నా కళ్లకు ఏమీ కన్పించడం లేదు తల్లీ! నన్ను దయతో కాపాడు తల్లీ! అంటూ లేచికూర్చున్నాడు అన్నమయ్య.

కిల కిల నవ్వుతూ "నాయనా!" అన్నమయ్యా! నేను అందరిపాలిటి అమ్మను అలమేలుమంగను. ఆనందనిలయుని హృదయవాసిని అయిన పద్మావతిదేవిని నేను. ఇపుడు నీవున్న చోటు తిరువేంకటపు కొండ! పవిత్రమయింది. ఈ క్షేత్రం అంతా సాలగ్రామమయం. అసలు కొండే ఒక సాలగ్రామం. ఆ కొండమీదున్న శ్రీ వేంకటేశ్వరుడు కూడ సాలగ్రామ

శిలారూపుడే! తెలిసిందా! అందువల్ల కాళ్ల జోళ్లతో ఈ కొండను ఎక్కడం మహాపాపం! నీ కాళ్లకువున్న జోళ్లను విడిచి చూడు. నీకే అంతా అవగతమవుతుంది. నీ కళ్లకు అంతా గోచరమవుతుంది" అంటూ ఆప్యాయంగా పలకరించింది అలమేలు మంగమ్మ.

వెంటనే కాళ్లకు వున్న చెప్పులను విసిరివేసినాడు అన్నమయ్య. అంతే! ఆక్షణంలోనే ఆ కొండంతా కోటిసూర్యకాంతులతో భాసిస్తూ కనపడింది. ఎదురుగా జగజ్జనని అలమేలుమంగమ్మ! చేతులుచాపి పిలుస్తోంది.

"అమ్మా! అలమేలుమంగమ్మా! నీ దర్శనంతో నా జన్మ చరితార్థ మయింది. ఎంతటి భాగ్యం తల్లీ!

అంటూ అన్నమయ్య చుట్టూ పరికించి చూశాడు.

"అరె ఎంత విచిత్రం. ఇవి రాళ్లూ రప్పలు కావే! నిజ్జంగా పవిత్రమైన సాలగ్రామ శిలలు! అదో! నృసింహసాలగ్రామాలగుట్ట. ఇదో ఇటువైపు విష్ణుసాలగ్రామాలు. అటు రామ.... కృష్ణ అరెరె! ఈ కొండంతా సాలగ్రామాలతో నిండివుంది. ఎంత విచిత్రం. అని ఆశ్చర్యపోతూ అన్నమయ్య, ఎంత తప్పుచేశాను. అయినా తెలియకుండ చేసిన తప్పు తప్పే కాదంటారు కదా! అనుకొంటూ గట్టిగా

"తల్లీ! నిండుదయతో నా తప్పును మన్నించి కాపాడవమ్మా!" అంటూ అన్నమయ్య నేలపై సాగిలపడి అలమేలుమంగకు నమస్కరించాడు.

"నాన్నా! అన్నయ్యా! లేచికూర్చో! బాగా అలసివున్నావు. ఆకలిగా కూడవుంది కదూ. ఎప్పుడు తిన్నావో ఏమో!... ఇదిగో ఇవి నీ కోసమే తెచ్చాను. తిను. ఇది పులిహోర. మెల్లగాతిను. ఇదేమో చక్కెర పొంగలి. ఈ చక్కెరపొంగలి మీ అయ్య వేంకటేశునికి బలే ఇష్టం! ఆ స్వామి తినగా మిగిలింది నీ కోసమే తెచ్చా. తొందరపడకు. నిదానంగా తిను. మరి ఇదేమో మిరియపు పొంగలి. దండిగా నెయ్యివేసి చేసింది ఈ మిరియప్పొంగలి. చాల కమ్మగా వుంటుంది. ఇంకొంచం పెట్టించుకో. రుచిగా వుంది కదూ! ఇది దధ్యోదనం. గట్టిగా వుండే ఈ మీగడ పెరుగన్నం చాలా బాగుంటుంది. ఇంకా కొంచం పెట్టనా".

అంటూ అలమేలుమంగ అన్నమయ్యకు ప్రేమగా, గోముగా మారాము చేస్తూ గోరుముద్దలు స్వయంగా తానే తినిపించింది. కొన్ని ముద్దలు

అన్నమయ్య అరచేతిలో పెట్టింది. అన్నమయ్యకు కడుపునిండ చాలు చాలని చెప్పినా బుజ్జగిస్తూ అడిగి అడిగి మరీ బలవంతం చేస్తూ ఇంకా తినిపించింది. ఇలా

శౌరియుఁ దాను నివ్వలు పొత్తుఁ గలసి
యారగించిన ప్రసాదాన్నముల్ దెచ్చి
పరి పరి రుచుల నేర్పడ సేద దేర
పెరిమతో భుజియింపఁ బెట్టి యూరార్చి

తిరుమలప్పని కొండ అదిగో! దేవదేవుని కొలువ అరుగు మటంచు అయ్యరవింద సదన అయిన అలమేలుమంగ అన్నమయ్యకు దారి చూపింది.

అలమేలుమంగమ్మ కొసరి కొసరి కోరి కోరి తినిపించిన తిరుమలేశుని కమ్మని ప్రసాదాల వల్ల అన్నమయ్యకు ఆకలి తీరింది! అలసటతీరింది! ఒక కొత్త ఉత్సాహం ఉరకలేసింది! ఒక చైతన్యం వెల్లి విరిసింది! ఒక దివ్యతేజస్సు ఆవరించింది. ఒక ఆధ్యాత్మికశక్తి ఆవహించింది. ఇలా తెలియని ఒక మధురానుభూతితో మైమరచినాడు అన్నమయ్య. అలమేలుమంగ అనుగ్రహ ప్రసాదంతో అన్నమయ్యకు తెలియకుండానే ఆవేశంగా ఆశువుగా కవితాధార పెల్లుబికింది.

చొచ్చితి తల్లి! నీమఱుఁగు
సొంపుగ నీ కరుణా కటాక్ష మె
ట్లిచ్చెదొ నాకు నేఁడు పర
మేశ్వరి! యో యలమేలుమంగ! నీ
మచ్చిక నందు నీ తరుణి
మన్నన నే నిముఁ గంటి నీకు నా
బచ్చెన మాట లేమిటికి
బ్రాఁతిని చూడఁగ వేంకటేశ్వరా!!

అంటూ అలమేలుమంగపై తొట్టతొలిగా ఒక నూరుపద్యాల శతకాన్ని భక్తి రసార్ద్ర చిత్తంతో ఆశువుగా స్తుతిస్తూ సాష్టాంగ నమస్కారం చేసినాడు అన్నమయ్య.

"భళీ! అన్నమయ్యా! భళీ! శ్రీ వేంకటేశ్వరానుగ్రహ ప్రాప్తి రస్తు!..." అంటూ అలమేలుమంగమ్మ ఆనందంతో అన్నమయ్యను నిండుగా ఆశీర్వదించి రెండుచేతులతో పట్టుకొని లేపుతూ.

"అన్నమయ్యా! అదిగో! వింత వింతకాంతులతో వెలుగుతూవున్న తిరువేంకటపు కొండ! అదె వేంకటాచలం!... ఆ క్షేత్రంలో కొలువై వున్న తిరుమలప్పని సేవించుకో. సేవించి తరించు. ఇతరులను కూడ తరింపచేయి...వెళ్ళిరా" అంటూ అదృశ్యమయ్యింది అలమేలుమంగమ్మ.

అమ్మలగన్న అమ్మ అలమేలుమంగమ్మ చేయెత్తి చూపుతూ నడిపించిన దారిలో అన్నమయ్య మెట్లు ఎక్కుతూ

కైవల్యపదము వేంకటనగ మదివో
శ్రీవేంకటపతికి సిరులయినది
భావింప సకలసంపదలరూప మదివో
పావనములకెల్ల బావనమయము

అని భక్తితో గానం చేసికొంటూ తిరుమలక్షేత్రం చేరుకున్నాడు.

ఆనందనిలయుడు తెలుగువారి కోసం తెలుగువాడిగా తాళ్లపాకలో అవతరించమని తన నందక ఖడ్గాన్ని ఆదేశించినారు.

కాని, తాళ్లపాకలో జన్మించిన నందకాయుధాన్ని, ఆ ఇంటివారు, కేవలం 'ఇనుపకొడవలి'గా తలంచి పశువులకు గడ్డి కోయుమని ఆజ్ఞాపించినారు.

మరి తెలుగువారి అదృష్టమో! ఏమో! సనకాది మహర్షులు యాత్రికుల వలె వచ్చి నీ స్థానం ఇదికాదు. నీ అసలైనస్థలం వేంకటాచలమే! అంటూ ఆ నందకకటారికి దారి చూపించి వెళ్లారు. దారిలో తెలిసీ తెలియక అడుగులేస్తూ తడబడుతున్న సమయంలో సాక్షాత్తు అలమేలుమంగమ్మతల్లి ఆ నందకాన్ని పట్టుకొని సానపెట్టి మెరుగులు దిద్ది, "నీ ధ్యేయం ఏమిటో తెలుసా! నీవు తరించడం, నీ వారిని అందరినీ తరింపజెయ్యడం" అంటూ తిరమైన తిరుమలకు దారి చూపించింది.

అందులకే "హరి యవతారమైన అన్నమయ్య" మనకు దక్కాడు. మరి ఇందుకు తెలుగువారు చేసిన పుణ్యరాసులు ఎన్ని కోట్లో! ఎన్నెన్ని కోట్లో!

అలమేలుమంగమ్మ అనుగ్రహాన్ని సంపూర్ణంగా పొందిన అన్నమయ్య ఆనందనిలయునిసన్నిధి చేరుకొన్నాడు. ముందుగా స్వామిపుష్కరిణిలో స్నానం చేసి శ్రీ ఆదివరాహస్వామివారిని దర్శించిన తర్వాత భక్తుల పాలిట పెన్నిధి, ఆర్తులపాలిటి ఆత్మబంధువు అడుగడుగుదండాలవాడు అయిన శ్రీవేంకటేశ్వరస్వామిఆలయంలో ప్రవేశిస్తూ తొలుత మహాద్వార గోపురానికి (పడికావలిగోపురం) చేతులెత్తి దండం పెట్టాడు. తిరుమల శ్రీవారి ఆలయంలో వరుసగా నీడతిరుగని చింతచెట్టు, గరుడగంభం, సంపంగి ప్రదక్షిణం, విమాన ప్రదక్షిణంలో శ్రీవరదరాజస్వామి, అలమేలుమంగను, యాగశాల, కల్యాణమంటపాన్ని వాహనమండపాల్లో ప్రకాశిస్తూవున్న అశ్వ వాహనాన్ని బంగారుగరుడునీ, పెదశేషుణ్ణీ దర్శిస్తూ జోతలు పెట్టాడు. శ్రీభాష్యకారులైన రామానుజుని, యోగనరసింహస్వామి, విష్వక్సేనుడికి సాష్టాంగనమస్కారం చేశారు. ఎందరో ఎందరెందరో ఎక్కడెక్కడినుంచో వచ్చి గోవిందా! ముకుందా! తిమ్మప్పా!! అంటూ ప్రదక్షిణలు పెడుతున్న భక్తుల్ని చూస్తూ శ్రీవారిముఖమండపంలో ప్రవేశిస్తూ, ధగ ధగ మెరుస్తున్న బంగారు వాకిలిచెంత నిలిచి నేరుగా ఆనందనిలయంలో కొలువై దర్శన మిస్తూవున్న నిలువెత్తు శ్రీస్వామివారి దివ్యమంగళ విరాణ్మూర్తిని—

*గజ్జలు నందియల్ కనకాంబరంబు*
*గొజ్జంగి ముత్యాలకుచ్చు కటారి*
*బెడఁగుగాఁ గటిమీఁద బెరసినకేల*
*నుడుగక వరముల నొసఁగు కెంగేలు*
*నుదర బంధంబు కేయూర హారములు*
*బొదలు తావులు తట్టుపుణుఁగు పైపూఁత*
*కుడిరొమ్ము మచ్చ, యక్కున నెలకొన్న*
*కడలికన్నియదివ్యకంఠసరంబు*
*ధళ ధళ దుళగించు దరము, చక్రంబు*
*బలసి చూపట్టెడు పాణి పద్మములు*
*బింబాధరమ్ము నొప్పెడు కపోలములు*

కంబు పోతంబు వెక్కౌన మాదుగళము
మకర కుండలములు మణికిరీటంబు
వికసిత ధవళారవిందనేత్రములు
చల్లనిచూపును జారునాసికయుఁ
దెల్లని మెఱుగు ముత్తియపు నామమును
గలిగి యెంతయును శృంగారభావంబు
మలయు నయ్యలమేలుమంగామనోజ్ఞు
సేవించి ప్రణమిల్లి చేరి సన్నుతులు
గావించి పులకితగాత్రుఁడై చెలఁగి.

కన్నులారా దర్శించినాడు అన్నమయ్య, పిదప తిరుమల క్షేత్రంలోని తీర్థాలన్నింటిని సేవిస్తూ ధన్యుడయినాడు అన్నమయ్య.

దేశాక్షి

కంటి నఖిలాండకర్తనధిపుని గంటి
కంటి నఘములు వీడుకొంటి నిజమూర్తిగంటి

మహనీయ ఘనఫణామణుల శైలము గంటి
బహు విభవముల మంటపములు గంటి
సహజ నవరత్న కాంచన వేదికలు గంటి
రహి వహించిన గోపురంబులవె కంటి.

పావనంబైన పాపవినాశనము గంటి
కైవశంబగు గగనగంగ గంటి
దైవికపుఁ బుణ్యతీర్థములెల్లఁ బొడగంటి
కోవిదులు గొనియాడు కోనేరిఁగంటి

పరమ యోగీంద్రులకు భావగోచరమైన
పరిలేని పాదాంబుజములు గంటి
తిరమైనగిరి చూపు దివ్యహస్తము గంటి
తిరువేంకటాచలాధిపుఁ జూడఁ గంటి.

ఇలా తీర్థాలన్నింటిలో స్నానంచేస్తూ శ్రీవేంకటేశ్వరుని సేవిస్తూ వుండగా, ఒకనాడు అన్నమయ్య ఆలయాన్ని చేరుకొన్న సమయానికి బంగారు వాకిళ్లు మూసివేయబడినాయి. అయ్యో! నేటికి శ్రీవారి దర్శనం కాలేదే! అని విచారంతో సంకీర్తన చేస్తూ దర్శనం ప్రసాదించమని స్వామి వారిని వేడుకున్నాడు. అంతే తాళాలు ఊడిపడి, వాకిళ్లు తెరుచుకు న్నాయి. ఈ అపూర్వ సంఘటనకు ఆశ్చర్యపడిన అర్చకస్వాములు బాలుడైన అన్నమయ్య ఎంత పరమభక్తుడో కదా అనుకుంటూ ప్రేమగా లోనికి తీసుకెళ్లి దర్శనం చేయించి తీర్థప్రసాదాలు ఇచ్చారు. ఆ సమయంలో స్వామివారిని స్తుతిస్తూ ఒక పద్యశతకాన్ని చెప్పాడు. వెంటనే స్వామివారు ఆనందించినట్లుగా మూలవిరాణ్మూర్తిమెడలోని ఒక ముత్యాలహారం జారి పాదాలపై పడగా, దాన్ని అన్నమయ్యకు ప్రసాదించినాడు అర్చకస్వామి. ఇలావుండగా —

ఘనవిష్ణుయతి అనే వైష్ణవగురువు తిరుమలలో వుండినాడు. ఒకనాటి రాత్రి ఆ యతికి కలలో శ్రీవేంకటేశ్వరస్వామి కనిపించి తిరుమల పుణ్యక్షేత్రంలో తననుగూర్చి పాడుకొంటూ తిరుగుతున్న అన్నమయ్య రూపురేఖల్ని వివరించి, అతనికి వైష్ణవమతాన్ని ప్రసాదించవలసిందని ఆదే శించి తన శంఖుచక్ర ముద్ర లిచ్చినాడు. శ్రీ స్వామివారి ఆదేశానుసారం విష్ణుయతి శ్రీవారి ఆలయప్రాంగణంలో తిరుగుతున్న అన్నమయ్యను చూచి స్వామివారు చెప్పిన బాలుడీతడే అని స్థిరంచేసుకొని వైష్ణవమతాన్ని ముద్రా సహితంగా ప్రసాదించినాడు. ఆ క్షణంనుంచి అన్నమయ్య 'అన్నమాచా ర్యులు' అయినారు. తెలుగువారిని తిరుమలేశునిదరికి దారి చూపించి నడిపించిన ఆచార్యులయినారు. ఆనాటి నుండి ఆనందనిలయుని అనంత తత్త్వాన్ని ప్రబోధిస్తూ పదకవితా పీఠాన్ని అధిరోహించి పదకవితా పితామహుడయినాడు తాళ్లపాక అన్నమాచార్యులు.

ఇక్కడ తాళ్లపాకలో అన్నమయ్య పొలంనుండి చెప్పకుండానే అటు నుండి అటే తిరుమలకేగినసంగతి, ఇంట్లో వాళ్లకి తెలియనే తెలియదు. అన్నమయ్యకోసం ఎదురుచూచి విసిగి వేసారినారు. గారాలకొడుకుకోసం తల్లి లక్కమాంబ నేల కరచుకొంది. అన్నమయ్య ఆచూకీ కోసం

అందరిని అడిగారు — అంతటా వెదికినారు. ఇక లాభంలేక చివరిప్రయత్నంగా దైవాన్ని వేడుకొన్నారు నారాయణసూరిదంపతులు. దైవప్రేరణచేత నారాయణసూరి లక్కమాంబలు, పోయిన అన్నమయ్యను మళ్లీ ప్రసాదించమని కోరటానికి తిరుమలక్షేత్రం చేరుకొన్నారు. శ్రీనివాసుని సన్నిధిలో సంకీర్తనలు గానంచేస్తూ పరవశించి తిరుగుతున్న అన్నమయ్యనుచూచి తల్లిదండ్రుల ప్రాణం లేచివచ్చింది. ఆహా! ఏమి శ్రీనివాసుని దయాపరత్వము. తనదగ్గరకు చేర్చుకొని భద్రంగా కాపాడుతూ మళ్లీచూపించినాడు కదా! అనుకుంటూ అన్నమయ్యను హృదయానికి హత్తుకున్నారు. తనను ఇంటికి తీసికొని వెళ్లడానికి వచ్చిన తల్లి దండ్రులతో స్వామివారినివిడిచి రానన్నాడు. తల్లి లక్కమాంబ పుత్రుని పరిస్థితి చూచి పరి పరివిధాల వేదన పడింది. మా పుత్రుని మాకు దక్కించు స్వామీ! అంటూ పరంధాముని వేడికొని ప్రాధేయపడింది. ఆ రాత్రి అలమేలుమంగపతి అన్నమయ్యకు స్వప్న దర్శనమిచ్చి 'నాయనా! అన్నమయ్యా! తల్లిదండ్రుల మనసు కష్టపెట్టకూడదు. మాతృదేవోభవ! పితృదేవోభవ! అందువల్ల నీవు ఇంటికి వెళ్లి నీ తల్లిదండ్రులు చెప్పినట్లు చెయ్యి. నీకు మేలు జరుగుతుంది' అని ఆదేశించినాడు. స్వామివారి ఆజ్ఞప్రకారం అన్నమయ్య తల్లిదండ్రులతో తాళ్లపాక చేరుకొన్నాడు.

తిరుమలేశుని ఆజ్ఞమేరకు తాళ్లపాక చేరిన అన్నమయ్యకు కొంతకాలానికి తిరుమలమ్మ, అక్కలమ్మ అనే కన్యలతో పెండ్లి జరిగింది. ఆ తర్వాత ప్రసిద్ధ నృసింహక్షేత్రమైన అహోబలానికి వెళ్లి శఠకోపముని అనే గురువువద్ద వైష్ణవసంప్రదాయాన్ని అధ్యయనం చేశాడు. అహోబలేశునితో ప్రత్యక్షంగా మాట్లాడగలిగే ఆ గురువు అన్నమయ్యకు నృసింహమంత్రాన్ని ఉపదేశించి ఆశీర్వదించి పంపినాడు. అటు నృసింహుణ్ణి, ఇటు వేంకటేశుణ్ణి అభేదంతో ఉపాసిస్తూ తిరుమల చేరినాడు అన్నమయ్య.

శ్రీనివాసుని సన్నిధిలోనే స్థిరంగా ఉండదలచిన అన్నమయ్యను "అన్నమయ్యా!" ఓబలేశుణ్ణి మాత్రమే నేనుకాదు. అందరినీ నేనే. ఇకమీద నీవు అంతటా తిరుగుతూ, నా తత్త్వాన్ని దేశమంతటా ప్రచారం చెయ్యి. నా అనుగ్రహాన్ని అందరికీ పంచిపెట్టు" అని స్వామి ఆదేశించినాడు.

తాళ్లపాకను విడిచి తిరుమలేశుని పంచనచేరిన అన్నమయ్య శ్రీస్వామి వారి ఆనతిమేరకు మళ్లీ తిరుమలకొండ దిగినాడు. తెలుగునాట కనపడిన ఊరూ, వాడా తిరిగాడు. ఆ యా ఊళ్లలోని ఓ రాముడు... ఓ కృష్ణుడు .... ఓ నృసింహుడు .... ఓ చెన్నకేశవుడు ..... ఓ పండరివిఠలుడు..... ఇలా ఆయా దేవుళ్లను వేనోళ్ల కీర్తించినాడు. ఒక్క తెలుగునాటే కాదు. దక్షిణాదిన ఎన్నో ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రాలు దర్శించాడు. అందలి మూర్తులను సేవించినాడు. అన్నమాచార్యులు తాను సందర్శించిన క్షేత్రాల్లోని వేల్పులను తిరుమలవేంకటేశ్వరునితో అభేదాన్ని పాటించి ఆనందపారవశ్యంతో సంకీర్తన చేశాడు.

మొట్టమొదటి అన్నమాచార్యులు వటపత్రశాయి అయిన రూపమిట్టిదని కొలువై పొడసూపుతూ దిగువ తిరుపతిలో అందముగా యోగనిద్రలో శయనించిన గోవింద రాజస్వామిని దర్శించి —

*కొలిచితే రక్షించే గోవిందుఁ డీతడు*
*ఇలకు, లక్ష్మికి మగఁడీ గోవిందుఁడు.*

అని కీర్తించాడు. ఆ తిరుపతిలోనే దర్శనమిస్తూవున్న శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేతుడైన ఇష్టార్థరాముణ్ణి సేవించి కొనియాడినాడు. తదుపరి తిరుమలకు వెళ్లేదారిలో, "దాసులను తప్పక కాచేనని అమరనభయ మిచ్చు చున్న" దిగువ పట్టణములోని "దేవ హనుమంతుణ్ణి" కూడ అన్నమాచార్యులు కీర్తించినాడు.

*అనిశము దలఁచరో అహోబలం*
*అనంత ఫలదం బహోబలం.*

అని అహోబలక్షేత్ర ప్రాశస్త్యాన్ని కీర్తిస్తూ 'అదివో చూడరో ఆదిమపురుషుని' అంటూ 'పెద యౌభళము మీద పెనుసింహము'ను కొనియాడుతూ బ్రహ్మాదులు, వేదాంతులు వెదకి కానగలేని ఆ ఘనసింహమును ప్రత్యక్షంగా దర్శించి వర్ణించినాడు.

పిదప అన్నమయ్య పావన పినాకినీతటంలో వెలసిన 'కప్పురపునవ్వుల కడపరాయడైన వేంకటేశ్వరుణ్ణి' జగదేకసుందరునిగా కన్నులారా దర్శిస్తూ ఆయన మితిలేని శృంగార లీలల్ని వర్ణించినాడు. ఆ తరువాత 'ఫాలలోచనుడై

భయదోగ్ర ముఖము గలిగి సకలాయుధములు సహస్ర భుజములతో కంభ మున వెడలిన కదిరీనృసింహుడు, దుష్టుల భంజించెనిదివో' అని చెప్పతూ ఆయనను విదితముగా సేవింవరో అని అన్నమయ్య కదిరీ నృసింహుణ్ణి కీర్తిస్తూ గానం చేశాడు.

విందువలె పరదైవముగా దర్శనమొసగుచున్న ఒంటిమిట్ట వీరరఘు రాముని కూడ పదకవితాపితామహుడు దర్శించి కొనియాడినాడు. 'పట్టపు వేంకటేశునకు నమ్మినబంటు అయి, పదియారువన్నెలబంగారు కాంతుల తోడ పొదలిన కలశాపుర హనుమంతుణ్ణి' పవిత్ర ద్వాదశనామాలతో అన్నమయ్య స్తుతించినాడు. అన్నమయ్య తన వేంకటేశ్వర భక్తి ప్రచారో ద్యమంలో గుత్తి దర్శించినపుడు అచట వెలసిన సౌమిత్రి సహోదరుడైన దశరథరాముని గూర్చి వీనుల విందుగా గానం చేసాడు.

ఎక్కడ ఎదురులేక ఈరేడు లోకములందు ఒక్కడే నిలిచిన విజయ నగర ఉగ్రహనుమంతుని, పుత్రకామేష్టియందు పరమాన్నమున పరగ జన్మించి, లంకసాధించి యువని భారము దించి పరబ్రహ్మమై వెలుగొం దిన విజయనగరరాముణ్ణి, వేదాద్రినారసింహుణ్ణి అన్నమాచార్యులు దర్శించి కీర్తించినాడు.

దక్షిణాదిన వైష్ణవక్షేత్రాల్లో ప్రధానమైనది శ్రీరంగం. శేషశాయి అయిన శ్రీరంగనాథుడు 'చిన్ని సిసువు'గా దర్శనమొసగి అన్నమయ్య చేత 'మర్రాకుతొట్టి'లో జోలపాడించుకున్నాడు. 'మూడుమూరుతుల మూలమై పెక్కుమహిమలతో పవిత్రచంద్రభాగానదీతీరాన వెలసి, పరగ నేడునూట డెబ్బది ఏడుగురుచేత నిరవై పాడించుకొన్న పాండురంగవిఠలుని, దర్శించి ధన్యుడయ్యాడు అన్నమయ్య.

ప్రసిద్ధ క్షేత్రాలేకాదు. మారుమూల పల్లెలు కూడ తన వేంకటేశ్వర భక్తిసాహిత్యప్రచారానికి ఆటపట్టులుగా చేసుకొన్నాడు అన్నమాచార్యులు. ఆ పల్లెల్లో, కుగ్రామాల్లో వెలసిన దేవతామూర్తులందరిని తన పరదైవమైన వేంకటేశుణ్ణి దర్శించి ధన్యుడయినాడు.

అన్నమయ్య 'వెలుగోటి చెన్నకేశవుని' వేడుకొన్నాడు. 'అందపు వేంక టేశుడు కోనచెన్నుడెవెలయగా' కోరిన వరాలు పొందాడు. ఇంతులతో

విహరిస్తున్న చుక్కలూరి చెన్నకేశవునితో, పేలకురితి చెన్నునితో, అన్న మయ్య శృంగారలీల నెరపినాడు. చెలువపు పింగారాల శ్రీరామచంద్రుని 'దాసరిపల్లె'లో దర్శించినాడు.

'నల్లబల్లి చెన్నుడు నాపాలిటి వెన్నుడు' అంటూ నల్లపల్లి చెన్నకేశ వుని ప్రసన్నం చేసుకున్నాడు. అట్లే ముడియంనారసింహుని, సంబటూరు చెన్నుణ్ణి, ఉదయగిరి ముద్దుకృష్ణుని, మాదుపూరుమాధవుని, మంగాంబుధి (మంగంపేట) హనుమంతుని, ఓగునూతుల నారసింహుని దర్శించి కీర్తిం వినాడు.

"దీనరక్షకు డఖిలవినుతుడు రాముడూ, హరుని తారకబ్రహ్మమంత్రమై యమరిన యర్థము రాముడూ" అని వావిలిపాటి వీర విజయుడైన రాముణ్ణి కూడ అన్నమాచార్యులు కొనియాడినాడు. మార్కాపురం చెన్నకేశవస్వామిని మహిమాన్వితునిగా కీర్తించినాడు.

ఇలా పరమభక్తాగ్రేసరుడైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఏ పుణ్య తీర్థాన్ని సేవించినా, ఏ దేవుణ్ణి దర్శించినా అక్కడ అందులో ఆయనకు తిరుమలేశుని రూపే గోచరమయ్యేది. అందువల్లే ఆ సంకీర్తనాచార్యుడు తాను దర్శించిన క్షేత్రాధినాథులను తిరుమల ఆనందనిలయునికి ప్రతిబింబా లుగా స్పష్టం చేసినాడు. అన్నమయ్య దృష్టిలో తిరుమల కోనేటిదండనున్న వేంకటపతికీ, ఆ దేవుళ్లకు అభేదం. అంటే తిరుమల శ్రీవేంకటేశ్వరుడు మూలవిరాట్టుకాగా, ఇతర క్షేత్రాల్లోని దేవతామూర్తులు ఆ వేంకటేశ్వరుని ఉత్సవమూర్తులని అన్నమయ్య పవిత్ర భావం. కనుకనే అన్నమాచార్యులు —

ఎవ్వరి గొలిచిన నేమిగొరత, మరి
ఎవ్వరి దలచిన నేమి
అవ్వలివ్వల శ్రీహరి రూపుగాని వా
రెవ్వరు లేరని యెరుక దోచిన జాలు

అని అంటూ తన సంకీర్తనాయజ్ఞాన్ని నిరాఘాటంగా సాగించినాడు. ఇలా తన పదకవితలద్వారా ఆ బాలగోపాలంలో వేంకటేశ్వర భక్తివికా సాన్ని కలిగించి ఆంధ్రదేశాన్ని భక్తి సుసంపన్నం చేస్తూ తిరుగుతున్న పరమభక్తుడైన అన్నమయ్య కీర్తి చంద్రికలు దశదిశలా వ్యాపించాయి.

అలాంటి సమయంలోనే అన్నమయ్యకు ముందే తెలిసిన సాళువ నర సింగరాయలు అనే పెనుగొండ ప్రభువు అన్నమయ్యను ఆహ్వానించి గురువుగా చేసికొని, ఆదరించి, తన ఆస్థానంలో వుంచుకొన్నాడు. ఆ రాజు స్వామివారిపై భక్తితో వున్నాడు కదా, అని భావించిన అన్నమయ్య అతని దగ్గరవున్న సమయంలో అలమేలుమంగా శ్రీనివాసుల శృంగారలీలా విశేషాన్ని వర్ణిస్తూ ఒక దివ్యకీర్తన ఇలా ఆలాపించాడు.

*ఏమొకొ! చిగురు టధరమున యెడనెడ కస్తూరినిండెను*
*భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు గదా*

దీన్ని విన్న నరసింగరాయలు దురాశతో, కీర్తి కాంక్షతో తనపై కూడ అలాంటి కీర్తన చెప్పమని కోరగా అన్నమయ్య హరి! హరీ! అంటూ నిక్కచ్చిగా తిరస్కరించినాడు. అంతే కోపావేశుడైన రాజు అన్నమయ్యకు "మూరురాయరగండ" అనే బంగారు సంకెళ్లను వేయించి చెరసాలలో పెట్టించాడు. అన్నమయ్య ఆర్తితో ఆనందనిలయుని వేడికొనగా ఆ సంకెళ్లు ఊడిపడ్డాయి. భటులు చెప్పిన ఈ విషయాన్ని నమ్మని ఆ రాజు మళ్లీ సంకెళ్లు బిగింపచేశాడు. తన కంటిఎదుటే సంకెలవీడిపోగా నరసింగ రాయల అహంకారం తగ్గి అన్నమయ్యను శరణువేడినాడు. భాగవతులను ఎప్పుడు అవమానం చెయ్యవద్దు అంటూ ఆ రాజును క్షమించి, రాజులపంచన వుండటం మంచిదికాదని తలుస్తూమళ్లీ తిరుమల చేరుకొన్నాడు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆర్తరక్షకత్వాన్ని గూర్చి ఆశ్రిత పక్షపాతాన్ని గూర్చి అనేక విధాలుగా కీర్తించి, ప్రచారంచేసిన అన్నమాచార్యులు సకుటుం బముగా తిరుమల చేరుకొన్నాడు. ఆనందనిలయుని సన్నిధిలో స్థిరనివాసం ఏర్పరచుకొని నిత్యమూ శ్రీనివాసునినిత్యసేవల్లో పాలుపంచుకొనేవాడు. ఆ సేవల్లో శ్రీస్వామివారివైభవాన్ని గూర్చి పరవసించి గానంచేసేవాడు. ప్రతిరోజు సుప్రభాతసమయంలో మేలుకొలుపులు పాడుతూ పరమ భక్తిగా శ్రీస్వామివారిని మేల్కొలిపేవాడు. రాత్రి అన్నమయ్య తానే యశో దగా భావించి లాలిపాటలు, జోలపాటలు పాడుతూ, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన వేంకటాచలపతిని నిద్రబుచ్చేవాడు. అఖిలజగాలవేలే ఆనందనిలయుడు బంగారు తూగుటుయ్యాలలో ఊగుతూ మంద్రమంద్రంగా

శ్రుతి శుభగంగా సాగే అన్నమయ్య లాలిపాటను వింటూ, తరిగొండ వెంగమాంబహారతిని అందుకుంటూ యోగనిద్ర కుపక్రమించేవాడు. ఇలా ప్రతిరాత్రీ అన్నమయ్యపాట తప్పక ఉండాల్సిందే. ఆ పాటను వినకపోతే పరంధాముడికి నిద్రపట్టేది కాదట! ఇలాంటి ఏకాంతసేవా సమయంలో తిరుమల శ్రీనివాసుడు ఇలా ఒక ప్రతిజ్ఞ చేశాడట.

"మామా! అన్నమాచార్యా! ప్రతిరోజురాత్రి నీ సంకీర్తన విన్న ఈ చెవులతో ఇంక ఇతరుల కీర్తనలను విననుగాక వినను" అని ప్రతిన చేశాడట. ఈమాటను అన్నమాచార్యుల కూతురి కొడుకైన రేవణూరి వేంకటార్యుడు తన "శకుంతలా పరిణయం" కావ్యంలో —

"అమ్మహాదేవుడు మదీయ మాతామహవంశ శిఖారత్నంబగు నన్నమాచార్యునకు జామాతురుండనిపించుకొని భవదీయ సంకీర్తనంబు లాలించిన కర్ణంబుల నితర సంకీర్తనంబు లాలించనని ప్రతిజ్ఞ గావించె" నని తెలియ జేశాడు.

ఇలా ఉదయం సుప్రభాతసమయంలో మేలుకొలుపుపాట, రాత్రి ఏకాంత సేవాసమయంలో జోలపాట లేదా లాలిపాట అయిన వెంటనే శ్రీవారి అర్చకులు తాళ్ళపాకవారిని చందన తాంబూలాదులతో సత్కరిస్తారు. ఈ నాటికీ శ్రీవారిఆలయంలో ఆనందనిలయంలో అమలులో వున్న సంప్రదాయం ఇది.

నందకాయుధధారి అయిన శ్రీవేంకటేశ్వరుడు తన నందకాంశజుడు అయిన తాళ్ళపాక అన్నమాచార్యులను మామా! అని పిలిచినట్లు, తాను అన్నమయ్యకు అల్లుడనని చెప్పుకొన్నట్లు ఇంతకుముందే తెలుసుకున్నాం.

నిజంగా అన్నమయ్యకు అల్లుడే ఆనందనిలయుడు! అదెట్లా అంటే —

## నిత్యకల్యాణోత్సవం

'నిచ్చల కల్యాణం పచ్చ తోరణం'గా ప్రసిద్ధి చెందిన క్షేత్రం వేంకటాచలం. భూలోక వైకుంఠమయిన ఈ తిరుమల పుణ్యక్షేత్రంలో శ్రీదేవి భూదేవి ఉభయదేవేరులతో శ్రీవేంకటేశ్వరస్వామివారికి నిత్యమూ కల్యాణోత్సవం జరుగుతుంది. తిరుమలలో ప్రతిరోజు జరిగే కల్యాణంలో శ్రీనివాసుడు నిత్యపెళ్ళికొడుకు. మరి శ్రీదేవి భూదేవులు పెండ్లి కూతుళ్ళు! అందువల్ల

తిరుమల శ్రీవారి కల్యాణమండపం ప్రతిరోజు మామిడాకుల పచ్చతోరణాలతో విలసిల్లుతూ వుంటుంది. అందుకే తిరుమల 'నిత్యకల్యాణం పచ్చతోరణం' అని పేరొంది భక్తుల నోళ్లలో నానుతూ శుభ పరంపరలను గుప్పిస్తూ వుంది.

తిరుమలశ్రీవారిసన్నిధిలో నిత్యకల్యాణాన్ని ఏర్పాటుచేసి, నిర్వహించింది తాళ్లపాక అన్నమాచార్యులవారే. అంతకుముందు సంవత్సరాని కొకమారు జరిగే బ్రహ్మోత్సవాల్లోను, విశేష పర్వదినాల్లోను జరిగే శ్రీనివాసుని కల్యాణోత్సవాన్ని ప్రతిరోజు ప్రతినిత్యం జరిగేటట్లు ఏర్పాటుచేసిన ఘనత అన్నమయ్యకే దక్కింది. మరోవిశేషం ఏమంటే శ్రీవేంకటేశ్వరస్వామి వారిది భరద్వాజ గోత్రం. మరి అన్నమాచార్యులవారిదీ భారద్వాజగోత్రమే! సగోత్రీకులకు కన్యాదానం చెయ్యకూడదంటారు కదా! అయినా జగత్కల్యాణచక్రవర్తికి కన్యాదానం చేసి, పెళ్లిచేయించిన కన్యాదాత తాళ్లపాక అన్నమాచార్యులు. ఆనందనిలయుడు నిత్య పెళ్లికొడుకు! అయితే అన్నమయ్య నిత్య నూతనకన్యాదాత! నేటికీ, ఈ నాటికీ తిరుమల శ్రీవారి కల్యాణోత్సవంలో అన్నమయ్య వంశీయులు కల్యాణపరంపరలు గుప్పించే కొండలరాయునికి నిత్యమూ కన్యాదానంచేస్తూ కన్యాదాతలుగా ప్రముఖ పాత్ర వహిస్తూ సముచితసత్కారం పొందుతూనే వున్నారు. ఈ నిత్యకల్యాణోత్సవాన్ని నిర్వహించడమేగాక, ఆ నిత్యపెండ్లికొడుకు, నిత్య పెండ్లి కూతుళ్ల వైభవాన్ని గూర్చి ఇలా కీర్తించినాడు అన్నమయ్య.

పిడికిట తలఁబ్రాల పెండ్లికూఁతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లికూఁతురు

పేరుకల జవరాలె పెండ్లికూఁతురు పెద్ద
పేరుల ముత్యాలమేడ పెండ్లికూఁతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూఁతురు విభు
బేరుకుచ్చ సిగ్గువడీ బెండ్లికూఁతురు

అని పెండ్లి కూతురైన అమ్మవారినీ —

పెట్టని కోటిందరికిఁ బెండ్లికొడుకు బొమ్మఁ
బెట్టె నసురులకెల్లఁ బెండ్లికొడుకు

పెల్లగించి భూమెత్తీఁ బెండ్లికొడుకు వాఁడె
పిల్లగోవి రాగాల పెండ్లికొడుకు
పెల్లైన యావుల పెండ్లికొడుకు వాఁడె
పిల్లఁ దీపు పెన్బుద్ది పెండ్లికొడుకు

పెంట పెరుగుల దొంగ పెండ్లికొడుకు భూమి
బెంటిపోతులఁ గూరిచెఁ బెండ్లికొడుకు
గెంటులేని వేంకటగిరిమీఁదను వాడె
పెంట వెట్టుకొన్నవాఁడు పెండ్లికొడుకు

నిత్య పెండ్లికొడుకైన శ్రీస్వామివారిని కీర్తిస్తూ, పిదప వారిరువురి కల్యాణానికి ఇలా ఆహ్వానించినాడు అన్నమయ్య.

పసిడి యక్షంత లివె పట్టరో వేగమె రారో
దెసల బేరంటాండ్లు దేవుని పెండ్లికిని

శ్రీవేంకటేశ్వరునికి శ్రీమహాలక్ష్మికి
దైవికపు బెండ్లి ముహూర్తము నేఁడు
కావించి భేరులు మ్రోసె గరుడధ్వజం బెక్కె
దేవతలు రారో దేవుని పెండ్లికిని

తాళ్లపాక అన్నమాచార్యులు 15వ శతాబ్దంలో ప్రారంభించిన ఈ "నిత్యకల్యాణోత్సవ సేవ" ఖ్యాతి, ప్రస్తుతం ఆసేతు హిమాచలపర్యంతమే గాక, యావత్ ప్రపంచం అంతా వ్యాప్తిచెంది, తద్వారా ఆ జగత్కల్యాణ చక్రవర్తియైన శ్రీనివాసునిఅనుగ్రహపరంపరల్ని సంపూర్ణంగా పొందడానికి అత్యంత శుభప్రదమైన విశిష్టసేవగా భక్తలోకంలో గుర్తింపు పొందిందన డంలో అతిశయోక్తి ఆవంతయినా లేదు. ఈ నిత్యకల్యాణోత్సవ నిర్వహణకు తాళ్లపాకవారు కొన్నిగ్రామాలను కూడ కానుక పెట్టుకొన్నారు.

తిరుమలలో నిత్యమూ జరుగుతూ ఎందరో ఎందరెందరో భక్తులు పాల్గొంటూ వున్న ఈ నిత్యకల్యాణోత్సవ విశేషాల్ని గూర్చి జరిగే విధానాన్ని గూర్చి మరోచోట విపులంగా చర్చించుకుందాం.

ఇలా ఒక్క కల్యాణోత్సవమే కాదు. వసంతోత్సవం, బ్రహ్మోత్సవం, పుష్పయాగం వంటి వార్షికఉత్సవాల్లో, ఉగాది, శ్రీరామనవమి, ఆణివార ఆస్థానం, వైకుంఠ ఏకాదశి, దీపావళి వంటి పండుగదినాల్లో జరిగే శ్రీవారి ఆస్థానాల్లో, కొలువు సేవల్లో తాళ్లపాక అన్నమాచార్యులు స్వయంగా పాల్గొని కీర్తించివాడు. ప్రతిశుక్రవారంనాడు స్వామివారి దివ్యమంగళ విరాణ్మూర్తికి జరిగే అభిషేకోత్సవంలో కూడ అన్నమయ్య పాల్గొని పరవసించి గానం చేశాడు.

## శుక్రవారాభిషేకం

కంటి శుక్రవారము గడియ లేడింట
అంటి అలమేల్మంగ అండనుండేస్వామిని

సొమ్ములన్ని కడఁబెట్టి సొంపుతో గోణముగట్టి
కమ్మని కదంబము కప్పుపన్నీరు
చెమ్మతోన వేష్టువలు రొమ్ముతల మొలచుట్టి
తుమ్మెదమైచాయతోన నెమ్మదినుండేస్వామిని

పచ్చకప్పురమె నూటి పసిఁడి గిన్నెలనించి
తెచ్చి శిరసాదిగ దిగనలఁది
అచ్చెర పడిచూడ అందరికన్నుల కింపై
నిచ్చమల్లె పూవువలె నిటు తా నుండేస్వామిని

తట్టుపునుఁగె కూర్చి చట్టలు చేరిచి నిప్పు
పట్టి కరఁగించి వెండి పళ్యాలనించి
దట్టముగ మేనునిండ పట్టించి దిద్ది
బిట్టు వేదుక మురియుచుండే బిత్తరిస్వామిని

ఆనందనిలయుని పన్నిధిలో అనునిత్యమూ శ్రీనివాసుని ఉత్సవాల్లో పాల్గొంటూ, ఆస్వామివారివైభవాన్ని కీర్తిస్తూ రోజుకు ఒక్కకీర్తనకు తక్కువ గాకుండా 32 వేల పద కవితలను ఆలాపిస్తూ జీవితాన్ని పండించుకున్న మహామనిషి తాళ్లపాక అన్నమాచార్యులు.

తిరుమలలో ప్రతి ఉగాది పండుగరోజున ప్రారంభమై వరుసగా 40 రోజుల పాటు కొనసాగే శ్రీవారి నిత్యోత్సవంలో, కొంతదూరం కేవలం అన్నమయ్యపాటను వింటూ, తిరుమల పురవీధుల్లో శ్రీనివాసుడు ఊరే గింపబడతాడు. ఎలాంటి బాజాభజంత్రీలు, వేదనాదాలు లేకుండా కేవలం అన్నమయ్య వంశీకులు తంబురను మీటుతూ గానంచేస్తూ ముందు వెళు తుండగా, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, శ్రీదేవి భూదేవి సమేతంగా ఆ కీర్తనను నిశ్శబ్దంగా మైమరచి వింటూ పురవీథుల్లో అశేషభక్తజనాన్ని అనుగ్రహిస్తూ వుండడం నేటికీ మనం చూడవచ్చు.

తిరుమల ఆనందనిలయుని సన్నిధిలో వైఖానస ఆగమ సంప్రదాయంగా అర్చనలు, ఉత్సవాలు సాగుతూనే వున్నాయి. వాటి నిర్వహణను పాంచ రాత్రాగమ అనుష్ఠానపరులైన భగవద్రామానుజాచార్యుల శిష్యపరంపరలోని జియ్యంగారులు పర్యవేక్షించడం జరుగుతూ వున్నది. ఇలా వైఖానసం - పాంచరాత్రాగమసంప్రదాయాల మధ్య నడుమంతరపు వైష్ణవులైన తాళ్లపాక అన్నమాచార్యుల కీర్తన శాశ్వతంగా చోటుచేసుకొని ప్రముఖపాత్ర వహించడం ఒక విధంగా ఆశ్చర్యం అద్భుతమే అయినా, ఇంకోవిధంగా ఆలోచిస్తే ఇది సాక్షాత్తు శ్రీవారి నందకాయుధం కదా! అందువల్ల దాని పదునైన స్థానాన్ని అది ఎదురులేకుండా నిలబెట్టుకుందని ఆనందం కలగడంలో అతిశయోక్తి లేదు, వుండదు.

ప్రతినిత్యం సుప్రభాత సమయంలో రాత్రి ఏకాంత సేవాసమయంలో, ఇంకా ఇతర సేవల్లోను శాశ్వతంగా ప్రధానంగా చోటుచేసుకొన్న "అన్న మయ్య తెలుగు పదకవిత" కేవలం తెలుగు సాహిత్యంలోనేకాదు, అనంతమైన ఆధ్యాత్మిక ప్రపంచంలోనే అనర్ఘరత్నాలు తాపిన సువర్ణ సింహాసనాన్ని అలం కరించిదని చెప్పవచ్చు. ఆహా! తెలుగుపదకవిత, తెలుగు తల్లి, తెలుగు ప్రజ చేసికొన్న భాగ్య మెంతటిదో!

తెలుగువారి ఇల (నేల) వేలుపుగా, ఇలు (ఇంటి) వేలుపుగా కొలువై వున్న బ్రహ్మాండనాయకుని దర్శించడానికి, ఆ శ్రీనివాసుని సేవించడానికి, ఉత్సవాలు చేయించడానికి విస్తృత ప్రచారంచేస్తూ, ముఖ్యంగా తెలుగు ప్రజను మేలుకొలిపి, అధ్యాత్మిక సుముఖులుగా, మహోన్నతంగా తీర్చి

దిద్దడమే గాక కొండలరాయుని కొండంత అనుగ్రహానికి పాత్రులనుగా చేసిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యుల వారికే దక్కింది.

ఇలా శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహతత్త్వాన్నీ, లీలల్నీ, మహిమల్నీ, తెలుగునాట ప్రతి తెలుగునోట అజరామరంగా నిలిచేట్లుగా ప్రచారం చేస్తూ చివరకు —

నా నాలికపై నుండి నానా సంకీర్తనలు
పూని నాచే నిన్ను పొగడించితివి
వేనామాల వెన్నుడా వినుతించ నెంతవాడ
కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేయయ్యా!

అని అత్యంత భక్తి ప్రపత్తులతో శ్రీనివాసుని స్మరిస్తూ, సర్వ జనాహ్లాదంగా, సర్వజనామోదంగా శ్రీవేంకటేశ్వరపదకవితా యజ్ఞాన్ని నిరాఘాటంగా సాగించి 32 వేల పదకవితలను వ్రాశాడు అన్నమయ్య. ఆ సంకీర్తన పుష్పాలను —

"దాచుకో నీ పాదాలకు తగ నే చేసిన పూజ లివి."

అంటూ తిరమలేశునికే అంకితం చేసినాడు. ఆ ఘనవేంకటేశుని చేత మూడు తరాలు ప్రత్యక్ష దర్శనాన్ని, ఏడుతరాలు మోక్షాన్ని, శాశ్వతంగా వంశీయులకు సేవాభాగ్యాన్ని పొందిన పరమభక్తాగ్రేసరుడు తాళ్లపాక అన్నమాచార్యులు.

"ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించగ
తక్కినవి భండారాన దాచివుండనీ."

అని అంటూ తిరుమల ఆలయ ఆవరణలో "సంకీర్తనా భండారాన్ని" ఏర్పాటు చేసి, "దేవుడు మెచ్చునట్లుగ లోకమూ మెచ్చునట్లుగ" సంకీర్తన రేకులను తయారుచేయించి, వాటిని త్రికరణ శుద్ధిగ సమర్పణ చేసినాడు అన్నమయ్య. విమాన ప్రదక్షిణ మార్గంలో ఉత్తరం దిక్కున వున్న "సంకీర్తన భండారం" (తాళ్లపాకం అర - రాగి రేకుల అర)ను గూర్చి, అక్కడికి వెళ్ళినప్పుడు అన్నమాచార్యుల కుమారులగురించి, వారి కీర్తనల గురించి, మరిన్ని వివరాలను తెలుసుకుందాం.

ఒకే వంశంలో తరతరాలుగా కవులు వుండవచ్చునేమో! ఒకే వంశంలో తరతరాలుగా భక్తులూ వుండవచ్చునేమో! కాని ఒకేవంశంలో తరతరాలుగా

భక్తులై, కవులై వుండడం, అందులోను ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమయిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయ అర్చనా సంప్రదాయవిశేషాల్లో, శాశ్వతంగా చోటు చేసుకొన్న భాగ్యం తాళ్లపాక అన్నమాచార్యులవారికీ, వారి వంశీయు లందరికీ దక్కింది. ఇది నేటికీ అమలులోవుంటూ, ఆనందనిలయునితోపాటు ఆంధ్ర ప్రజను యావత్తూ అలరిస్తూ ఆనందపరుస్తూ వున్న విశేష విషయం! ఇది సాక్షాత్తు హరినందకాంశసంభూతుడైన అన్నమయ్యకే చెల్లింది.

ఇలా సుమారు 95 ఏండ్లపాటు ఆనందనిలయంలోని శ్రీవారి నుంచి విడివడి, విశిష్టమైనపాంచభౌతికశరీరంతో సాక్షాత్తు హరియవతారంగా నడ యాడుతూవున్న నందకఖడ్గం, ఇక స్వామివారితో విరహాన్ని భరించలేక పోయింది. "మమ్ము నెడయకవయ్య కోనేటి రాయడా!" అని విన్నవిం చుకొంటూ నేటికీ 498 (2001) సంవత్సరాల కిందట అంటే సరిగ్గా క్రీ.శ. 1503 దుందుభినామ సంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు అన్నమాచార్యులు, తమపాంచభౌతికదివ్యశరీరాన్ని వదలిపెట్టి, మళ్లీ పూర్వపు నందక ఖడ్గంగా మారి అనంతకోటి బ్రహ్మాండనాయకుని సన్నిధికి తరలివెళ్లి, ఆ స్వామివారి నాభిప్రదేశంలో దివ్యాలంకారమై వెలసినాడు.

భూలోకవైకుంఠమైన తిరుమలపుణ్యక్షేత్రంలో భక్తులపాలిటి కొంగు బంగారంగా, పిలిస్తే పలికే ప్రత్యక్షదైవంగా కొలువై దర్శనమిస్తూవున్న శ్రీవేంకటేశ్వరస్వామివారిని భక్తిగా కొలవడానికి వేరే మంత్రాలు అవస రంలేదు. ఆపదమొక్కులవాడైన ఆనందనిలయుని వేడుకోవడానికి వేద మంత్రాలు తెలియ నక్కరలేదు. ఆ కొండలరాయుని కొండంతటి దయా గుణాన్ని కీర్తించడానికి శ్లోకాలు అక్కరే లేదు. మరింకేం కావాలి? అంటే వేంకటేశుని మంత్రాలై వరలిన అన్నమయ్య పదాలు చాలు! అన్నమాచా ర్యుల చక్కనైన పాటలు చాలు చాలు! ఆయన పదిలమైన మాటలు అంతకంటె చాలు! ఎంచేతంటే అన్నమయ్య పదాలు తిరువేంకటేశుని కీర్తించే వేదాల నాదాలు! ఆయన పాటలు సప్తగిరులనెక్కే రతనాల బాటలు! ఆయన మాటలు శ్రీవేంకటేశుని మంత్రాల మూటలు! ఆ సంకీర్తనలు తెలుగువారి ఇలవేలుపు అలమేలుమంగావిభుని శృంగార నర్తనలు! అన్నమయ్య పదకవితలు శ్రీ వేంకటేశుని దరహాసచంద్రికలను చాటిచెప్పే దివ్యపతాకలు!!

ఈ సందర్భంలో ఒక సత్యమైన మాట! అన్నమాచార్యులను ఆయన పదకవితలను ఉపాసించడంవల్లనే, ఈ రచయిత (జాలకంటి బాల సుబ్రహ్మణ్యం)కు ఒక విధమగు ప్రేరణ, ఒకానొక ధారణ కలిగాయి. ఆ సత్ఫలితమే ప్రతినెలా "సప్తగిరి" మాసపత్రికలో ధారావాహికంగా అక్షర రూపాన్ని పొందుతూ, ప్రస్తుతం మీ చేతుల్లో అలరారుతున్న "హరికొలువు" రచన.

అందుకే అంటున్నాను. అన్నమయ్యపాటద్వారా ఆనందనిలయుని ఉపాసించి మీ కోరికలన్నీ తీర్చుకోండి! తప్పక సిద్ధిస్తాయి.

ఎందుకంటే ఆనందనిలయుడే అన్నమయ్య! అన్నమాచార్యులే తిరు వేంకట విభుడు!!

శ్రీ వేంకటేశపరబ్రహ్మతత్త్వంలో తన మనస్సును నిరంతరం రమింప జేస్తూ, మనలను అందరినీ తరింప జేయడానికి అవతరించిన అన్నమాచార్యుని ఇలా స్తుతించుతూ నతమస్తకులమవుదాం.

> వేంకటేశ పరబ్రహ్మ రసతుందిల మానసమ్
> అధ్యాత్మవిద్యామర్మజ్ఞం అన్నమార్యం నమామ్యహమ్.
>
> — శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ

అత్యంత ప్రాచీనమైన ఈ తిరుమల దివ్యక్షేత్రంలో వెలసిన శ్రీవేంక టేశ్వరుని దివ్యమంగళమూలవిరాణ్మూర్తిని గురించిన అనేక విషయాలను మనకు అర్థమయినంతవరకు తెలుసుకున్నాం. ఆ మూర్తి భక్తులనెలా ఆక ర్షించి, ఆకట్టుకొని అనుగ్రహిస్తున్నదీ తెలుసుకున్నాం. ఆ శ్రీనివాసుని సేవలో అనాదిగా పాలుపంచుకుంటూ ధన్యులైన ఎందరోభక్తవరేణ్యుల కథ లను గాథలను హృదయంగమంగా చర్చించుకున్నాం. ఇలా ఆ వేంకటేశ్వరుని లీలలను తెలియజేసే వృత్తాంతాలు అనంతమైనవి. తిరుమలేశుని మహిమ లను స్పష్టపరచే భక్తుల ఇతివృత్తాలు అనంతానంతములు. ఆనందనిలయుని లీలలు ఆనందనిలయునికి ఒక్కనికి మాత్రమే తెలుసు. ఆయన వృత్తాంతం ఆ స్వామిలీలలు బ్రహ్మాది దేవతలకు సైతం అగమ్యగోచరమైనవి.

మరి ఇలా ఎందరికో దివ్యానుభూతులను పంచిపెడుతూవున్న శ్రీని వాసపెరుమాళ్లు ఆళ్వారులకుకూడ ఎలాంటి అనుభవాల్ని ప్రసాదించాడో క్లుప్తంగా చర్చించుకొని ముందుకు సాగుదాం.

అద్భుతావహమైన ఆనందాయకమైన, ఆకర్షణీయమైన తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యమూర్తిని అత్యంత ప్రాచీనులు, పరమవైష్ణవ భక్తాగ్రేసరులైన ఆళ్వారులుకూడ చక్కగా అనుభవించి ఆనందించి మనకు చక్కని మార్గోపదేశం చేస్తున్నారు చూడండి.

## ఆళ్వారులు

ఆళ్వారులలో మొదటవారే పొయ్‌గై ఆళ్వారు.

"దశావతారాలను గూర్చి విన్నాం. కాని చూళ్లేదు. చూడాలన్నా వీలుకాదు కదా! కాని ప్రత్యక్ష దర్శనం ఇస్తూ భక్తుల ఆర్తిని పోగొడుతూ శాశ్వతంగా తిరువేంగడంలో నిలిచివున్న శ్రీవేంకటేశ్వరుని దివ్యపాద సౌందర్యాన్ని దర్శించాలే తప్ప వర్ణించలేం."

అని పాడుతూ పరవశిస్తారు పొయ్‌గై ఆళ్వారు.

తిరుమలక్షేత్ర సౌందర్యాన్ని శోభనూ వర్ణిస్తారు భూతత్తాళ్వారు. పేయాళ్వారుకు శ్రీనివాసుడు హరిహరమూర్తిగా దర్శనమిస్తూ పొగిడించుకున్నాడు.

తిరుమళిశై ఆళ్వారు, భక్తులకు ఆనందాన్ని పంచి ఇవ్వడానికే భగవంతుడు అర్చామూర్తిగా వేంకటేశ్వరుడై నిలిచి వున్నాడంటారు.

పరమవైష్ణవశిరోమణి అయిన నమ్మాళ్వారులు "శ్రీ వేంకటపతికి చేతులెత్తి దండంపెడితే చాలు. అటు గతజన్మల, ఇటు రాబోయే జన్మల పాపం నశిస్తుంది. ఈ కలియుగంలో ఏమైనా కావాలి అంటే వేంకటాచలం వెళ్లాల్సిందే! ఏడుకొండలవానిని దర్శించి వేడికోవలసిందే. తప్పదు" అంటూ సప్తగిరుల దారిని చూపిస్తారు.

కులశేఖరాళ్వారు సాక్షాత్తు వేంకటాచల పర్వత సానువుల్లో చెట్టుగాను, పుట్టగాను, అక్కడి పుష్కరిణిలో చేపగాను, కొంగగాను, అయివుండాలని కోరుతూ, మళ్లా ఆ కోరిక అశాశ్వతం కనుక, శాశ్వతంగా శ్రీనివాసుని దరహాస చంద్రికలను చూస్తూ వుండేట్లుగా ఆస్వామివారి (చెంత) ముందు రాయిగా పడివుండాలని ఆకాంక్షించాడు. ఈ పరమ భక్తాగ్రేసరుని పేరుతోనే తిరుమల శ్రీస్వామివారి ముందున్న రాతి గడప 'కులశేఖరపడి' అని పిలువబడుతూ ఆయనను స్మరింపజేస్తూ వుంది.

పెరియాళ్వారుగా ప్రసిద్ధి చెందిన విష్ణుచిత్తుడు వేంకటాచలపతి సాక్షాత్తు కృష్ణుడే అని మైమరచి వర్ణించారు. తిరుప్పాణాళ్వారు "ఓ తిరువేంకటేశా! నీ భక్తులకు సేవ చేసే భాగ్యం కలిగించు స్వామీ!" అని ప్రార్థిస్తారు.

ఇక తిరుమంగై ఆళ్వారు "స్వామీ! నేనెన్నో పాపాలు చేశాను. నా పాపాలను నీవు మాత్రమే నశింపజేయగలవాడని" శ్రీ వేంకటేశ్వరుని సార్థక నామాన్ని వర్ణించినారు.

ఇక ఆండాళ్ (గోదాదేవి) తిరుమల గోవిందుని దివ్యమూర్తిని దర్శించి, "వేయివెలుగులతో ప్రకాశిస్తూవున్న దివ్య శంఖ చక్రాలను ధరించివున్న తిరువేంకటపతికి తాను పూర్తిగా అంకితం అయినా" నని విన్నవించుకుంది.

ఇలా కాలాంతరంలో ఎందరో మహనీయులు, ఎందరెందరో పరమ భక్తులు 'కో'యని పిలిస్తే 'ఓ' యని పలికే ప్రత్యక్షదైవమని ప్రసిద్ధి పొందిన శ్రీ వేంకటేశ్వరుని మనసా వాచా కర్మణా త్రికరణ శుద్ధిగ అనుభవించి ఆనందించి తరించారు. మనం అందరం కూడ ఇహపర సౌఖ్యాలను లెస్సగా అనుభవించి తరించడానికి అతి సులువైనది, దగ్గరైనది వేంకటాద్రి మార్గం ఒక్కటే అంటూ సన్మార్గోపదేశం చేశారు. చేస్తున్నారు కూడ. ఆ మహనీయులు చూపిన బాటలో ఏ పూర్వపుణ్యం లేశం చేతనో, తెలిసో తెలియకో మనం అందరం ఆనందనిలయుని సన్నిధిలో నిలిచివుంటూ శ్రీవేంకటేశ్వరుని దివ్యమూర్తి దర్శనాన్ని కన్నులారా చేసుకుంటున్నాం. చెవులారా గోవిందుని గాథల్ని వింటున్నాం. నోరారా శ్రీనివాసుని మధురామృతాన్ని గ్రోలుతున్నాం. మరొక్కసారి ఆనందనిలయం ప్రతిధ్వనించేట్లుగా గోవిందనామాన్ని చేస్తూ తర్వాతి విశేషాలను వివరించుకుందాం

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## శ్రీ వేంకటేశ్వరుని మూలవిరాణ్మూర్తి

ఇలా పరిపరివిధాలుగా దివ్యానుభూతులను పంచిపెడుతూ, భక్తులచేత కీర్తింపబడుతూవున్న శ్రీవేంకటాచలపతి మూలవిగ్రహం సుమారు 8 అడుగుల ఎత్తువుంటుంది.

ప్రతిరోజు తెల్లవారుజామున సుప్రభాతానంతరం భక్తులు, యాత్రికులు ఆనందంగా దర్శించి పులకించే దివ్యమనోహరమూర్తి ఈ మూలవిరాట్టు. ఆ ప్రతిరోజు తెల్లవారుజామునుంచి రాత్రి పొద్దుపోయే దాకా వేలాదిమంది యాత్రికులు భక్తులు బారులుగా వైకుంఠం క్యూద్వారా లేదా ఆర్జిత ప్రవే శంగల పి.పి.సి. షెడ్ల క్యూద్వారా వెళ్లి దర్శించి పునీతులయ్యే దివ్యమూర్తి కూడ ఈ మూలవిరాణ్మూర్తే. అంతేకాదు తిరుమలలోని ఆనందనిలయమనే గర్భాలయంలో కొలువై దర్శనమిస్తూ అందరిని అలరిస్తూ వున్న శ్రీ వేంక టేశ్వరునినిలువెత్తు దివ్యసాలగ్రామ శిలామూర్తిని దర్శించడంకోసమే భక్తులు తిరుమల యాత్ర చేస్తారు.

ప్రతిరోజు రాత్రి ఏకాంతసేవానంతరం బ్రాహ్మమూర్తంలో బ్రహ్మాది దేవతలు కూడ ఈ దివ్యమంగళమూర్తిని దర్శించి ఆరాధించడానికి వస్తారని ప్రసిద్ధి. అందువల్లే అర్చకస్వాములు బ్రహ్మాదిదేవతలు అర్చించడంకోసం బంగారుగిన్నెలో జలాన్ని ఉంచుతారు. ఆ జలమే సుప్రభాతానంతరం భక్తులకు, యాత్రికులకు "బ్రహ్మతీర్థం"గా ఇవ్వబడుతుంది.

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తికి ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండుపూటలా తోమాలసేవ (పుష్పాలంకరణ) ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, ఇలా మూడుమార్లు అర్చన నైవేద్యాలు జరుపబడుతున్నాయి.

ప్రతి మంగళం ఉదయం 6 గంటలకు రెండవ అర్చనగా "అష్టదళ పాదపద్మారాధన" అనే పుష్పార్చన 108 బంగారుకమలాలతో శ్రీ వేంక టేశ్వరస్వామివారి మూలమూర్తి పాదపద్మాలకు అష్టోత్తర శతనామార్చన జరుగుతుంది. ఆర్జితసేవగా కూడ నిర్వహించే ఈ పాదపద్మారాధనలో రుసుమును చెల్లించి గృహస్థులు పాల్గొనవచ్చును.

ప్రతి గురువారం రెండవ అర్చన సమయంలో, ముందుగా మూల మూర్తికి ఆభరణాలు, తిరునామం సడలింపు (సళ్లింపు) చేయబడి రెండవ అర్చనానంతరం 'అన్నకూటోత్సవం' అనబడే "తిరుప్పావడ" నైవేద్యం జరుగు తుంది. బంగారువాకిలి బయట శ్రీస్వామివారికి ఎదురుగా పెద్ద పులిహోర రాశిని అమర్చి నేరుగా శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నివేదించడమే

తిరుప్పావడ సేవ అంటారు. ఈ సేవలో, పులిహోరతోపాటు పెద్ద పెద్ద జిలేబీలు, మురుకులు కూడ శ్రీనివాసునికి నివేదిస్తారు. ఈ తిరుప్పావడ సేవ పూర్తి అయిన తర్వాత శ్రీవారి నేత్రదర్శన అవకాశం భక్తులకు లభిస్తుంది. ఆ నాటి సాయంత్రం "పూలంగిసేవ" అనబడే పుష్పాలంకరణ సేవ ఈ మూలమూర్తికే శోభాయమానంగా జరుగుతుంది.

ప్రతి శుక్రవారం సుప్రభాతానంతరం పునుగు జవ్వాది కస్తూరి మున్నగు సుగంధద్రవ్యాలతో కూడిన మంగళాభిషేకం ఈ దివ్య సాలగ్రామ శిలా మూర్తికి ఘనంగా జరుపబడుతుంది. ఈ శుక్రవారాభిషేక సమయంలో మాత్రమే, బ్రహ్మాది దేవతల కోరికపై ఏనాడో ఎప్పుడో మన కోసం మనందరి కోసం ఈ భూలోక వైకుంఠంలో, ఈ వేంకటాచలంలో వక్షఃస్థల లక్ష్మితో ఆవిర్భవించిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి స్వయంవ్యక్తమూర్తిని ఎలాంటి ఆభరణాలు లేకుండా, ఎలాంటి అలంకరణలు ఆచ్ఛాదనలు లేకుండా యథా తథంగా భక్తులు దర్శించవచ్చును. శ్రీస్వామివారి వక్షఃస్థలంపై కొలువైవున్న ద్విభుజ వ్యూహలక్ష్మిని కూడ భక్త జనులు అభిషేక సమయంలో మాత్రమే నయనానందకరంగా సందర్శించ వచ్చును.

## పరిమళ ద్రవ్యాలు

ప్రతి శుక్రవారం అభిషేక సమయంలో శ్రీస్వామివారి మూలమూర్తికి 84 తులాల పచ్చకర్పూరం, 36 తులాల కుంకుమపువ్వు, 1 తులం కస్తూరి, $1\frac{1}{2}$ తులం పునుగు తైలం, 24 తులాల పసుపుపొడి మున్నగు పరిమళ ద్రవ్యాలు ఉపయోగిస్తారు. శ్రీస్వామివారికి శిరసాదిగా ఈ పరిమళ ద్రవ్యాలతో అభిషేకం చెయ్యగా వచ్చే తీర్థాన్ని "పులికాపు తీర్థం" అని "అంటారు. ఆర్జితసేవగా జరిపే శ్రీవారి శుక్రవారాభిషేకంలో పాల్గొనే భక్తులమీద యాత్రికుల మీద అభిషేకానంతరం ఈ శ్రీపాదతీర్థాన్ని సంప్రోక్షిస్తారు. ఈ హరిపాదతీర్థం అద్భుతమయిన మహిమ గలది. ఈ తీర్థ మహిమను గూర్చి పదకవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు ఇలా కీర్తించినాడు.

## శంకరాభరణం

శ్రీహరిపాదతీర్థంబే చెడని మందు
మోహపాశాలు గోసి మోక్షమిచ్చే మందు.

కారమై కంటగించని కదుఁ జల్లనిమందు
మూఁటని కాచనియట్టి మున్నని మందు
కోరికతో వెలవెట్టి కొని తేవల్లని మందు
వేరు వెల్లంకులు కూర్చనట్టి వెందువోని మందు

గుఱుతైన రోగములు గుణముచేసే మందు
దురితములు పెడఁబాపే దొడ్డమందు
నిరతము బ్రహ్మాదులు నేరుపుతో సేవించే మందు
నరకము సొరనట్టి నయమయిన మందు

పొంకముతో భయములు పొందనియ్యని మందు
మంకుబుద్ధులు మాన్పి మన్నించే మందు
పంకజాక్ష వేంకటరమణ ప్రపన్నుని మందు
సెంకించక తనదాసులఁ జేపట్టేమందు

## ఊర్ధ్వపుండ్రాలు

ప్రతి శుక్రవారంనాడు అభిషేకానంతరం ఈ మూలమూర్తికి నొసటన ఊర్ధ్వ పుండ్రాలు (నామాలు) సమర్పిస్తారు. దీనినే "తిరుమణికాప్పు" అంటారు. వారంలో ఒక్కసారి మాత్రమే అంటే శుక్రవారంనాడు అభిషేకానంతరం మాత్రమే శ్రీవారి నొసటన అలంకరింపబడే తిరమణికాప్పునకు (ఈ నామానికి) గాను 16 తులాల పచ్చకర్పూరం, $1\frac{1}{2}$ తులాల కస్తూరి వినియోగమవుతుంది. శుక్రవారంనాడు కన్నులనిండా నొసటి భాగాన అలంకరించిన ఈ తిరునామాలు మళ్లీ గురువారంనాడు మాత్రమే సడలించబడుతవి. గురువారంనాడు నామాన్ని బాగా తగ్గించినందువల్ల శ్రీవారి నేత్రాలు స్పష్టంగా కనపడతాయి. అందువల్లే గురువారంనాడు "నేత్రదర్శనం" అవుతుంది.

బ్రహ్మోత్సవ సమయాల్లో మాత్రం ఈ నామం సమర్పణలో రెట్టింపు వుంటుంది. అంటే ప్రతి సంవత్సరం పదిరోజులపాటు జరిగే బ్రహ్మోత్సవాలకు ముందువచ్చే శుక్రవారంనాడు - బ్రహ్మోత్సవాలమధ్యలో వచ్చే శుక్రవారంనాడు - బ్రహ్మోత్సవాల ముగింపు తర్వాత వచ్చే శుక్రవారంనాడు - ఇలా మూడు లేదా నాలుగు శుక్రవారాల్లో శ్రీస్వామివారినామాల అలంకరణకు 32 తులాల పచ్చకర్పూరం, 3 తులాల కస్తూరి వినియోగించబడుతుంది. అంటే సంవత్సరంపొడవునా వచ్చే శుక్రవారాల్లోని నామం సమర్పణకంటే రెట్టింపన్నమాట. అందువల్లే బ్రహ్మోత్సవ సమయాల్లోని మూడు లేదా నాలుగు శుక్రవారాలను రెట్టింపు శుక్రవారాలనీ, రెట్టవారాలని తిరుమల ఆలయ సంప్రదాయంలో అంటారు. శ్రీవేంకటేశ్వరస్వామివారికి అలంకరింపబడే పచ్చకర్పూరపునామం వైఖానస ఆగమ సంప్రదాయం ప్రకారంగానే —

"నాసికామూల మారభ్య రేఖా ద్వితయ సంయుతమ్
ధారయేత్ ఊర్ధ్వపుండ్రం హరేః ఫాలతలే శుభే."

నాసికామూలంనుండి ప్రారంభింపబడి ఫాలభాగమువరకు పొడగింపబడి అలంకరింపబడుతుంది.

అభిషేకానంతరం ఈ మూలమూర్తికి 24 మూరల పొడవు 4 మూరల వెడల్పుగల సరిగంచు పెద్దపట్టువస్త్రాన్ని అంతరీయంగాను (ధోవతి) 12 మూరల పొడవు 2 మూరల వెడల్పుగల పట్టువస్త్రాన్ని ఉత్తరీయంగాను రమణీయంగా ధరింపజేస్తారు. ఈ మూలమూర్తికే మణుగుల కొద్ది బరువుగల అనేక అమూల్యమైన ఆభరణాలను, వజ్రకిరీట, శంఖ, చక్ర, వజ్ర కటి హస్తాలు ఇంకా మరెన్నో హారాలు నగలు అలంకరింపబడతాయి.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యమూలవిరాణ్మూర్తికి పాదపద్మాలు మొదలు శిరోభాగము వరకు నిలువెల్ల తొడవులుగా విరాజిల్లే తిరుమలేశుని ఆభరణాలను ఎప్పుడెప్పుడు ఏ యే భక్తులు కానుకలు పెట్టుకున్నారో, ఎందుకు కానుకలు పెట్టుకున్నారో తెలుసుకోవడం ఎవరితరమూ కాదు! నిలువెల్ల నిగనిగలాడుతూ మిరుమిట్లు గొలుపుతూవున్న అమూల్య ఆభర

ణాలు ఆనందనిలయుని ఆర్త రక్షకత్వానికి ఆశ్రితపక్షపాతానికి, వరప్రదానానికి ప్రతీకలు!

ప్రతినిత్యము శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాట్టునకు అలంకరింపబడే కొన్ని దివ్యాభర ణాల పేర్లను మాత్రం తెలుసుకుందాం.

## ఆనందనిలయుని ఆభరణాలు

1. శ్రీవారిపాదాల క్రింది పద్మపీఠం - బంగారు రేకుల పద్మపీఠం
2. బంగారుపాద కవచాలు రెండు - 1. కుడిపాదం, 2. ఎడమ పాదం
3. స్వర్ణపీతాంబరం (బంగారు రేకు)
4. బంగారు ఖడ్గం అనబడే సూర్యకఠారి
5. వైకుంఠ హస్తమునకు అలంకరింపబడే బంగారు కవచంరేకు
6. వైకుంఠ హస్తమునకు అలంకరింపబడే పొడవైన బంగారు సాదారేకు
7. వైకుంఠ హస్తమునకు సాతుబడి అయ్యే బంగారు కుడి నాగాభరణం
8. వైకుంఠ హస్తనాగాభరణం క్రింద వుండే కడియం
9. కటి హస్తమునకు అలంకరించే బంగారు సాదారేకు
10. కటి హస్తమునకు అలంకరింపబడే బంగారు కడియం
11. కటి హస్తమునకు అలంకరింపబడే పొడవైన బంగారు కవచంరేకు
12. బంగారు కటిహస్త కవచం బంగారు రేకు
13. కటిహస్తమునకు అలంకరింపబడే రత్నాలదస్తుబందు
14. ఎడమచేయి నాగాభరణం
15. బంగారు నాగాభరణం అనే వడ్డాణం
16. వక్షఃస్థలం అమ్మవార్ల బంగారు కంటె, రత్నాలతో
17. బంగారు సహస్రనామ సాలిగ్రామమాల
18. బంగారు తులసీహారం
19. కమ్మరపట్టె అనే బంగారు వడ్డాణం
20. ఆరుపోర్వల బంగారు యజ్ఞోపవీతం
21. బంగారు కాసుల దండ (అష్టోత్తర శతనామాలు)
22. నాలుగు పేటల బంగారు మొహరీల గొలుసు

23. భుజకీర్తులు రెండు
24. రత్నాలు పొదిగిన బంగారు శంఖం రేకు
25. రత్నాలు చెక్కిన బంగారు చక్రం రేకు
26. రత్నాలు చెక్కిన బంగారు ఎడమ కర్ణపత్రం
27. రత్నాలు చెక్కిన బంగారు కుడికర్ణపత్రం
28. రత్నాలు చెక్కిన బంగారు బావలీలు: కుడి, ఎడమ
29. చంద్రవంకి తరహా బంగారు కంటె
30. బంగారు గళహారం
31. బంగారు గంటల మొలతాడు
32. బంగారురేకు కర్ణ పత్రముల జంట
33. బంగారు రెండుపేటలగొలుసు
34. బంగారు సాదాకంటెలు
35. బంగారు కిరీటం
36. కొత్తగా చేయించిన బంగారు శంఖచక్రముల కవచరేకులు
37. బంగారు ఐదుపేటల గొలుసు
38. శ్రీ స్వామివారి మకరతోరణం
39. వక్షఃస్థలంలో తగిలించివున్న భూదేవి ప్రతిమ

నిత్యం సమర్పణ అయ్యే ఈ ఆభరణాలన్నీ అర్చకుల అధీనంలో వుంటాయి. వీటి విలువ కోట్ల రూపాయలకు పైబడే వుంటుంది. వీటిలో కొన్ని శ్రీస్వామివారికి అలంకరింపబడగా, మిగిలినవి శ్రీవారిఆలయంలోనే భద్రపరచడం జరుగుతుంది.

సర్వాభరణభూషితుడై నిరంతరం నిరంతరాయంగా భక్తులకోసం ఎదురు చూస్తూ దర్శనమిస్తూవున్న భక్తప్రియుడైన బ్రహ్మాండనాయకుని ఇలా స్తుతించి ముందుకు సాగుదాం.

*వాఁడెవో కంటి రటరే! వన్నెలవాఁడు*
*పైడి మోలము కటారు పరుజులవాఁడు*

పెద్దకిరీటము వాఁడు పీతాంబరమువాడు
నొద్దిక గౌస్తుభమణి వురమువాఁడు
ముద్దుల మొగమువాఁడు ముత్తేల నామమువాఁడు
అద్దిగో శంఖచక్రాల హస్తాలవాఁడు

అందిన కటిహస్తము నభయహస్తమువాఁడు
అందెల గజ్జెల పాదాలవాఁడు
కుందణంపు యీ మకరకుండలంబులవాఁడు
కందువ బాహుపురుల కడియాలవాఁడు

నగవు జూపులవాఁడు నాభి కమలమువాఁడు
మొగపుల మొలనూళ్ల మొలవాఁడు
చిగురు మోవివాఁడు శ్రీవేంకటేశుఁడు
తగు నలమేలుమంగ తాళి మెడవాఁడు.

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!! గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 36. భోగశ్రీనివాసమూర్తి

తిరుమల ఆనందనిలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యవిగ్రహ మూర్తులలో నిలువెత్తు సాలగ్రామమూర్తి అయిన మూలవిరాణ్మూర్తి (ధ్రువ మూర్తి) మొదటిది. కాగా రెండవది 'మనవాళప్పెరుమాళ్' అని పిలువబడే భోగశ్రీనివాసమూర్తి. ఈ మూర్తికే వైఖానసాగమం ప్రకారం 'కౌతుక మూర్తి, పురుష బేరము' అనికూడ పేర్లు వ్యవహారంలో వున్నాయి. శ్రీవారి ఆలయంలో నిత్యమూ రాత్రి ఏకాంత సేవాభాగ్యాన్ని పొందుతూవున్న ఈ భోగమూర్తే 'మనవాళప్పెరుమాళ్' అని కూడ పిలువబడుతూవున్నాడు. 'మనవాళన్' అనగా పెండ్లి కొడుకు. ఎలాంటి పెండ్లి కొమరుడు? అంటే 'నిత్యపెళ్లికొడుకు!' అందుకే ప్రతిరోజు రాత్రి చివరగా ఏకాంత సేవా సమయంలో పట్టుపానుపుపై శయనించే భోగభాగ్యాన్ని పొందుతూ, నిత్యశోభనమూర్తిగా వెలుగొందుతూ వున్న భవ్యమూర్తి, దివ్యమూర్తి ఈ భోగశ్రీనివాసుడు!



భోగ శ్రీనివాసమూర్తి



శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్ప స్వామి

శంఖచక్రధారియైన ఈ చతుర్భుజమూర్తి అన్నివిధాలా శ్రీవారి మూల విరాణ్మూర్తికి ప్రతిరూపం (నకలు)గా ప్రతిష్ఠింపబడిన చిన్న వెండి ప్రతిమ! అదిగో దర్శించండి! ఒకటిన్నర అడుగుల ఎత్తు వున్న ఈ భోగశ్రీనివాస మూర్తిని, 'జీవస్థానం' అని పిలువబడే అంటే శ్రీ స్వామివారిమూలవిరాట్టు పాదాలచెంత పద్మపీఠానికి ఆనించి వుంచారు చూడండి!

క్రీ.శ. 614 లో 'కడవన్ పెరుందేవి' అనే నామాంతరం వున్న పల్లవమహారాణి 'సామవాయి' (శ్యామవ్వ లేదా శ్యామలాంబ) ఈ వెండి భోగ శ్రీనివాసమూర్తిని తిరుమల శ్రీవారి ఆలయానికి బహూకరించింది. ఆ సమయంలో ఆనందనిలయం (గర్భాలయం) మరమ్మత్తులు జరుగుతుండగా, నేడు 'స్నపనమండపం' అని పిలువబడే 'తిరువిలాన్ కోయిల్ (బాలాలయం)ను నిర్మించి, అందులో మూలమూర్తికి ప్రతిగా ఈ భోగశ్రీనివాసుణ్ణి ప్రతిష్ఠించి స్నపన తిరుమంజనాదులు (అభిషేకాలు) పూజా నివేదనలు ఏర్పాటు చేసిందట'. అంతమాత్రమేగాక కన్యామాసం అనగా తమిళుల పెరటాసి నెలలో (సెప్టెంబరు అక్టోబరు నెలలో జరిగే శ్రీవారి బ్రహ్మోత్సవాలకు ముందుగా)ఈ మూర్తిని ఊరేగించేట్లుగా కట్టడి చేసిందట ఈ పల్లవరాణి శ్యామవ్వై. అంతమాత్రమేగాక ఈ మనవాళప్పెరుమాళ్ భోగ మూర్తికి అనేక ఆభరణాలను నగలను కూడా కానుకలు పెట్టి అలంకరింపజేసి తరించింది పల్లవరాణి పెరిందేవి.

ఆనాటి నుండి నేటివరకు ఈ భోగ శ్రీనివాసమూర్తి పేరుతో ఈ వెండిమూర్తి శ్రీవారి ఆలయ సేవలో ప్రధానంగా పాలుపంచుకొంటూవుంది.

ప్రతిరోజు తెల్లవారుజామున సుప్రభాతానంతరం, తోమాలసేవ (పుష్పాలంకరణ)కు ముందుగా ఈ భోగశ్రీనివాసమూర్తికి ఆకాశగంగా తీర్థ జలాలతో నిత్యాభిషేకం జరుగుతుంది. శ్రీనివాసుని మూలమూర్తికి బదులుగా నిత్యమూ అభిషేకాన్ని చేయించుకుంటున్న దివ్యమూర్తి ఈ భోగమూర్తి.

ప్రతి బుధవారంనాడు ఉదయం 6 గంటలకు బంగారువాకిలికి ముందు వున్న మహామణిమండపంలో జరిగే సహస్రకలశాభిషేకంలో ఈ భోగ శ్రీనివాస మూర్తిని స్నానపీఠంపై గరుడాళ్వారుకు ఎదురుగా వేంచేపు చేస్తారు. ఆ సమయంలో ఆనందనిలయంలోవున్న మూలమూర్తితో బయట బంగారు

వాకిలిముందు స్నానంపీఠంపై వున్న భోగమూర్తిని పట్టుదారంతోకాని, బంగారుతీగతోకాని కట్టి అనుసంధానిస్తారు. ఇలాఅనుసంధానించడంలో ఈ భోగమూర్తికి జరిగే సహస్రకలశాభిషేకం సర్వవిధాలా మూలమూర్తికి జరిగినట్లేనని అంతరార్థం. ఈ సహస్రకలశాభిషేకసమయంలో భోగశ్రీనివాస మూర్తికి కుడిపక్కన ఉత్తరాభిముఖంగా ఒకస్నానపీఠంపై శ్రీదేవి, భూదేవి సమేత మలయప్పస్వామి వారినీ, అలాగే ఎడమ పక్కన మరొక స్నానపీఠంపై దక్షిణాభిముఖంగా సేనాధిపతి విష్వక్సేనులవారిని వేంచేపుచేసి భోగమూర్తితో కలిపి, సహస్రకలశాభిషేకం చేస్తారు. అభిషేకానంతరం రెండవనైవేద్యంగా క్షీరాన్నం, అప్పాలు, పొంగళ్లు మున్నగునవి నివేదింపబడతవి.

ప్రతిరోజు రాత్రి ఏకాంతసేవలో 'పవ్వళింపు సేవ' మనవాళపెరుమాళ్ అని పిలువబడే ఈ భోగ శ్రీనివాసమూర్తికే జరుగుతుంది. కాని ప్రతి ధనుర్మాసంలో ఒక నెలరోజులపాటు మాత్రం ఈ శయనసేవాభాగ్యం, ఆనందనిలయంలోనే కొలువై వున్న మరోమూర్తి శ్రీ కృష్ణస్వామివారికి జరుగుతుంది.

ప్రతిరాత్రి ఏకాంతసేవా సమయంలో భోగశ్రీనివాసుడిని గర్భాలయం ముందువున్న శయనమండపంలో వెండిగొలుసులతో వేలాడగట్టబడిన బంగారు నవారు పట్టెమంచంమీద వేసి పట్టుపరుపుపై భక్తులను వీక్షిస్తున్న భంగి మలో దక్షిణం తలాపుగా శయనింపజేస్తారు. మంచంచుట్టూ నేలమీద తరిగొండవెంగమాంబ పేరు మీద ముగ్గుపిండితో రంగవల్లులు తీర్చిదిద్దబడ తాయి. మంచంముందు రెండడుగుల ఎత్తుగల వెండిదీపం సెమ్మెలను 'సన్నిధిగొల్ల' వెలిగిస్తారు.

ప్రతిరాత్రి జరిగే ఈ ఏకాంతసేవా సమయంలో శ్రీవేంకటేశ్వరస్వామి వారికి చక్కెరకలిపిన గోరువెచ్చని ఆవుపాలు, పంచకజ్జాయం (గసగసాలు, చక్కెర, జీడిపప్పు, ఎండుకొబ్బరి ముక్కలు, ఎండుద్రాక్ష, ఏలకులపొడి కలిపి తయారుచేయబడి పొడిగా వున్న ప్రసాదం), అనేకరకాల పండ్లను తరిగి, కలిపి తయారుచేసిన 'మేవా' అనబడే పంచామృతంలాంటి ప్రసాదం నివేదించబడుతుంది.

ఈ సమయంలోనే మెత్తటి శ్రీచందనం ముద్దలు రెండింటిలో ఒకముద్ద శ్రీ వేంకటేశ్వరస్వామివారిమూలమూర్తి పాదాలపైన, సగంముద్ద మంచంపై పవ్వళించివున్న భోగశ్రీనివాసమూర్తి వక్షఃస్థలంపైన, 1/4 వంతు మూల మూర్తి వక్షఃస్థలంపైన, వున్న శ్రీమహాలక్ష్మి అమ్మవారికి, మిగిలిన 1/4 భాగం ముద్ద రాత్రి బ్రహ్మాది దేవతలువచ్చి అర్చించుటకుగాను మూలమూర్తి సమక్షంలో పళ్లెంలో వుంచబడుతుంది.

శ్రీ భోగశ్రీనివాసమూర్తికి శయనమండపంలో పాన్పుసేవ జరుగుతూ వుండగా రాములవారిమేడ నడవలో తాళ్లపాక అన్నమయ్య వంశీయులొకరు స్వామికి ఎదురుగా కూర్చొని లాలిపాటను లేదా జోలపాటను తంబుర మీటుతూ గానంచేస్తారు.

అన్నమయ్యగారిలాలిపాట పూర్తి అయినతర్వాత చివరిగా పరమ భక్తు రాలు తరిగొండ వెంగమాంబగారి 'ముత్యాలహారతి' అనబడే కర్పూరహారతిని అటు ఆనందనిలయంలోపల శ్రీవారి మూలమూర్తికి, ఆ తర్వాత మంచంపై పవ్వళించివున్న భోగమూర్తికి ఇస్తారు. ఈ చివరి హారతి వెలుగుల్లో శ్రీనివా సుని దివ్యతేజస్సు మనోహరంగా, నయనానందకరంగా వుండి మనస్సును ఎదో తెలియని ఆధ్యాత్మికలోకాల్లో విహరింపజేస్తుంది. ఈ 'ముత్యాల హారతి'తో ఆనాటి శ్రీస్వామివారి పూజావిధి, ఆలయ కార్యక్రమం పూర్తి అవుతుంది.

ముత్యాలహారతి అనంతరం స్వామికి నివేదింపబడిన పాలు మేవా ప్రసాదం భక్తులకు పంచబడుతుంది.

మళ్లీ తెల్లవారుజామున సుప్రభాతసేవాసమయంలో బంగారువాకిలి ముందు సుప్రభాతపఠన జరుగుతుండగా, బంగారువాకిలి లోపల అర్చకస్వా ములు పట్టుపానుపుపై శయనించివున్న భోగశ్రీనివాసమూర్తికి ఉపచారము లను సమర్పించి శయనమండపంనుంచి యథాప్రకారంగా గర్భాలయంలోనికి తీసుకొని స్వామివారి మూలవరులపాదపీఠం (జీవస్థానం) చెంత వేంచేపు చేస్తారు.

నిత్యశోభనమూర్తియైన భోగశ్రీనివాసస్వామిని కన్నులారా దర్శించండి!

సమస్తభోగభాగ్యాలను ప్రసాదించే ఈ భోగశ్రీనివాసుని వైభవాన్ని ఏకాంతసేవా సమయంలో పాల్గొన్నప్పుడు, లేదా సహస్రకలశాభిషేకంలో పాల్గొన్నప్పుడు మరోసారి దర్శించి ధన్యోస్మి! అని ఆనందిద్దాం!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఇప్పుడు శ్రీవేంకటేశ్వరస్వామివారి మరోమూర్తి అయిన 'కొలువు శ్రీనివాసుని గూర్చి తెలుసుకుందాం.

## 37. కొలువు శ్రీనివాసమూర్తి

అదిగో! దర్శించండి! బంగారు సింహాసనంలో మహాదర్పంగా దర్శనమిస్తూవున్న కొలువు శ్రీనివాసమూర్తిని!

ఈ కొలువుశ్రీనివాసమూర్తికి లేఖనశ్రీనివాసమూర్తి, దర్బార్ శ్రీనివాసమూర్తి, అళగిప్పిరానార్, బలిబేరం, అనిరుద్ధబేరం అనే వేర్వేరు పేర్లు కూడా వున్నాయి.

శ్రీవారి మూలమూర్తికి నకలు పంచలోహ ప్రతిమగా చెప్పబడుతూవున్న ఈ కొలువు శ్రీనివాసమూర్తి ఎత్తు 2 అడుగులు మాత్రమే! ఈ మూర్తి, క్రీ.శ. 826 సం॥ నాటిదిగా భావించడం జరుగుతున్నది.

ప్రతిరోజు ఉదయం శ్రీస్వామివారిమూలమూర్తికి, తోమాలసేవ (పుష్పాలంకరణ) పూర్తి అయిన వెంటనే, బంగారువాకిలి లోపలవున్న స్నపన మండపంలోవున్న బంగారు సింహాసనంలో ఈ కొలువు శ్రీనివాసమూర్తిని ఆసీనుల్నిచేస్తారు. బంగారుగొడుగు, వింజామరలు పట్టుకుంటారు. అర్ఘ్య పాద్యాచమనాది ఉపచారాలు సమర్పించిన తర్వాత ధూపదీపహారతులు ఇస్తారు. ఆ తర్వాత పంచాంగశ్రవణం జరుగుతుంది.

పంచాంగశ్రవణంలో ఆస్థానసిద్ధాంతివచ్చి శ్రీనివాసునిసన్నిధిలో సాష్టాంగ దండప్రణామాలు సమర్పిస్తూ, ఆనాటి తిథి, వార, నక్షత్ర యోగ, కరణాది విశేషాలతో పాటు, ఆనాటి శ్రీవారి ఉత్సవవిశేషాలను, సేవలను గూర్చి తెలియజేస్తారు.

పిదప బొక్కసం (ట్రెజరీ) గుమాస్తా వచ్చి, చేతులుజోడించి శ్రీ స్వామివారికి భక్తుల నుండి వచ్చిన ముందునాటి ఆదాయాలను, హుండీ

రాబడులను, ఉత్సవాలవల్లా, ప్రసాదం అమ్మకం వగైరాలవల్ల వచ్చిన ఆదాయాన్ని పైసలవరకు కూడ లెక్కగట్టి మొత్తం నికరాదాయాన్ని ఈ కొలువు శ్రీనివాసమూర్తి వారికి వినిపించి, చివరలో 'ప్రభువులవారు చిత్తగించవలెను!' అని అత్యంత భక్తి పూర్వకంగా వినయంగా విన్నవించుకొంటూ సాష్టాంగ నమస్కారంచేస్తాడు. ఈ కొలువులోనే 'నిత్యాన్నదానపథకం' దాతల పేర్లుకూడ శ్రీస్వామివారికి వినిపింపబడతవి. ఆ తర్వాత అర్చకస్వాములు, బంగారు సింహాసనంలో ఆసీనులైన శ్రీ కొలువు శ్రీనివాసమూర్తివారితో మాత్రాదానం (తండులదానం - 16 కిలోల బియ్యం)తో పాటు దక్షిణ తాంబూలాలు స్వీకరిస్తూ, 'నిత్యైశ్వర్యోభవ!' అని శ్రీశ్రీనివాసస్వామివారిని ఆశీర్వదిస్తారు. పిదప, వేయించి, బెల్లంతో కలిపి దంచిన నువ్వుల పిండిని ఈ కొలువుమూర్తికి నివేదించి కర్పూర నీరాజనాలు ఘనంగా సమర్పిస్తారు.

సూర్యోదయానికి పూర్వం అయితే, ఈ కొలువు, బంగారువాకిలి లోపలవున్న స్నపన మండపంలోను, సూర్యోదయం అయిన తర్వాత అయితే బంగారువాకిలి ముందువున్న ఘంటామండపంలోను జరుపబడుతుంది.

ఈ కొలువు శ్రీనివాసమూర్తిని 'బలిబేరం' అని పిలువబడుతున్నా శ్రీవారినైవేద్యం అయింతర్వాత ఆలయఅష్టదిక్కుల్లో బలిని సమర్పించే సమయంలో ఈ మూర్తిని ఆలయంవెలుపలికి తీసుకొని రావటంలేదు. ఏవేళలోను ఘంటామండపాన్ని దాటిరాని ఈ కొలువుమూర్తిని అందరూ దర్శించ వలనుపడదు.

ఇదీ సర్వజగత్ప్రభువులైన శ్రీనివాసచక్రవర్తికి ప్రతినిత్యమూ జరుపబడే దర్బార్! ఈ దర్బార్‌లో బంగారుసింహాసనం మీద కొలువై దర్పంగా సార్వభౌమోచిత సత్కారాలతో నిండుగా మెండుగా దర్శనమిస్తూవున్న కొలువు శ్రీనివాసమూర్తి వారికి ఎలుగెత్తి బహూపరాకులు చెప్పండి మరి!

*అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా!*
*ఆదిమధ్యాంత రహితా!*
*జగదేక సార్వభౌమా!*
*శ్రీమత్ రాజాధిరాజపరమేశ్వరా!*
*నిత్యకల్యాణచక్రవర్తీ!*

*శ్రీమదలమేలుమంగపతీ!*

*బహూపరాక్! బహూపరాక్!! బహూపరాక్!!!*

ఇక శ్రీవేంకటేశ్వరస్వామివారి నాల్గవ మూర్తి అయిన 'శ్రీ ఉగ్ర శ్రీనివాసమూర్తి'ని గూర్చి తెలుసుకుందాం.

## 38. ఉగ్రశ్రీనివాసమూర్తి

శ్రీదేవి భూదేవి సమేత శ్రీ ఉగ్రశ్రీనివాసమూర్తికే 'వేంకటత్తురైవార్, స్నపన బేరం, స్నపనమూర్తి, అచ్యుతబేరం' అనే పేర్లు తిరుమల ఆలయ సంప్రదాయంలో వినవస్తున్నాయి.

స్నపనబేరం (స్నానంబేరం) అని పిలువబడుతున్నా ఈ మూర్తికి నిత్యాభిషేకం నిర్వహించటం లేదు. ఉభయ నాచ్చియారులతోకూడివున్న ఈ ఉగ్రశ్రీనివాసుని పంచలోహమూర్తులు ప్రాచీనకాలంలో తిరుమల ఉత్సవాల్లో, ఊరేగింపుల్లో పాల్గొనేవట!

ఒకప్పుడు, ఈ విగ్రహమూర్తుల్ని ఊరేగిస్తున్న సమయంలో కొన్ని విచిత్ర సంఘటనలు, విపరీత పరిణామాలు, భీతావహమైన ఉపద్రవాలు కలగడంవల్ల ఆనాటి (1330) నుండి ఆ ప్రతిమల్ని ఉపయోగించడంలేదు.

కాని సంవత్సరంలో ద్వాదశ తిరువారాధన (కృష్ణాష్టమి రోజునజరిగే ఆరాధన) నాడు, కార్తీక ద్వాదశి (కైశికద్వాదశి లేదా క్షీరాబ్దిద్వాదశి) అనే పర్వదినాల్లో మాత్రమే ఈ ఉగ్రశ్రీనివాసమూర్తికి ఆస్థానం జరుగుతుంది. సూర్యోదయం అయినతర్వాత వెలుగులు ఈ మూర్తికి సోకితే ఉగ్రత్వం వస్తుందనీ, నేటికీ పై రెండురోజుల్లో జరిగే ఉత్సవాల్లో సూర్యోదయానికి చాల ముందుగానే అంటే తెల్లవారుజామున 2 $\frac{1}{2}$ - 3 గంటలకు మధ్య జరుపబడుతున్నది.

ద్వాదశ తిరువారాధననాడు రాత్రి 10 గంటలకు బంగారువాకిలి ముందున్న ఘంటామండపంలోనికి శ్రీదేవిభూదేవిసమేత శ్రీఉగ్ర శ్రీనివాసమూర్తిని వేంచేపుచేసి స్నపన తిరుమంజనాదులు నిర్వహించి నివేదనలు చేస్తారు. అనంతరం మళ్లీ ఈ మూర్తులను తీసుకొని వెళ్లి ఆనందనిలయంలో వేంచేపుచేస్తారు.



వజ్రకవచధారి శ్రీ వేంకటేశ్వరుడు



శ్రీ మలయప్ప స్వామి

ఇక కైశికద్వాదశి (కార్తీకద్వాదశి) రోజున సుప్రభాతం, తోమాల సేవా నంతరం శ్రీదేవి భూదేవి సమేత శ్రీఉగ్రశ్రీనివాసునికి అభిషేకాదులు జరిగిన తర్వాత పట్టువస్త్రాలు, ఆభరణాలు, పుష్పమాలలు అలంకరిస్తారు. పిదప ఈ స్వామివారు ఛత్రచామర బాజాభజంత్రీలు మున్నగు సార్వ భౌమోచిత సత్కారాలతో ఆలయం వెలుపలికి వచ్చి, తిరుమల ఆలయం మహాప్రదక్షిణ మార్గంలో ఊరేగింపబడతారు. ఈ ఊరేగింపు సూర్యోదయా నికి చాల ముందుగా జరుగుతుంది. అర్చకులు ఉదయాత్పూర్వమే అంటే తెల్లవారుజామున 3 గంటల సమయానికంతా ఈ ఉగ్ర శ్రీనివాసుడు ఆలయంలో ప్రవేశించునట్లుగా అత్యంత జాగ్రత్త వహిస్తారు. ఈ ఊరేగింపు పూర్తి అయిన తర్వాత ఆలయంలోని రంగమండపంలో ఈ ఉగ్ర శ్రీని వాసమూర్తిని సర్వభూపాలవాహనంలో వేంచేపుచేసి నైవేద్య నీరాజనాలు సమర్పిస్తారు. పిదప ఈ మూర్తులను ఆనందనిలయంలో ప్రవేశింప జేస్తారు.

శ్రీవారి మూలమూర్తికి నకలు ప్రతిమ అయిన ఈ ఉగ్రశ్రీనివాసమూర్తి పంచలోహవిగ్రహం 20 అంగుళాల ఎత్తు కలిగివుండి, 6 అంగుళాల ఎత్తుగల పద్మపీఠంపై అమర్చబడివుంది. అలాగే ఈ స్వామికి ఇరువైపులా 5 అంగుళాల పీఠంపై 18 అంగుళాల ఎత్తుకలిగివున్న శ్రీదేవి, భూదేవి పంచలోహ ప్రతిమలు ఉన్నాయి.

అతిప్రాచీనకాలంనుండి శ్రీవేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తికి ప్రతిగా, ఇప్పుడున్న అన్ని ఉత్సవమూర్తులకంటే చాలపూర్వమే ఉత్సవాల్లో ఊరేగింపుల్లో పాల్గొంటూ, తనభక్తులను బాధించే, హింసించేవారియందు ఉగ్రత్వాన్ని వహించే శ్రీదేవి భూదేవి సహిత శ్రీ ఉగ్రశ్రీనివాసమూర్తిని అదిగో కన్నులారా దర్శిస్తూ అడుగడుగుదండాలు పెట్టండి మరి!

*అడుగడుగు దండాలవాడా! గోవిందా!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 39. శ్రీ మలయప్పస్వామి

అదిగో! నేత్రానందంగా దర్శించండి! ఆనందనిలయం వెలుపల, శ్రీదేవి భూదేవి ఉభయ నాచ్చియారులతో, ప్రతిఉత్సవంలో, ప్రతి ఊరేగింపులో పాల్గొనే ఉత్సవ శ్రీనివాసమూర్తి!

మలయకునియన్నిన పెరుమాళ్, ఉత్సవబేరం, సత్యబేరం, మలయప్ప స్వామి అని ఈ ఉత్సవ శ్రీనివాసమూర్తికి తిరుమలఆలయవ్యవహారంలో పేర్లు వినపడుతున్నాయి. ఇలా ఈ మూర్తికి ఎన్నిపేర్లు వున్నప్పటికీ వీటి అన్నింటిలోను, భక్తుల హృదయమందిరాల్లో స్థిరంగా ప్రతిష్ఠింపబడి విస్తృతంగా ప్రచారం పొందిన పేరు "శ్రీ మలయప్ప స్వామి."

తిరుమల ఆనందనిలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి వున్న ఐదుమూర్తుల (పంచబేరాలు)లో శ్రీదేవి భూదేవి సమేతంగా వున్న శ్రీమలయప్పస్వామివారి పంచలోహమూర్తి ఐదవది. శ్రీవారి ఆలయంలో శ్రీస్వామివారిధ్రువమూర్తికి కుడివైపున, దక్షిణంవారకు ఒక పీఠంపై ఎప్పుడూ ఈ మూర్తులు వేంచేసి దర్శనమిస్తూ వుంటారు.

'మలయప్పస్వామి' ప్రస్తావన క్రీస్తుశకం 1339 నాటి శాసనంలో కనపడుతున్నది. అంతకుపూర్వం శ్రీదేవి భూదేవులతో కూడివున్న "శ్రీఉగ్ర శ్రీనివాసమూర్తి" ఉత్సవమూర్తిగా ప్రముఖపాత్ర వహించినట్లు తెలుస్తున్నది.

తిరుమలలో పూర్వంనుండి ఉత్సవమూర్తిగా వుంటూ "వేంకటత్తురైవార్" అని ప్రసిద్ధిచెందిన ఉగ్రశ్రీనివాసమూర్తికి బదులుగా ఈ "మలయప్ప స్వామి" ఉత్సవమూర్తిగా ప్రవేశించడానికి ఒక అద్భుతగాథ అనూచానంగా వినవస్తున్నది.

## మలయప్పకోనలో స్వామి

పూర్వం అంటే 13వ శతాబ్దంలో జరుగుతూ వున్న ఒకానొక బ్రహ్మోత్సవ సమయంలో శ్రీదేవి భూదేవులతో కూడి వున్న ఉగ్రశ్రీనివాసమూర్తి తిరుమల పురవీధుల్లో ఊరేగింపబడుతూవుండగా తిరుమలలోని ఇండ్లన్నీ తగులబడ్డాయట. భయంకరమైన ప్రమాద సంఘటనలు సంభవించాయట. ఈ విపరీత పరిణామాలకు అర్చకస్వాములు, తిరుమల గ్రామస్థులు, యాత్రికులు, భక్తులు, భీతిచెంది ఈ విపత్తులనుంచి కాపాడవలసిందని శ్రీవేంకటేశ్వరస్వామివారిని ప్రార్థించారట. అప్పుడు శ్రీస్వామివారు ఒక భక్తునియందు ఆవేశించి, ఇకమీదట తన ఈ విగ్రహమూర్తులను ఉత్సవాలకు ఊరేగించినట్లయితే ఉగ్రత్వమొస్తుందని ఇలాంటి సంఘటనలు జరగకుండా

వుండాలంటే, అందుకుగాను అనువుగావుండే వేరే ప్రతిమామూర్తులు ఈ వేంకటాచలపర్వతసానువుల్లో 'మలయప్పకోన' అనే చోట లభ్యమవుతా యనీ వాటిని తెచ్చి ఇప్పటినుంచి ఉత్సవమూర్తులుగా ప్రతిష్ఠించవలసిందని ఆదేశించినాడు.

శ్రీవారి ఆదేశానుసారం వెంటనే అర్చకస్వాములు ఆ బ్రహ్మోత్సవా లను ఆపివేసి, కొత్త విగ్రహాలకోసం ఏడుకొండలలో 'మలయప్పకోన' అనేచోట అన్వేషించి, అన్వేషించి చివరకు నేలలో నిక్షిప్తమైవున్నవాటిని కనుగొన్నారు. సంప్రదాయసిద్ధంగా బాజాభజంత్రీలతో, వేదమంత్రోచ్చార ణలమధ్య ఆ ఉత్సవ మూర్తులను తీసుకొనివచ్చి సంప్రోక్షణాదులవంటి ఆగమకార్యక్రమాలను నిర్వహించి శ్రీదేవి భూదేవి సమేతంగా లభ్యమైన ఉత్సవ శ్రీనివాసమూర్తి మూడు విగ్రహాలను ఉత్సవమూర్తులుగా శ్రీవారి ఆలయంలో ప్రతిష్ఠించి ఆ మూర్తులతో ఉత్సవాలు నిర్వహించినారట. మధ్యలో ఆగిపోయిన బ్రహ్మోత్సవంలోనే శ్రీస్వామివారి జన్మ నక్షత్రమైన శ్రవణం రోజునే ఈ కొత్తమూర్తులతో ఉత్సవాలు కొనసాగించినారు.

'మలయప్పకోన' అనే ప్రాంతంలో ఈ మూర్తులు దొరికినందువల్ల ఈ ఉత్సవమూర్తి 'మలయప్పస్వామి' అని వ్యవహరింపబడుతూ, ప్రసిద్ధి చెందినాడు. అంతేకాదు ఎంతో లోతైన మలయప్పకోనలో లభ్యమైనందువల్ల 'మలయకునియునిన్ర పెరుమాళ్' అని తమిళంలోకూడ ఈ మూర్తి పిలువ బడినాడు. అంటే "బాగా వంగిన పర్వతమైదానంలో దొరికిన పెరుమాళ్లు (దేవుడు)" అని అర్థం.

శ్రీ వేంకటాచలక్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరా ణ్మూర్తి స్వయంభువులయిన "సాలగ్రామశిలామూర్తి" కాగా, "మలయప్ప స్వామి" కూడ ఈ ఏడుకొండలక్షేత్రంలోనే స్వయంవ్యక్తమై లభ్యమైన "పంచలోహమూర్తి" — అని చెప్ప బడుతూవుంది. అంతమాత్రమే కాదు.

తిరుమలభక్తులకు, యాత్రికులకు నిత్యమూ ఎక్కువకాలం సన్నిహితంగా దర్శనమిస్తూ మైమరపు కలిగించి పులకింపజేస్తూవున్న శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూలవిరాణ్మూర్తి ఆనందనిలయంలో స్థిరంగావున్న 8అడుగుల ఎత్తువున్న సాలగ్రామమూర్తి కాగా, ఆ భక్తులందరితోపాటు, ఆనంద

నిలయం వెలుపల సంచరిస్తూ, అందరికీ అందుబాటులో అతిదగ్గరగా వుంటూ నిండుగా మెండుగా వివిధ సోయగాలతో, సొంపులతో, వివిధ అలంకారాలతో, ఆభరణాలతో ఆనందింపజేస్తూ చరిస్తూవున్న 3 అడుగుల ఎత్తువున్న పంచలోహమూర్తి ఈ "మలయప్పస్వామి". అనగా భక్తుల హృదయాల్లో శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తి తర్వాత ప్రత్యేక మైన విశిష్టస్థానాన్ని సంపాదించుకున్న ఉత్సవ శ్రీనివాసమూర్తి "శ్రీ మలయప్పస్వామి". భక్తులను తన దగ్గరికి రప్పించుకొని దర్శనమిచ్చే స్వామి "ధ్రువమూర్తి" కాగా, భక్తులదగ్గరికే వచ్చి దర్శనమిచ్చే చరమూర్తి "శ్రీ మలయప్పస్వామి".

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తికి ప్రతి (నకలు)గా, ఉత్సవబేరంగా అలరారుతూవున్న శ్రీ మలయప్పస్వామివారి పంచలోహ ప్రతిమ ఎత్తు 3 అడుగులు. అనగా 9 అంగుళాల పద్మ పీఠంపై 27 అంగుళాల స్వామివారిమూర్తి అమర్చబడింది. ఈ మూర్తికి ఇరువైపులా 4 అంగుళాల పీఠంపై అమర్చబడిన 24 అంగుళాల ఎత్తు కలిగిన శ్రీదేవి (స్వామివారికి కుడివైపు), భూదేవి (ఎడమవైపు) పంచలోహ ప్రతిమలు దర్శనమిస్తున్నాయి దర్శించండి!

శ్రీమలయప్పస్వామిమూర్తులు లభ్యమైన నాటినుండి తిరుమలలో, శ్రీవారిఆలయం వెలుపల అంటే బంగారువాకిలి బయట జరిగే ఉత్స వాల్లో, ఊరేగింపుల్లో, ఆస్థానసేవల్లో, కొలువుల్లో, వేడుకల్లో..... ఇలా ఒకటేమిటి? అన్నిటా శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామి పాల్గొంటూ పరమానందాన్ని పంచిపెడుతూనే వున్నాడు.

తిరుమలలో శ్రీమలయప్పస్వామివారు ఏ యే సేవల్లో, ఏ యే ఉత్సవాల్లో ఎప్పుడెప్పుడు పాల్గొంటారో తెలుసుకుందాం. తెలుసుకునే ముందుగా శ్రీవారిఆలయ సంప్రదాయంలో, ఆనందనిలయ కార్యక్రమాల్లో శ్రీమలయప్పస్వామి వారికి ఉన్న ప్రత్యేకతలను, ప్రాముఖ్యాన్ని, విశిష్టతలను గూర్చి తెలుసుకుందాం.

## అభిషేకం

ప్రతివెలా శ్రీస్వామివారి జన్మనక్షత్రం అయిన శ్రవణం రోజున తెల్లవారు జామున సుప్రభాతానంతరం తోమాలసేవకు ముందుగా, శ్రీమలయప్ప స్వామివారికి దేవేరులతోకూడ ఆనందనిలయంలో ఏకాంతంగా అభిషేకం జరుపబడుతుంది.

ఇదిగాక ప్రతిరోజు ఆర్జితసేవగా జరిగే వసంతోత్సవంలోను, ప్రతి సోమవారం ఉదయం జరిగే 'విశేషపూజ' లోను, ప్రతి బుధవారం ఉదయం జరిగే 'సహస్రకలశాభిషేకం'లోను వార్షికోత్సవాలైన వసంతోత్సవాల్లోను, జ్యేష్ఠాభిషేకంలోను, పవిత్రోత్సవాల్లోనూ, బ్రహ్మోత్సవాల్లోను, పుష్పయాగంలోను, తిరుమంజనాదు (అభిషేకాలు) లందుకొంటున్నాదు శ్రీమలయప్పస్వామి.

## దివ్య కవచములు

శ్రీ వేంకటేశ్వరస్వామివారిమూలమూర్తికి వున్నట్లుగానే శ్రీమలయప్ప స్వామివారికి కూడ అనేకానేక అమూల్యమైన బంగారు నగలు, వజ్రఖచిత స్వర్ణాభరణాలు, వివిధ కిరీటాలు వున్నాయి. ఎందరో మహారాజులు, ప్రభువులు, సంస్థానాధీశులు ఆ యా కాలాల్లో సమర్పించిన కానుకపెట్టుకొన్న చారిత్రక విలువలు కలిగిన దివ్యాభరణాలెన్నో ఈ మలయప్పస్వామివారికి ప్రత్యేకంగా వున్నాయి.

అంతేకాదు, తిరుమల శ్రీవారి ఆలయంలో ఏ మూర్తికీ లేనటువంటి వజ్రకవచాన్నీ, ముత్యాలకవచాన్ని, బంగారుకవచాన్ని కలిగి వున్నాదు శ్రీ మలయప్ప.

వజ్రకవచాన్ని ధరించిన శ్రీమలయప్ప భక్తులను వజ్రకవచంవలె రక్షిస్తూ "వజ్ర కవచధారి వేంకటేశ్వరుని"గా దర్శనమిస్తూ భక్త రక్షణలో తన వజ్రసంకల్పాన్ని వ్యక్తంచేస్తూ భక్తిని మరింత పెంచుతున్నాదు. ఇక ముత్యాలకవచంలో స్వామి "ముత్యాల కవచధారి"గా భక్తులను మురిపిస్తూ, చల్లగా అందరినీ కరుణిస్తూ కోరినవరాలనిచ్చే కొండలరాయునిగా దర్శనమిస్తున్నాదు. ఇక స్వర్ణకవచంలోకూడ స్వామివారు కన్నులకు మిరుమిట్లుగొలుపుతూ తన భక్తప్రియత్వాన్ని చాటుతూ స్వర్ణకవచధారి సప్తగిరీశునిగా మైమరపిస్తున్నాదు.

## నైవేద్యాలు

ధ్రువమూర్తితోపాటు చరమూర్తి అయిన శ్రీమలయప్పస్వామివారు ఆనందనిలయంలో వేంచేసివున్నప్పుడు మాత్రమే నివేదనలు జరుపబడుతవి. ఒకవేళ ఆనందనిలయాన్ని విడిచి ఊరేగింపునకుగాని, ఉత్సవానికిగాని బంగారు వాకిలిదాటి బయటికివెళ్లినా, శ్రీమలయప్పస్వామి మళ్లీ తిరిగి ఆనంద నిలయంలో ప్రవేశిస్తేనే నివేదనలు జరుగుతాయి. అంతవరకు ఆలయంలో ఎలాంటి నివేదనలు జరుగవు.

ఆనందనిలయంలో ధ్రువమూర్తితోపాటు ప్రతిరోజు మూడుపూటలే గాక, ఆనందనిలయం బయట ఉత్సవాల్లో పాల్గొన్నప్పుడు ప్రత్యేకంగా శ్రీమలయప్పస్వామికి అన్నప్రసాదాలు, వడలు, లడ్డులు, అప్పాలు, దోసెలు ...... వగైరా నివేదింపబడుతున్నాయి.

## ఎన్నెన్నో సేవలు.... మరెన్నెన్నో ఉత్సవాలు

శ్రీవేంకటేశ్వరస్వామి పిలిస్తే పలికే ప్రత్యక్ష దైవం. భక్తులపాలిటి కొంగుబంగారం. ఆదుకొనే ఆపద్బంధువు. అత్యంత భక్త ప్రియుడు. అంతే కాదు ఆ భక్తులందరిచేతా తృణమో పణమో దానంపుచ్చుకొని వారి వారి పాపాలను పోగొడుతూ వున్నాడు. వారినుంచి ఒకటిగ తీసుకొని దానికి వేయి రెట్లుగ అనుగ్రహిస్తాడు. భక్తులను దండిగ అనుగ్రహించడానికే వారిచేత ఉత్సవాలు చేయించుకుంటాడు. అసలు తన భక్తులకు కల్యాణప్రదములైన శుభపరంపరలు కలిగించటానికే వారిచేత కల్యాణోత్సవాలో, డోలోత్సవాలో, ఊరేగింపులో నిర్వహింపజేసుకుంటూ "కలౌ వేంకటనాయకః" అన్న ప్రసిద్ధి పొందిన దేవదేవుడు, జగత్కల్యాణచక్రవర్తి తిరుమల గోవిందుడు. తిరుమల శ్రీనివాసునికి ప్రతినిత్యమూ జరిగే ఎన్నో సేవల్లో ... మరెన్నెన్నో ఉత్సవాల్లో శ్రీవారి వైభవాన్ని తిలకించిన వారికి ఒక్కొక్క సేవలో ఒక్కొక్క సంతృప్తి! ఒక్కొక్క ఉత్సవంలో ఒక ఉత్సాహం! ఒక్కొక్క ఊరేగింపులో ఒక్కొక్క దివ్యానుభూతి! ఒక మైమరపు! ఒక తన్మయత్వం! కలుగుతుంది.

ఇలా భక్తులకు యాత్రికులకు వింత వింతలుగా అనుభవాలను, అనుభూతులను దివ్యాతిదివ్యంగా పంచుతూవున్న శ్రీవేంకటేశ్వరస్వామివారి

ఉత్సవాలు, సేవలు ఏడాది పొడవునా జరుగుతూనే వుంటాయి. కనుకనే తిరుమలపుణ్యక్షేత్రంలో ప్రతిరోజూ పండుగనే! ప్రతిపూటా పాయసాలే! పరమాన్నాలే! సంవత్సరం పొడవునా అంటే 365 రోజుల్లో తిరుమలలో 450కి పైబడే ఉత్సవాలు ఊరేగింపులు జరుపబడుతున్నాయి. వీటిసంఖ్య ఎప్పటికప్పుడు ఇంకా పెరుగుతూనే వుంది. వీటిలో కొన్ని సేవలు శ్రీనివాసుని మూలమూర్తికి జరుగుతూ వుండగా, అత్యధికంగా శ్రీవారి ఉత్సవమూర్తి అయిన శ్రీమలయప్పస్వామివారికే నిర్వహింపబడపటం విశేషం!.

ప్రస్తుతం ఏడాదిపొడవునా శ్రీదేవి భూదేవులతో కూడివున్న శ్రీమలయప్పస్వామివారికి జరుగుతూవున్న అన్ని సేవలను గూర్చి ఏకరవు పెట్టడంకూడ అంత సులభంకాదు. అయినా వాటిల్లో అతిముఖ్యమైన వాటిని గూర్చి క్లుప్తంగా తెలుసుకుందాం.

## నిత్యకల్యాణోత్సవం

భక్తులు కోరిన సంతానం, వివాహాలు, ఉద్యోగాలు, గృహనిర్మాణాది సర్వశుభకార్యాలను సంపూర్ణంగా నెరవేర్చి, వారిచేత తాను నిత్యకల్యాణం చేయించుకోవడం శ్రీవేంకటేశ్వరస్వామివారికి భలే ఇష్టం! అసలు అలాంటి శుభపరంపరలు కల్గించడానికే భక్తులచేత కల్యాణం చేయించుకుంటాడట స్వామి! కనుకనే తిరుమలపుణ్యక్షేత్రంలో శ్రీదేవి భూదేవులతో శ్రీవేంకటేశ్వరస్వామివారికి నిత్యమూ కల్యాణోత్సవం జరుగుతుంది. మరి నిత్యమూ జరిగే ఈ కల్యాణోత్సవంలో నిత్యనూతన వరుడెవరో తెలుసా! మన మలయప్పస్వామివారే! దర్శించండి.

కేవలం కన్నులతో మాత్రమే కాదు. ఆ నూతన వధూవరుల దివ్య సౌందర్యాన్ని మనస్సు విప్పి లోపలి పొరలలోనుంచి ప్రశాంతంగా వీక్షించండి! హృదయంలోంచి అరమరికలు లేకుండా తిలకించండి! ఎన్నో జన్మాంతర వాసనల్ని మాయంచేస్తూవున్న, ప్రారబ్దకర్మల్ని, పాపాల్ని నశింపజేస్తూవున్న నిత్యకల్యాణచక్రవర్తిని దర్శించి ధన్యులు కండి! మరి ఈ శుభసమయాన ఒక్కసారి ఆ లోకకల్యాణ చక్రవర్తికి జేజేలు పలికి శుభప్రదంగా ముందుకు సాగుదాం.

*జగత్కల్యాణ చక్రవర్తీ! జయహో!*
*నిత్యకల్యాణ చక్రవర్తీ! జయ జయహో!*

పూర్వం శ్రీమలయప్పస్వామివారికి విశేషపర్వదినాల్లో, బ్రహ్మోత్సవాల్లో మాత్రమే కల్యాణోత్సవం జరిగేది. కాని ఆ తర్వాత తాళ్లపాక అన్నమాచార్యులవారు తిరుమలలో నిత్యకల్యాణాన్ని ఏర్పాటుచేసి స్వయంగా తాను కన్యాదాతగా కూడ నిర్వహించినాడు. అప్పుడు 15వ శతాబ్దంలో తాళ్లపాక అన్నమయ్య ఏర్పాటు చేసిన ఈ నిత్యకల్యాణోత్సవం నేటికీ నిర్విఘ్నంగా, నిరాఘాటంగా కొనసాగుతూ తద్ద్వారా ఆ జగత్కల్యాణచక్రవర్తి అయిన శ్రీనివాసప్రభువుల సంపూర్ణమైన అనుగ్రహ పరంపరలను పొందడానికి అత్యంత శుభప్రదమైన విశిష్ట సేవగా యావత్ ప్రపంచంలోని భక్తలోకంలో గుర్తింపు పొందింది అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

తిరుమల క్షేత్రంలో భక్తులు అత్యధికంగా పాల్గొనే సేవ కూడ నిత్యకల్యాణోత్సవం ఒక్కటే!

కూటికే గడవని అతిపేదవారు మొదలుకొని, కోట్లకు పడగెత్తిన ధనవంతులవరకూ కూడ అందరూ పాల్గొనే ఈ నిత్యకల్యాణోత్సవంలో భక్తులసంఖ్య నానాటికీ పెరుగుతూనే వుంది. ప్రస్తుతం ప్రతిరోజు 300 లకు పైగా కల్యాణోత్సవాలు నిర్వహింపబడుతూ వున్నాయి. నానాటికీ శ్రీ మలయప్పస్వామివారికి కల్యాణోత్సవం చేయించే భక్తుల సంఖ్య విపరీతంగా పెరుగుతున్నందువల్ల ఎప్పటికప్పుడు శ్రీవారి కల్యాణవేదిక మార్చబడుతూనే వుంది.

భక్తుల రాక కోసం ఎదురుచూస్తూ, ఆ వచ్చిన భక్తులను తన దివ్యమంగళ విగ్రహ దర్శనభాగ్యంచేత ఆ దివ్యక్షణంలోనే మైమరపిస్తూ, ఆ భక్తులకు కల్యాణ పరంపరల్ని గుప్పించడానికే నిత్యమూ కల్యాణోత్సవం చేయించుకుంటూవున్న సర్వజగత్ప్రభువు అయిన సప్తగిరీశునకు మరొక్కమారు మంగళప్రదంగా ఆరతులిచ్చి తర్వాతి విషయాల్ని తెలుసుకుందాం.

*జగత్కల్యాణ చక్రవర్తికి జయమంగళం!*
*నిత్యకల్యాణచక్రవర్తికి నిత్యశుభమంగళం!!*
*గోవిందా! గోవిందా!! గోవిందా!!!*

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారిఉత్సవమూర్తి అయిన శ్రీమలయప్పస్వామి వారికి ప్రతిసంవత్సరం ఉగాదినుంచి ఉత్సవాలు, ఊరేగింపులు ప్రారంభమవుతాయి. తెలుగు సంవత్సరాది పండుగను, తెలుగువారి ఇలవేలుపు అయిన శ్రీవేంకటేశ్వరుడు తెలుగువారి సంప్రదాయరీతిలోనే జరుపుకొంటారు. ఉగాదిరోజున శ్రీవారి ఆలయంలో జరిగే వేడుకనే 'ఉగాది ఆస్థానం' అంటారు.

## ఉగాది ఆస్థానం

ఉగాది ఆస్థానం రోజున శ్రీమలయప్పస్వామి శ్రీదేవిభూదేవి సమేతంగా సర్వశోభాయమానంగా వజ్రవైడూర్యాది అనేకమైన నగలతో అలంకరించుకొని బంగారువాకిలి ముందువున్న గంటామండపంలో తూర్పుముఖంగా సర్వభూపాలవాహనంలో వేంచేస్తారు. ఆ పక్కనే మరొకపీఠంపై దక్షిణాభిముఖంగా శ్రీవారిసేనాధిపతి వేంచేస్తారు. పిదప నివేదనాదులు అన్నీ అయినతర్వాత శ్రీస్వామివారికి అర్చకస్వాములు పంచాంగ శ్రవణం శోభాయమానంగా చేయిస్తారు. సంవత్సర ఫలితాలు, లాభనష్టాలు, ఆదాయ వ్యయాలు, పంటలు వగైరావిషయాలన్నీ పంచాంగశ్రవణంద్వారా శ్రీనివాసుడు తెలుసుకుంటాడు. ఆతర్వాత శ్రీస్వామివారికి అక్షతారోపణ, కర్పూర హారతులు జరుగుతవి. ఇదే ఉగాది ఆస్థానం. ఇంచు మించు ఇదేరీతిలో దక్షిణాయన పుణ్యకాలమైన కర్కాటక సంక్రాంతి (జులై 16) నాడు ఆణివార ఆస్థానం, దీపావళినాడు, బంగారువాకిలి ముందట శ్రీమలయప్పస్వామివారికి ఆస్థాన సేవలు జరుపబడుతవి.

ఇలా తొలిగా ఆస్థానం మొదలు శ్రీమలయప్పస్వామివారికి ప్రారంభమైన ఉత్సవాలు ఏడాదిపోడవునా జరుగుతవి. ఉత్సవ శ్రీనివాసమూర్తి అనబడే ఈ మలయప్పస్వామివారికి ప్రతిరోజు నిత్యకల్యాణోత్సవం, వాహన సేవలు, సహస్ర దీపాలంకారసేవ వంటి నిత్యోత్సవాలు, విశేషపూజ, సహస్రకలశాభిషేకం వంటివారోత్సవాలు, శ్రవణం ఆరుద్రవంటి నక్షత్రోత్సవాలు (మాసోత్సవాలు) వసంతోత్సవం, ఆణివార ఆస్థానం, పవిత్రోత్సవం, బ్రహ్మోత్సవం, పారువేటోత్సవం, పుష్పయాగం, పద్మావతీ పరిణయోత్సవం,

తెప్పోత్సవాలు వంటి వార్షిక ఉత్సవాలు నిర్వహింపబడుతూవున్నాయి. ఏడాదిపాటూ ప్రతిరోజు జరిగే అన్ని సేవలు, ఉత్సవాలు ఊరేగింపులకంటే సంవత్సరంలో ప్రతి కన్యామాసంలో పదిరోజులపాటు జరిగే బ్రహ్మోత్సవ వైభవం మాత్రం తిరుమలపుణ్యక్షేత్రచరిత్రలోనే పరాకాష్ఠ! మరి తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాలు ఎప్పటికప్పుడు నూతనంగా దివ్యంగా వైభవోపేతంగా జరుగుతూ ప్రపంచప్రసిద్ధిని పొందినాయి. 'న భూతో న భవిష్యతి' అని పేరొందిన బ్రహ్మోత్సవాల విశిష్టతను గూర్చి క్లుప్తంగా తెలుసుకుందాం.

## బ్రహ్మోత్సవాలు

శ్రీమహావిష్ణువునకు వైకుంఠం తర్వాత అత్యంత ఇష్టమైన ఈ వేంకటాచల క్షేత్రంలో తాను సంకల్పించినపుడు భువికి దిగివచ్చి సంచరిస్తూ భక్తులను సంరక్షిస్తూ వుండినాడు. పిదప బ్రహ్మాది దేవతల కోరికపై భక్తులకోసం స్వయంభువుగా అర్చామూర్తియై భూలోకవైకుంఠమయిన ఈ తిరుమల పుణ్య క్షేత్రంలో శ్రీమహావిష్ణువు శ్రీవేంకటేశ్వరునిగా అవతరించి నాడు. ఆయన ఆవిర్భవించిన శుభసమయం కన్యామాసంలోని శ్రవణ నక్షత్రంరోజు. ఇది సరిగ్గా ప్రతిసంవత్సరం చాంద్రమానం ప్రకారం విజయ దశమి - శ్రవణనక్షత్రం రోజునకు కూడుతుంది. ఎప్పుడైనా అధికమాసం వచ్చినట్లైతే ఈ కన్యామాసం భాద్రమాసంలో వస్తుంది. ఇలా అలనాడు శ్రీవేంకటేశ్వరుడు భక్తులకోసం ఆవిర్భవించిన కన్యామాసం - శ్రవణ నక్షత్రం నాటికి ముగిసేట్లుగా పదిరోజులముందునుంచే తిరుమల శ్రీవారికి అవతారదినోత్సవాలు లేదా ఆవిర్భావ దినోత్సవాలు, లేదా జన్మదినోత్స వాలు జరుగుతాయి. తొట్టతొలిగా శ్రీనివాసుని అవతారదినోత్సవాలను బ్రహ్మదేవుడు లోకకల్యాణార్థం నిర్వహించినాడు. ఆనాటినుండి బ్రహ్మ నిర్వహించిన ఈ ఉత్సవాలు నేటివరకు ఇప్పటివరకు "బ్రహ్మోత్సవాలు" పేరుతో నిరాటంకంగా, వైభవంగా జరుగుతూ ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా విరాజిల్లుతూవున్నాయి.

పదిరోజులపాటు జరిగే బ్రహ్మోత్సవాల్లో శ్రీమలయప్పస్వామివారు రోజుకొక్క వైభవంగా పూటకొక్క వాహనంపై ఊరేగింపబడతారు.

తొలిరోజు ధ్వజారోహణ అనే కార్యక్రమంలో ఆలయంలోని బంగారు ధ్వజస్తంభంపై గరుడకేతనం ఎగురవేయబడుతూ, అష్టదిక్పాలకులు దేవతలు, ఇలా అందరూ శ్రీమలయప్పస్వామి ఆధ్వర్యంలో ఆహ్వానింపబడతారు. పిదప ఆ రాత్రి శ్రీమలయప్పస్వామి శ్రీదేవి భూదేవి సమేతుడై పెద్దశేషవాహనంలో ఊరేగింపబడతారు. ఇక ఆ మరునాటినుంచి చిన్నశేషవాహనం, హంస, సింహ, ముత్యపుపందిరి, సర్వభూపాల వాహనం, మోహిని అవతారంలోను, బంగారుగరుడనిపై, హనుమంతునిపై, గజవాహనంపై సూర్య, చంద్రప్రభలపై అశ్వంపై వివిధ అలంకార సోయగాలతో సొంపులతో ఊరేగుతూ మైమరపిస్తాడు శ్రీ మలయప్పస్వామి.

## గరుడోత్సవం

ఈ బ్రహ్మోత్సవంలో ఐదవనాటి రాత్రి గరుడోత్సవంలో శ్రీ మలయప్పస్వామి వైభవం వర్ణించడానికి వలనుపడదు. ఆనందనిలయంలోని మూలవిరాట్టునకు అలంకరింపబడే లక్ష్మీహారం, మకరకంఠి, సహస్రనామ హారం మున్నగు అమూల్యమైన హారాలు గరుడోత్సవంనాడు శ్రీమలయప్పస్వామివారికి అలంకరింపబడతవి. మద్రాసునుంచి కొత్త గొడుగులు వస్తాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శ్రీవారికి సమర్పించిన నూతనపట్టు వస్త్రాలను ధరిస్తారు స్వామి. అదే సమయానికి శ్రీవిల్లిపుత్తూరు శ్రీగోదాదేవి ధరించిన పూలమాల రాగా దానినికూడ అత్యంత ప్రియంగా ధరిస్తారు శ్రీమలయప్పస్వామి. ఇలా ఆ రాత్రి అనంత వైభవాలతో అశేష జనప్రవాహం మధ్య అందరినీ అలరిస్తూ ఆనందింపజేస్తూ శ్రీమలయప్పస్వామి గరుడనిపై విహరిస్తారు. ఈ ఉత్సవాన్ని చూచి తీరాలే తప్ప వర్ణించడానికి మాటలు చాలవు.

## రథోత్సవం

ఈ బ్రహ్మోత్సవాల్లోనే తొమ్మిదవరోజు ఉదయం జరిగే మరో విశిష్ట ఉత్సవం రథోత్సవం. తిరుమల చరిత్రలోనే అత్యంత విశిష్టమైనది మహోన్నతమైనది శ్రీవారి రథోత్సవం. మేరుపర్వతంలాంటి చెక్కరథంలో

శ్రీమలయప్పస్వామి ఉభయదేవేరులతో వేంచేసి, భక్తులందరూ గోవింద నామ ఘోషలతో రథం పగ్గాలను లాగుతూ వుండగా, చిన్మయహాసంతో దర్శనమిస్తారు స్వామి.

"రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే."

రథంలో వేంచేసివున్న శ్రీమలయప్పను దర్శిస్తే భక్తులకు మళ్లీ జన్మ అంటూ వుండదట! కాని ఇక్కడ మాత్రం భక్తులు స్వామీ మళ్లీ మళ్లీ ఈ రథోత్సవాన్ని తిలకించడానికే జన్మ నివ్వవలసిందని శ్రీమలయప్పను ప్రార్థిస్తారట భక్తులు.

## చక్రస్నానం

బ్రహ్మోత్సవంలో చివరిరోజు 'చక్రస్నానం' శ్రీస్వామివారి జన్మ నక్షత్రం శ్రవణం కూడినరోజు. ఈ రోజు శ్రీదేవి భూదేవులతో కూడిన శ్రీ మలయప్పస్వామి, వరాహస్వామి ఆలయ ప్రాంగణం చేరుకుంటారు. ఈ మలయప్పతోపాటు మరొకపల్లకిపై శ్రీసుదర్శనభగవానులు కూడ అక్కడికి చేరుకుంటారు. శ్రీవరాహస్వామిఆలయ ప్రాంగణంలో శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్ప స్వామివారి పక్కన ఒకేపీఠంపై శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు వేంచేయగా వీరందరికీ అభిషేకం జరుగుతుంది. పిదప శ్రీసుదర్శనభగవానులకు మాత్రమే శ్రీస్వామిపుష్కరిణిలో పవిత్ర స్నానం జరుపబడుతుంది. అదే సందర్భంలో శ్రీసుదర్శన భగవానులతోపాటు యాత్రికులు భక్తులు పుష్కరిణిలో పవిత్రస్నానం చేసి పునీతులవుతారు. ఈ చక్రస్నానంలో పదిరోజుల బ్రహ్మోత్సవాలకు అవబృథం జరుగుతుంది. ఇక ఆ రాత్రి శ్రీమలయప్పస్వామి సమక్షంలో బంగారు ధ్వజస్తంభంపైన వున్న గరుడ ధ్వజం అవరోహణ చేయబడటంతో బ్రహ్మోత్సవాలు సంపూర్ణమవుతాయి.

ఇలా సంవత్సరం పొడవునా ఆనందనిలయం బయట తిరుమల పుర వీధుల్లో జరిగే ఉత్సవాలలోను, ఊరేగింపులలోను పాల్గొంటూ అందరికీ సన్నిహితంగా ఉంటూ ఆనందపరుస్తూవున్న స్వామి శ్రీమలయప్పస్వామి ఉత్సవాలకు మారుపేరు అయిన శ్రీమలయప్పస్వామివారికి జరిగే వివిధ ఉత్సవాలను, ఊరేగింపులను గూర్చి తర్వాత తెలుసుకుందాం.

ఇలా సామాన్య భక్తులు మొదలుగా బ్రహ్మాది దేవతలవరకు వారి వారి శక్తిమేరకు ఉత్సవాలను సేవలను చేయించుకుంటూ అందరికి అన్ని కోరికలను తీరుస్తూ కోరిన వరాలరాయుడని ప్రసిద్ధిచెందిన జగత్కల్యాణ చక్రవర్తి అయిన శ్రీమలయప్పస్వామికి మరొక్కమారు సాష్టాంగదండప్రణామాలు చేసి ముందుకు సాగుదాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# ఇతర మూర్తులు

ఇంతవరకు మనం శ్రీవేంకటాచలక్షేత్రంలోని ఆనందనిలయంలో వెలసిన శ్రీవేంకటేశ్వరస్వామివారి పంచబేరాలను (ఐదుమూర్తులను) గూర్చి వివరంగా చర్చించుకున్నాం. ఆ యా మూర్తులు ఎప్పుడెప్పుడు ఏ యే సేవల్లో పాల్గొంటారో తెలుసుకున్నాం. ఆనందనిలయంలో శ్రీనివాసుని పంచబేరాలే కాక, మరికొన్ని ఇతర ఉత్సవమూర్తులు కూడ వెలసివున్నాయి. అవి 1. శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు, 2. శ్రీ సీతారామలక్ష్మణులు, 3. రుక్మిణీ శ్రీకృష్ణులు, 4. సాలగ్రామాలు.

# 40. శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు

తిరుమల శ్రీవారిఆనందనిలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిలో శ్రీ సుదర్శనభగవానుడు పంచలోహఉత్సవమూర్తిగా చక్రాకార రూపంలో వేంచేసి దర్శనమిస్తూవున్నాడు. సుమారు 6 అంగుళాల ఎత్తు కలిగిన చతురస్ర పీఠంపై సుమారు 2 అడుగుల ఎత్తు కలిగిన గుండ్రని చక్రాకారంతో విరాజిల్లుతూవున్న శ్రీ సుదర్శన భగవానునికి సంవత్సరంలో నాలుగుమార్లు శ్రీస్వామిపుష్కరిణిలో చక్రస్నానం జరుగుతుంది. ప్రతి బ్రహ్మోత్సవంలోను, రథసప్తమి పండుగనాడు, అనంత పద్మనాభ చతుర్దశి రోజున, వైకుంఠద్వాదశినాడు — ఇలా నాలుగుమార్లు జరుగుతున్న శ్రీ సుదర్శన చక్రస్నానాన్ని గురించి వివరంగా తెలుసుకుందాం. ఈ వివరాలను తెలుసుకునేముందు తిరుమలలో శ్రీ సుదర్శన భగవానులు శ్రీస్వామివారి కుడిచేతిలోను, జ్యోతిస్స్వరూపంగాను, ఉత్సవమూర్తిగాను దర్శనమిస్తూ

భక్తులచేత ఎలా సేవింపబడుతున్నాడో, భక్తులను ఎలా రక్షిస్తూవున్నడో క్లుప్తంగా పరిశీలిద్దాం.

ఆనందనిలయంలో శ్రీవేంకటేశ్వరస్వామివారి కుడిచేతిలో చక్రాయుధంగా సుదర్శనుడు వేంచేసివున్నాడు. మరి శ్రీవారు ధరించిన ఈ చక్రం ఎలాంటిది దాని స్వరూపం ఏమిటి!

స్ఫురత్ సహస్రార శిఖాతి తీవ్రం
సుదర్శనం భాస్కర కోటితుల్యమ్
సురద్విషాం ప్రాణ వినాశి విష్ణోః
చక్రం, సదాహం శరణం ప్రపద్యే.

కోటి సూర్యుల తేజస్సుతో ప్రకాశించే జ్యోతిశ్చక్రమట! ఇదే భావంతో తాళ్లపాక అన్నమాచార్యులు కూడా శ్రీనివాసుని చేతి సుదర్శనచక్రాన్ని —

కోటి సూర్యులొక కూటువ గూడుక
చాటున మెరసేటి చక్రము!
గాఁటపు వేవేలు కాలరుద్రులటు
నీటునఁ తొలఁకేటి నిబిడ చక్రము!
... ... ... ... ... ... ... ... ... ...
అమరుచు శ్రీవేంకటాధిపు కరమున
దెమలక యుండేటి దివ్య చక్రము!

అని వర్ణిస్తూ కీర్తిస్తాడు. తన ఈ దివ్యచక్రాన్ని శ్రీ వేంకటేశ్వరస్వామివారు తన ఆంతరంగిక భక్తుడైన తొండమానుచక్రవర్తికి ఇచ్చి ఆదుకున్నట్లు ఇంతకు ముందే తెలుసుకున్నాం కదా. అందుకే భక్తరక్షణ కోసం శ్రీవేంకటేశుడు శంఖచక్రాలను ధరించి సిద్ధమై సర్వసన్నద్ధమై వుంటాడు.

సర్వకాలాల్లో సర్వప్రదేశాల్లో సర్వావస్థల్లో భక్తులను ఆదుకొనే ఆపద్బంధువు, ఆత్మబంధువు ఆనందనిలయుడు. శ్రీవేంకటేశ్వరస్వామివారి దుష్టశిక్షణ, భక్త రక్షణ కార్యక్రమంలో సుదర్శనభగవానుడు నిత్యమూ అప్రమత్తంగా పాల్గొంటూ సేవచేస్తున్నాడు. అలాంటి సమయాల్లో శ్రీ స్వామివారు తన చక్రాన్ని ప్రయోగించడట! కేవలం మనసులో సంకల్పి

స్తాడట. అలా శ్రీనివాసుడు భక్తులను రక్షించవలసిందని సుదర్శనుణ్ణి సంకల్పించిన వెంటనే తిరుమలకు వచ్చే యాత్రికులు, ఇంటివద్ద యాత్రకు సంకల్పం చేసుకున్నక్షణంనుంచీ, యాత్రలో బస్సుల్లో, రైళ్లల్లో, తిరుమలలో, కల్యాణకట్టలో, స్వామిపుష్కరిణిలో, వైకుంఠంక్యూల్లో, దర్శనవేళల్లో ఇలా సర్వే సర్వత్రా మళ్లీ ఆ భక్తులు ఇండ్లకు చేరేంతవరకు అప్రమత్తంగా, అత్యంత జాగరూకుడై భక్తరక్షణ చేస్తుంటాడు సుదర్శనభగవానుడు. ఏ భక్తుని కైనా, ఎక్కడైనా, ఏదైనా ఆపద కలిగిన వెంటనే ఆ భక్తుడు "గోవిందా! ఏడుకొండలవాడా! గోవిందా! వేంకటరమణా! ఆపద మొక్కులవాడా! గోవిందా! ఈ ఆపద పోగొట్టుస్వామీ!" అని ఆప దమొక్కులతో ప్రార్థించిన వెంటనే ఏడుకొండలమీద బంగారుమేడలో కొలువైవున్న బ్రహ్మాండనాయకుడు భక్తరక్షణకై సుదర్శన భగవానుని ఆదే శిస్తాడట! అంతే ఆ భక్తుడు ఎన్ని వేలమైళ్ల దూరంలో వున్నా సరే సుదర్శనుడు అక్కడ ఆ భక్తునికి కలిగిన ఆపదని తొలగిస్తాడు. అందువల్లే శ్రీవేంకటేశ్వరస్వామివారికి ఆపద మొక్కులవాడని పేరు కలిగింది. అలా వేడుకొన్నవారిని రక్షించడమే వేంకటేశ్వరుని కర్తవ్యంకూడా. మనకు స్థూలంగా శ్రీవేంకటేశ్వరుడు, శ్రీసుదర్శనుడు వేర్వేరుగా గోచరిస్తున్నా వీరిద్దరూ అభిన్నులే. ఒక్కరే కూడ. శ్రీ వేంకటేశ్వరుని మనసులో ఏముందో లక్ష్మీదేవికి కూడా తెలియదట! కాని సుదర్శనునికి తెలుస్తుందట! దీని వల్ల వీరిద్దరూ ఒక్కరే అని స్పష్టమవుతున్నది. శ్రీవేంకటేశ్వరస్వామివారికి ప్రతిరోజు ఉదయంపూట తులసీదళాలతో సహస్రనామార్చన జరుగుతుంది. ఆ అర్చనలో—

ఓం దుర్వాసో దృష్టి గోచరాయ నమః
ఓం అంబరీష వ్రత ప్రీతాయ నమః
ఓం మహాకృత్తి విభంజనాయ నమః
ఓం మహా అభిచారక విధ్వంసినే నమః
ఓం కాలసర్ప భయాంతకాయ నమః
ఓం సుదర్శనాయ నమః

అంటూ శ్రీసుదర్శనభగవానుని నామాలతో శ్రీవేంకటేశ్వరుడు అర్చింప బడుతూ తానే శ్రీసుదర్శనుణ్ణి అనీ, స్పష్టం చేస్తూవున్నారు. అందువల్లే

బ్రహ్మోత్సవాల్లో శ్రీవేంకటేశ్వరస్వామివారు ఒకేపీఠంమీద తన సరసనే సుదర్శనుని ఆసీనులనుగాచేసి అభిషేకం చేయిస్తాడు. ఇలా తిరుమల క్షేత్రంలో సుదర్శనభగవానునికి జరిగే ఉత్సవాలను "చక్రస్నానం" అంటారు. ఆ వివరాలను తెలుసుకుందాం.

## చక్ర స్నానం

భక్తవత్సలుడు, భక్తులపాలిటి చింతామణి అయిన ఏడుకొండల వెంకన్న అభీష్టానుసారం శ్రీసుదర్శనభగవానుడు సంవత్సరం పొడవునా తిరుమలకు వచ్చే యాత్రికులను, వారియాత్ర ప్రారంభమై మళ్లీ సంపూర్ణమయ్యేంతవరకు కంటికి రెప్పలా రక్షించడం ఒక ఎత్తుకాగా, ప్రత్యేకంగా ప్రతి సంవత్సరం కన్యామాసంలో పదినాళ్లపాటు జరిగే తిరుమల బ్రహ్మోత్సవాల్లో తిరుమలకు వచ్చే భక్త జన సందోహాన్ని రక్షించడం మరోయెత్తు.

బ్రహ్మోత్సవంలో పదినాళ్లు తిరుమలక్షేత్రం లక్షలాది భక్తజన సమూహంతో కిక్కిరిసి సందడిగా వుంటుంది. బ్రహ్మోత్సవంలో ప్రతిరోజూ ఉదయం, రాత్రిపూట వరుసగా పెద్దశేషవాహనం, చిన్న శేషవాహనం, కల్ప వృక్షం, ముత్యాలపందిరి, గరుడోత్సవం, రథోత్సవం ఇత్యాది వాహనాల్లో, ఉత్సవాల్లో, అంగరంగ వైభవంగా ఊరేగుతూ, నిండుగా తిరుమలేశుడు దర్శనమిస్తూ భక్తులను ఆనందింపజేస్తాడు. తిరుమల అంతటా భక్తులతో, భజనలతో, విరాజిల్లుతూ, ఒక వినూత్న ఆధ్యాత్మిక వాతావరణం వెల్లివిరుస్తూ వుంటుంది. మరి 'న భూతో న భవిష్యతి' అన్నట్లుగా ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా జరిగే ఈ ఉత్సవాలకు వచ్చే భక్తసమూహాలను రక్షించే బాధ్యతకూడ గొప్పగానే వుంటుంది మరి! ఆ భక్త రక్షణ కార్యక్రమాన్నికూడ సుదర్శనభగవానుడే స్వీకరించి చక్కగా నెరవేరుస్తూన్నాడు. అదెలాగ? అంటే—

పదినాళ్లలో ప్రతిరోజు ఉదయమూ సాయంత్రమూ శ్రీదేవిభూదేవి సమేతులైన శ్రీమలయప్పస్వామి భక్తులకు దర్శనమివ్వటానికి ఆలయం నుండి బయలుదేరటానికి ముందే ఆనందనిలయంలో వుండే శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు (ఉత్సవమూర్తి) పల్లకిలో బయటికి వస్తాడు. ముందుగా

తిరుమల పురవీధుల్లో శ్రీసుదర్శనుడు నాల్గుమూలలా సంచరిస్తూ "ఖబడ్దార్! సర్వజగత్ప్రభువు అయిన తిరువేంకట సార్వభౌముడు వేంచే స్తున్నాడహో! దుష్టరక్కసులారా ఖబడ్దార్! తిరుమల భక్తులకు ఎక్కడా ఎలాంటి హాని కల్గించారో జాగ్రత్త!" అంటూ శ్రీస్వామివారి రాకనుగూర్చి, భక్తులక్షేమాన్నిగూర్చి హెచ్చరిస్తూ తిరుమల అంతటా నిష్కంటకం చేసిన తరువాత ఆలయంలో ప్రవేశించి, శ్రీనివాసప్రభులకు విన్నవించుకుం టాడు. ఆ తర్వాతనే శ్రీస్వామివారు ఊరేగింపునకు బయలుదేరతాడు. ఇలా బ్రహ్మోత్సవంలో ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం రెండుపూటలా జరుగుతుంది.

ఇలా తొమ్మిదిరోజులు పూర్తి అయిన తర్వాత పదవ రోజున శ్రీస్వామి వారి జన్మనక్షత్రమైన శ్రవణం కూడిన రోజున, ఉదయం, దేవేరులతోకూడిన శ్రీ మలయప్పస్వామితో పాటు మరొక పల్లకిపై సుదర్శన చక్రత్తాళ్వారుకూడా ఒకేసారి ఆలయంనుండి బయలుదేరి మహాప్రదక్షిణ మార్గంలో ఊరేగుతూ స్వామిపుష్కరిణికి వాయవ్యమూలలోవున్న శ్రీవరాహస్వామివారి ఆలయ ప్రాంగణానికి చేరుకుంటారు.

శ్రీ వరాహస్వామివారి ఆలయ ప్రాంగణంలో ఒకే పీఠంపై శ్రీస్వామి వారు తన సరసనే సుదర్శనుని ఆసీనుల్ని చేసుకుంటాడు. "భళా! సుదర్శనా! భక్తరక్షణమనే నాకార్యదీక్షలో నీవు నా వెంట వుండి సహాయం చేస్తున్నావు. భళా! ప్రత్యేకంగా ఈ బ్రహ్మోత్సవంలో భక్తసంరక్షణలో తీరిక లేక మునిగివుంటూ బాగా అలసి సొలసి వున్నావు. రా! రమ్మ" అంటూ శ్రీస్వామివారు తనతోపాటు సుదర్శనునికి ఒకేపీఠంపై పన్నీటిజలాలతో స్నపన తిరుమంజనం చేయిస్తారు.

మరి ఈ ఉత్సవాలు నిర్వహించిన బ్రహ్మదేవునకుగాని, తిరుమల క్షేత్రపాలకుడైన రుద్రునకుగాని, శ్రీస్వామివారికి వాహనాలుగా ఉపయోగ పడే ఆదిశేషుడు, గరుడుడు, హనుమంతుడు మున్నగువారికి దక్కని మహద్భాగ్యం ఒక్క సుదర్శనభగవానునికి మాత్రమే కల్గించడంలో సుదర్శ నుడూ తాను ఒక్కరమే, అభిన్నులమే అని శ్రీవేంకటేశ్వరస్వామి స్పష్టం చేస్తున్నాడు.

ఇలా శ్రీస్వామివారితో పాటు సుదర్శన చక్రత్తాళ్వారునకు తిరుమంజనం (అభిషేకం) అయిన తర్వాత, సుదర్శన చక్రత్తాళ్వారుకు మాత్రమే శ్రీస్వామి పుష్కరిణిలో పవిత్రస్నానం చేయిస్తారు. ఇలాగ శ్రీస్వామి పుష్కరిణిలో సుదర్శన భగవానునికి పవిత్ర స్నానం జరుగుతున్న సమయంలో ఈశానాదిక్పాలురు, యక్షకిన్నర గంధర్వులు, మానవులు ఆ సుదర్శన భగవానుణ్ణి శ్రీవేంకటభగవానునితో అభేదంగానే--

*దనుజ విస్తార కర్తన! జనితమిస్రా వికర్తన!*
*అమరదృష్ట స్వవిక్రమ! సమర జుష్ట భ్రవిక్రమ!*
*జయ జయ శ్రీసుదర్శన! జయ జయ శ్రీసుదర్శన!*

అని కీర్తిస్తూ, గోవిందా! గోవిందా!! అంటూ ఆ సుదర్శన భగవానునితోపాటు అందరూ పుష్కరిణిలో పవిత్రస్నానాలుచేసి పునీతులవుతారు.

బ్రహ్మోత్సవంలో చివరిరోజున శ్రీ వరాహస్వామిఆలయ ప్రాంగణంలో శ్రవణ నక్షత్రం సమయంలో జరిగే "చక్రస్నానం" భక్తులకు ఒక దివ్యసందేశాన్ని ఇస్తున్నది.

తిరుమలక్షేత్రంలో వెలసిన తొలిదైవం శ్రీవరాహస్వామి. ఈయన జ్ఞానమూర్తి. అందుకే ఈస్వామి "జ్ఞానప్పిరాన్" అని శాసనాల్లో, ప్రాచీన తమిళ వాఙ్మయంలో కూడ పేర్కొనబడుతున్నాడు.

శ్రీవేంకటేశ్వరుడు - ఆనందమూర్తి. సుదర్శనుడు అంటే సరిగ్గా దర్శనం చేయించేవాడు. అంటే సరిగ్గా దర్శిస్తే భక్తునికి జ్ఞానం కలిగిస్తాడు శ్రీవరాహస్వామి. జ్ఞానం కలిగిన భక్తునికి ఆనందం కలగడం సులభాతిసులభమట! సారాంశమేమనగా తొలిగా జ్ఞానమయకోశంలో ప్రవేశింపజేసే వరాహస్వామిని చక్కగా దర్శించాలి. ఆ తర్వాతే శాశ్వతఆనందమయ కోశాన్ని తప్పక అనుగ్రహిస్తాడట ఆనందనిలయుడు! అందుకే తొలిగా వరాహస్వామివారిని మలిగా శ్రీనివాసుని దర్శనం చేసుకోవాలి.

ఉత్తరాదివారు అంటే హిందీప్రాంతాల నుంచి వచ్చిన భక్తులంతా శ్రీవరాహస్వామివారిని భగవాన్ బాలాజీకి 'గురువు' గా సంభావిస్తారు. ఈ భావనకూడ పై సందేశానికి చాల దగ్గరగా వుంది. జ్ఞానాన్ని కలిగించే

గురువుద్వారా వెళితే సులభంగా భగవంతుని దర్శనం కలిగి శాశ్వతానందం కలుగుతుంది కదా!

ఇలా బ్రహ్మోత్సవంలో మాత్రమేగాక, రథసప్తమినాడు, వైకుంఠ ఏకాదశి మరునాడు వైకుంఠద్వాదశిరోజున, అనంత పద్మనాభ చతుర్దశి రోజున శ్రీస్వామిపుష్కరిణిలో సుదర్శన చక్రత్తాళ్వారునకు స్నానం జరుగుతుంది. అయితే బ్రహ్మోత్సవంలో మాత్రమే శ్రీమలయప్పస్వామివారు పాల్గొంటారు. మిగిలిన పై రోజుల్లో శ్రీసుదర్శనభగవానులు ఒక్కడు మాత్రమే స్నానానికి వస్తాడు.

మరి పవిత్రమైన శ్రీస్వామిపుష్కరిణిలో జరుగుతున్న శ్రీసుదర్శన భగవానుల 'చక్రస్నానం'తో పాటు మనం అందరం గోవిందా! అంటూ మునకలిడి పునీతులవుదాం.

*నమో నమో దానవవినాశ చక్రమా!*
*సమర విజయమైన సర్వేశు చక్రమా!!*

*రవిచంద్రకోటి తేజరాసియైన చక్రమా!*
*దివిజ సేవితమైన దివ్య చక్రమా!*
*తవిలి శ్రీవేంకటేశు దక్షిణకర చక్రమా!*
*యివల నీదాసులము యేలుకోవే చక్రమా!!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 41. శ్రీ సీతారామలక్ష్మణులు

అదిగో దర్శించండి! కోదండాలను ధరించి సీతాసమేతంగా విరాజిల్లుతూవున్న శ్రీ రామలక్ష్మణమూర్తులు. తిరుమల శ్రీస్వామివారి ఆనందనిలయంలో శ్రీవేంకటేశ్వరస్వామివారి మూలవిగ్రహమూర్తికి ఎడమ పక్కన ఒకపీఠంపై శ్రీతారామలక్ష్మణుల పంచలోహ ఉత్సవమూర్తులు నెలకొని వున్నాయి. ఒకప్పటి త్రేతాయుగంలో అరణ్యవాస చేస్తూన్న సమయంలో సీతమ్మ వారిని వెదుకుతూ జడధారులైన శ్రీరామలక్ష్మణులు ఈ వేంకటాద్రికి వచ్చారట! అందుకు గుర్తుగా ఈ విగ్రహమూర్తులు తిరుమల

శ్రీవారిఆలయంలో కొలువై వున్నాయని అంటారు. కనుకనే ఈ రామ లక్ష్మణుల విగ్రహమూర్తులు కిరీటాలు లేకుండా కేవలం జడధారులుగానే దర్శనమిస్తూ వున్నాయి.

భగవద్రామానుజులవారు తమగురువైన తిరుమలనంబి దగ్గర శ్రీ వేంక టాచలపర్వత మూలంలో అనగా అలిపిరిలో, (తిరుపతినుంచి తిరుమలకు నడచివెళ్లే మార్గంలో) శ్రీమద్రామాయణ రహస్యాలను అధ్యయనం చేస్తూ వుండినారు. ఆ సమయంలోనే ఒక విప్రుడు వారిదగ్గరకు వచ్చి ఈ సీతారామలక్ష్మణ విగ్రహాలను సమర్పించినట్లు ప్రతీతి! ఆ విగ్రహాలే ఆనందనిలయంలో చేరినట్లు చెబుతారు.

ఏది ఏమైనప్పటికీ, ఆనందనిలయంలోని శ్రీసీతారామ లక్ష్మణ విగ్రహాల ప్రస్తావన క్రీ.శ. 1476లోను క్రీ.శ. 1504 లోని శాసనాల్లో కనపడుతున్నది. నివేదనలందుకున్నట్టుకూడ స్పష్టమవుతూవుంది.

రాముడు 40 అంగుళాల ఎత్తు, లక్ష్మణుడు 37 అంగుళాలు, సీత 36 అంగుళాల ఎత్తు కలిగిన ఈ పంచలోహమూర్తులకు ప్రతిరోజూ ప్రత్యేక పూజలు లేకపోయినా, ఇతరమూర్తులతోపాటు పూజానివేదనలందుకుంటూ వున్నాయి. కొన్ని విశేషసందర్భాల్లో ఉత్సవాలు ఊరేగింపులు ప్రత్యే కంగా జరుపబడుతూ ఈ మూర్తులు తిరుమల ఆలయసంప్రదాయంలో ప్రాముఖ్యాన్ని సంపాదించుకున్నాయి.

ప్రతిసంవత్సరం చైత్రమాసంలో శ్రీరామనవమి పండుగనాడు బంగారు వాకిలి ముందర శ్రీసీతారామ లక్ష్మణులకు కొలువు జరుగుతుంది. పూజానివేదనానంతరం తిరుమల పురవీధుల్లో ఊరేగింపు జరుగుతుంది. ఆ మరునాడు దశమిరోజు శ్రీరామపట్టాభిషేక మహోత్సవం బంగారు వాకిలిముందే జరుగుతుంది. ఈ రెండురోజుల్లో కూడ శ్రీసీతారామ లక్ష్మణులతోపాటు రామపరివారమైన ఆజ్ఞాపాలక ఆంజనేయస్వామి, సుగ్రీ వుడు, అంగదుడు మున్నగువారు పాల్గొంటారు. ఈ రామపరివారాన్ని గురించి "రాములవారిమేడ"లో ప్రవేశిస్తూ తెలుసుకున్నాం కూడ. పూర్వం ఈ సీతారామలక్ష్మణుల విగ్రహమూర్తులు, ఆంజనేయుడు, సుగ్రీవుడు, అంగదుడు ఈ విగ్రహాలన్నీ "రాములవారి మేడ"లో వుండేవనీ, అందువల్లే

అది "రాములవారి మేడ"గా పిలువబడింది. కాని విగ్రహ రక్షణకై తరువాతికాలంలో ఈ సీతారామలక్ష్మణుల విగ్రహాలు ఆనందనిలయంలోనికి తరలించబడినాయి.

ఇక అదే చైత్రమాసంలో పున్నమినాడు కూడ, తిరుమల శ్రీవారి ఆలయానికి నైరుతి మూలలోవున్న వసంతమండపంలో శ్రీసీతారామలక్ష్మణులకు వసంతోత్సవం జరుగుతుంది. తిరుమల శ్రీవారికి మూడునాళ్లపాటు జరిగే వార్షిక వసంతోత్సవాల్లో చివరిరోజు పున్నమినాడు శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్పస్వామితోపాటు రుక్మిణీ శ్రీకృష్ణులు, శ్రీ సీతారాలక్ష్మణులు కూడ పాల్గొంటారు.

ఇదిగాక ప్రతిసంవత్సరం ఫాల్గుణమాసంలో పున్నమినాటికి పూర్తి అగునట్లుగా ఐదురోజులపాటు తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామివారికి "స్వామిపుష్కరిణి"లో తెప్పోత్సవాలు జరుగుతాయి. ఈ తెప్పోత్సవాల్లో మొదటిరోజున అంటే ఫాల్గుణ శుద్ధ ఏకాదశిన శ్రీసీతారామలక్ష్మణులకు శ్రీస్వామిపుష్కరిణిలో తెప్పోత్సవం అంగరంగవైభవంగా జరుపబడుతుంది.

ఇలా వార్షికోత్సవాలేగాక ప్రతినెలా శ్రీరాముని జన్మనక్షత్రమైన పునర్వసురోజున ఉదయమే శ్రీసీతారామలక్ష్మణులకు ఆనందనిలయంలో ఏకాంతంగా అభిషేకం జరుపబడుతుంది. పిదప బంగారువాకిలి దగ్గర కొలువు ఆ సాయంత్రం దేవాలయం వెలుపలగల కొలువుమండపంలో సహస్రదీపాలంకారసేవ అనే ఊయలసేవ జరుగుతుంది. పిదప ఆలయ మహాప్రదక్షిణ మార్గంలో ఊరేగింపు జరిగిన పిదప చివరగా సన్నిధి వీధిలో ఎదురుగా వున్న శ్రీ బేడి ఆంజనేయస్వామి గుడిదగ్గరకు శ్రీ సీతారామలక్ష్మణులు వేంచేస్తారు. ఆ సమయంలో శ్రీరాముని మెడలోని పుష్పహారం శ్రీబేడి ఆంజనేయస్వామివారికి సమర్పింపబడుతుంది. పిదప శ్రీరామునికి నివేదన జరిగిన తర్వాత కర్పూర హారతి ఇస్తారు. శ్రీరామచంద్రునకు సమర్పించిన ప్రసాదాన్ని హారతిని మళ్లీ శ్రీ బేడీ ఆంజనేయస్వామికి ఇస్తారు. ఆ తర్వాత శ్రీసీతారామలక్ష్మణులు శ్రీవారి ఆలయ ప్రవేశం చేస్తారు.

సాక్షాత్తు శ్రీవేంకటేశ్వరస్వామివారు కూడ పదిరోజులపాటు జరిగే బ్రహ్మోత్సవాల్లో ఆరవనాటి ఉదయంపూట హనుమంతునిపై, త్రేతాయుగంనాటి శ్రీరామచంద్రుని అవతారంలో తిరుమల పురవీధుల్లో ఊరేగుతూ వేంకటాద్రిరామునిగా దర్శనమిస్తూ కీర్తింపబడుతూవున్నాడు. ఆనాటి రాముడే ఈనాటి వేంకటేశ్వరుడనీ, త్రేతాయుగంనాటి వేదవతే ఈనాటి పద్మావతి అని శ్రీవేంకటాచలమాహాత్మ్యం స్పష్టం చేస్తున్నదికూడ. అందువల్లే పదకవితాపితామహుడూ, శ్రీవేంకటేశ్వరుని అంతరంగిక భక్తుడూ, నందకాంశసంభూతుడైన తాళ్లపాక అన్నమాచార్యులుకూడ శ్రీవేంకటేశ్వరస్వామివారికీ, శ్రీరామచంద్రునికీ అభేదం చెపుతూ అయోధ్యావిభుడు, వేంకటాద్రి విభుడు అభిన్నులనీ, ఒక్కరే అంటూ కొన్ని వందల కీర్తనలను గానం చేస్తూ పరవశిస్తాడు.

*రామచంద్రు డితడు రఘువీరుడు*
*కామిత ఫలము లియ్యగలిగె నిందరికి*

*గౌతముభార్యపాలిటి కామధేనువితఁడు*
*ఘాతలఁ గౌశికుపాలి కల్పవృక్షము*
*సీతాదేవి పాలిటి చింతామణీతడు*
*యీతడూ దాసులపాలి యిహపర దైవము.*

*పరగ సుగ్రీవుపాలి పరమబంధు డితడు*
*సరి హనుమంతుపాలి సామ్రాజ్యము*
*నిరతి విభీషణుని పాలి నిధానము*
*గరిమ జనకుపాలి ఘనపారిజాతము.*

*తలప శబరిపాలి తత్త్వపు రహస్యము*
*అలరి గుహుని పాలి ఆదిమూలము*
*కలదన్నవారి పాలి కన్ను లెదుటిమూరితి*
*వెలయ శ్రీవేంకటాద్రి విభుడితడు.*

ఇలా త్రేతాయుగంలో పరబ్రహ్మమై వెలిగిన అయోధ్యలోని శ్రీరామచంద్రుడే, మళ్లీ ఈ కలియుగంలో తానే భక్తులపాలిటి కొంగుబంగారమై

పిలిస్తే పలికే ప్రత్యక్ష దైవంగా ఈ వేంకటాచలదివ్యక్షేత్రంలో శ్రీనివాస పరబ్రహ్మంగా కొలువై "కౌసల్యా సుప్రజారామా!" అంటూ మేలుకొలుపులు పాడించుకొంటూ, నిరంతరం నిరంతరాయంగా దర్శనమిస్తూవున్నస్వామి వారిని ఆదిత్యపురాణాంతర్గత శ్రీవేంకటేశమాహాత్మ్యంలో చెప్పబడినట్లుగా ఇలా కీర్తిస్తూ స్వామివారి అనుగ్రహం కోసం ప్రార్థిద్దాం!

శ్రీరామ దశదిగ్వ్యాప్తం దశేంద్రియ నియామకమ్
దశాస్యఘ్నం దాశరథిం శ్రీనివాసం భజేఽనిశమ్.

అనంతమైన సుఖాలనిస్తూ, పదిదిక్కులలో వ్యాపించియున్నవాడూ దశేంద్రియాలకు అభిమానదైవాల్ని శాసించేవాడూ దశముఖుడైన రావణుని సంహరించినవాడు దశరథుని కుమారుడూ అయిన శ్రీరామచంద్రునిగా ప్రసిద్ధిపొందిన శ్రీనివాసప్రభువులను ఎల్లప్పుడు భజిస్తాను.

ప్రస్తుతం శ్రీవారి ఆనందనిలయంలోనే నెలకొనివున్న శ్రీరుక్మిణీ శ్రీకృష్ణులను గూర్చి తెలుసుకొందాం.

## 42. రుక్మిణీ శ్రీకృష్ణులు

ద్వాపరయుగంనాటి శ్రీకృష్ణుడే శ్రీవేంకటేశ్వరుడని పురాణ ప్రశస్తి. అందుకనే శ్రీవేంకటేశ్వరస్వామివారిని, ఆనాటి గోవిందుని పిలిచిన ట్లుగానే గోవిందా! గోవిందా!! గోవింద!!! అని పిలుస్తుంటారు. ప్రతి ఉదయం తెల్లవారుజామున లేచినవెంటనే సుప్రభాత సమయంలో "ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద!....." అంటూ మేలుకొలుపులు పాడించుకొంటూ మొట్టమొదటగా శ్రీనివాసుడు ద్వాపరయుగంనాటి అలవాటుప్రకారం వెన్నను ఆరగిస్తాడు. ఆవుపాలను స్వీకరిస్తాడు. సుప్రభాత సేవలో పాల్గొన్న భక్తులకు ఈ వెన్నను ప్రసాదంగా ఇస్తారు.

అందుకే కాబోలు ఆనందనిలయంలో రుక్మిణీశ్రీకృష్ణుల వెండి విగ్రహ మూర్తులు చోటు చేసుకున్నాయి. కుడిచేతిలో వెన్న ముద్దను పెట్టుకొని నృత్యభంగిమలో ఒక కాలుమీద ఒయ్యారంగా నిలుచున్న బాలకృష్ణుడీయన. ఇదే నవనీత నృత్య భంగిమ! దర్శించండి!

సుమారు రెండు అడుగుల ఎత్తు కలిగిన ఈ రుక్మిణీ కృష్ణులకు ప్రతిరోజూ ప్రత్యేకంగా పూజలు నివేదనలు జరుపబడవు.

ఆనందనిలయంలోని ఇతరమూర్తులతో పాటే నివేదనలు జరుపబడు తున్నాయి. ప్రతిసంవత్సరం కొన్ని విశేష పర్వదిన సందర్భాల్లో మాత్రమే ఈ రుక్మిణీ శ్రీకృష్ణులు విశేషంగా ఆరాధింపబడుతూ అర్చించబడుతూ, ఊరేగింపబడుతూవున్నారు.

ప్రతినెలా శ్రీకృష్ణుని జన్మనక్షత్రమైన రోహిణినాడు సుప్రభాతసేవ అనంతరం ఈ వెండిమూర్తులకు ఏకాంతంగా అభిషేకం జరుగుతుంది. ఆ సాయంత్రం ఆలయం వెలుపల వున్న ఊయలమండపంలో సహస్ర దీపాలమధ్య ఊయలసేవ నందుకొంటాడు శ్రీ కృష్ణస్వామి. పిదప తిరుమల పురవీధుల్లో ఊరేగింపబడిన అనంతరం ఆలయంలో ప్రవేశిస్తారు.

ప్రతి సంవత్సరం చైత్రమాసంలో పున్నమినాడు తిరుమల వసంత మండపంలో శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామి, శ్రీ సీతా రామలక్ష్మణులతోపాటు ఈ రుక్మిణీ కృష్ణులకు వార్షిక వసంతోత్సవం జరుగుతుంది.

శ్రావణమాసంలో కృష్ణాష్టమినాటి రాత్రి శ్రీవారి ఆలయంలో తోమాల సేవ జరుగుతుంది. పిదప శ్రీదేవి భూదేవి సహిత శ్రీ ఉగ్ర శ్రీనివాస మూర్తిని బంగారు వాకిలిముందువున్న తిరుమామణి (గంటా) మండపంలో స్నాన పీఠంపై వేంచేపు చేస్తారు. ఆ పక్కనే మరొకపీఠంపై శ్రీకృష్ణ స్వామివారినికూడ తూర్పుముఖంగా వేంచేపుచేసి ఏకాంతంగా అభిషేకం చేస్తారు. కేవలం అర్చకులు, ఆచార్యపురుషులు మాత్రమే చుట్టూ తెరలు గట్టి అభిషేకాన్ని చేస్తారు. పూర్వం పన్నెండుమార్లు ద్వాదశాక్షరమంత్రాన్ని సంపుటీకరిస్తూ అభిషేకాలు, నివేదనలను చేసేవారట. అందువల్లే ఈ కృష్ణాష్టమి రోజున జరిగే ఆరాధనను ద్వాదశ తిరువారాధన అంటారు. కాని నేడు ఒకేమారు అభిషేకం - నివేదన జరిగినప్పటికీ "ద్వాదశ తిరువారాధనం" అనే పిలువబడుతున్నది.

అభిషేకానంతరం శ్రీ ఉగ్ర శ్రీనివాసమూర్తి ఆనందనిలయంలోనికి వేంచేస్తారు. ఇక బంగారువాకిలి దగ్గర మండపంలో శ్రీకృష్ణస్వామిని

శయనించిన భంగిమలో అలంకరిస్తారు. ఈ సందర్భంగా జియ్యంగారులు దివ్యప్రబంధాన్ని పారాయణ చేస్తారు. పిదప నివేదనలు జరిగిన తర్వాత శ్రీకృష్ణునిపై అక్షతారోపణం చేస్తారు. ఈ సందర్భంగా శ్రీమద్భాగవతంలోని తృతీయాధ్యాయంలోని శ్రీకృష్ణావతారఘట్టాన్ని పురాణపండితులు చదువుతూ హృదయంగమంగా పురాణ శ్రవణం చేస్తారు. ప్రసాద వినియోగం జరిగిన తర్వాత శ్రీకృష్ణుడు లోనికి వెళతారు.

ఆ తెల్లవారుజామున శ్రీవారి సుప్రభాతం తోమాలసేవానంతరం శ్రీ కృష్ణస్వామిని బంగారువాకిలిముందు వేంచేపుచేసి నువ్వులనూనెతోతలంటుతారు. దీన్నే తైలకాపు సమర్పణ అంటారు. అప్పుడే జన్మించిన బాలకృష్ణుని తిరుమలలో మహాప్రదక్షిణమార్గంలో ఊరేగింపుచేస్తూ శ్రీకృష్ణునికి తైలకాపు చెయ్యగా మిగిలిన పురిటితైలాన్ని వీధుల్లో భక్తులకు పంచుతారు. దానిని భక్తులు తలంటుకొని అభ్యంగన స్నానం చేస్తారు. పిదప స్వామి ఆలయం చేరుకోగానే అర్చన, నివేదనాదులు యథావిధిగా జరుగుతవి.

ఆ మధ్యాహ్నం అర్చన రెండవ నివేదనలు పూర్తి అయిన తర్వాత శ్రీమలయప్పస్వామి ఒక పల్లకిపై, శ్రీకృష్ణస్వామి మరొక పల్లకిపై వేంచేసి సర్వాభరణాలతో అలంకరించుకొని మంగళవాద్య పురస్సరంగా పూలబావికి ఎదురుగా వున్న "యామునోత్తరైమిరాశి" పూల అరలోనికి వేంచేయగా అక్కడ ఆస్థానం జరిగి నివేదనలు జరుగుతవి. పిదప తిరుమలవీధుల్లో జరిగే ఉట్లఉత్సవాల్లో మహావైభవంగా పాల్గొంటారు.

ప్రతిసంవత్సరం సంక్రాంతి పండుగ మరునాడు కనుమరోజున శ్రీ వేంకటేశ్వరస్వామితోపాటు మరొకపల్లకిలో శ్రీకృష్ణుడు పారువేట ఉత్సవంలో పాల్గొంటాడు. పారువేట జరిగే స్థలంలోకూడ, శ్రీకృష్ణుడు ఆవట గొల్లల విడిదికి వెళ్లి ప్రత్యేక పూజలందుకుంటాడు. వెన్న, పాలు, పండ్లు ఆరగిస్తాడు. ఈ గొల్లవారే శ్రీనివాసుని సేవలో పాలుపంచుకుంటూ... "సన్నిధిగొల్లలు"గా పేరుపొందినారు. ఇలా ద్వాపరయుగంనాటి మధురస్మృతుల్ని మరచిపోక, మరచిపోలేక శ్రీనివాసుడు స్మరించి ఆనందిస్తూ మనల్ని ఆనందింపజేస్తూ వున్నాడు.

ఒక్క సంక్రాంతి పండుగ సమయంలోనే కాక ప్రతిమూడేళ్లకు రెండు బ్రహ్మోత్సవాలు జరిగిన సమయంలో దసరాపండుగ మరునాడు కూడ జరిగే పారువేట ఉత్సవంలో కూడ అప్పటిలాగే శ్రీకృష్ణుడు పాల్గొంటాడు. ఈ పారువేట ఉత్సవ విశేషాలను మరోచోట వివరంగా తెలుసుకుందాం.

ఇక ప్రతిసంవత్సరం బ్రహ్మోత్సవంలో ఐదవనాటి ఉదయంపూట శ్రీ మలయప్పస్వామి మోహినీ అవతారంలో అందరినీ సమ్మోహనపరుస్తూ దంతపు పల్లకిలో ఊరేగుతారు. ఆ జగన్మోహిని సరసనే మరో పల్లకిపై శ్రీకృష్ణుడు ఊరేగుతూ, ఆ మోహినీరూపం, ఈ మోహనరూపం రెండూ తనవేనంటూ భక్తులను సమ్మోహింప చేస్తూ ఆనందింపచేస్తాడు.

## ధనుర్మాసంలో.......

ప్రతిసంవత్సరం ధనుర్మాసంలో ఒక్క నెలరోజులపాటు ఆనందనిల యంలో జరిగే ఏకాంతసేవలో భోగ శ్రీనివాసమూర్తికి బదులుగా ఈ వెన్నముద్ద కృష్ణుడే శయనభాగ్యం పొందుతూ వున్నాడు. ఈ నెలరోజుల పాటు తెల్లవారుజామున సుప్రభాత పఠనం వుండదు. బంగారు శయ్యపై పవ్వళించిన చిన్నికృష్ణుని గోదాదేవి పఠించిన తిరుప్పావై పాశురాలను పాడుతూ మేల్కొల్పుతారు. ఇలా నెలరోజులపాటు ధనుర్మాసమంతా ఏకాంతంగా జరిగే తిరుప్పావై పఠన అనంతరం చిన్నికృష్ణునికి గోరువెచ్చని నీటితో స్నానం చేయించి పాలు, వెన్న, వేడి వేడి పొంగళ్లు నివేదిస్తారు.

*ఏడుకొండలవాడా! వేంకటరమణా!!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 43. సాలగ్రామాలు

తిరుమల ఆనందనిలయంలో శ్రీవేంకటేశ్వరస్వామివారిమూల విరా ణ్మూర్తి, ఇతర ఉత్సవమూర్తులతోపాటు, ప్రత్యేకంగా నాలుగు పెద్ద సాలగ్రామాలు, ఇంకా చిన్న సాలగ్రామాలు కొన్ని నిత్యాభిషేకార్చనలందు కుంటూ వున్నాయి. ఈ సాలగ్రామాలన్నీ శ్రీస్వామివారి పాదాలచెంత వెండిపాత్రల్లో వుంచబడి పూజింపబడుతూవున్నాయి.

ప్రతిరోజూ, భోగ శ్రీనివాసమూర్తితోపాటు ఈ సాలగ్రామాలకు అభిషేకం జరిగిన తర్వాత, అన్ని మూర్తులతోపాటు ఈ సాలగ్రామాలకు పుష్పార్చన, నివేదన జరుపబడుతున్నది. ఇలా పూజలందుకొంటూవున్న సాలగ్రామాలు మాత్రమేకాక, శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యమూలవిరాణ్మూర్తికి ఇరువైపులా రెండు భుజాలనుండి పాదాలవరకు వేలాడుతున్న దివ్య సాలగ్రామ హారాలు నిత్యశోభాయమానంగా ప్రకాశిస్తూ వున్నాయి.

బంగారు కవచాలలో పొదుగబడి కూర్చబడిన ఈ రెండు సాలగ్రామ హారాలు మాత్రమే కాకుండా పూర్వం ప్రసిద్ధ ద్వైత సంప్రదాయ పీఠాధిపతులైన శ్రీవ్యాసతీర్థులవారు శ్రీవేంకటేశ్వరస్వామివారికి మరొక సాలగ్రామహారం సమర్పించినట్లు తెలుస్తున్నది. విజయనగర చక్రవర్తులైన వీర నరసింహరాయలు, కృష్ణదేవరాయలు, అచ్యుతరాయలు...... ఇలా ఈ ముగ్గురికీ గురువులుగా ప్రసిద్ధి చెందినవారు శ్రీవ్యాసరాయలు.

ముఖ్యంగా శ్రీకృష్ణదేవరాయలకు కలిగిన "కుహూ" యోగమనే కాల సర్ప దోషం నుండి రక్షించడానికి కొన్ని ఘడియలకాలం విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించి తమ తపశ్శక్తిచేత ఆ సర్పదోషాన్ని భస్మం చేసారట! అందువల్లే కొద్దికాలం విజయనగరసింహాసనాన్ని అధిష్ఠించిన వ్యాసతీర్థులవారికి 'వ్యాసరాయలు' అనే ప్రసిద్ధనామం ఏర్పడినట్లు చరిత్ర చెబుతున్నది.

ఆ తర్వాత అదే సమయంలో తిరుమల శ్రీవారి ఆలయంలో అర్చన నిర్వహిస్తూవున్న వైఖానస అర్చకులకు ఏదో అవాంతరం ఏర్పడి శ్రీస్వామి వారి అర్చనాది కార్యక్రమాలకు విఘాతం కలుగగా, శ్రీవ్యాసతీర్థుల వారు సుమారు 12 ఏండ్లపాటు తిరుమలక్షేత్రంలోనే వుంటూ స్వయంగా శ్రీవేంకటేశ్వరస్వామివారికి అర్చనాది కార్యక్రమాలు నిర్వహించినారట! ఆ తర్వాత అర్చనాది కార్యక్రమాలు పరహస్తంకాకుండా తిరిగి సంప్రదాయంప్రకారం వైఖానసార్చకులకు అప్పజెప్పినారు. అంతేకాదు. ఈ వ్యాసరాయలవారి కాలం నుండే ఆనందనిలయంమీద వుండిన విమాన వేంకటేశ్వరస్వామి అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకున్నాడు.

పూర్వం విమాన ప్రదక్షిణంచేస్తూ ఆనందనిలయ విమాన వేంకటేశ్వర స్వామి వారిని దర్శించిన తర్వాతనే ఆనందనిలయంలోపలి శ్రీవేంకటేశ్వర

స్వామివారిని దర్శించేవారు. ఒకవేళ పూజాదికార్యక్రమాలవల్లా, నివేదనలవల్ల ఆనంద నిలయంలోపల వున్న శ్రీనివాసుని దర్శనం కాకపోయినా పర వాలేదటకాని, విమానవేంకటేశ్వరుని దర్శనం చేస్తే చాలన్న అభిప్రాయం వ్యాసతీర్థులవారి కాలంనుంచే ఏర్పడింది.

ఈ వ్యాసతీర్థులవారు కూడా భగవద్రామానుజులవారివలెనే శ్రీవేంకటే శ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తిని దివ్యసాలగ్రామమూర్తిగా భావించడమే కాక తిరుమల దివ్యక్షేత్రం కూడా దివ్యసాలగ్రామమయమని సాక్షాత్తుగా తిరుమలకొండే తిరుమలేశుడని, అందువల్లే వారు కూడా మోకాళ్లతోనే వేంకటాచలక్షేత్రాన్ని అధిరోహించినట్లు చెబుతారు.

ఇంతేకాదు అన్నమాచార్యులవారి చరిత్రలో కూడ ఇలా పేర్కొన బడింది. మొట్టమొదట పాదరక్షలతో తిరుమల కొండను ఎక్కుతూ అలసి, కళ్లుకనపడక, కాళ్లుముందుకు సాగక చతికిల బడిన అన్నమయ్యతో సాక్షాత్తు శ్రీవేంకటేశుని పట్టపురాణి అలమేలుమంగ ఇలా అంటుంది.

"………కమలామహాదేవి శిశువు
దన కృపామృతధార దనివి నొందించి
బాలక! యా యీ మహాపర్వతేంద్రంబు
లాలిత సకల సాలగ్రామమయము
ఘనులకు నిది చెప్పుఁగాళ్ల నెక్కంగ
జనదు, నీ చెప్పులు సడలించి వైచి
కనుఁగొను కన్నులఁ గనవచ్చుననిన."

అన్నమయ్య తన కాళ్లకున్న చెప్పులను విసరివైచి పరికించినాడు అంతే!

"ఆ రమా నారాయణాకృతి గలిగి
శ్రీరామ కృష్ణ లక్ష్మీ నృసింహాది
మూర్తులన్నియు నొక్క మొత్తమైనట్లు
వర్తింపుచున్న నా వడువు వీక్షించి
మహిత సాలగ్రామమయ మౌనటంచు
బహు విస్మయము నొంది ప్రణతులొనర్చి."

తరువాత, అలమేలుమంగ అనుజ్ఞతో తిరుమలకొండను చేరుకున్నాడు అన్నమయ్య.

సాక్షాత్తు సాలగ్రామమయమైన శ్రీవేంకటాచల క్షేత్రంలో "ఓం సాల గ్రామ నివాసాయ నమః" అని నిత్యమూ కీర్తింపబడుతూ మనందరికీ దివ్య దర్శనాన్ని ప్రసాదిస్తూ వున్న దివ్యసాలగ్రామమూర్తి అయిన శ్రీవేం కటేశ్వరుని దివ్య సన్నిధిలో మనం అందరం నిలిచి, శ్రీవారి సన్నిధిలోని సాలగ్రామ సముచ్ఛయాన్ని దర్శిస్తూవున్న, మన అందరి పూర్వజన్మ సుకృతం ఎంతటిదో కదా! మరి ఇంతటి మహద్భాగ్యాన్ని, అనంత శుభాల్ని కలిగిస్తూ వున్న ఈ దివ్యక్షణంలో మనంఅందరం ఒక్కసారి గొంతెత్తి నోరారా పిలుద్దాం!

*ఏడుకొండలవాడా! వెంకట రమణా!!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# పునర్దర్శన ప్రాప్తిరస్తు!

ఇంతవరకు మనం అద్భుత శిలాగ్రామ శిలామూర్తి అయిన శ్రీవేంక టేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తిని గూర్చి ఎన్నో అద్భుత విషయాల్ని తెలుసుకున్నాం. మరెన్నో పరమాద్భుత విశేషాల్ని తెలుసుకొన్నాం. అనాదిగా ఆస్వామివారిచేత ఆకర్షింపబడిన తొండమానురాజు, కుమ్మరనంబి, తిరుమలనంబి, అనంతాళ్వానులు, తాళ్లపాక అన్నమాచార్యులు, తరిగొండ వెంగమాంబ, మహంతు హాథీరాం బావాజీ ఇలా ఎందరో పరమభక్తుల దివ్య గాథల్ని చర్చించుకున్నాం. తద్వారా శ్రీవేంకటేశ్వరుని లీలల్ని, మహిమల్ని భక్తప్రియత్వాన్ని తృప్తిగా ఆస్వాదించాం. ఇంకా ఆనంద నిలయం లోనే శ్రీవేంకటేశ్వరస్వామివారి ధ్రువమూర్తితోపాటు మిగిలిన నాలుగు విధములైన, శ్రీభోగ శ్రీనివాసమూర్తి, శ్రీకొలువు శ్రీనివాసమూర్తి, శ్రీ ఉగ్రశ్రీనివాసమూర్తి, ఉత్సవ శ్రీనివాసమూర్తి అయిన శ్రీ మలయప్ప స్వామిని గూర్చిన విశేషాల్ని ఆ మూర్తులకు జరిగే ఆరాధనా విశేషాల్ని క్లుప్తంగా తెలుసుకున్నాం. ఇంతమాత్రమేకాదు ఆనందనిలయంలోనే కొలువై

పూజలందుకుంటూవున్న శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు, శ్రీ సీతారామ లక్ష్మణులు, శ్రీరుక్మిణీ శ్రీకృష్ణులు, సాలగ్రామాలను గురించి కూడా తెలుసుకున్నాం. ఇలా ఎన్నో విషయాల్ని శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్య మంగళమూల విరాణ్మూర్తి సన్నిధిలో నిలిచివుండి తెలుసుకున్నాం కూడ!

శ్రీవేంకటేశస్య కథామృతం త్విదం
మాహాత్మ్యసారం సుతపస్వి గమ్యమ్
శ్రీవేంకటేశస్య మహాప్రియ ప్రియం
లోకోత్తరం దేవ ఋషి ప్రియం చ.

ఇలా మనం తెలుసుకున్న శ్రీవేంకటేశ్వరుని కథా వృత్తాంతాలన్నీ భక్తులకు జన్మ మృత్యువులను నివారింపజేస్తుంది. శ్రీస్వామివారి ఈ లీలలన్నీ అత్యంత శ్రేష్ఠములైన మహిమలు కలవి. ఇలా వీనిని తెలుసుకొనే భాగ్యం అందరికి కలుగనే కలుగదు. మహాభాగ్యం చేసుకొన్నవారికి మాత్రమే లభిస్తుంది. ఈ గాథలన్నీ చెవులారా వినడం, నోరారా కీర్తించడం, మనసారా స్మరించడం షోడశోపచార పూజలు చెయ్యడంకంటే కూడ శ్రీనివాసుడు చాలా ప్రియంగా భావిస్తాడట. ఇది లోకోత్తరమై దేవతలకు, ఋషులకు కూడ ప్రియమైన మోక్షాన్ని ప్రసాదిస్తుందట!

మరి మనం వేంకటాచలంలో శ్రీస్వామివారి సన్నిధిన నిలవబడి ఇంతటి భాగ్యానికి నోచుకున్న మనకందరికి అన్నీ సంపూర్తిగా సిద్ధిస్తాయనడంలో అతిశయోక్తి అణువంతయినాలేదు, లేదు. లేదు. అంతమాత్రమే కాదు.

సమస్త పాపౌఘ వినాశకారణం
సమస్త పుణ్యౌఘ సమృద్ధి కారణమ్
శ్రీవేంకటేశస్య పదారవిందయోః
సద్భక్తి వృద్ధావ సమాన కారణమ్.

ఈ శ్రీవేంకటేశ్వరుని వృత్తాంత విశేషాలు, సర్వ పాపరాశిని పోగొడు తుంది. సర్వపుణ్యరాశిని ఇంకా ఇంకా పెంపొందిస్తుంది. ఇంతేనా! ఈ తిరు మల ఊసులన్నీ శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్య పాదారవిందములయందు ఎనలేని భక్తి ప్రపత్తులను పెంపొందించిస్తాయట!

అందువల్ల మళ్లీ మళ్లీ ఘనవేంకటేశుని దివ్య కథావిశేషాల్ని వినే భాగ్యం కలిగించవలసిందని ఇంకా ఇంకా అనేకానేక విషయాల్ని తెలుసుకునే మహదవకాశం మనకు కలిగించమనీ ప్రార్థిస్తూ మరొక్కసారి ఆ కొండల రాయని నిలువెత్తు దివ్యమంగళ విగ్రహమూర్తిని కన్నులారా దర్శించండి! నోరారా కీర్తించండి!

*ఏడుకొండలవాడా! వేంకట రమణా!!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఓ వేంకటాచలపతీ! స్వామీ! ఆపాదమస్తకము నీ దివ్యమంగళ విగ్రహ దర్శనంచేత మమ్మల్ని పునీతం చేశావుకదయ్యా! స్వామీ! నీ సమ్మోహన రూపాన్ని దర్శించడానికి నాకు రెండు కన్నులు చాలడంలేదే. ఈ నా రెండుకండ్లతో నీ దివ్య పాద సౌందర్యాన్ని చూడనా! నీ కటివరదహస్తాల్ని వీక్షింతునా! నీ నందకఖడ్గం మెరుపుల్ని కనుగొందునా! నీ కంఠాభరణాల నిగనిగల్ని కందునా! నీ శంఖచక్రాల తీక్షణాన్ని పరిశీలింతునా! నీ చెక్కిళ్ల సోయగాన్ని మైమరచిచూడనా! కరుణారసప్రవాహాల్ని పొంగించే నీ కన్నులను కాంచుదునా! నీ ఫాలభాగాన మెరిసే తెల్లనైన చక్కని నామాన్ని కన్నులార్పక చూడనా! నల్లనిమేఘాల్లోని మెరుపుతీగవలె నీ వక్షః స్థలమీద ప్రకాశిస్తూ, అష్టైశ్వర్యాలను ప్రసాదించే అలమేలుమంగను, అదే ఆ పద్మావతిఅమ్మను ఆనందంగా నయనాభిరామంగా దర్శించుదునా! ఇలా కేవలం నా రెండు కన్నులతో ఏమని చూడగలను! ఎంతని చూడగలను!

ఇలా అణువణువునా నీ సౌందర్యాన్ని ఆపాదమస్తకం నా కన్నులతో చూడలేక పోతున్నాను స్వామీ! అనంతమాయామోహితుడనైన నేను నీ దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని పూర్తిగా చూడగలనా! నీవు అనుగ్రహిస్తే తప్ప! అందువల్ల ఓ ఆనందనిలయవాసా! మళ్లీ మళ్లీ నీ దివ్య దర్శనాన్ని అనుగ్రహించవయ్యా! పునః పునః నీ దర్శనానికి రప్పించుకోవయ్యా! పదే పదే నీ పాదారవిందాల్ని చూచే భాగ్యాన్ని కలిగించవయ్యా! తిరుమలేశా! తిరిగి తిరిగి నీ ముఖారవిందాన్ని కన్నులారా చూచేట్లుగా అనుగ్రహించు స్వామీ! అందుకే ఓ ఏడుకొండలవాడా! వేంకటరమణా! మా భవబంధాల్ని

త్రుంచివేయగల నీ దర్శనమే చాలు! అదే మాపాలిట మహాభాగ్యం! అందుకే అంటున్నాను.

పునర్దర్శన ప్రాప్తిరస్తు!
పునర్దర్శన ప్రాప్తిరస్తు!
పునర్దర్శన ప్రాప్తిరస్తు!!

అని నిండుగా దండిగా ఆశీర్వదించమని సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను.

*ఏడుకొండలవాడా! వేంకట రమణా!!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

అదిగో! కన్నులారా దర్శించండి! అర్చకస్వాములు కర్పూరహారతిని ఇస్తూ శ్రీవారి దివ్యరూపాన్ని మనందరిచేత దర్శింపజేస్తూ వున్నారు. మనం అందరం కూడా ఆ అర్చక స్వామివారితోపాటు గొంతెత్తి నిత్యమంగళ ప్రదాత అయిన వేంకటేశునికి మంగళహారతు లిద్దాం.

నిత్యాయ నిరవద్యాయ, సత్యానంద చిదాత్మనే
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్.

ఇలా నోరారా కీర్తిస్తూ మనసారా స్మరిస్తూ, కన్నులారా దర్శిస్తూ మనం అందరం శ్రీవేంకటేశ్వరస్వామివారికి అభిముఖంగా వుంటూనే వెనక్కు అడుగులు వేస్తూ బంగారువాకిలి వద్దకు నడుద్దాం. శ్రీనివాసప్రభువుల వారిని ఒకవైపు చూస్తూ మరోవైపు అడుగులు వేస్తూ నడవాలి. ఎందుకంటే ఘనవేంకటేశుని దర్శనం కోసం ఎన్నో మైళ్ళదూరంనుండి అనేక శ్రమలను ఓర్చికొంటూ మనమాదిరే ఎందరో పసిపిల్లలు, మూడుకాళ్ల ముదుసలులు, కుంటివారు, అనారోగ్యంతో వున్నవారు, అస్వస్థులు, స్త్రీలు, ఇలా ఎందరో మన వెనక వస్తూ వున్నారు. మరి వారందరూ శ్రీవేంకటేశ్వరస్వామివారిని తప్పక దర్శించాలి కదా! ఆ భక్తులంతా వైకుంఠం క్యూలో గంటల తరబడి తమవంతు వచ్చేదాకా నడచివస్తూ ఆకళ్లతో, దప్పులతో మనతర్వాత వస్తూ వున్నారు కదా. మరి వాళ్లందరూ శ్రీవారిని దర్శించుకోవడానికి మనం తప్పక జరుగుతూ నడవ వలసిందే! తప్పదు మరి!



శ్రీ మలయప్ప స్వామి



శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్ప స్వామి

ఆనందనిలయం వెలుపల బంగారువాకిలి దాటిన తర్వాత శ్రీనివాస స్వామివారికి నివేదింపబడిన తీర్థప్రసాదాలను స్వీకరించుదాం. ఆ ప్రసాదాలను తయారుచేసే 'వంటశాల'ను గూర్చి తెలుసుకుందాం. ఆ వంటశాలను పర్యవేక్షించే 'వకుళమాతను' దర్శిద్దాం. శ్రీస్వామివారి శుక్రవారాభిషేకంలో ఉపయోగబడే 'బంగారుబావి'ని దర్శించి పునీతుల మవుదాం. ఇంకా విమాన ప్రదక్షిణంలోని ఎన్నో విశేషాల్ని తెలుసుకుందాం. ఇంకా 'ఆనందనిలయ విమానం' 'విమాన వేంకటేశ్వరస్వామి' సభ-అర, తాళ్లపాక అర, భాష్యకారుల సన్నిధి, యోగనరసింహస్వామి, పరిమళపు అర, శ్రీవారిహుండీ, విష్వక్సేనుల వారిని గూర్చి వివరంగా చర్చించుకుందాం. తొందరగా నడవండి మరి! శ్రీస్వామివారిని చూస్తూ అలాగే వెనక్కి నడవండి! ఇదిగో బంగారువాకిలి దగ్గరికి వచ్చేశాం. మరొక్కసారి బంగారువాకిళ్లకు, బంగారు గడపకు నమస్కరిస్తూ ఆ బంగారువాకిళ్లగుండా దర్శనమిచ్చే కొండలరాయని కన్నులారా దర్శిస్తూ ఎలుగెత్తి కీర్తించండి మరి!

*ఏడుకొండలవాడా! వేంకట రమణా!!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఇప్పుడు మనం శ్రీస్వామివారిని దర్శించిన తర్వాత మళ్లీ విమాన ప్రదక్షిణం ఆవరణలో ప్రవేశించాం. అదిగో ఎదురుగా ఆ కనపడేదే శ్రీవారి 'ప్రధానవంటశాల'. ఆ వంటశాలలో ప్రవేశించి అందలి విశేషాల్ని తెలుసుకుందాం.

## 44. ప్రధాన వంటశాల (పోటు)

ప్రస్తుతం మనం తిరుమల శ్రీవారిని దర్శించి, బంగారువాకిలి ద్వారా బయటికి వచ్చి మళ్లీ విమాన ప్రదక్షిణ ఆవరణలోనికి వచ్చాం. అదిగో సరిగ్గా మనకు ఎదురుగా కనపడేదే శ్రీవారి ప్రధాన వంటశాల. ఈ వంటశాల లోనికి ప్రవేశించి ఆ వంటశాలను, ఆ వంటశాలలో తయారుచేయబడే వంటకాలను, ఈ వంటకాల తయారీని పర్యవేక్షించే "వకుళమాత" ను గూర్చి తెలుసుకుందాం.

విమాన ప్రదక్షిణంలో శ్రీస్వామివారి గర్భాలయానికి సరిగ్గా ఆగ్నేయ మూలకు శాస్త్రోక్తంగా 3 అడుగుల రాతి అధిష్ఠానంపై (వేదికపై) 61 అడుగుల పొడవు 30 అడుగుల వెడల్పుతో అత్యంత విశాలంగా ఎత్తైన రాతి స్తంభాలతో ఈ వంటశాల నిర్మింపబడివుంది. అత్యంత ప్రాచీనకాలం నుంచీ ఇదొక్కటే వంటశాల. శ్రీవారికి నివేదనమయ్యే అన్న ప్రసాదాలు, పిండివంటకాలు (లడ్డు,వడ వగైరాలు) అన్నీ ఈ వంటశాలలోనే తయారు చేసేవారు. నానాటికి భక్తులసంఖ్య పెరగడంతోపాటు, శ్రీవారి నివేదనలు పెరుగుతూవున్నందువల్ల విమాన ప్రదక్షిణంలోని ఈ ప్రాచీనవంటశాలను ప్రస్తుతం ప్రధానంగా అన్న ప్రసాదాలకుగాను వాడుకుంటూ వున్నారు. ఇక పిండివంటలైన లడ్డు, వడ, అప్పం, దోశె, పోళీ, సుఖియ, మురుకు, జిలేబి మున్నగువాని తయారీకి, వెండివాకిలిబయట సంపెంగప్రదక్షిణంలో ఉత్తరం వైపువున్న మంటపాలను వంటశాలగా ఏర్పాటుచేసి ఇటీవలికాలంనుంచీ ఉపయోగించడం జరుగుతూవున్నది. సంపెంగప్రదక్షిణంలోని 'పడిపోటు' అనే పిండివంటకాలశాలను గూర్చి ఇంతకుముందే వివరంగా తెలుసుకున్నాం కూడ.

ప్రస్తుతం విమానప్రదక్షిణంలోని ఈ ప్రధానవంటశాలను శ్రీవారి ఆలయ సంప్రదాయంలో 'పోటు' అని పిలువబడుతూవున్నది. ఈ వంటశాలలో శ్రీవేంకటేశ్వరస్వామివారికి నివేదన చెయ్యబడే అత్యంత రుచికరములైన పాయసాలు, పరమాన్నాలు నిత్యమూ వండబడుతూ వుంటాయి. తిరుమలప్పని వైభవానికి వైభోగానికి ప్రధానంగా రెండే రెండు విశేషాలు స్పష్టంగా గోచరిస్తాయి. మిరుమిట్లుగొలుపుతూ వున్న అమూల్య రత్నాభరణాలు, ఉత్సవాలు, ఊరేగింపులు మొదటిదికాగా, ఇక రెండవది ఆయన ఆరగించే దివ్యప్రసాదాలు. ఇక్కడతప్ప ప్రపంచంలో ఎక్కడా, మరెక్కడా ఇంతటి వైభవం వైభోగం కానరాదు. న భూతో న భవిష్యతి అన్న ప్రసిద్ధికి కారణం ఆ తిరుమలేశుని ఎనలేని భక్త ప్రియత్వమే ప్రధాన కారణం. భక్తులు కోరిన వరాలనన్నిటిని ఇవ్వడం, ఆ భక్తులు చెప్పినట్లుగా వినడం, చేసినట్లుగా ఉత్సవాలు చేయించుకోవటం, వారు పెట్టింది సుష్టుగా ఆరగించటమే శ్రీవేంకటేశునికి తెలిసిన భక్త ప్రియత్వం. ఆలోచిస్తే తిరుమల

శ్రీనివాసుడు ఎంతటి అలంకార ప్రియుడో అంతటి నైవేద్య ప్రియుడట! ఎంతటి నైవేద్య ప్రియుడో అంతటి భక్తప్రియుడట! అందుకే తాను ఏరి కోరి ఆరగించిన రుచికరములైన ప్రసాదాలన్నీ భక్తులు తింటేనే ఆయన కానందం! తాను తిన్నవన్నీ భక్తులు తింటేనే ఆయనకు ఒక తృప్తి! అసలు భక్తులకు తినిపించడానికే శ్రీవేంకటేశ్వరుడు మంచి మంచి కమ్మనైన పిండివంటల్ని, అన్న ప్రసాదాల్ని ఆరగిస్తాడట! ప్రపంచంలో ఈ స్వామిని మించిన నైవేద్య ప్రియుడు భోజన ప్రియుడు మరొకడు కన్పడడు. అందుకే తాళ్లపాక అన్నమాచార్యులు ఒకచోట--

ఇందిర వడ్డించ ఇంపుగను
చిందక ఇట్లే భుజించవో స్వామి!

అంటూ, "అక్కాళపాశాలు, అప్పాలు, వడలు, పేణులు, మిరియపు దాళింపులు, కూరలు, పిండివంటలు, పెరుగులు, పాలు".... ఇలా స్వామివారి ఆరగింపును వర్ణిస్తాడు. మరోచోట కూడ

అరిసెలు నూనె బూరియలు నౌగులు
జక్కెరమండెగల్ వడల్
బురుడలు, పాలమండెగ లపూపము
లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందువెట్టు బరమాన్న
శతంబుల సూపకోట్లతో
నిరత వినిర్మలాన్నముల నేతుల
సోనల వేంకటేశ్వరా!

అంటూ పేర్కొన్నాడు.

మరో అజ్ఞాతకవి (17వ శతాబ్దం) తిరుమల శ్రీవేంకటేశ్వరుని భోజన ప్రియత్వాన్ని చాటుతూ—

"పాలు వెన్న బకాళబాతు దధ్యోదనం
బుఫుళి యోరెము వెన్న బూరియలును
సరడాల పాశముల్, చక్కెర పులగముల్
నువ్వు మండిగలు, మనోహరములు

అప్పము లిడ్డెన లతిసారముల్ హోళిగల్
వడలు, దోసెలు గల వంటకములు
శాకముల్ సూపముల్ చారు లంబళ్లు
శుద్ధోదనములును, సద్యోఘృతమ్ము
పండ్లు తేనెలు హొబ్బట్లు పచ్చడులును."

అని ఆనందనిలయుడు ఆరగింపుచేసే పదార్థాల్ని ఏకరువు పెట్టాడు. కాని ఇవి కొన్ని మాత్రమే. తిరుమలస్వామి ఎన్నెన్ని ఆరగిస్తాడో వాటిని ఏకరువుపెట్టలేక తెనాలి రామకృష్ణకవి "తిండి మెండయ్య" అంటూ ఒక్కమాటలో తిరుమలేశునికి పెద్దబిరుదునే తగిలించినాడు.

ఇలా ఇన్నివిధాలుగా, ఇందరిచేత పొగడబడిన తిరుమలస్వామి నిత్యమూ "తోమని పళ్లాల్లో" ఆరగిస్తాడు తెలుసా! తోమని పళ్లాల్లో ఆరగించే శ్రీవేంకటేశ్వరుని భోగం ఎంతటిదో! ఎంతెంతటిదో కదా! అని మురిసిపోతూ, ఆశ్చర్యపోతూవున్నారుకదూ! వినండిమరి! ఆస్వామి ఒకసారి ఆరగించిన పళ్లాన్ని మళ్లీ తోమకుండా పారవేస్తారు. మళ్లీ భోజనానికి మళ్లీ కొత్తపళ్లెం! మళ్లీ.... కొత్తపళ్లెం వినియోగిస్తారు. ఆ 'తోమని పళ్లాలు' ఏమిటో తెలుసా! మట్టికుండలు! అదికూడా సగం పగిలిన మట్టి పెంకు! దాన్నే 'ఓడు' అంటారు. అదే ఓటికుండ! భక్తప్రియుడైన శ్రీవేంకటేశ్వరుడు తాను పగిలిన మట్టిపెంకులో భోజనంచేస్తూ, భక్తులచేతమాత్రం విందారగింపచేస్తూ వున్నాడు. భక్తులే తనకు పరమార్థం! భక్తుల ఆనందమే తనకానందం! అంటూ మురిసిపోతూ చిరుమందస్మిత వదనంతో ప్రకాశిస్తూవున్న స్వామిని—

వేడుకొందామా వేంకటగిరి వేంకటేశ్వరుని
ఆమటి మ్రొక్కులవాడే ఆది దేవుడే వాడు
తోమని పళ్లాలవాడే దురిత దూరుడే.
వడ్డికాసులవాడే వనజనాభుడే పుట్టు-
గొడ్డురాండ్రకు బిడ్డల నిచ్చే గోవిందుడే
ఎలమి గోరిన వరాలిచ్చే దేవుడే వాడు
అలమేల్మంగా శ్రీవేంకటాద్రి నాథుడే.

అంటూ భక్తులు చిందులేస్తూ పాడుకొంటూ నిత్యమూ తిరుమల యాత్ర చేస్తుంటారు.

ఇలా "తోమని పళ్లాలవాడని" ప్రసిద్ధిపొందిన శ్రీస్వామివారికి తర తరాలుగా ఎందరో రాజులు, రారాజులు చక్రవర్తుల దగ్గరనుంచి, సామాన్య నిరుపేద భక్తులదాకా తమ తమ శక్తి కొద్దీ ఎన్నో నివేదనలు చేశారు. ఆరగింపులను చేయించారు. శ్రీవేంకటేశ్వరుడు భక్తులు సమర్పించిన నివేదనల్ని అత్యంత ప్రియంగా ఆస్వాదించి వాటికి దివ్యత్వాన్ని ప్రసాదించి వాటిని మళ్లీ భక్తులకే వినియోగింపచేస్తూ వున్నాడు.

ఇలా తరతరాలుగా ఎందరో భక్తులు తమకిష్టమైన రీతిలో తాము మెచ్చిన రీతిలో వండింపచేసి, సమర్పించిన ఇన్ని విధాల ప్రసాదాలను శ్రీస్వామివారు అత్యంత ప్రియంగా ఆరగించే ప్రసాదాలు అన్నీ శ్రీవారి ఆలయంలో 'గమేకార్లు' అనబడే వంటవారు సంప్రదాయసిద్ధంగా, సంప్ర దాయబద్ధంగా "పోటు" అనే ఈ వంటశాలలో వండుతారు. పూర్వం వంటచెరకు (కట్టెలు)ను ఉపయోగించి కేవలం మట్టి కుండలలో మాత్రమే వంటచేసేవారు. కాలక్రమేణ వాటి స్థానంలో ఇత్తడి గంగాళాలు చోటు చేసుకున్నాయి. ఇంకా ఇటీవలి కాలంలో విపరీతంగా పెరుగుతున్న లక్షలాది భక్తులసంఖ్య దృష్ట్యా ప్రస్తుతం 'గాస్'ను ఉపయోగిస్తూ శ్రీవారి పరిచారకులు (వంటవారు) శుచిగా శుభ్రంగా రుచికరంగా అత్యంత భక్తిశ్ర ద్ధలతో వంటలు తయారుచేసి శ్రీవారికి సమర్పిస్తూ వున్నారు! వాటిని శ్రీస్వామివారిచేత ముప్పూటలా సుష్టుగా ఆరిగింపజేస్తూ పిదప శ్రీవారి భుక్త శేష ప్రసాదాలను భక్తులచేత ఆరగింపచేస్తూ, శ్రీవారి వంటవారు ఆనందింపచేస్తూ వున్నారు కదా! మరి. తిరుమల శ్రీవారికి వంటలు చేస్తూ సమర్పించే పాచకుల (వంటవారు) పూర్వజన్మభాగ్యం ఎంతటిదో! ఒకప్పటి మహారాణులైన కౌసల్యాదేవికి, దేవకీదేవికి కూడ తమ చేతులతో వండిపెట్టే భాగ్యం లబ్బివుండదు అనడంలో అతిశయోక్తి ఏమాత్రంలేదు. నిజంగా వారి జన్మలు ధన్యాతి ధన్యములు!

ప్రస్తుతం తిరుమల స్వామివారికి ప్రతిరోజూ సుప్రభాతం మొదలు రాత్రి ఏకాంతసేవ వరకు ఈ వంటశాల (పోటు)లో తయారుచేయబడి యే పదార్థాలు, అన్న ప్రసాదాలు, పిండివంటలు నివేదనమవుతూ వున్నాయో క్లుప్తంగా పరిశీలించి ముందుకు సాగుదాం.

ఆనందనిలయంలోని మూలవిరాణ్మూర్తి అయిన శ్రీవేంకటేశ్వరస్వామి వారికి ప్రతిరోజూ ఉదయం, మధ్యాహ్నం, రాత్రి ఇలా మూడుపూటలా నివేదన జరుగుతుంది. ఈ మూడు పూటలా శ్రీవేంకటేశ్వరుని నివేదన జరగడానికి ముందే ఈ వంటశాలనుండి క్షేత్ర సంప్రదాయం ప్రకారం, "తొలిపూజ - తొలినివేదన - తొలి దర్శనం" అన్నట్లుగా శ్రీవారి ప్రధాన వంటశాలనుండి మొట్టమొదట ఛత్రచామర బాజా భజంత్రీ సహితంగా సంప్రదాయ సిద్ధంగా శ్రీవరాహస్వామివారికి నివేదన పంపబడుతుంది. అక్కడ శ్రీవరాహస్వామిఆలయంలో నివేదన పూర్తిఅయిన వెంటనే ఇక్కడ ఆనందనిలయంలో శ్రీనివాస ప్రభువులవారికి ఇంకా ఇతర ఉత్సవమూర్తులకు నివేదన జరుగుతుంది. పిదప విమాన ప్రదక్షిణంలో వుండే ఇతర దేవతామూర్తులయిన ద్వారపాలకులు, గరుత్మంతుడు, వరదరాజస్వామి, వకుళమాత, యోగనరసింహస్వామి, విష్వక్సేనులు, భాష్యకారులు.... ఇలా అందరికి నివేదన జరుగుతుంది. ఆ తర్వాత ఆలయంలోని అష్టదిక్కుల్లో బలి సమర్పించడంతో నివేదన పూర్తవుతుంది. ఇలా మూడుపూటలా నివేదన జరుగుతుంది. ఆ తర్వాత శ్రీవారి ఆలయానికి ఎదురుగా అంటే సన్నిధివీధిలో వుండే శ్రీ బేడి ఆంజనేయస్వామివారికి కూడ శ్రీవారి నివేదనానంతరం నివేదన పంపబడుతుంది.

## నివేదనలు

ప్రతిరోజూ తెల్లవారుజామున సుప్రభాతవేళలో తొట్టతొలుత శ్రీనివాసమూర్తికి వెన్న, పాలు, చక్కెర నివేదిస్తారు. ద్వాపరయుగంలో ఉదయం లేచిన వెంటనే యశోదాదేవి వెన్నముద్దలు తినిపించేదట! ఆనాటి అలవాటేమో మరి!"

ఇక ఆ తర్వాత శ్రీశ్రీనివాసస్వామివారికి కొలువు (దర్బార్) జరుగుతుంది. బంగారు సింహాసనంపై ఛత్ర చామర మర్యాదలతో మహాదర్పంగా వేంచేసి ఉన్న శ్రీవేంకటప్రభువులకు రాజోచిత మర్యాదలన్నీ సమర్పించిన తర్వాత ఆనాటి తిథివార నక్షత్రాది పంచాంగ శ్రవణం, శ్రీవారి ఆలయ ఆదాయ వ్యయాలు విన్పించిన తర్వాత నువ్వులపిండి (వేయించిన నువ్వులను

బెల్లంతో కలిపి దంచిన పిండిని) సమర్పిస్తారు. శనిదేవునకు ప్రీతికరంగా ప్రతిరోజూ శ్రీ వేంకటేశ్వరస్వామివారు నువ్వులపిండిని ఆరగిస్తారు. అందులకే శ్రీనివాసునికిష్టమైన శనివారవ్రతం ఆచరిస్తూ శ్రీనివాసుని సేవించినవారికి శనిగ్రహదోషాలు తొలుగుతాయి.

పిదప సహస్రనామార్చన జరుగుతుంది. ఆ తర్వాత మొదటిగంట అని పిలువబడే తొలి నైవేద్యంలో శ్రీస్వామివారికి ఎదురుగా పులిహోర, పొంగలి, దధ్యోదనం, చక్కెరపొంగలి మున్నగు అన్న ప్రసాదాలు, లడ్లు, వడలు, అప్పాలు వగైరా పిండివంటలు కులశేఖరపడికి ఇవతలే వుంచుతారు. ఇంతలో ప్రధాన వంటదారుడు 'ఓడు' అని పిలువబడే పగిలిన మట్టికుండలో 'మాత్రా' అనబడే మాత్ర దధ్యోదనాన్ని మాత్రం ఆనందనిలయంలోనికి తీసుకెళ్లి సమర్పిస్తాడు. చిక్కటి మీగడ పెరుగన్నం వున్న 'ఓడు' తప్ప మిగిలిన ప్రసాదాలన్నీ గడపకివతలే నివేదన చెయ్యబడతాయి. ఇలా మీగడ పెరుగన్నాన్ని అత్యంత ప్రియంగా ఆరగించే ద్వాపరయుగం అలవాటును ఈ కలియుగంలోకూడా ఈ వేంకటాద్రి కృష్ణుడు ఇంకా మరవలేకున్నాడు మరి!

ఇక మధ్యాహ్నం "అష్టోత్తర శతనామార్చన" అయిన వెంటనే శ్రీస్వామి వారికి రెండవగంట అనబడే మధ్యాహ్నపు నైవేద్యానికి కూడ ఈ వంటశాలలో వంటలు సిద్ధంగానే వుంటవి మరి!

పైన పేర్కొన్న అన్నప్రసాదాలతోపాటు, శుద్ధాన్నం, ఇంకా భక్తులు మొక్కులుగా సమర్పించే అన్నప్రసాదాలు, సీరా, పాయసం, కేసరీబాత్, క్షీరాన్నం, కదంబం, మున్నగు ప్రసాదాలను కూడ శ్రీవేంకటేశ్వరుడు ప్రియంగా ఆరగించి భక్తులను ఆనందింపచేస్తూ వున్నాడు.

రెండవగంట అయినవెంటనే శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్ప స్వామి (ఉత్సవ శ్రీనివాసమూర్తి) భక్తులకు కన్నులపండువు చేయడానికి నిత్య కల్యాణోత్సవానికై కల్యాణమండపానికి వేంచేస్తారు. కల్యాణానంతరం శ్రీవారికి లడ్లు, వడలు, అప్పాలు, దోసెలతోపాటు చక్కెరపొంగలి, పులిహోర, పొంగలి, దధ్యోదనం మున్నగు అన్నప్రసాదాలు నివేదింపబడతవి.

ఆ తర్వాత శ్రీమలయప్పస్వామి కొందరి ఆర్జితసేవా భక్తుల కోరిక మేరకు వసంతోత్సవంలో పాల్గొని కనువిందు చేస్తారు. ఆ వసంతోత్సవం

లోకూడ శ్రీస్వామివారు దోసెలు అన్న ప్రసాదాలను ఆరగించుతాడు. ఆ వెంటనే అద్దాలమండపంలోజరిగే 'డోలోత్సవం' లోను, సాయంత్రం జరిగే 'సహస్ర దీపాలంకారసేవ' లోను శ్రీస్వామివారికి 'పంచకజ్జాయం' అనే ప్రసాదం నివేదింపబడుతుంది. చక్కెర, గసగసాలు, కలకండముక్కలు, ఎండుద్రాక్ష, జీడిపప్పు, బాదంపప్పు పలుకులు, ఎండుకొబ్బరికోరు అన్నీ కలిపి తయారుచేసిన పొడిలాంటి ప్రసాదమే ఈ 'పంచకజ్జాయం' దీన్నికూడ వంటశాల పరిచారకులే సిద్ధంచేసి సమర్పిస్తారు.

ఇక సాయంత్రం సంధ్యాసమయంలో శ్రీవేంకటేశ్వరస్వామివారికి తోమాల సేవ అనే పుష్పాలంకరణ సేవ ఏకాంతంగా జరుగుతుంది. వెంటనే తోమాలదోసెపడి అనే పెద్ద పెద్ద నెయ్యిదోసెలు, మొళహోర, కదంబం మున్నగు అన్నప్రసాదాలు నివేదింపబడతవి. పిదప శ్రీస్వామి వారికి మూడవ అర్చనగా 'అష్టోత్తర శతనామార్చన' జరిగిన తర్వాత 'మూడవగంట' అనబడే రాత్రి నైవేద్యం జరుగుతుంది. ఈ గంటలో కూడ చక్కెరపొంగలి, పొంగళ్ళు, మొళహోర, కదంబం మున్నగు ప్రసాదాలను శ్రీనివాసుడు ఆరగిస్తాడు. ఇలా మూడుగంటలు అనబడే మూడుపూటలా నివేదనలేకాక చివరగా రాత్రిపూట "తిరువీసం" గంట అనే ప్రత్యేక నివేదనలో శ్రీనివాసునికి చక్కెర పొంగలి మాత్రం సమర్పిస్తారు.

పిదప రాత్రి ఏకాంతసేవలో శ్రీవేంకటేశ్వరునికి బాగా కాచి చల్లార్చిన గోరువెచ్చని చక్కెర కలిపిన పాలు, పండ్లు, పంచకజ్జాయంతోపాటు "మేవా" అనబడే పంచామృతంలాంటి ప్రసాదం నివేదింపబడుతుంది.

ఇలా ప్రతిరోజు ఇవేకాకుండా, ప్రతిసోమవారం ఉదయం శ్రీ మల యప్పస్వామివారికి జరిగే "విశేషపూజ"లో కూడ పెద్ద వడలు, లడ్లు, అన్నప్రసాదాలు నివేదన చేస్తారు. ప్రతి బుధవారం ఉదయం బంగారువాకిలి వద్ద జరిగే సహస్రకలశాభిషేకంలో ప్రత్యేకంగా క్షీరాన్నంతోపాటు మిగిలిన అన్నప్రసాదాలు నివేదింపబడతాయి. ఇక ప్రతి గురువారం జరిగే "తిరుప్పావడ" అనే సేవలో సుమారు 420 కిలోల బియ్యంతో తయారుచేసిన "పులిహోర"ను శ్రీస్వామివారి మూలమూర్తికి ఎదురుగా బంగారువాకిలి ముందర పెద్దరాశిగా అమర్చి నేరుగా నివేదిస్తారు. దీనితోపాటు ప్రత్యేకంగా

చాటంత పెద్ద జిలేబీలు, చాటంత పెద్ద మురుకులు (తేనెతొల) కూడ "తిరుప్పావడ" సమయంలో శ్రీవారు ఆరగిస్తారు.

ఇక శుక్రవారంనాడు శ్రీనివాసునికి పోళీలు లేదా హోళిగలు అనే పూర్ణంభక్ష్యాలను, సుఖియలనే ఉండ్రాళ్లను నివేదించుతూ వున్నారు. ఇక ప్రతి ఆదివారంనాడు "ఆదివారం ప్రసాదం" అనబడే "చలిపిండి" ప్రసాదాన్ని ప్రత్యేకంగా నివేదిస్తారు. ఈ చలిపిండినే 'అమృతకలశం' అంటారు. పిదప దీన్ని గరుడాళ్వారుకు నివేదిస్తారు.

ఇవిగాక ఏకాదశి, వైకుంఠ ఏకాదశి మున్నగుపర్వదినాల్లో శ్రీస్వామి వారు దోసెలు, శనగపప్పుతో తయారుచేసిన శుండలి (గుగ్గుళ్లు)ని ఆరగిస్తారు. ఇంతేగాక శ్రీవారికి పెసరపప్పు పణ్ణారం, పానకాన్ని కూడ నివేదిస్తారు. ఇక నెలరోజులపాటు జరిగే ధనుర్మాసవ్రత సమయంలో అన్న ప్రసాదాలతోపాటు ప్రత్యేకంగా "బెల్లపుదోసె"ను ప్రియంగా ఆరగిస్తాడు ఆనందనిలయుడు.

పైన పేర్కొన్న ప్రసాదాలేకాక కొన్ని విశేష పర్వదినాల్లో శ్రీ వేంకటే శ్వరస్వామి పాయసాలను, కేసరీబాత్, శాకరీబాత్, బకాళాబాత్, మనోహరం అనబడే విశేషవంటకాల్ని కూడ సుష్టుగా భోంచేస్తారు.

ఇంతేగాక, ఉగాది ఆస్థానం, ఆణివార ఆస్థానం, దీపావళి ఆస్థానం...... వంటి ఆస్థానాలలోను, బ్రహ్మోత్సవ సమయంలో జరిగే ఉత్సవాల్లో, ఊరే గింపుల్లోను ఇంకా, పారువేట ఉత్సవాల్లోనూ, శ్రీస్వామివారికి విశేషంగా నివేదనలు సమర్పింపబడతాయి.

ఇలా ఎన్నో ఎన్నెన్నో ప్రసాదాలను, అన్ని వేళలా అప్రమత్తంగా వేళ మించకుండా, శ్రీవారి ఆకలిని గమనిస్తూ సరిఅయిన వేళల్లో సమర్పించేం దుకై అహరహం శ్రీవారి పాచకులు ఈ వంటశాలలో వంటలతయారీలో నిమగ్నులై వుంటారు. శ్రీనివాసునికి ఏవేళ ఏ ఉత్సవం జరుగుతుందో, అప్పుడు ఆ వేళ అవసరమయ్యే ప్రసాదాన్ని రుచికరంగా వండి వడ్డిస్తూ వుంటారు శ్రీవారి పరిచారక అర్చకస్వాములు. తిరుమల శ్రీవారు ఆర గించే ప్రసాదాలన్నీ ఈ ప్రధాన వంటశాలలోనే తయారు చెయ్యబడతాయి. ఈ వంటశాలలోనే వాయువ్యమూలకు శ్రీవేంకటేశుని తల్లిగా చెప్పబడే వకుళమాత ఒక వేదికపై అధిష్ఠించి వంటల తయారీని పర్యవేక్షిస్తూ వుంటుంది.

ప్రపంచంలో ఎక్కడా కూడా ఇంత పెద్ద ఎత్తున నివేదనలు జరగనే జరుగవు. అదీ అన్ని వంటలుకూడా నెయ్యితోనే తయారు చెయ్యబడతవి. శ్రీవారి వంటశాలలో కాగి కాగి చివరకు మిగిలిన ఒకనాటి నెయ్యి గసి (జిడ్డు) ఇతర ఆలయాలలో ఒక సంవత్సరానికి ఉపయోగించవచ్చునని ప్రసిద్ధి.

అందుకే, తొలుత అన్నమయ్య, తిరుమలను సందర్శించినపుడు

*"దండడి నవ్వేల్పు తళిఘల క్రింద*
*జిందఁగా జేత నూర్చిన నంటివచ్చు-*
*నొకనాటి నెయ్యి వేరొక దేవళమున*
*నొకయేటనైనను నున్నదే యనుచు"*

అని ఆశ్చర్యపడినాడట!

ఇలా "తిండిమెండయ్య", "నైవేద్యప్రియుడు", "తోమని పళ్ళాలవాడు" అయిన తిరుమలేశుడు తనకు ఎన్ని పిండివంటలు సమర్పించినా, ఎన్నిరకాల పాయసాలు నివేదించినా వాటిని మళ్లీ భక్తులకే సమర్పిస్తూ వారినందరినీ పునీతులను చేస్తూ, సంతృప్తిపరుస్తూవున్నాడు. శ్రియఃపతిని ఆ శ్రీవేంకటేశ్వరుని మనసారా స్మరిస్తూ, నోరారా శ్రీవారి ప్రసాదాలను ఆస్వాదించుతూ, ఇదిగో ఈ "శ్రీవారి ప్రధానవంటశాలకు", ఆ వంట శాలలో అహరహం అప్రమత్తులై వంటలు చేస్తూవున్న శ్రీవారి వంటవారికి, వారు తయారుచేస్తున్న ప్రసాదాలను పునీతం చేసి మనకు సమర్పించుతూ వున్న ఆనందనిలయునకు జేజేలు పలుకుదాం. గట్టిగా అనండి మరి.

*ఏడుకొండలవాడా! వేంకట రమణా!!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 45. వకుళాదేవి

మనం ఇంతవరకు శ్రీవారి వంటశాలను, శ్రీస్వామివారు తృప్తిగా ఆరగించడానికి ఆ వంటశాలలో తయారుచేసే అన్న ప్రసాదాలను గురించి తెలుసుకున్నాం.

ప్రస్తుతం ఆ వంటశాలలోనే ఇదిగో ఇటు చూడండి. వాయవ్యమూలన వున్న ఈ చిన్న మందిరాన్ని దర్శించండి!

ఆ నాలుగడుగుల నలుచదరపు రాతి అరుగు (అధిష్ఠానం)పై నిర్మింపబడివున్న ఈ చిన్నమందిరంలో తూర్పు అభిముఖంగా ప్రతిష్ఠితురాలైవున్న ఈ అమ్మవారే "వకుళాదేవి". ఇంకా "వకుళమాత", "వకుళమాలిక" అని కూడ పిలువబడుతూవున్న ఈ దేవత, ప్రాచీనకాలంలో లక్ష్మిగానే పేర్కొనబడింది. కాని తర్వాతికాలంలో ఈ మూర్తి వకుళమాతగా చెప్పబడుతూ ప్రసిద్ధి పొందింది. ఇంతకూ ఎవరీ వకుళాదేవి?

ద్వాపరయుగంలో కృష్ణావతారసమయాన పొత్తిళ్లనాటినుండి శ్రీ కృష్ణుని పెంచి పెద్ద చేసిన మాతృమూర్తి యశోదాదేవి. ఆబాల్యం నుంచి శ్రీకృష్ణుని కంటికి రెప్పలా పెంచుతూ, చిన్నప్పటినుంచీ ఎందరో రాక్షసులను సంహరించిన లీలల్ని, మహిమల్ని చూచి ఆనందించినా, ఆయన సాక్షాత్తు భగవంతుడే అని తెలియని యశోద మనసు తల్లడిల్లేది. పాపం పుత్రప్రేమతో తన చిన్ని కన్నయ్యకు ఎక్కడ ఏ ఆపద కలుగుతుందో అని అహరహం బాధలతో అష్టకష్టాలుపడి పెంచి పెద్ద చేసింది. కాని కంసవధానంతరం ఆ కృష్ణుడు తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులను చేరినాడు. వారి దగ్గరే ఆయనకు వివాహాది కార్యక్రమాలన్ని జరిగాయి. చిన్నప్పటినుండి పెంచి పెద్దచేసిన తాను శ్రీకృష్ణునికి, వివాహాన్ని స్వయంగా చేసి సంతోషించే భాగ్యాన్ని నోచుకోలేదు కదా! అని చింతిస్తూవున్న యశోదాదేవి మనస్సును తెలుసుకొన్న శ్రీకృష్ణపరమాత్మ "అమ్మా! నీవు ఏమాత్రం చింతించవలసిన పనిలేదు. నీవు లేకున్న ఈకృష్ణుని మనుగడే లేదు. ఇప్పుడు పెంచి పెద్దచేసిన చేతులతోనే స్వయంగా నీవే నాకు వివాహాన్ని చేసి సంతోషించే భాగ్యాన్ని కలిగిస్తున్నాను. అది ఈ ద్వాపరయుగంలో కాదు. తర్వాతి కలియుగంలో వేంకటాచలశిఖరాలలో యోగినివై వున్న సమయంలో "శ్రీనివాసుని" పేరుతో నీ దగ్గరికి చేరతాను. ఇప్పటి ఈ ద్వాపరయుగంనాటి శ్రీ కృష్ణున్నే అప్పటి ఆ వేంకటాద్రిమీది కృష్ణుడినై వరలుతాను. ఆ సమయంలో నీ చేతులమీదుగానే నా వివాహం జరిపించి ఆనందించి నన్ను సేవించే భాగ్యాన్ని పొందగలవని తల్లిని ఊరడించి వరమిస్తాడు శ్రీనివాసుడు.

ఇదిగో ఆ ద్వాపరయుగం నాటి వర ప్రభావంచేత ఆ యశోదాదేవి "వకుళాదేవి"గా అవతరించింది.

శ్రీమహావిష్ణువు శ్రీనివాసునిగా వేంకటాచలానికి చేరిన తర్వాత శ్రీ వరాహస్వామి వారి అండదండలతో అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు. అప్పటికే తిరుమలగిరులలో తనకు సపర్యలు చేస్తూవున్న వకుళమాతను ఇకమీదట శ్రీనివాసుని ఆలనా పాలనా చూస్తూ అన్న పానాదులు, ఆకలిదప్పులు తీరుస్తూ తృప్తిగా కాలక్షేపం చేస్తూవుండమని వరాహ స్వామి ఆమెను ఆదేశిస్తాడు. అలా వకుళమాత వేంకటాచలపర్వతం చేరిన శ్రీనివాసునికి అన్ని సపర్యలు చేస్తూవుండింది. ఆ కొండల్లో దొరికే శ్యామక ధాన్యాన్ని సేకరించి వాటితో అన్నంచేసి తేనెతో కలిపి శ్రీనివా సునికి వడ్డించేదట వకుళమాత. తేనె కలిపిన శ్యామకాన్నాన్ని అత్యంత ప్రియంగా తినేవాడట స్వామి. అందువల్లే శ్రీస్వామివారు "ఓం ప్రియంగు ప్రియభక్షాయ నమః" అని అష్టోత్తర శతనామావళిలో ప్రతిరోజూ కీర్తింపబ డుతూవున్నాడు. ప్రియంగు అనబడే శ్యామక ధాన్యం నేటికీ రాయలసీమ, తెలంగాణా, కర్నాటక ప్రాంతాల్లో పండుతూ వుంది. దీన్నే రాయలసీమలో, తెలంగాణాలో 'కొర్రలు' అనీ, కర్నాటకలో 'శ్యామలు' అని అంటారు.

అనంతరం ఆకాశరాజు కూతురు పద్మావతిఅమ్మవారిని శ్రీనివాసు నికి ఇచ్చి వివాహం చెయ్యడానికి ప్రధానపాత్ర వహించిన వకుళమాత, జీవితాంతం శ్రీనివాసుని సేవలోనే తరించింది. ఆయమ నిత్యమూ, శ్రీ వేంకటేశ్వరునికి ప్రియంగా వుండే వంటలను తయారుచేయిస్తూ పర్యవేక్షిస్తూ వుంటుంది.

ద్వాపరయుగంలో యశోదాదేవి తినిపించిన వెన్నముద్దలను, మీగడ పెరగన్నం రుచిని, కమ్మదనాన్ని మరువలేక, ఈ కలియుగంలో కూడ వకుళాదేవి చేతి వెన్నను, పాలను, ఆరగిస్తూవున్నాడు. మీగడపెరుగన్నాన్ని నిత్యమూ తింటూనే వున్నాడు.

ప్రతిరోజూ తెల్లవారగానే సుప్రభాత సమయాన ఆవుపాలను, వెన్నను, శ్రీనివాసుడు స్వీకరిస్తున్నాడు. ఆ తర్వాత 'మాత్రా' అనే మాత్ర దధ్యో

దనాన్ని పగిలిన మట్టికుండలో ఆరగిస్తూ ద్వాపరయుగంనాటి అలవాట్లను, ఆచరిస్తూ ఆనాటి తల్లి యశోదను నిత్యమూ తాను స్మరిస్తూ, మళ్ళీ ఆనాటి కృష్ణలీలలను మనలచే స్మరింపచేస్తూ వున్నాడు ఈ వేంకటాద్రి గోవిందుడు.

ఇలా వంటశాలలోని ఈ మూర్తిని 'వకుళాదేవి'గానే కాక 'మాడపల్లి (మర ప్పల్లి) నాచ్చియార్' అని 'మాడపులి నాచ్చియార్' అని కూడా అంటారు. ఈమెనే 'పచన లక్ష్మి' 'పాచక లక్ష్మి' అని కూడా పిలువబడుతూ వున్నది.

ఇన్ని పేర్లతో పిలువబడుతూ, శ్రీవారి వంటశాలను పర్యవేక్షిస్తూవున్న ఈ వకుళమాలిక మూర్తిని శ్రీవేంకటేశ్వరుని దేవేరి అయిన 'శ్రీమహాలక్ష్మి' అని కూడ కొందరు చెప్పడం కద్దు. పదకవితా పితామహుడైన అన్నమా చార్యులు ఎనిమిదేళ్ల పిన్న వయస్సులో, తొలిగా తిరుమల దర్శించినపుడు శ్రీవారి ఆలయప్రాంగణంలో శ్రీవారి దర్శనానంతరం విమాన ప్రదక్షిణం చేస్తూ—

*"శ్రీనివాసుని నమస్కృతి చేసి దంచఁ*
*గానుపించిన భాష్యకారులఁ బొగడి*
*శ్రీనరసింహుని సేవగావించి*
*దానవాంతకు జనార్దను సన్నుతించి*
*అలమేలుమంగకు నభివందనములు*
*సలిపి చెంగటి యాగశాల గీర్తించి."*

నాడట! ఈ అమ్మవారికి అలమేల్మంగకు (మహాలక్ష్మి) వలెనే నాలుగు భుజాలు వున్నాయి. పై రెండు చేతుల్లోనూ పద్మాలు వున్నాయి. అలానే క్రింది కుడిచేయి 'అభయముద్ర' తోను, క్రింది ఎడమచేయి 'వరదముద్ర' తోను విరాజిల్లుతూ దర్శనమిస్తూ వుంది. ఈ మహామాతకు భక్తితో ప్రణమిల్లుదాం!

*వందే జగన్మనాతరం!వందే జగన్మాతరమ్!!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ఈ "వకుళమాత"కు ముప్పూటలా నివేదనలు జరుగుతూ వున్నాయి. ఇవి కాక ప్రతిరోజు రాత్రి ఏకాంతసేవా సమయంలో 'అమ్మవారి పాయసం'

అనబడే చక్కెరపొంగలి ప్రసాదం, శ్రీవారి పాకశాలకు అధీశ్వరి అయిన ఈ తల్లికి నివేదింపబడుతున్నది. ఆ సమయంలో ముందుగా శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యమూలవిరాణ్మూర్తి పాదాలమీద వున్న పూలమాల (తిరువడిపూరం) ను ఈ వకుళమాతకు అలంకరిస్తారు. పిదప అమ్మవారి పాయసాన్ని నివేదించి కర్పూర నీరాజనాన్ని సమర్పిస్తారు.

ఇంతమాత్రమేగాక ఈ "వకుళమాలిక"కు ప్రతి శుక్రవారంనాడు అభిషేకం, అర్చన నివేదనలు జరుపబడుతున్నాయి.

శ్రావణమాసంలో 'వరలక్ష్మీవ్రతం'నాడూ, అలాగే మకర సంక్రాంతి పర్వదినానికి మరునాడు "కనుమ పండుగ" నాడు జరిగే గోదాపరిణయోత్సవ సమయంలోను ఈ "వకుళాదేవి"కి పంచామృత స్నపన తిరుమంజనాదులు, నివేదనలు ఘనంగా, వైభవంగా నిర్వహింపబడుతున్నాయి.

శ్రీవేంకటేశ్వరస్వామివారి సేవలో బద్ధకంకణురాలై, నిత్యమూ రుచికరములైన వంటకాలను ఆ స్వామివారిచేత ఆరగింపచేసి, సంతృప్తి పరుస్తూవుంటుంది. ఆయన తినగా మిగిలిన భుక్తశేషాల్ని మనకు తృప్తిదీర సమర్పిస్తూ తద్వారా మనలను అందరినీ నిత్యమూ ఆ నిత్యకల్యాణ చక్రవర్తి సంపూర్ణ అనుగ్రహానికి పాత్రులనుగా చేసి ఆనందింపజేస్తూవున్న ఈ మహాతల్లిని, సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి స్వరూపురాలుగా భావించి అందరం భక్తిపూర్వక వందనమాచరిద్దాం.

*నిత్యముక్తా! దోషదూరా!*
*త్వదూనాధిక సద్గుణా!*
*త్వత్పాద పూజనే నిత్యం*
*బద్ధకంకణ భూషితా!*

*పద్మాలంకృత పాణి పల్లవ యుగాం*
*పద్మాసనస్థాం శ్రియమ్*
*వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం*
*వందే జగన్మాతరమ్*

*ఏడుకొండలవాడా! వేంకట రమణా!!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 46. బంగారు బావి

ఇదిగో శ్రీవారి ప్రధానవంటశాలకు పక్కనే వున్న ఈబావిని "బంగారు బావి" అంటారు.

ఈ బావి, శ్రీస్వామివారి దర్శనం చేసికొని బంగారు వాకిలినుండి వెలుపలికి వచ్చిన తరువాత ఎదురుగా వున్న వంటశాలలోనికి వెళ్లేమార్గంలో వంటశాలమెట్లకు ఆనుకొని ప్రక్కనే వున్నది చూడండి. ఈ బావికి చుట్టూ, భూమిమట్టం (భూమితలం) నుండి చెక్కడపు రాళ్లతో 'వర' నిర్మింపబడింది. ఈ రాతి కట్టడం మీద బంగారు మలాము చేయు బడిన రాగిరేకులు తాపబడి వుండటంవల్ల ఇది 'బంగారుబావి' అని ప్రసిద్ధి చెందింది.

ఈ బంగారుబావికే 'శ్రీతీర్థం' అనీ, "సుందరస్వామి బావి" అని కూడా పేర్లు వున్నాయి.

శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీవేంకటేశ్వరుడు లీలామానుష రూపుడై శ్రీవైకుంఠంనుండి వచ్చి భూలోక వైకుంఠమైన ఈ వేంకటాచల క్షేత్రంలో సంచరిస్తూ వున్న సమయంలో శ్రీవారి వంటకోసం శ్రీమహాలక్ష్మి ఒక తీర్థాన్ని ఏర్పరిచింది. అదే "శ్రీతీర్థం" అనీ "లక్ష్మీతీర్థం" అనీ పేరుపొందింది. అలాగే భూదేవికూడ ఒకతీర్థాన్ని ఏర్పాటుచేయుగా అది "భూతీర్థం"గా పేరొందింది. కాలాంతరంలో ఆ తీర్థాలు రెండూ అదృశ్యములై నిక్షిప్తంగా వుండినాయి.

మళ్లీ అనంతరకాలంలో శ్రీవేంకటేశ్వరస్వామివారికి, వైఖానసాగమ శాస్త్రోక్తంగా అర్చిస్తూవున్న గోపీనాథుడనే అర్చకునకు సహాయంగా "రంగ దాసు" అనే సేవకుడు తిరుమల చేరుకున్నాడు. శ్రీస్వామివారి ఆరాధనకోసం అవసరమయ్యే పుష్పాలకోసం తోటను పెంచడానికి రెండుబావులను నిర్మించి నాడు. అదే స్థలంలో ఎప్పుడో నిక్షిప్తములైన శ్రీతీర్థ, భూతీర్థాలు మళ్లీ దైవికంగా బహిర్గతములయ్యాయి. అనంతరం ఆ రంగదాసు మరణించగా మళ్లీ ఆ బావులు రెండూ శిథిలము లయ్యాయి.

శ్రీవేంకటేశ్వరస్వామివారికి తోటలు పెంచి పుష్పాలు సమర్పించి సేవచేసిన ఫలితంగా ఆ రంగదాసు అనంతరకాలంలో "తొండమాను చక్రవర్తి"గా జన్మించి మళ్లీ శ్రీస్వామివారినే చేరుకొన్నాడు. మళ్లీ ఈ జన్మలో

కూడా పెక్కువిధాలుగా సేవిస్తూవున్న తొండమానునితో శ్రీస్వామివారు అతని పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలియజేసి, తాను వుండడానికి ఒక ఆలయాన్ని నిర్మించి దానిపై బంగారుతొడుగుతో ఒక బంగారు విమానాన్ని ఏర్పాటు చేయవలసిందని, ఆ ఆలయ ప్రాకారఆవరణలో పూర్వజన్మలో అంటే రంగదాసుగా అతను నిర్మించిన శ్రీతీర్థ, భూతీర్థాలను మళ్లీ పునరుద్ధరించమని ఆజ్ఞాపించినాడు. తన పూర్వజన్మవృత్తాంతానికి ఆశ్చర్య పడిన 'తొండమాను చక్రవర్తి' శ్రీతీర్థాన్ని ఉద్ధరించి దానికి చుట్టూ రాతి కట్టడం ఏర్పాటుచేసి, దానికి బంగారురేకులు తాపించినాడు. అదే అప్పటినుంచి 'బంగారుబావి' అని పేరు పొందింది. అలాగే భూతీర్థాన్ని దిగుడుబావిగా మెట్లతో నిర్మించినాడు. అదే 'పూలబావి'గా ప్రసిద్ధి పొందింది. సంపెంగ ప్రదక్షిణలోవున్న 'పూలబావి'ని గూర్చి, ఇంతకుముందే తెలుసుకున్నాంకూడ. కాలాంతరంలో ఆ శ్రీతీర్థం (బంగారుబావి) శ్రీవారి వంటశాలకు, అర్చన ఆరాధనలకు ఉపయోగింపబడుతూ ప్రముఖ స్థానాన్ని పొందింది.

తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తికి ప్రతి శుక్రవారంనాడు అభిషేకం జరుపబడుతున్నది. ఈ అభిషేకానికి గాను తిరుమలనంబి (11వ శతాబ్దంలో) పాపవినాశన తీర్థంనుండి రోజూ ఆ పవిత్రజలాన్ని తెచ్చేవారు. ఈ తిరుమలనంబి భగవద్రామానుజులకు 'గురువు' మాత్రమే కాక మేనమామ కూడ. ఇలా అభిషేకజలాన్ని సమర్పిస్తూ సేవిస్తూవున్నకాలంలో తిరుమల నంబి (ఈయనకే మరో పేరు తిరుమల తాతాచార్యులు) గారి గురువైన యామునాచార్యులు తిరుమలకు వేంచేసి శ్రీనివాస ప్రభువులను దర్శించారట! ఆ సమయంలో ఎడతెరిపిలేని కుంభవర్షాలు పడుతూవుండగా, తిరుమలనంబి, పాపవినాశన తీర్థంనుండి అభిషేక జలం తెచ్చుటకు ఆటంకం ఏర్పడింది. అప్పుడు శ్రీస్వామివారి అభిషేకానికి ఎలాంటి విఘ్నం కలగకుండా వుండడానికి యామునాచార్యులు శ్రీమహాలక్ష్మిని ఇలా ప్రార్థించినారట! "అమ్మా! శ్రీదేవీ! శ్రీనివాసుని అభిషేకమునకు ఇతర తీర్థములకంటే, నీవు వెలయింపచేసిన శ్రీతీర్థజలం సర్వశ్రేష్ఠము. అందువల్ల ఈ జలాలు ఇక మీదట శ్రీవారి అభిషేక యోగ్యములై వుండుగాక" అంటూ సాక్షాత్తూ ఈ "బంగారుబావి"

సుందరమైన భగవంతుని రూపమేనంటూ దానికి "సుందరమైన స్వామి కూపము" అని నామకరణము చేసినారు యామునాచార్యులు. ఈ సుందర మైన స్వామికూపమే తమిళంలో "అళగప్పినార్ కిణఱు" అనే పేరుతో వ్యవహరింపబడుతున్నది.

పిదప భగవద్రామానుజాచార్యులవారు తిరుమల క్షేత్రాన్ని సందర్శించి నపుడు, ఇలా గతంలో పైవిధంగా జరిగిన వృత్తాంతాన్ని విని ఆనందిస్తూ శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యమూల విరాణ్మూర్తి శుక్రవారాభిషేకమునకు, ప్రతినిత్యమూ భోగశ్రీనివాసునికి జరిగే నిత్యాభిషేకమునకుగాను ఇకమీదట పాపవినాశతీర్థం కానీ, లేదా గురువులైన తిరుమల నంబికి శ్రీనివాసుడాదేశిం చినట్లు ఆకాశగంగా తీర్థంకానీ, లేదా పరమగురువులైన యామునాచార్యులు నిర్ణయించినట్లు శ్రీతీర్థం (లక్ష్మీతీర్థం) అనబడే ఈ "బంగారుబావి" పవిత్రజలాల్ని మాత్రమే ఉపయోగించవలెనని కట్టడి చేసినారు.

అప్పటినుంచి ఈ "బంగారుబావి"లోని పవిత్రజలాలు శ్రీవారి అభిషేక అర్చనల్లోను, శ్రీవారివంటశాలలో పచనాదికార్యక్రమాల్లోను ఉపయోగింప బడుతూ, భక్తులను, దర్శన మాత్రం చేతనే, స్మరణం మాత్రం చేతనే పునీతులను చేస్తున్నది.

పూర్వం ఈ బంగారుబావినుండి చేదిన నీటిని 15 అడుగుల ఎత్తులో అమర్చివున్న రాతి కాలువద్వారా నేరుగా వంటశాలలోని తొట్టిలోనికి చేర్చేవారు. ఈ పద్ధతి విజయనగర రాజుల కాలంలో హంపీనగరంలో నీరు సరఫరాచేసే పద్ధతిని పోలివుందని పరిశీలకుల అభిప్రాయం. ఇటీవల 20 ఏళ్లక్రిందటివరకు శ్రీవారి వంటచేసే పరిచారకులు బంగారుబావి నుంచి నీటిని కుండలతో చేదుతూ ఈ రాతికాలువ ద్వారానే వంటశాలలోనికి చేర్చేవారు. కాని నానాటికి పెరుగుతున్నశ్రీవారి నివేదనలు పులిహోరలు, పొంగళ్లు....... ఇలా ఎన్నెన్నో ప్రసాదాల తయారీని, భక్తులను దృష్టిలో వుంచుకొని, విద్యుత్తుద్వారా ఈ బావిలోని నీరు తోడుతూ వంటలకు ఉపయోగించడం జరుగుతున్నది.

ఇంతటి పరమోన్నత చరిత్రను కలిగివుంటూ, శ్రీదేవిని, భూదేవిని పరమభక్తుడైన తొండమాను చక్రవర్తిని (రంగదాసును), యామునాచా

ర్యులవారిని, శ్రీవారిచేతనే తాతా! అనిపిలిపించుకొన్న తిరుమల నంబిని, భగవద్రామానుజులవారిని స్మరింపజేస్తూ సాక్షాత్తుగా శ్రీవారి రూపంగా భావింప బడుతూ "సుందరస్వామికూపం" అని పిలువ బడే పవిత్రమైన ఈ "బంగారుబావి"కి నమస్కరిస్తూ భక్తవరదుడైన బాలాజీకి జేజేలు పలుకుదాం!

*భక్తవత్సలుడైన బాలాజీకి జై!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!*

## 47. అంకురార్పణ మండపం

ఇదిగో! శ్రీవారి వంటశాలకు ఎదురుగా, బంగారుబావికి దక్షిణంగా వున్న ఈ మండపాన్నే 'అంకురార్పణ మండపం' అంటారు.

ఈ మండపంలోనే శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రతిసంవత్సరం పది నాళ్లపాటు జరిగే బ్రహ్మోత్సవాల ప్రారంభానికి ముందు అంకురార్పణ జరుగుతుంది. అంకురార్పణం అనగా బీజావాపం అని అంటారు. నవ ధాన్యాలు విత్తులుగా చల్లి, వాటిని మొలకెత్తింప చేస్తారన్నమాట. ప్రతి శుభకార్యానికి, ఉత్సవానికి నాందిగా జరిగే వైదిక ప్రక్రియ అంకురార్పణం.

బ్రహ్మోత్సవాలు ప్రారంభమవడానికి ముందురోజు అనగా బంగారు ధ్వజస్తంభంపై ధ్వజారోహణం జరిగే రోజునకు ముందురోజు సాయంత్రం శ్రీ స్వామివారి సేనాధిపతి అయిన శ్రీ విష్వక్సేనులవారి ఆధ్వర్యంలో ఈ మండపంలో అంకురార్పణ జరుగుతుంది. ముందుగా బంగారువాకిలిలోపల వున్న రాములవారిమేడ లోని విష్వక్సేన, గరుడ, అనంతుల పంచలోహ ఉత్సవమూర్తులను ఈ మండపంలో వేంచెపుచేస్తారు. పిదప విష్వక్సేనులవారి ఆధ్వర్యంలో మృత్సంగ్రహణ యాత్ర జరుగుతుంది. శ్రీవారి ఆలయానికి నైరుతి మూలలో వున్న వసంతోత్సవ మండపానికి శ్రీ విష్వక్సేనులవారు, శ్రీ సుదర్శన, అనంత, గరుడులతో కలిసి ఛత్ర చామర బాజా భజం త్రీలతో వేదపారాయణలతో ఊరేగింపుగా వెళతారు. వసంతమండపంలో "మృత్సంగ్రహణ (పుట్టమన్ను)" కార్యక్రమం జరుగుతుంది ముందుగా గుద్దలి, పార మున్నగు ఆయుధపూజ, పుట్టకుపూజ మున్నగు కార్యక్రమాలు వైదిక శాస్త్రోక్తంగా జరిగిన తర్వాత పుట్టమన్నును సేకరిస్తారు. తర్వాత

ఆ పుట్టమన్నుతో విష్వక్సేనుల వారి ఊరేగింపు ప్రదక్షిణంగా మహాప్రదక్షిణ మార్గంలో సాగి శ్రీవారి ఆలయంలో ప్రవేశించడంతో పూర్తవుతుంది. ఆ తర్వాత ఈ అంకురార్పణ మండపంలో వైఖానస ఆగమశాస్త్రోక్తంగా నవధాన్యాల బీజావాపం జరుగుతుంది. ఈ కార్యక్రమం జరిగిన తర్వాత బ్రహ్మోత్సవాలు జరిగే పదిరోజుల పాటు అనంత గరుడ విష్వక్సేనాదులు ఈ అంకురార్పణ మండపంలోనే కొలువై వుంటారు.

ఇలా బ్రహ్మోత్సవాలలో మాత్రమేగాక, సంవత్సరానికి ఒకసారి జ్యేష్ఠ మాసంలో మూడురోజులపాటు జరిగే జ్యేష్ఠాభిషేకానికి ముందు, శ్రావణ మాసంలో పౌర్ణమికి మూడురోజులపాటు జరిగే పవిత్రోత్సవాలకు అలాగే కార్తీక మాసంలో శ్రవణానక్షత్రం రోజున జరిగే శ్రీవారి పుష్పయాగోత్సవానికి ముందురోజు సేనమొదలియార్ అయిన విష్వక్సేనులవారి పర్యవేక్షణతో పైన వివరించిన విధంగా, మృత్సంగ్రహణ యాత్ర జరిగిన అనంతరం ఈ మండపంలోనే "అంకురార్పణ" కార్యక్రమం నిర్వహింపబడుతుంది. అందువల్లే ఇది "అంకురార్పణ మండపం"గా పేరొందింది.

ఇంకో విశేషం ఏమంటే బంగారు వాకిలి లోపల రాములవారి మేడలో వున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి నిత్యసూరులయిన అనంత, విష్వక్సేన, గరుడుల విగ్రహమూర్తులు, అలాగే శ్రీరాములవారి పరివార దేవతలయిన సుగ్రీవుడు, అంగదుడు, ఆజ్ఞాపాలక ఆంజనేయస్వామి విగ్రహమూర్తులు ప్రస్తుతం ఈ అంకురార్పణ మండపంలోనే భక్తుల దర్శనార్థం ఏర్పాటు చేశారు. కన్నులారా దర్శించండి! ఈ పరివారదేవతలను గూర్చి "రాముల వారిమేడ"వద్ద చర్చించుకున్నాం కూడా. అహరహం అప్రమత్తంగా శ్రీ వేంకటరమణుని సేవలో పాల్గొంటూ, శరణాగతి భక్తి ప్రపత్తులకు ప్రతీకగా నిలిచిన ఈ పరివార దేవతల సన్నిధిలో ప్రస్తుతం ఈ అంకురార్పణ మండపం వద్దనే శ్రీవారి అర్చకులు, యాత్రికులకు అందరికి శ్రీ స్వామివారి దర్శనానంతరం తీర్థాన్ని ఇస్తూవున్నారు. శ్రీవారి శఠారిని అనుగ్రహిస్తూ వున్నారు. మనంకూడ అర్చకస్వాములు అనుగ్రహిస్తూవున్న తీర్థ శఠారులను భక్తిగా వినయ వినమ్రంగా గోవిందనామస్మరణతో స్వీకరిద్దాం. అనండి మరి!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 48. యాగశాల

అంకురార్పణ మండపాన్ని ఆనుకొని పడమటివైపుగా వుండే ఈ గది శ్రీవారి 'యాగశాల'. అనగా యాగాలు, హోమాలు, నిర్వహింపబడే మండపం ఇది. ప్రతి నిత్యం శ్రీవారిఆలయంలో జరిగే వైదిక కార్యకలాపాలకు సంబంధించిన హోమాలు, యాగాలు ఈ మండపంలో నిర్వహింపబడుతూ వుంటాయి. కాని, ప్రస్తుతం ఒక్క బ్రహ్మోత్సవాల్లో మాత్రమే ఈ యాగశాలలో హోమాలు నిర్వహింపబడుతున్నాయి. మిగతాకార్యక్రమాల్లోఅంటే శ్రీస్వామివారికి జరుపబడే జ్యేష్ఠాభిషేకం, పవిత్రోత్సవం, పుష్పయాగం వంటి వార్షికోత్సవాల్లోను, ప్రతి సోమవారంనాడు ఉదయం జరిగే 'విశేషపూజ' సమయంలోను ఇక ప్రతిరోజు జరిగే నిత్యకల్యాణోత్సవ సమయంలోను, పై ఉత్సవాలు నిర్వహింపబడే సంపంగి ప్రదక్షిణంలోని కల్యాణమండపంలోనే హోమాలు, యాగాలు నిర్వహింపబడుతూవున్నాయి. ప్రతి బుధవారంఉదయంపూట బంగారువాకిలి వద్ద జరిగే సహస్ర కలశాభిషేకసమయంలో మాత్రం బంగారువాకిలి వద్దనే హోమవేదిక ఏర్పాటు చేయబడి యాగం నిర్వహింపబడుతున్నది.

"యజ్ఞో యజ్ఞ పతిర్యజ్వా
యజ్ఞాంగో యజ్ఞవాహనః
యజ్ఞ భృద్యజ్ఞ కృదజ్ఞీ
యజ్ఞ భుగ్యజ్ఞసాధనః
యజ్ఞాంతకృ ద్యజ్ఞ గుహ్యా
మన్న మన్నాద ఏవ చ."

అని విష్ణు సహస్రనామస్తోత్రంలో కీర్తింపబడిన శ్రీ మహావిష్ణువు ఒకానొకప్పుడు భృగుమహర్షి మున్నగువారు చేసిన యజ్ఞంవల్లే ఈ కలి యుగంలో భూలోక వైకుంఠమైన వేంకటాచల క్షేత్రంలో శ్రీవేంకటేశ్వర స్వామివారుగా అర్చామూర్తిగా అవతరించి ఆరాధింపబడుతూ వున్నారు. ఇక ఆ శ్రియఃపతి హృదయకమలవాసిని అయిన శ్రీ అలమేలుమంగ కూడ వేంకటాచల పర్వతసానువులలోనేగల నారాయణవరంలో, ఆకాశరాజుగారి యజ్ఞభూమిలో అవతరించింది. పిదప అక్కడ నుంచి ఆనందనిలయుని

చేరుకొంది! అప్పటినుంచి ఆ స్వామి శ్రీనివాసుడై భక్తులకు కోరికలెల్లతీరుస్తూ సిరులను గుప్పిస్తూవున్నాడు.

అందువల్లే తానే యజ్ఞమై, యజ్ఞపురుషుడై, యజ్ఞ ద్రవ్యమై, ఋత్విక్కుగా అయ్యి విరాజిల్లుతూ, అలాంటి యజ్ఞం ద్వారానే అవతరించిన ఆ శ్రీ వేంకటాచలపతి, ఆ అలమేలుమంగపతి, ఆ శ్రీనివాసుడు ప్రతిరోజు, సహస్రనామార్చనలో ఇలా

"ఓం యజ్ఞాయనమః
ఓం యజ్ఞ విభావనాయనమః
ఓం యజ్ఞీయోర్వీ సముద్ధర్త్రేనమః"

అని కీర్తింపబడుతూ వున్నాడు.

మరి శ్రీవారి ఆలయం ప్రాంగణంలోని ఈ యజ్ఞశాల వద్ద, శ్రీ పద్మావతీ శ్రీనివాసుల అవతార ఘట్టాల్ని స్ఫురణకు తెస్తూవున్న ఈ పవిత్రమైన యాగశాలకూ, ఇక్కడ అనాదిగా లోకకల్యాణానికై నిర్వహింపబడుతూ వున్న పవిత్ర యజ్ఞాలకూ, ఈ యజ్ఞాల నిర్వహణలో తానే కర్తా, కర్మా, క్రియగా ప్రకాశిస్తూ వున్న సాక్షాత్ యజ్ఞ స్వరూపుడు అయిన సప్తగిరీశునకూ భక్తిపూర్వక సాష్టాంగ దండ ప్రణామా లాచరిద్దాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 49. నాణేల పరకామణి

## (కల్యాణమండపం)

శ్రీవారి 'యాగశాల'కు తర్వాత ఆనుకొనివున్న విశాలమైన మండపమే కల్యాణ మండపం. ఇది రెండవ ప్రాకారానికి లోపలి వైపుగా అనుసంధించి నిర్మింపబడినది.

సుమారు 3 అడుగుల ఎత్తుగల రాతి అధిష్ఠానంపై 80 అడుగుల పొడవు, 36 అడుగులు వెడల్పు కొలతలతో వున్న ఈ కల్యాణమండపాన్ని క్రీ.శ. 1586 లో విజయనగరసామ్రాజ్య ప్రతినిధి అయిన చెన్నప్ప అనే అధికారి అంచెలంచెలుగా నిర్మించినాడని చరిత్ర చెబుతున్నది. అత్యంత మనోజ్ఞమైన శిల్పాలతో విరాజిల్లుతూ వున్న 29 నల్లరాతి స్తంభాలతో

నిర్మింపబడ్డ ఈ కల్యాణ మండపం విజయనగర నిర్మాణ శైలీ విన్యాసానికి మచ్చుతునకగా ప్రకాశిస్తూవుంది!

అంతేకాదు విజయనగరరాజుల త్యాగనిరతికీ, శ్రీవేంకటేశ్వరుని మీది భక్తి ప్రపత్తులకు ఈ కల్యాణమండపం ప్రధానతార్కాణగా నిలిచింది. తిలకించండి!

ఈ మండపంలోని స్తంభాలపై ఉగ్రనరసింహస్వామి, త్రివిక్రమ, హయ గ్రీవ, సహస్రబాహువైన సుదర్శనచక్రస్వామి మొదలైన శిల్పాలు సునిశితమైన వంపులతో సొంపులతో అతి మనోహరంగా మలచబడి సంపంగి ప్రదక్షిణంలోని తిరుమలరాయమండపాన్ని తలపిస్తూ వున్నాయి కదూ!

ఈ మండపంలోనే పడమటివైపు మధ్యలో చతురస్రాకారంతో ఒక అంద మైన చిన్నకల్యాణవేదిక దానికి తర్వాత 9 అడుగుల చతురస్ర మందిరం వున్నాయి చూడండి!

ఒకప్పుడు ఇంచుమించు ఏభై ఏళ్లకు పూర్వంవరకు శ్రీ వేంకటేశ్వర స్వామివారికి ప్రతిరోజూ జరిగే నిత్యకల్యాణోత్సవాలు ఈ మండపంలోనే జరుపబడేవి. నానాటికి పెరుగుతూవున్న యాత్రికుల రద్దీ దృష్ట్యా, శ్రీ స్వామివారి కల్యాణోత్సవాలు కొన్నాళ్లక్రితం వరకు రంగనాయకమండపంలో జరుపబడుతుండేవి. అక్కడా స్థలాభావంవల్ల ప్రస్తుతం సుమారు ఇరవై ఏళ్లనుండి సంపంగి ప్రదక్షిణంలో ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడిన "శ్రీ వెంకటరమణస్వామి కల్యాణమండపం"లో శ్రీస్వామివారి నిత్యకల్యాణోత్స వాలు నిర్వహింపబడుతూవున్నాయి.

పూర్వం బ్రహ్మోత్సవం జరిగే పదిరోజుల్లోకూడ శ్రీమలయప్పస్వామి ఉభయదేవేరులతో కూడ ఈ కల్యాణమండపంలోనికి తరలివచ్చి దీపావళి పండుగవరకు దాదాపు ఒకనెలరోజులపాటు ఇక్కడనే ఈ కల్యాణ మండ పంలోని చిన్నమందిరంలో కొలువై వుండేవారు. అలాగే ధనుర్మాసంలో జరిగే అధ్యయనోత్సవంలో కూడ 25 రోజులపాటు ఈ మండపంలోనే శ్రీ స్వామివారి ఆస్థానం జరిగేది. ఆ సమయాల్లో ఈ కల్యాణమండపంలోని చిన్నమందిరం లోపల ఉత్సవమూర్తులను భద్రపరచేవారు.

ప్రస్తుతం ఈ కల్యాణమండపంలో ప్రతిరోజు ఉదయం 6 గంటలనుండి సాయంత్రం 6 గంటలవరకు 'నాణేల పరకామణి' జరుపబడుతున్నది.

భక్తులు, యాత్రికులు శ్రీనివాసునికి మొక్కులుగా, కానుకలుగా శ్రీవారి హుండీలో చెల్లించుకొన్న కాసులను, అనగా వివిధ చిల్లర నాణేలను వేరుపరచి విడి విడిగా లెక్కించే కార్యక్రమాన్నే 'నాణేల పరకామణి' అంటారు. ఈ పవిత్ర కార్యక్రమాన్ని భక్తులు చూడడానికి వీలుగా చుట్టూ ఇనుప జల్లెడలను ఏర్పాటు చేశారు చూడండి. ఆసక్తిగా తిలకించండి మరి!

అదిగో ఇటువైపు పావలాలు! అటువైపు అర్థరూపాయబిళ్లలు! ఈ మూలకు రూపాయి నాణేలు! అటు ఆ వైపుగా చూడండి! ఎంత ప్రాచీనమైన నాణేలో! కాసులు! రాగి దమ్మిడీలు! బొట్టులు (కానులు)! అర్ధణాలు! అణాలు! బేడలు! ఇప్పుడు అమలులో వుండేవి, చెలామణిలోలేని ప్రాచీన నాణాలు కూడ మనకు దర్శనమిస్తున్నాయి చూడండి!

సర్వేసర్వత్రా వ్యాపించివున్న శ్రీ మహాలక్ష్మిదేవి యొక్క మరో రూపా విలాసమే ఈ నాణేల లీలావిలాసం! ఇంత పెద్దెత్తున ఇక్కడ తప్ప మరోచోట కానగలేని కానగరాని అద్భుత లక్ష్మి విలాసమే ఈ నాణేలపరకామణి!

ఈ నాణేలన్నిటిని ఏ భక్తులు స్వామివారికి సమర్పించారో ఎందుకు సమర్పించారో, ఎవరెవరు ఎంతెంత సమర్పించారో, ఇందులో అస్సలు ఎంతో! ఆ పైన వడ్డీ ఎంతో! ఎవరికెరుక! తెలిస్తే ఆ అసలు వడ్డీల లెక్కలు తెలిసిన ఏడుకొండలమీది వడ్డికాసులవాడికే తెలియాల! కాసులద్వారా కష్టాల్ని పోగొట్టే ఆ వడ్డికాసులవాడికి మాత్రమే తెలియాల! వడ్డీకి వడ్డీని గుంజుతూ గుప్పిళ్లతో వరాలను వడ్డించే వడ్డికాసులవానికి ఒక్కనికిమాత్రమే తెలియాల!

మరి ఈ సమయంలో మనం కేవలం కాసులతోనే కష్టాలనుండి కాపాడే భక్తప్రియుడైన వడ్డికాసులవాణ్ణే ఒక్కసారి ఎలుగెత్తి కీర్తించుదాం అనండి మరి.

*వడ్డికాసులవాడా! వేంకటరమణా!!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

ప్రతి శుక్రవారంనాడు తెల్లవారుజామున నాలుగుగంటల సమయంలో శ్రీస్వామివారి మూలవిరాణ్మూర్తి అభిషేకానికిగాను, పట్టువస్త్రాలతోను, పూరాభిషేకం, గంబూరా గిన్నెలు, పునుగు గిన్నెలతో ఆలయ అధికారులు,

జియ్యంగారులు, ఏకాంగులు, భక్తులు ఈ కల్యాణమండపం వద్దనుంచే ఛత్ర చామర మంగళవాద్య పురస్సరంగా బయలుదేరి విమాన ప్రదక్షిణం చేస్తూ వెండివాకిలి బయట వున్న ధ్వజస్తంభ ప్రదక్షిణం చేసి మళ్లీ శ్రీవారి సన్నిధికి వెళ్లటం జరుగుతున్నది.

ఇలా ప్రాచీనకాలంనుంచి, శ్రీవారి కల్యాణోత్సవాలకు, బ్రహ్మోత్సవాలకు, ప్రస్తుతం, నాణేలపరకామణికి, శుక్రవారాభిషేకభక్తులకు ఉపయోగ పడుతూ, ఒకప్పటి విజయనగరచక్రవర్తుల భక్తి ప్రపత్తులకు తార్కాణగా నిలిచిన ఈ కల్యాణ మండపంవద్ద శ్రీనివాసునకు మరొక్కసారి జేజేలు పలుకుదాం.

*జయ జయ గోవిందా!*
*జయహో గోవింద!!*
*జయ జయహో గోవిందా!!!*

# 50. నోట్ల పరకామణి

ఈ విమాన ప్రదక్షిణమార్గంలోనే పడమటిదిక్కులో అంటే ఆనంద నిలయ విమానమునకు సరిగ్గా వెనుకగా వున్న సుమారు 153 అడుగుల పొడవున్న మండపాన్ని చూడండి! ఈ మండపంలోనే ప్రస్తుతం "నోట్లపరకామణి" జరుగుతున్నది చూడండి.

ఉత్తర దక్షిణాలుగా వ్యాపించివున్న ఈ పొడవైన మండపం 50 ఏళ్లకు పూర్వం అనేక విధాలుగా ఉపయోగ పడుతుండేది. శ్రీ వేంకటేశ్వర స్వామివారికి ఉపయోగించే దంతపుపల్లకి, గజవాహనం, గరుడుడు, శేషుడు మున్నగు వాహనాలు ఈ మండపంలో భద్రపరచేవారు. శ్రీ స్వామివారి మూలవిరాణ్మూర్తికి ఉపయోగించే పునుగుతైలం కూడ ఈ మండపంలోని ఒక అరలో తయారు చేయబడేది. ఇక్కడ ఇంకొక అరలో శ్రీవారికి నివేదన అయిన ప్రసాదాలు భక్తులకు వితరణ చేయబడేవి. ఇలా చాల ప్రాచీన కాలం నుంచే పశ్చిమ దిక్కునవున్న విమానప్రదక్షిణ మార్గంలోని ఈ మండపాలు ఉపయోగపడుతున్నట్లు తాళ్లపాక అన్నమాచార్యులు చరిత్ర కూడ తెలియజేస్తున్నది.

"మరుగురు కల్యాణ మంటపంబునకు
గరములు మొగిచి వెంగట తేజికెఱిగి
బంగారుగరుడని భజియించి, వెంత
సింగారమై యున్న శేషుని గొలిచి
వాసన నలుదెసల్ వలగొన రాశి
పోసియుండెడు గోన పునుగుచుట్టలను
గట్టి బంగారు సలాకల గుచ్చి కాచి
తట్టుపునుంగు లత్తఱి నొత్తువిధము...ను

అన్నమయ్య దర్శించినట్లు స్పష్టమగుచున్నది.

కాని దినదినానికి పెరుగుతున్న శ్రీ వేంకటేశ్వరుని భక్తుల సంఖ్య దృష్ట్యా కాలాంతరంలో చాలా చాల మార్పులు, కొన్ని స్థలాల మార్పులు, కొన్ని వేళల మార్పులు ఎన్నో ఎన్నెన్నో జరిగాయి. అలా కాలక్రమేణ మార్పులు చోటుచేసుకొని ప్రస్తుతం విమాన ప్రదక్షిణంలోని ఈ పొడవైన మండపంలో "నోట్ల పరకామణి" కార్యక్రమం జరుప బడుతూ వుంది.

భక్తులు ఎన్నో ఏళ్లుగా దీక్షను స్వీకరించి, మొక్కులు మొక్కుకొని అత్యంత భక్తి శ్రద్ధలతో యాత్రలుచేసి, తిరుమలస్వామివారికి తమ మొక్కుబళ్లను హుండీద్వారా సమర్పించుకుంటారు. అలా హుండీ ద్వారా సమర్పించుకున్న మొక్కులను, కానుకలను గట్టి బందోబస్తుతో ఈ మండపంలో విడదీసి నగలను, నాణేలను, నోట్లను వేరు వేరుగా విడమరచి వివరంగా వాటి వాటి విలువలను లెక్కిస్తారు.

చాల పూర్వం క్రిందట కాసులు, దమ్మిడీలు, పాతికా, పరకా ఇలా నాణేలు చలామణీలో వుండేవి. భక్తులు కలగాపులగంగా సమర్పించిన అనేక విధాలైన కానుక మొక్కులను పాతికా, పరకా ఇలా విడమరచి చేసే కార్యాన్ని, ఆపని జరిగే స్థలాన్ని కలిపి "పరకామణి" అంటారు. 'మణి' అనగా మండపం అని అర్థం. అనగా వడ్డీకాసులవానికి భక్తిగా భక్తులు అనేక విధాలుగా సమర్పించుకొన్న ధనాన్ని విడమరిచి లెక్కించే కార్యక్రమం స్థలంతోపాటు 'పరకామణి' అన్నరూపంలో రూఢి అయ్యింది.

ప్రస్తుతం నోట్ల పరకామణిగా అమలులో వున్న ఈ మండపంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారిని నిరంతరం చేరుతూవున్న శ్రీ మహాలక్ష్మి

స్వరూపమైన ఈ హుండీ కానుకలను, వాటిని అత్యంత దీక్షతో భక్తి శ్రద్ధలతో వింగడిస్తూ వున్న ఉద్యోగుల సేవానిరతిని దర్శించండి!

ఈ 'పరకామణి' కార్యక్రమాన్ని భక్తులందరూ చూడటానికి వీలుగా నిదువైన అద్దాలు ఏర్పాటు చేశారు చూడండి. ఈ అద్దాల లోంచి ఆ కార్యక్రమాన్ని చక్కగా తిలకించండి!

అటు ఆ వైపు చూశారా! ఆ ఉద్యోగి కేవలం బంగారాన్ని మాత్రం పోగుచేస్తున్నాడు. ఆ బంగారపురాశిలో ఆహాహా! ఎన్ని తాళిబొట్లు, ఎన్ని కమ్మలు... ఉంగరాలు, గాజులు, కంఠహారాలు, వడ్డాణాలు, ముక్కుపుటకలు కడియాలు....కంకణాలు..

ఇటు ఈ వారకు చూడండి! అబ్బో వెండిగిన్నెలు...వెండిగొలుసులు.. వెండి ఉయ్యాలలు వెండి బొమ్మలు, వెండికన్నులు, వెండి కాళ్లు, వెండిచేతులు ఇటు చూడండి! వెండి ఇంటి నమూనా!

అటు ఆ మూలకు 'నాణేలరాశిని' చూడండి! అబ్బ ఎంత పెద్ద డబ్బులరాశో... ఆ రాశిలో ఐదు పైసల బిళ్లలు, పదిపైసలు, పావలా, అర్ధరూపాయలు, రూపాయలు, రెండురూపాయల, ఐదురూపాయల, పది రూపాయల నాణేలు కలగాపులగంగా వున్నాయి. ఏమి అద్భుతం! ఏమి పరమాద్భుతం!

మన ఇంట్లో ఇంత ధాన్యపురాశి కూడ వుండదే! అంతడబ్బులరాశి! అంతేకాకుండ మరో విచిత్రం చూడండి. ఈ డబ్బుల రాశిలో ఎప్పుడో చలామణిలో అమలులో వున్న బంగారు రూపాయలు, వెండిరూపాయలు, రాగి దమ్మిడీలు, కానులు, అర్ధాణాలు, బేడలు, ఇలా ఎన్నో ఆర్థిక విలువలు కలిగినవి మాత్రమే గాక, చారిత్రక విలువలు కలిగినవి అందులో చేరి వున్నాయి. ఈ 'ధనరాశిని' (నాణేలరాశిని) ప్రత్యేకంగా 'నాణేలపరకా మణి'కి పంపిస్తారు. అక్కడ ఈ నాణేలరాశిని లెక్కగడ్తారు. ఇంతకుముందే మనం "నాణేల పరకామణిని"ని చూచివచ్చాం కదా.

ఇటు చూడండి కేవలం నోట్లు... రూపాయి, రెండురూపాయల నోట్లు, ఐదురూపాయలు, పదిరూపాయలు, ఇరవై, ఏభై, వంద, ఐదువందల నోట్లు మాత్రమేనా! కాదు కాదు ఇతర దేశాలలో అమలులోవున్న నోట్లు కూడ

వున్నాయి చూడండి. అవిగో అమెరికా డాలర్లూ, బ్రిటన్ దేశపు పౌండ్లు. ఇవన్నీ ఆయాదేశాల్లో వున్న భారతీయులు స్వామివారికి సమర్పించుకున్నవే! వాటిని విడి విడిగా వేటికవి విడమరచి లెక్కకట్టబడుతున్నాయి చూడండి.

ఇక్కడ చూడండి కర్పూరం పాకెట్లు, సిగరెట్లు, చాకలేట్లు, లాటరీ టికెట్లు, అద్దాలు, దువ్వెనలు, స్నోలు, పౌడర్లు, సెంటు సీసాలు, సబ్బులు, మందులు, వస్త్రాలు, చీరలు, కలకండ, బియ్యం, వడ్లు, ఇలా ఎన్నో ఎన్నెన్నో మరెన్నో వస్తువులు అత్యంత భక్తి ప్రపత్తులలో మొక్కులుగా ఏడుకొండల స్వామికి సమర్పించుకున్నవే.

ఈ పరకామణిని చూస్తుంటే మీకు ఏమని అనిపిస్తున్నది? ఏదో అద్భుత లోకంలో, శ్రీ వైకుంఠంలో విహరిస్తున్నట్లు వుంది కదూ! ఎంత సంపద, ఏమి వైభవం ఎంతెంతవైభవం!

'పుర్రెకో బుద్ధి, జిహ్వాకో రుచి' అన్నట్లు ఎన్నెన్ని పుర్రెలున్నా వాటి ఆలోచనలు మరెన్నెన్ని వున్నా, ఆ ఆలోచనలకు తగ్గట్టు ఎన్నెన్నో అభిరుచులున్నా, ఆ అన్నింటి ఆలోచనలకు, అభిరుచులకూ అనువైన దేవుడు తిరుమల వెంకన్న! తిరుమల స్వామివారు తమ భక్తుల ఆచార వ్యవహారాలు వేర్వేరు అయినా, వారి భాషలు ఒక్కటి కాకపోయినా, వారు మొక్కులను వింత వింతలుగా చెల్లించినా వాటినన్నింటిని స్వీకరించి, వారు కోరిన కోరికలను తీరుస్తూవుంటారు. ఒక్క మానవమాత్రులేకాదు. ముక్కోటిదేవతలు సైతం కలియుగ వైకుంఠనాథుని దర్శనానికి వస్తారు. మొక్కులు చెల్లిస్తారు. ఇలా అందరి మొక్కుబళ్లను అత్యంత ఆనందంతో స్వీకరిస్తుంటారు. అసలు మొక్కుబళ్ల మిషతోనే భక్తులను తన దగ్గరికి రప్పించుకుంటాడు. అందుకే తిరుమలస్వామి మొక్కుబళ్ల దేవుడిగా ఆపదమొక్కులవానిగా ప్రసిద్ధి కెక్కినాడు. ఇలా తమకు తీరిన కోరికలకు కృతజ్ఞతగా, ఉడుతాభక్తిగా నానావిధమైన భక్తులందరూ అలా సమర్పించుకొన్న మొక్కుబళ్లే, కానుకలే ముడుపులే ఈ అద్భుత వస్తురాశి!

ఈ వస్తురాశిని అంతా, దేవస్థానం ఉద్యోగులు ప్రతిరోజు 2,3 దఫాలు (బ్యాచిలు)గా వచ్చి వేరుచేసి లెక్కిస్తుంటారు. ఒక దఫాలో వచ్చిన ఉద్యోగులు మరొక దఫాలో రారు. వీరంతా అత్యంత జాగ్రత్తతో వీటిని

లెక్కిస్తుంటారు. లెక్కించే ఉద్యోగులు తమసొంత గడియారాలు, బంగారు గొలుసులు వంటి తమ వస్తువులను ధరించకుండా కేవలం కట్టుకున్నవస్త్రా లతో మాత్రమే ఈ 'పరకామణి' మండపంలోనికి అప్రమత్తంగా ప్రవేశించి తమవిధి నిర్వహణ చేస్తారు. వీరు లెక్కించే సమయంలో వివిధ హోదాల్లో ఉద్యోగ బాధ్యతలుగలవారు పర్యవేక్షిస్తుంటారు. ఇంతమాత్రమేకాక 'నిఘా శాఖ' వారుకూడ పరిశీలిస్తుంటారు. ఇదిగాక వీరందరి చర్యలపై 'విడియో' కేంద్రీకరింపబడి రికార్డు చేయబడుతుంటుంది. ఇంతేగాక ఈ పరకామణి కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తూ ప్రారంభంనుండి చివరివరకు ఇద్దరు యాత్రికులు సాక్షిగా వుంటారు. శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శనంచేసుకొని విమాన ప్రదక్షిణంలో సరిగా ఆ సమయంలో అటుగా వెళ్తున్న యాత్రికులను ఇద్దరిని ఎవరినైనా సరే దేవస్థానం అధికారులు "పరకామణి" కార్యక్రమానికి సాక్షిగా పిలవడం జరుగుతుంది. తద్వారా ప్రతిరోజు ప్రతిదఫాలో ఇరువురి భక్తులకు సాక్షిగా వుంటూ "పరకామణి" కార్యక్రమాన్ని వీక్షించే భాగ్యం కలుగుతుంది. ఈ కార్యక్రమం పూర్తి అయిన తర్వాత 'పరకామణి' లెక్కింపుకార్యక్రమం సజావుగా జరిగినట్లుగా ఆ యాత్రికులిద్దరు సాక్షి సంతకాలు చేస్తారు. పిదప ఆ యాత్రికులకు ఇద్దరికీ మళ్లీ ప్రత్యేకంగా శ్రీ స్వామివారి దర్శనం చేయించి శ్రీవారి ప్రసాదం కూడ ఇస్తారు. ఇలా కట్టుదిట్టమైన భద్రతల మధ్య ప్రతిరోజు 'పరకామణి'లో సాయంత్రానికంతా లెక్కకట్టి నికరాదాయం నిగ్గు దేల్చబడుతుంది.

ఏ భక్తురాలికి పసుపు కుంకుమలు నిలిపినాడో ఆ ఏడుకొండవాడు. అందుకు ప్రతిగా ఏ భక్తురాలో తన తాళినే సమర్పించింది!

ఏ భక్తురాలికి చిక్కులనన్నింటిని తొలగించాడో తిరుమలేశుడు! అందుకు కృతజ్ఞతగా ఏ భక్తురాలు నిలువుదోపిడి ఒలిచి పెట్టిందో! ఏ ఆర్తురాలి కడుపు పండించాడో ఆనంద నిలయుడు! అందుకు ఉడుతా భక్తిగా వెండి ఊయల సమర్పించింది!

ఏ దుర్వ్యసనాన్ని బాపాడో అడుగడుగు దండాలవాడు! అందుకే వాటిని విసర్జిస్తు ఏ భక్తులు సమర్పించారో లాటరీ టికెట్లు, సిగరెట్లు, మత్తుమందులు!

ఏ రోగాల్ని మటు మాయంచేశాడో ఆ అద్భుతవైద్యుడు వేంకటేశుడు. అందువల్లే ఏ భక్తులు అసలుతోపాటు వడ్డీలు సమర్పించారో! ఏ భక్తునికి స్వగృహవసతిని కల్పించాడో! అందువల్లే ఆ భక్తుడు సమర్పించుకొన్న చిన్న వెండి ఇంటినమూనా!

ఇవన్నీ చూస్తుంటే ఈ 'పరకామణి' కార్యక్రమం భక్తుల త్యాగాన్నీ, కొండలరాయని కొండంత భక్త ప్రియత్వాన్నీ, అనంత ఆశ్రిత రక్షకత్వాన్ని కోటి విధాలుగా చాటుతున్నట్లుగా వుంది కదూ!

అందుకే ఏడుకొండలవాడు, అడుగడుగు దండాలవాడు అయిన శ్రీ వేంకటేశ్వరుడు కో! అని పిలిస్తే ఓ! పలికే ప్రత్యక్ష దైవం! అందువల్లే ఆనందనిలయుడు కొందరికి పెళ్లి చేయించిన నిత్యకల్యాణ ప్రదాత! కొందరికి సంతాన ప్రదాత! మరికొందరికి గృహదాత!..... ఇంకొందరికి రోగాల్ని బాపిన అద్భుతవైద్యుడు! కొందరికి కల్యాణపరంపరలు గుప్పించే నిత్య కల్యాణోత్సవమూర్తి! ..... ఉద్యోగ ప్రదాత. ఆదుకొన్నదైవం, కోరికలు తీర్చే వరాలరాయుడు. ఇలా ఎన్నెన్నో....

ఇదిగో! శ్రీస్వామివారి అనంత ఆశ్రిత వాత్సల్యాన్ని, అనుగ్రహాన్ని తెలియజేసే ఈ పరకామణిమండపంవద్ద, భక్తితో భక్తులు సమర్పించిన కానుకపెట్టుకొన్న సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి స్వరూపమైన ఈ వస్తురాశికి భక్తితో నమస్కరించి, స్మరించి, కన్నులారా తిలకిస్తూ ఎలుగెత్తి కీర్తింమదాం.

*శ్రీలక్ష్మీ వేంకటరమణ గోవిందా!*
*శ్రీమద్రమారమణ గోవిందా!*
*ఆపదమొక్కులవాడా గోవిందా! గోవింద!!*

## 51. చందనపు అర

విమాన ప్రదక్షిణ మార్గంలోనే 'నోట్ల పరకామణి' జరిగే సుదీర్ఘమగు మండపానికి ఉత్తరం దిక్కున అనుకొని వాయువ్య మూలకు ఒక గది ఇనుపకడ్డీలవాకిళ్లతో తూర్పుముఖంగా కనుపిస్తున్నది చూడండి! దీనినే "చందనపు అర" అంటారు.

ఈ అరలో ప్రతినిత్యం శ్రీస్వామివారి ఆలయానికి అవసరమయ్యే చందనం తయారు చేయబడుతుంది. ఇక్కడ ఈ గదిలో గంధం తీయ

డానికి అనువుగా వుండే ఎత్తైన సానరాళ్లు ఏర్పాటు చేయబడివున్నాయి చూడండి. పెద్దతిరుగలిరాళ్ల మాదిరిగా వున్న ఈ సానరాళ్లమీద గంధం చెక్కలను చక్కగా అతి వడిగా అరగదీస్తూ మెత్తని చందనలేపనాన్ని తయారుచేస్తారు. ఇలా చందనాన్ని తయారుచేసే పరిచారకులను 'చందనపాణి' అంటారు. దీనితో పాటు ఈ చందనపుఅరలో మెత్తని 'పసుపు ముద్దలు' కూడ చేయబడతవి.

చందనపాణి తయారుచేసిన మృదువైన సురభిళ చందనాన్ని, పసుపు ముద్దలను ప్రతిరోజు రంగనాయకమండపంలో జరిగే ఆర్జిత వసంతోత్సవంలో శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్ప స్వామివారికి స్నపన తిరుమంజనంలో ఉపయోగిస్తారు.

అంతేగాక ప్రతిరోజు రాత్రి ఏకాంత సేవా సమయంలొ ఈ చందనపు అరలో తయారు చేయబడిన రెండు చందనపుముద్దలలో, ఒక ముద్దను శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తి దివ్యపాదద్వయంపైనా, సగం ముద్దను శయనమండపంలో బంగారుమంచంపై పవ్వళించివున్న భోగశ్రీనివాసమూర్తి వక్షఃస్థలంపైనా, $\frac{1}{4}$ వంతు ముద్దను శ్రీవారి మూలమూర్తి వక్షఃస్థలంపై వున్న శ్రీమహాలక్ష్మి అమ్మవారికీ, మిగిలిన $\frac{1}{4}$ భాగం చందనపు ముద్దను ఏకాంతసేవానంతరం రాత్రి బ్రహ్మాది దేవతలు వచ్చి శ్రీ స్వామివారిని అర్చించుటకు గాను మూలమూర్తిముందర ఒక బంగారుపళ్లెంలో ఉంచుతారు. అలాగే ఒక బంగారు గిన్నెలో తీర్థాన్ని కూడా ఉంచుతారు. మరునాడు తెల్లవారుజామున సుప్రభాతానంతరం భక్తులకు ఈ చందనం కొద్ది కొద్దిగాను, పిదప తీర్థం బ్రహ్మతీర్థంగా ఇవ్వబడుతుంది.

ఇక ప్రతి శుక్రవారం తెల్లవారు జామున శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూల విరాణ్మూర్తికి జరిగే శుక్రవారాభిషేకంలో కూడ ఈ చందనపు అరలో తయారు చేయబడిన చందనాన్ని పచ్చకర్పూరం, కుంకుమపువ్వుతో కలిపి 'పరిమళం' తయారు చేయబడుతుంది. ఈ పరిమళ మిశ్రమం తోనే ఆనందనిలయంలోని శ్రీ స్వామివారిమూలమూర్తికి శిరసాదిగా, పాదాలవరకు నలుగుపెడతారు. దీన్నే 'ఉద్వర్తనం' అంటారు. ఈ చందన మిశ్రమాన్నే 'పులికాపు' అని కూడ అంటారు.

ఈ చందనపుఅరలో తయారు చేయబడిన చందనం, పసుపు ముద్దలను, ప్రతిసోమవారం ఉదయంపూట ఉభయదేవేరులతో శ్రీ మలయప్పస్వామి వారికి జరిగే 'విశేషపూజ'లోను, ప్రతిబుధవారం శ్రీ భోగశ్రీనివాసమూర్తికి, శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్పస్వామివారికి శ్రీవిష్వక్సేనులవారికి జరిగే సహస్రకలశాభిషేకంలో ఉపయోగిస్తారు.

ఇదిగాక ప్రతి చైత్రమాసంలో వసంతోత్సవ మండపంలో జరిగే వసంతోత్సవంలో శ్రీదేవి భూదేవులతో కూడిన శ్రీ మలయప్ప స్వామివారికి, శ్రీ సీతారామలక్ష్మణులకు, శ్రీ రుక్మిణీ శ్రీ కృష్ణులకు చందనపు పసుపు ముద్దలు ఉపయోగిస్తారు.

అంతేగాక ప్రతి సంవత్సరం జేష్ఠమాస పౌర్ణమికి మూడురోజులపాటు తిరుమలలో శ్రీ మలయప్పస్వామివారికి జరిగే 'అభిద్యేక అభిషేకం' అనబడే జ్యేష్ఠాభిషేకంలోను, ప్రతి శ్రావణమాసం పౌర్ణమికి మూడురోజుల పాటు జరిగే పవిత్రోత్సవాలలోను, బ్రహ్మోత్సవాల్లో జరిగే స్నపన తిరుమంజనాదులలోను, బ్రహ్మోత్సవానంతరం ప్రతి కార్తీకమాసం శ్రవణ నక్షత్రానికి జరిగే శ్రీవారి పుష్పయాగంలోను జరిగే స్నపన తిరుమంజనాదుల్లోను, అభిషేకాల్లోను, సుగంధ పూరితమైన శ్రీ చందానాన్నిపసుపును ఉపయోగిస్తారు.

ఇలా ఏడాది పొడవునా శ్రీవారి ఆలయంలో జరిగే స్నపన తిరుమంజనాదుల్లోను, ఉత్సవాల్లోను ఈ చందనపుఅరలో అరగదీసిన శ్రీగంధాన్ని, పసుపును ఉపయోగిస్తారు.

ఇలా నిత్యమూ, శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవల్లో, ఉత్సవాల్లో పాలుపంచుకొనే ఈ చందనపు అరకు భక్తితో నమస్కరించి ముందుకు సాగుదాం.

*చందన చర్చిత గోవిందా! గోవిందా!*
*నీలవర్ణా గోవిందా! గోవింద!!*
*పీతవసనా గోవిందా!! గోవింద!!!*

# 52. ఆనందనిలయ విమానం

అదిగో ! చూడండి. అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుని బంగారుమేడ! విమాన ప్రదక్షిణమార్గంలో ఏ మూలనుంచైనా చాలదగ్గరగా చక్కగా కనపడుతూ, చూచిన వెంటనే సంతోషాన్ని కలిగించే సప్తగిరీశుని స్వర్ణమయ గోపురం! అదే! అందరినీ ఆనంద సముద్రంలో ఓలలాడించే ఆనందనిలయ విమానం!

విమాన ప్రదక్షిణమార్గంలో పడమటి దిక్కున వున్న మనం ఉత్తరంవైపు మళ్లిన వెంటనే "విమానవేంకటేశ్వరస్వామి దర్శనం" అనే ఫలకం (బోర్డు) కనపడుతుంది చూశారా! అక్కడవున్న వేదిక మీద నిలవబడి ఆనంద నిలయ విమానాన్ని, ఆ విమానంమీద వేంచేసివున్న వేంకటేశ్వరస్వామిని నేత్రానందంగా దర్శించండి!

తలలను పైకెత్తి, రెండుచేతులను జోడించి నమస్కరిస్తూ, దివ్య కాంతులను వెలారుస్తూ చూపరులకు వింత వింత దివ్యానుభవాలను పంచుతూవున్న ఆనందనిలయవిమాన గోపురప్రభలను తిలకించండి!

కలియుగవరదునిగా, ఆర్తులపాలిటి ప్రత్యక్ష దైవంగా భూలోక వైకుంఠ మయిన తిరుమల క్షేత్రంలో వెలసిన స్వామి శ్రీవేంకటేశ్వరుడు. వక్షఃస్థలం మీద శ్రీమహాలక్ష్మి విరాజిల్లుతూవుండగా శ్రీనివాసుడన్న ప్రసిద్ధ నామంతో స్వయంవ్యక్తమూర్తియై అర్చనలందుకొంటూ నిలిచివున్న దివ్యస్థలమే ఆనంద నిలయం. అందువల్లే ఘనవేంకటపతికి ఆనందనిలయుడనే మరోపేరు కలి గింది. గర్భాలయమైన ఆ ఆనందనిలయం మీద కోటిభాను సదృశమైన బంగారుశిఖరం నిర్మింపబడింది. ఆ బంగారు గోపురమే, ఆ బంగారుశిఖ రమే "ఆనందనిలయవిమానం" అని పిలువబడుతూవుంది. ఇక్కడ మనకు కనిపించే బంగారుగోపురమే "విమానం" అనే పేరుతో ప్రసిద్ధి పొందింది.

ఈ బంగారు గోపురం మహిమా, గొప్పదనం ఇంతింత అని వివరించి చెప్పటానికి వీలు లేనిది, వీలు కానిది. అందువల్లే ఇది విమానం. 'మానం' అంటే కొలత అని అర్థం. అంటే కొలవడానికి సాధ్యంకానిది విమానం. అంతేగాక ఆకాశంలో ఎగురుతూవున్న ఇతర దివ్యవిమానాలవలె ఈఆనంద నిలయ దివ్యవిమానం కూడ ఇక్కడినుంచి శ్రీవైకుంఠానికి, మళ్లీ అక్కడి



బంగారు వాకిలి



ఆనందనిలయ విమానం

నుంచి ఈ భూలోకవైకుంఠానికి ఎగురుతూ వెళ్లేది గనుక ఇది కూడా విమానం అని ప్రసిద్ధిని పొందింది.

శ్రీ వేంకటాచలయాత్రను సంకల్పించడమే ఒక ఆనందం! ఇక, యాత్రికులు, భక్తులు ఎన్నో వ్యయప్రయాసలను ఓర్చుకొంటూ ఏడుకొండలను ఎక్కి, సంకటహరణుడైన శ్రీవేంకటమరణుని దర్శించిన తర్వాత కలిగే అవ్యక్తమైన దివ్యానుభూతుల పరాకాష్ఠే పరమానందం! ఆ స్వామివారి దర్శనం సర్వపాపహరం! సర్వకలిదోషనాశనం! సర్వసంకటనాశనం. అంతే కాదు సర్వార్థసిద్ధిప్రదం కూడా. ఇలా అదీ..ఇదీ.. అనకుండా భక్తులు కోరినవన్నీ సంపూర్తిగా అనుగ్రహించడమేగాక, చివరకు శాశ్వతమైన ఆనందం కూడ ప్రసాదింపబడుతుంది, అనే ప్రధాన సందేశాన్ని చాటుతూ, ఎత్తైన సప్తగిరి శిఖరాలమీద నెలకొని బ్రహ్మాండభాండాలలో అంతటా ఆధ్యాత్మిక స్వర్ణమయ కాంతులను విరజిమ్ముతూ వున్న దివ్యతేజో కేంద్రమే అసమానమయిన ఈ ఆనందనిలయ విమానం!

అందుకే శ్రీవేంకటేశ్వరుని నందకాంశ సంభూతుడు పరమభక్తుడు, పదకవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు "ఆనందనిలయ విమాన" దర్శనాన్ని ఎలా ప్రస్తుతించాడో చూడండి!

*ఇంచుకైన వేంకటేశు గిరిశిఖరము*
*కాంచుటే కలుగవలె గాకా*
*అంచితంబైన నిత్యానంద పదవులును*
*మించి తమ ఎదుట ప్రభవించినవె కావా*

అని ఆ బంగారుగోపుర దర్శనంతో అన్నీ సిద్ధిస్తాయనీ అంటూ, అన్నమయ్య ఇంకా

*కోరినవారికి కోరినవరముల*
*నూరంత ప్రొద్దుల నొసగుచు*
*చేరువయ్యె కృపచేసె నిదివో*
*కూరిమి నా నడిమి 'గోపురమేడ'*

తిరుమల శిఖరాలలో నట్టనడుమ ప్రకాశించే "గోపురమేడ" అదే "బ్రహ్మాండనాయకుని బంగారుమేడ" దర్శనం, కోరినవరాల నన్నింటిని

ప్రసాదిస్తుందని ఖండితంగా చెప్తున్నాడు అన్నమాచార్యులు. ఎంతైనా ఆయన సాక్షాత్తు నందకఖడ్గం యొక్క అవతారం కదా. మరోచోట ఆనందనిలయవిమానం వేంచేసి వున్న దివ్యస్థలం బ్రహ్మాది దేవతలకు అపురూపమైనదనీ, అఖిల మునులచేత నిత్యమూ ఉపాసించబడుతున్నదనీ, నింగినున్న దేవతలకు అది నిజనివాసమై ప్రకాశిస్తున్నదనీ, భావించినవారికి సకల సంపదలను ప్రసాదించే దివ్యధామమనీ, పావనములకెల్ల పావనమనీ కొనియాడుతూ "అదె చూడు డదెమొక్కు డానందమయము" అనీ, ఆ శిఖరాలు సాక్షాత్తు, భగవానుని స్వరూపమే నంటూ "బంగారు శిఖరాల బ్రహ్మబ్రహ్మామయమును" సేవించవలసిందని అంటూ భక్తులను ప్రేరేపించి అందరినీ అనుభవింపజేసినాడు అన్నమయ్య.

అనంతమహిమాన్వితమైన ఈ ఆనందనిలయ విమానాన్ని మొదట శ్రీమహా విష్ణువు ఆదేశంపై గరుత్మంతుడు శ్రీ వైకుంఠంనుండి తీసుకొని వచ్చి ఈ భూలోకంలో పవిత్రమైన వేంకటాచల క్షేత్రంలో ప్రతిష్ఠించి నాడట!

విమానం కారయామాస రత్నచిత్రం మహోన్నతమ్
చతుర్మూర్తి సమోపేతం వైనతేయ విభూషితమ్

శ్రీవైకుంఠంనుంచి సాక్షాత్తుగా గరుత్మంతునిచే కొనిరాబడిన అప్పటి ఆనందనిలయం సామాన్యులయినవారికి గోచరించదట! కేవలం పరమభక్తు లయిన యోగులకు, నిష్కాములయిన ఉపాసకులకు, దేవతలకు మాత్రమే గోచరిస్తుందని తరిగొండవెంగమాంబ ఇలా పేర్కొంది.

వైకుంఠమున నుండి వచ్చియున్న విమాన
మెక్కువగా వారికొక్కవేళ
దగఁజూపు, నప్పుడంతర్ధాన మొందించు,
ఆనందనిలయంబునందు నిలిచి
మొనసియున్నటువలె జనులకు గనుపించు
నంతర్విమానంబునంద యుండు
నా విమానము దేవతావళులకు జూపు
దీపించు నరులకుఁ జూపకుండు

పొసగ మనుజులచే బాహ్యపూజ లందు
గుప్తముగ దేవపూజ గైకొనుచునుండు
పరులు తనుజేరి కోరినవరము లిచ్చి
మహిమ దనరార జూపును మాధవుండు

— వేంకటాచలమాహాత్మ్యం - తరిగొండవెంగమాంబ.

ఉత్తమ భక్తులకు మాత్రమే సాక్షాత్కారం కలిగించే సమయంలో తాను, వైకుంఠంనుండి వచ్చిన దివ్యవిమానాన్ని చూపించుతాడట స్వామి. మిగిలిన సమయాల్లో ఆ విమానాన్ని మాయంచేస్తూ, సామాన్యులకు మాత్రం బంగారు గోపురమైన ఇప్పటి ఆనందనిలయంలో నిత్యచైతన్యమూర్తి అయినప్పటికీ, కేవలం విగ్రహశిలామూర్తిగా భ్రమింపచేస్తూ అర్చనలందుకుంటాడట ఆనందనిలయుడు. అందువల్లే నిత్యమూ మానవులచే పూజలందుకుంటూవున్న స్వామి ప్రతిరోజు గుప్తముగా బ్రహ్మాదిదేవతలచేత కూడ ఆరాధింపబడుతు న్నాడనుట జగత్ప్రసిద్ధమైన విషయం కదా.

తిరుమలక్షేత్రంలో స్వామిపుష్కరిణీతీరాన నెలకొనివున్న దివ్యమైన ఆనందనిలయ విమానాన్ని కాలాంతరంలో ఎందరో మహర్షులు, పరమ యోగులు, మునులు, దేవతలు... ఇలా ఎందరెందరో దర్శించారు. వామనపురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యంలో ఋషులు దర్శించిన ఆనందనిలయవిమానాన్ని గూర్చి ఇలా తెల్పబడింది.

దదృశు ర్విమలం దివ్యం విమానం భాస్కరోపమమ్
స్వామిపుష్కరిణీ తీరే దక్షిణే లోక విశ్రుతే

నారాయణాశ్రితం దివ్యం నిత్యం చ మహదద్భుతమ్
పాండురాభ్రఘనప్రఖ్యం నానాశృంగై రలంకృతమ్

అనేక రత్నసంఛన్నం ముక్తా దామవిభూషితమ్
భాసయత్తేజసా సర్వా దిశో దశ నరాధిప!

....................................................

మునీంద్రాస్తే తు తద్ దృష్ట్వా విమానం పరమాద్భుతమ్
అదృష్ట పూర్వ మన్యస్మిన్ కాలే నరవరాత్మజ!

....................................................

విమానమద్భుతాకారం తంచాపి పురుషోత్తమమ్
దృష్ట్వా తత్పోఽచిరాశ్చర్యం తే హర్షోత్ఫుల్లలోచనాః

విమానం పుణ్య మాశ్చర్యం జ్వలద్భాస్కర సన్నిభమ్
అస్యా ఏవ శుభే తీరే పుష్కరిణ్యాః స్థితైరపిః

అస్మాభిః సహితైః సర్వైః సద్భిరత్రైవ చాదరాత్
హరిణా ధ్రువ మేతత్స్యాత్ అనేనైవ స్వమాయయా

అంతర్హితం కృతం దివ్యం విమానం సిద్ధసేవితమ్
ఏవం విధాని వాక్యాని మునయస్తే పరస్పరమ్
ప్రోచు ర్దేవాధి దేవస్య సన్నిధౌ తస్య శార్జ్గిణః

తిరువేంకటక్షేత్రంలో స్వామిపుష్కరిణికి దక్షిణ తీరాన సూర్యతేజస్సుతో ప్రకాశిస్తూవున్న విమలమయిన దివ్యవిమానాన్ని ఋషులు దర్శించారు. ఆ దివ్యవిమానం మహనీయమై ఆశ్చర్యకరమై, అద్భుతమైన తెల్లని మేఘం వలె స్వచ్ఛమైనకాంతితో, అనేక బంగారు శిఖరాలతో అలంకృతమై శ్రీ మన్నారాయణునికి నిలయమై శాశ్వతంగా వెలుగొందుతూ వుండింది.

ఇంకా ఆ దివ్యవిమానం అనేకమైన రత్నాలతో పొదగబడింది. ముత్యాల హారాలతో శోభాయమానంగా అలంకరింపబడింది. దివ్యకాంతులతో మిరు మిట్లు గొలుపుతూ చూచేకొద్దీ ఆనందాన్ని పెంపొందించేదిగా వుందట!

అయితే ఆ పర్వత సానువుల్లో సంచరించే ఆ మునీంద్రులకుగానీ, ఇంద్రాది దేవతలకుగాని, అంతకుముందు ఎన్నడు అలాంటి అద్భుత విమానం కనిపించనే లేదట!

ఆ మునులంతా ఆ పర్వతం మీద అంతకు మునుపెన్నడు చూడని అద్భుతాకృతి గల విమానాన్ని, అందులో పురుషోత్తముడైన భగవానుని దర్శించి ఆనందంతో వికసించిన కన్నులతో ఇంకా ఇలా అనుకొంటున్నారుట!

పుష్కరిణీతీరంలో అగ్నివలె, సూర్యునివలె ప్రకాశిస్తూవుండిన ఆశ్చర్య కరమైన ఈ విమానాన్ని మనం ఎప్పుడు చూడలేదు. అయినా ఈ దివ్యస్థలంలో మనతోపాటు సంచరిస్తున్న సత్పురుషులందరి మీది దయతో భగవానుడు తనమాయచే అంతర్హితముగా వున్న తన విమానంతోకూడ తానూ దర్శనమిచ్చాడు కదా! ఆహా ఇది మనం చేసికొన్న భాగ్యవిశేషంకదా! అని

మునిగణమంతా ఆనందనిలయ విమానాన్ని గూర్చి ముచ్చటించుకొన్నట్లు వామనపురాణంలోని వేంకటాచలమాహాత్మ్యం తెలియజేస్తున్నది.

ప్రస్తుతం మనం అందరం దర్శిస్తూవున్న ఆనందనిలయవిమానం స్థానం లోనే, శ్రీ వైకుంఠంనుంచి తేబడిన అద్భుతమైన ఆనందనిలయ విమానం అంతర్హితమైవుంటూ, మహనీయులకు, సత్పురుషులకు పరమ భక్తులకు మాత్రమే గోచరిస్తూ అనుగ్రహింపబడుతున్నదట! (వామనపురాణం)

ఇప్పుడు మనం చూస్తూ ఆనందిస్తూవున్న స్వర్ణమయమైన విమా నాన్ని శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆనతిపై పూర్వం తొండమానుచక్రవర్తి నిర్మించాడట!

శ్రీనివాస భగవానుడు పద్మావతి అమ్మవారిని వివాహం చేసికొన్న తర్వాత కొంతకాలం అగస్త్యాశ్రమమైన శ్రీనివాసమంగాపురంలో వుండి నాడు. ఆ సమయంలోనే ఆకాశరాజు స్వర్గస్థుడయినాడు. రాజ్యం కోసం ఆకాశరాజు కొడుకు వసుదానుడు, ఆకాశరాజు తమ్ముడు తొండమానుడు యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో పద్మావతిఅమ్మవారి కోరికపై వేంకటేశ్వ రుడు వసుదానుని పక్షాన చేరాడు. కాని పరమ భక్తుడైన తొండమానునికి తన శంఖుచక్రాలను ఇచ్చాడు. ఆ యుద్ధంలో శ్రీనివాసుడు మూర్ఛపోగా యుద్ధం ఆగిపోయింది. చివరకు రాజ్యం రెండు సమభాగాలుగా ఇద్దరికీ పంచబడింది. ఆ తరుణంలో శ్రీనివాసుడు కలియుగంలోని మానవులు ఇలాగే లుబ్ధులై అనేక దుష్కృత్యాలు చేస్తారని, అందువల్ల ఇకమీదట ఇక్కడ వుండడం తగదని, వైకుంఠం వెళ్లిపోతున్నానని అంటాడు.

ఆ సమయంలో బ్రహ్మాదిదేవతలు స్వామీ! శ్రీనివాసా! ఈ కలియు గంలోని మానవులు చాల బలహీనులు. వీరు ప్రత్యక్షంగా వైకుంఠానికి వచ్చి నిన్ను దర్శించలేని అల్పులు, అభాగ్యులు. అందువల్ల వీరికోసమైనా మీరు ఇక్కడే ఈ భూలోకంలోనే నిలిచివుండి "కలౌ వేంకటనాయకః" అన్నప్రసిద్ధితో ప్రత్యక్ష దైవంగా వీరందరినీ రక్షించి, కాపాడాలని ప్రార్థించారు. వీరందరి కోరికపై శ్రీవేంకటేశ్వరుడు సరే! అలాగే అంటూ ఇకమీదట ఎవరితోను ప్రత్యక్షంగా మాటలాడను. గోచరింపను. కాని అందరి అర్చనలు స్వీకరిస్తూ, వారికోరికలనెల్ల తీరుస్తూ వుంటాను. అంటూ తొండమానునితో 'రాజా! నీవు నా పరమభక్తునివి. ఇప్పుడేగాదు. గత జన్మల్లోకూడ

నీవు ఇక్కడే నాకు ఎంతో సేవ చేశావు. ఇప్పుడు కూడా నీవు నాకోసం శాస్త్రోక్తంగా సకల సౌకర్యాలతో ఒక ఆలయాన్ని నిర్మించు. దాని మధ్యలో బంగారు శిఖరాలతో ప్రకాశించే ఒక దివ్య విమానాన్ని ఏర్పాటుచెయ్యి' అని ఆజ్ఞాపించాడు.

*తత ఆనందనిలయే తొండమాన్నృప నిర్మితే*
*విమానాగ్ర్యే శ్రీనివాసో రరాజ భగవాన్ హరిః*

శ్రీనివాసుని ఆనతిపై తొండమానుడు మహోన్నతమైనట్టి, రత్న ఖచిత మైనట్టి చతుర్మూర్తి సమోపేతమైనట్టి, వైనతేయ విభూషితమైనట్టి సువర్ణ కలశంతో ప్రకాశించే విమానాన్ని నిర్మించినాడు. ఆ విమానం చుట్టూ మూడుప్రాకారాలతో, మూడు ప్రదక్షిణమార్గాలను, ఆ మార్గాల్లో మండపా లను, వంటశాలలను, బంగారుబావి మున్నగుతీర్థాలను పునరుద్ధరించాడు. ఆనందనిలయ విమానంపైన కూడ శ్రీనివాసుని మూర్తిని ప్రతిష్ఠింపజేశాడు. ఆయనే "విమాన వేంకటేశ్వరస్వామి".

సుముహూర్తంలో వైఖానసాగమశాస్త్రోక్తంగా, మంగళవాద్యాలు మోగు తుండగా, వేదపారాయణలు శ్రుతిపేయంగా సాగుతుండగా సార్వ భౌమోచిత ఛత్రచామర ఉపచారాలతో దేవతలు పుష్పవర్షం కురిపిస్తూవుం డగా పరమశివుడు, బ్రహ్మేంద్రాది దేవతలు పరివేష్టించి వుండగా శ్రీ పద్మావతి సమేతంగా శ్రీనివాసుడు తొండమానునిచే సర్వశోభాయమానంగా సర్వసౌకర్యాలతో నిర్మింపబడిన బంగారుమేడ, అయిన ఆనందనిలయంలో ప్రవేశించినాడు. బంగారుపద్మపీఠంపైన కటివరద హస్తాలతో తాను నిలిచి వుండి, ఆ విశేషభంగిమయొక్క ప్రాశస్త్యాన్ని, ముఖ్యంగా ఈ కలియుగంలో తన పాదాలను శరణువేడిన వారిని ఆదుకొని రక్షించడమే తన ప్రధాన ధ్యేయమని బ్రహ్మాది దేవతలతో శ్రీనివాసుడు వివరించినాడు.

*ఆనంద జనకత్వాత్తం ఆనందనిలయం విదుః*
*వరపద్మాసనే సుస్థాం విధాయ కమలాలయమ్.*

సాక్షాత్తు ప్రత్యక్షభగవానుడయిన శ్రీవేంకటేశ్వరుడు, పద్మాసని అయిన వక్షఃస్థలమహాలక్ష్మితో వెలసిన ఈ దివ్యస్థలం, దర్శించిన వెంటనే ఆనందాన్ని కలిగిస్తుంది కనుక అది ఆనందనిలయమని ప్రసిద్ధిపొందింది.

ఆనందనిలయంలో ప్రవేశించిన శుభసందర్భంలో బ్రహ్మదేవుడు స్వామీ! శ్రీనివాసా! కలియుగాంతంవరకు మీరు భక్తవరదులై ఆనందాన్ని కలిగిస్తూ, ఆనందనిలయుడవన్న సార్థక నామధేయుడవై అర్చన లందుకొనవలసిందిగా ప్రార్థించినాడు. అంతేకాదు శ్రీనివాసుడు ఆనందనిలయంలో ప్రవేశించిన శుభముహూర్తంలో బ్రహ్మదేవుడు రెండు జ్యోతులను వెలిగించి, ఈ రెండు జ్యోతులు కలియుగాంతం వరకు అఖండంగా వెలుగుతూవుంటాయనీ, అవి ఎప్పుడయితే శాంతిస్తాయో, అప్పుడు ఆనందనిలయవిమానం శిథిల మౌతుందనీ, ఆ సమయాన శ్రీవేంకటేశ్వరుడు తిరిగి శ్రీవైకుంఠాన్ని చేరు కుంటాడనీ, అంతవరకు ఈ కలియుగంలో ఆదుకొని రక్షించే ఏకైకదేవుడు వేంకటనాయకుడు ఒక్కడే అన్నట్లు వరాన్ని ప్రసాదించవలసిందని అనేక విధాల ప్రార్థించినాడు. శ్రీనివాసుడు అలాగేనంటూ అనుగ్రహించాడు. పిదప బ్రహ్మదేవుడు ఆనందనిలయునకు పదినాళ్లపాటు ఉత్సవాలను నిర్వహించినాడు. అవే బ్రహ్మోత్సవాలుగా జగత్ప్రసిద్ధము లయ్యాయి.

ఆనాటినుంచి శ్రీవేంకటేశ్వరుడు ఆనందనిలయునిగా కలియుగ వర దునిగా భూలోక వైకుంఠమయిన వేంకటాచలక్షేత్రంలో అర్చామూర్తియై-

ఓం మాయాగూఢవిమానాయ నమః
ఓం వైకుంఠాగత సద్హేమ విమానాంతర్గతాయ నమః
ఓం సహస్రార్క చ్ఛటా—
భాస్వద్విమానాంతస్థితాయ నమః

అని నిత్యమూ అర్చనలందుకొంటూ వున్న శ్రీనివాస భగవానుని ఒక్కసారిగా గట్టిగా కీర్తించి తర్వాతి విశేషాలను తెలుసుకుందాం.

*ఆనందనిలయవాసా! గోవిందా!*
*బంగారు గోపురాలవాడ! గోవిందా! గోవింద!!*

విమానం సర్వపాపఘ్నం సర్వలోకేషు విశ్రుతమ్
అప్రాకృత మనాద్యంతం వైకుంఠాదాగతం మహత్

ఆద్యంతములేని, అప్రాకృతమైన ఈ విమానం శ్రీ వైకుంఠంనుంచి కొనిరాబడింది. అంతేకాదు అఖిల జగాల్లో తెలియబడిన ఈ ఆనందనిలయ

విమాన దర్శనం సర్వపాపాల్ని తొలగిస్తుంది. మరి స్వర్ణమయమైన అలాంటి దివ్యవిమానం వేంకటాచలక్షేత్రంలో నిలిచి దర్శనమిస్తూ వున్న నాటినుంచి కాలాంతరంలో ఎందరో మహనీయులు మరెందరో రాజులు, రారాజులు, దర్శించుకొన్నారు. సేవించుకొన్నారు. ఆ గోపురాన్ని ఉద్ధరించారు. బంగారు కవచాలను తొడిగించారు. బంగారు పూత పూయించారు. గోపురంపైన బంగారుకలశాలను ప్రతిష్ఠించారు. ఇలా చారిత్రకంగా, శాసన పరంగా ఆధారాలు అందినంత వరకు ఎవరెవరుఎప్పుడెప్పుడు ఆనందనిలయ విమాన కైంకర్యం చేశారో పరిశీలిద్దాం.

## విమాన కైంకర్యపరులు

క్రీ.శ.839వ సంవత్సరంలో పల్లవరాజు అయిన విజయదంతి విక్రమవర్మ, ఈ ఆనంద నిలయ విమానానికి స్వర్ణకవచం సమర్పించు కొన్నాడు. పిదప క్రీ.శ. 1262 సం॥లో జాతవర్మ సుందరపాండ్యదేవుడు కూడ స్వర్ణకవచాన్ని సమర్పించాడు.

పిదప క్రీ.శ. 1359 వ సం॥ జూలై 6వ తేదీన సాళువమంగిదేవ మహా రాజు ఆనందనిలయవిమానంపై వున్న పాతకలశాన్ని తీసివేసి కొత్తబంగారు కలశాన్ని ప్రతిష్ఠించాడు.

క్రీ.శ. 1417వ సం॥లో విజయనగర సామ్రాజ్యం అమాత్యుడగు చంద్రగిరి మల్లన తిరుమల శ్రీవారిఆలయంలో ఎన్నో మండప నిర్మాణాలు చేపట్టినాడు. క్రీ.శ. 1417 ఆగష్టు 25 నాటికి బంగారువాకిలి ముందువున్న మహామణి మండపాన్ని (ఘంటా మండపం) నిర్మించాడు. ఆ సందర్భంలో ఆనందనిలయ విమానజీర్ణోద్ధారణ చేశాడు.

అటు తర్వాత సాహితీసమరాంగణసార్వభౌముడు విజయనగర సామ్రా జ్యాధినేత అయిన శ్రీ కృష్ణదేవరాయలు, సర్వజగత్సార్వభౌముడైన సప్తగిరీశు నకు ఎన్నో సేవలు, ఉత్సవాలు నిర్వహించినాడు. ఎన్నో ఆభరణాలు, బంగారు పాత్రలు సమర్పించుకున్నాడు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యమూల విరా ణ్మూర్తితోపాటు, ఉత్సవమూర్తి అయిన శ్రీదేవి భూదేవి సమేతుడయిన శ్రీ మలయప్పస్వామివారికి అనేక నగలు, నాణ్యాలు సమర్పించుకున్నాడు. ఈ

విజయనగరచక్రవర్తి క్రీ.శ. 1513 నుండి 1521 వరకు ఏడుపర్యాయాలు తిరుమలక్షేత్రాన్ని సందర్శించి శ్రీ వేంకటప్రభువులను అర్చించి ఆరాధించి నాడు. క్రీ.శ. 1517 జనవరి 2న ఐదవసారి తిరుమలయాత్రకు వచ్చిన సందర్భంలో ఆలయం ప్రాంగణంలో శ్రీవారికి అభిముఖంగా తనదేవేరులు తిరుమల దేవి, చిన్నాదేవులతోకూడ తమ నిలువెత్తు విగ్రహాల్ని నమస్కార భంగిమలో అతివిరాడంబర భక్తుల వేషంలో ప్రతిష్ఠించు కొన్నాడు. ముఖ్యంగా క్రీ.శ.1518 సెప్టెంబరు 9వ తేదీ గురువారం బహుధాన్య సంవత్సరం కన్యామాసం (భాద్రపద) పౌర్ణమినాడు 30 వేల బంగారు వరహాలతో ఆనందనిలయ విమానానికి బంగారుమలాము చేయించాడు.

ఆ తర్వాతి విజయనగరరాజు అయిన వీరనరసింగదేవయాదవ రాయలు తనఎత్తు బంగారాన్ని తులాభారం వేసికొని, ఆ బంగారంతో ఆనంద నిలయ విమానంతోపాటు, బంగారు వాకిళ్ళకు కూడ బంగారు పూతను పూయించాడు.

క్రీ.శ. 1630లో కంచిక్షేత్ర వాస్తవ్యులైన కోటి కన్యాదానం తాతా చార్యులు అనే వైష్ణవాచార్యులు ఆనందనిలయ విమానానికి బంగారు మలాము చేయించాడు.

తిరుమల తిరుపతి దేవస్థానం, మహంతుల పాలనలో ఉన్న సమయంలో అంటే క్రీ.శ. 1908 సం॥ సెప్టెంబరు 30వ తేదీన అనగా కీలకనామ సంవత్సరం ఆశ్వయుజ పౌర్ణమినాడు తిరుమలలోని బావాజీమఠం మహంతు అయిన ప్రయాగదాసుకు సోదర శిష్యుడైన అధికారి రామలక్ష్మణదాసు ఆనందనిలయవిమానంపై బంగారు కలశాన్ని ప్రతిష్ఠించినాడు.

## 1958లో జరిగిన ఆనందనిలయ విమాన మహాసంప్రోక్షణ

ఇక ఇటీవల చివరగా 1958వ సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో 18-8-1958 నుండి 27-8-1958 వరకు పది రోజులపాటు జరిగిన ఆనందనిలయ విమాన జీర్ణోద్ధరణ మరియు బంగారు రేకుల సమర్పణ కార్యక్రమాలను గూర్చి ప్రత్యేకంగా తెలుసుకుందాం.

గడచిన ఆరు లేదా ఏడువందలసంవత్సరాల్లో ఇంత వైభవంగా ఘనంగా సంపూర్ణంగా ఆనందనిలయ విమానజీర్ణోద్ధరణ స్వర్ణకవచ సమర్పణ - మహాసంప్రోక్షణ కార్యక్రమాలు జరిగివుండలేదన్న సత్యాన్ని చరిత్ర స్పష్టం చేస్తోంది. ఆ వివరాలు పరిశీలిద్దాం.

1958వ సంవత్సరంలో జరుపబడిన ఆనందనిలయ విమాన మహా సంప్రోక్షణలో 12 టన్నుల రాగి, 12 వేల తులాల మేలిమి బంగారం ఉపయోగించబడింది.

ఆనాటి లెక్కల ప్రకారం సుమారు 18 లక్షల రూపాయల ఖర్చుతో కొనసాగిన ఈ కార్యక్రమంలో, అంతకుముందే విమానంమీద వున్న పాత రేకులలోని బంగారం సుమారు 8 లక్షల విలువగలిగినది సేకరించ బడింది. దానితోపాటు అదనంగా నూతనంగా వేలాదిమంది భక్తులు హుండీ ద్వారా కానుక పెట్టుకొన్న బంగారంమాత్రమే ఈ ఆనందనిలయ విమాన సంప్రోక్షణ కార్యక్రమంలో ఉపయోగింపబడింది.

ఆనాడు అత్యంత విస్తృతంగా జరిగిన ఈ మహోన్నత కార్యక్రమంలో ఎంతో ఓర్పుతో కూడిన కళాత్మకనైపుణ్యం ఉట్టిపడుతూ ఈనాటికీ ఆనంద నిలయవిమానం దర్శనమిస్తూవుంది. ఈ విమానానికి "రేకులు తాపడం" అనే కార్యక్రమం సుమారు 5 ఏళ్ళ కాలంపాటు కొనసాగింది. అందులో 3 ఏళ్లకాలం రాగిరేకుల పనిలోనే పట్టింది. ఆ తర్వాత రెండేళ్లపాటు బంగారుమలాము చేసే పనులకు సరిపోయింది.

1952 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి 'సంపూర్ణంగా ఆనందనిలయవిమాన మహాసంప్రోక్షణ జరిపించాలని నిర్ణయించిన తీర్మానం' మేరకు, 1953లో ఈ పని ప్రారంభింపబడింది. ఈ పనికిగాను 1953 జూన్ 16 నుండి 21 వరకు ఆరు రోజులపాటు శ్రీవారిఆలయంలో "బాలాలయం" ప్రతిష్ఠ జరిగింది. ఈ వారం రోజుల్లోనే ఆనందనిలయం విమానం మీది పాతరేకులు అన్నిటినీ తీసివేసిన తర్వాత అన్ని కొలతలతోపాటు, గోపురం, ఫోటోలను అన్నికోణాలనుండి తీసికొన బడినాయి. పిదప తిరుమలలోని ఆనందనిలయవిమానఫోటోలు, కొలతల ఆధారంగా తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయప్రాంగణంలో

ఆనందనిలయ విమానానికి నకలుప్రతీక నిర్మించబడింది. ఈ గోపురం నమూనాలోకూడా ఆయా మూలలకు వున్న అన్ని బొమ్మలు యథాతథంగా చాలా జాగ్రత్తగా చిత్రించబడినాయి. పిదప నమూనాప్రతీకగోపురం ఆధారంగా సరిగ్గా వుండే కొలతలతో రాగిరేకులపని, ఆ తర్వాత బంగారు మలాము పని సుమారు ఐదేళ్ళపాటు ఎంతో కళాత్మక నైపుణ్యంతోను, ఆధునిక సాంకేతిక స్ఫూర్తితోను ఓర్పుతోను కొనసాగింది. అన్ని హంగులతో మెరుగులు దిద్దుకొని ప్రకాశిస్తూ, సిద్ధమైన బంగారు కవచాలను తిరుమల ఆనందనిలయ విమానంపైన బిగించే కార్యక్రమంకోసం 1957వ సంవత్సరంలో అక్టోబరు 25వ తేదీ నుంచి నవంబరు 1వ తేదీవరకు వారంరోజులపాటు మరోసారి బాలాలయం ప్రతిష్ఠ జరిగి నిర్వహింపబడింది.

ఇందుకుగాను విమాన ప్రదక్షిణంలోని కల్యాణ మండపం (ప్రస్తుతం చిల్లర నాణేల పరకామణి జరిగే మండపం)లో మేడికర్ర (ఔదుంబరం, అత్తి)తో తయారుచేయబడిన సుమారు 5 అడుగుల ఎత్తుగల శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూలవిరాణ్మూర్తి నకలు విగ్రహం తయారుచేయబడి ప్రతిష్ఠింప బడింది. ముందుగా ఆనందనిలయంలో, శ్రీ వేంకటేశ్వరస్వామి వారి మూలమూర్తిలోని కళాంశలను ఒక బంగారు కలశంలోనికి కళాకర్షణ చేసిన తర్వాత ఆకలశంలోని కళలను బాలాలయంలో ప్రతిష్ఠింపబడిన మేడిచెక్క విగ్రహంలోనికి మళ్ళీ కళాకర్షణ చేయబడింది. ఈ బాలాలయ ప్రతిష్ఠ, కళాకర్షణ కార్యక్రమాలన్నీ వైఖానసాగమశాస్త్రోక్తంగా జరుపబడినాయి.

1957 నవంబరు 1 నుంచి 1958 ఆగష్టు 27 వరకు ఈ మధ్యకాలంలో శ్రీవారి ఆలయంలో వలెనే ఈ బాలాలయంలో అన్నివిధాలా దర్శన పూజానివేదనాదులన్నీ కొనసాగించబడినాయి.

1957 నవంబరు నుంచి 1958 ఆగష్టు 27 వరకు ఈ మధ్యకాలంలో అంటే సుమారు 10 నెలల కాలంలో ఆనంద నిలయవిమానం పూర్తిగా జీర్ణోద్ధరణ కావింప బడడమేకాక, దానిపై అప్పటికే సిద్ధంగా తయారు చేయబడిన బంగారు రేకులస్థాపన, కలశ ప్రతిష్ఠ, మొదలగు కార్యక్రమాలన్నీ దిగ్విజయంగా, నిర్విఘ్నంగా 'న భూతో న భవిష్యతి' అన్నట్లుగా వైభవోపేతంగా కొనసాగినాయి. ఈ విమానజీర్ణోద్ధారణ, మహాసంప్రోక్షణ,

రాగిరేకుల, తయారీ, బంగారుపూత మున్నగు కార్యక్రమాలు మొదలుగా పునః ప్రతిష్ఠ వరకు వందలాదిమంది కార్మికులు అత్యంత భక్తితో ఉత్సాహంతో, ఉత్తేజంతో పాల్గొన్నారు. ఈ కార్యక్రమాలన్ని 1958 ఆగష్టు 10వ తేదీ నాటికి పూర్తి అయి మహాసంప్రోక్షణ కార్యక్రమాలకు గాను ఆనందనిలయవిమానం సర్వశోభాయమానంగా సిద్ధమయింది.

ఈ బాలాలయ ప్రతిష్ఠ జరిగిన తర్వాత ఆనందనిలయ విమానం మీద బంగారు రేకులు తాపిన సమయంలోనే బంగారువాకిలి, ఆ వాకిలికి ఎదురుగా వున్న గరుడాళ్వారు సన్నిధిపైన బంగారు శిఖరం ఏర్పాటు, బంగారు బావికి బంగారు రేకుల తాపడంవంటి పనులుకూడ జరుపబడినాయి. అంతేకాదు ఆనందనిలయంలో శ్రీవేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తికి వున్న బంగారుమకరతోరణానికి కూడ బంగారు మెరుగులు దిద్దబడినాయి.

పిదప 1958 ఆగష్టు 18 నుండి 27 వరకు పదిరోజులపాటు మహావైభవంగా ఆనందనిలయవిమాన మహాసంప్రోక్షణ కార్యక్రమం జరుపబడింది. మళ్లీ శ్రీవారి విగ్రహం (మేడిక్కర విగ్రహం)లోని కళలను యథా తథంగా ఆనందనిలయంలోని శ్రీవారి దివ్యమూల విరాణ్మూర్తికి కళాకర్షణ కార్యక్రమం అత్యంత ఘనంగా సశాస్త్రీయంగా వైఖానసాగమోక్తంగా నిర్వహింపబడింది. 1958లో జరిగిన మహాసంప్రోక్షణ కార్యక్రమంలో దేశం నలుమూలలనుంచి వేలాదిమంది భక్తులు పాల్గొని దర్శించారు.

1957-1958వ సంవత్సరాల్లో అద్భుతావహంగా జరిగిన తిరుమల ఆనందనిలయ విమాన మహాసంప్రోక్షణ కార్యక్రమాల్లో అంచెలంచెలుగా ఎందరెందరో ప్రముఖులు పాలుపంచుకొన్నారు. ఈ మహోన్నత దైవ కార్యక్రమంలో ప్రత్యక్షంగా పాలుపంచుకొని సేవలందించి, శిఖరాయమానంగా కీర్తినందుకొన్న వారిని ఈ సందర్భంలో స్మరించి కృతజ్ఞతాపూర్వక నమస్సులందించడం, మన ధర్మమేకాక విధి కూడ.

తమిళనాడులోని మధురపట్టణ వాస్తవ్యులు శిల్పాచార్యులు శ్రీ సి. నాగరాజుపిళ్లై తొలిమెట్టుగా ఆనందనిలయవిమానప్రతీకను నిర్మించడమే గాక, ఆనందనిలయవిమానాన్ని జీర్ణోద్ధారణ మరమ్మత్తుల్ని అద్భుతంగా చేశారు.

ఆనందనిలయ విమానం మీది పాత రేకులలోని బంగారాన్ని, హుండీ ద్వారా భక్తులు సమర్పించిన బంగారాన్ని రసాయన ప్రక్రియలద్వారా శుద్ధిచేసే కార్యక్రమాన్ని మహారాష్ట్రంలోని పూనావాస్తవ్యులు శ్రీరామనాథ సింథేగారు నిర్వహించి మేలిమి బంగారాన్ని అందించారు.

తమిళనాడు మధురలోని స్థపతి శ్రీ ఎం. చొక్కలింగాచారి ఆనంద నిలయ విమానానికి రాగిరేకులను తయారుచేశారు. వీరు సిద్ధంచేసిన రాగి తొడుగులకు తమిళనాడులోని తిరుచిరాపల్లిలోని రాజా ఇండస్ట్రియల్స్ అధినేత శ్రీ ఆర్. రాజగోపాలస్వామిరాజు బంగారు మెరుగులు దిద్దినారు.

ఇలా తిరుమలేశుడు ఎందరోభక్తులచేత ఎన్నెన్నో పనులు చేయించు కొంటూ, తాను ఆనందిస్తూ, భక్తులను ఆనందింపచేస్తూవున్న ఆనందనిల యునకు ఒక్కసారి జేజేలు పలుకుదాం.

*భక్త ప్రియ గోవిందా! గోవింద!!*
*ఆనందనిలయవాసా! గోవిందా! గోవిందా!!*

# విమాన నిర్మాణ వైశిష్ట్యం

తిరుమలక్షేత్రంలో 'ఆనందనిలయ విమానం' అనేప్రసిద్ధమైనపేరును పొందివున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి బంగారు గోపురం 'త్రితల గోపురం' (మూడంతస్థుల గోపురం) అని చెప్పబడుతున్నది. క్రింది మొదటి రెండు అంతస్థులు దీర్ఘచతురస్రాకారంగాను, మూడవది అయిన చివరి అంతస్థ వర్తులాకారంగాను నిర్మింపబడింది.

వేసరశైలిలో ఏకకలశ శిఖరంతో నిర్మింప బడిన ఈ బంగారు గోపురం ఎత్తు కలశంతో సహా 37 అడుగులా 8 అంగుళాలు. ఈ గోపురం క్రింద నిర్మింపబడిన ప్రాకారం ఎత్తు 27 అడుగుల 4 అంగుళాలు. అనగా భూమితలంనుండి బంగారుకలశం వరకు కూడ మొత్తం ఆనందనిలయ విమానం ఎత్తు 65 అడుగులా 2 అంగుళాలు.

బంగారుశిఖరంలో దీర్ఘచతురస్రాకారపు మొదటి అంతస్థు 10 అడుగులా 6 అంగుళాల ఎత్తును కలిగివుంది. ఈ భాగంలో ఎలాంటి బొమ్మలు లేవు. కేవలం చిన్న చిన్న లతలు, తీగలు, మకరతోరణాలు, చిన్నశిఖరాలు మాత్రమే ఇందులో వున్నాయి.

ఇక గోపురంలోని దీర్ఘచతురస్రాకారపు రెండవ అంతస్థు 10 అడుగుల 9 అంగుళాల ఎత్తును కలిగివుండడమేగాక ఇందులో చుట్టూ 40 బొమ్మలు ఏర్పాటు చేయబడినవి. మకరతోరణాలతోపాటు వరాహస్వామి, నరసింహ స్వామి, అనంతుడు, వైకుంఠనాథుడు మున్నగు ప్రధాన శిల్పమూర్తులు మధ్యలోని చతురస్రాకారతలంపై నాలుగు దిక్కుల విరాజిల్లుతూ వున్నాయి. వీటితోపాటు చుట్టూ శ్రీ విష్ణురూపాలు, జయ విజయులు, గరుడ, అనంత, విష్వక్సేన, ఆంజనేయులు, ఋషులు మున్నగు వారి రూపాలు వున్నాయి. ఈ రెండవ అంతస్థులోనే ఉత్తర దిక్కున పడమటి వారకు (వాయువ్య మూలకు) 'వేంకటేశ్వరస్వామి' ఉత్తరాభిముఖంగా వేంచేసి దర్శనమిస్తూ వున్నాడు. ఈయనే 'విమానవేంకటేశ్వరస్వామి'

ఇక గోపురంలోని చివరి అంతస్థు వర్తులాకారాన్ని కలిగివుండి, 16 అడుగులా 3 అంగుళాల ఎత్తుతో విరాజిల్లుతోంది. ఈ భాగంలో మహాపద్మంతోపాటు 20 బొమ్మలు వున్నాయి. ఈ చివరి వర్తులాకారంలోనే నాలుగు మూలల్లో 8 సింహాల బొమ్మలు వున్నాయి. అనగా ఒక్కొక్క మూలలో చిన్న పద్మాన్ని పరివేష్టించిన రెండు సింహాల వంతున నాలుగు మూలల్లో మొత్తం 8 సింహాలు వున్నాయి. బంగారు కలశానికి ఆనుకొని కిందిభాగంలో వున్న 'మహాపద్మం' చిలకలు, లతలు, హంసలుమున్నగు చిత్రాలతో అత్యంత విలక్షణంగా ఆకర్షణీయంగా విరాజిల్లుతూ వుంది.

ఈ ఆనందనిలయ విమానం చుట్టూవున్న ప్రదక్షిణ మార్గాన్ని 'విమాన ప్రదక్షిణం' అంటారు. యాత్రికులు, భక్తులు గర్భాలయంలోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తిని దర్శించుకున్నతర్వాత విమాన ప్రదక్షిణమార్గంలో వెళుతూ ఆనందనిలయ విమానానికి ప్రదక్షిణంచేస్తూ, ఈ మార్గంలో అన్నివైపులనుండి ఆనందనిలయవిమాన సౌందర్యాన్ని వీక్షిస్తారు. ఇలా భక్తులు మాత్రమేకాదు. శ్రీవారి గర్భాలయం నుండి శ్రీ మలయప్ప స్వామివారు బయలు దేరి, ఉత్సవాలకు, ఊరేగింపులకు బయటికి వెళ్లాలన్నా విమానప్రదక్షిణం చేస్తూ, వెళ్తారు. అంతేకాదు బయటినుంచి తెచ్చిన ఏ పూజా ద్రవ్యాలయినా, తోమాలసేవకుగాను పుష్పాలయినా, అభిషేకానికి ఆకాశగంగ తీర్థమయినా, విమానప్రదక్షిణం పూర్తిచేసిన తర్వాతే వాటిని గర్భాలయంలోనికి తీసుకవెళ్లి సమర్పించడం జరుగుతుంది.

ఎప్పుడైనా, శ్రీస్వామివారు ఉత్సవానికి బయలుదేరినప్పుడు విమాన ప్రదక్షిణమార్గంలో నాలుగు మూలల్లో హారతులందుకుంటాడు.

వేంకటాచల పర్వతసానువుల్లో అనంతతేజోవిరాజితమై గోచరిస్తూ సందర్శకులందరికీ శ్రేయస్సులను కలిగిస్తూవున్న ఈ బ్రహ్మాండనాయకుని బంగారుమేడ అయిన ఈ 'ఆనందనిలయవిమానం' కొలువై వున్నందువల్లే బ్రహ్మాండభాండాలలో వేంకటాద్రికి సమమయిన స్థానం లేనేలేదని, అలాగే ఆ విమాన అంతర్భాగంలో వేంచేసివున్న శ్రీవేంకటేశ్వరస్వామివారికి సాటి రాగల మేటిదేవుడు అటుభూతకాలంలోను, ఇటు భవిష్యత్తులోను లేడు, ఉండడని ప్రసిద్ధి కలిగింది.

అనంతమహిమాన్వితమై ప్రకాశిస్తూవున్న ఈ ఆనందనిలయ విమానం నెలకొనివున్న వేంకటాచలపర్వతంపై మామూలు విమానాలు హెలికాప్టర్లు సంచరించడం నిషేధింపబడింది. ఆకాశంలో పయనించే విమానాలు వేంకటాచలానికి ముఖ్యంగా ఆనందనిలయవిమానానికి దూరంగా తొలిగి వెళ్లేందుకుగాను ఎత్తైన నారాయణగిరి పర్వతంమీద విమానచోదకులకోసం 'సిగ్నల్స్' ఏర్పాటు చేయబడ్డాయి. ఈ నిషేధంవల్లే రాష్ట్రపతి, ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి ఇలా ఎవరైనా సరే హెలికాప్టరులో గాని, విమానాల్లోగాని మొదట తిరుపతిలో (దిగువ తిరుపతిలో) దిగవలసిందే. ఆ తర్వాతే తిరుపతి నుంచి తిరుమలకు కారులోవెళ్లి స్వామివారిని దర్శించ వలసిందే! తప్ప నేరుగా హెలికాప్టర్లలో వేంకటాచలంపై విహరిస్తూ సంచరించడం నిషేధం.

ఇలా వేయి వెలుగులతో అసమానమై అప్రమేయమై ప్రకాశిస్తూవున్న ఆనందనిలయ విమానాన్ని గూర్చి ఎన్ని కోణాల్లో పరిశీలించి, పరిశోధించి చెప్పుకొన్నా అది తక్కువగానే కాక, అత్యల్పంకూడ అవుతుంది.

ఇలా యుగయుగాలనుంచి లక్షలాది సామాన్య భక్తుల నుంచి స్వర్గ వాసులవరకు, పామరులనుండి పరమయోగుల వరకు దర్శించిన వెంటనే దివ్యానందానుభూతులను పంచుతూ వున్న ఆనందనిలయ విమానాన్ని కన్నులారా దర్శిస్తూ, చేతులారా నమస్కరిస్తూ ఈ విమానాంతర్భాగంలో

సార్థక నామధేయుడై విరాజిల్లుతూవున్న శ్రీ స్వామివారిని కీర్తించుతూ పునః పునః దర్శనమిమ్మని ప్రార్థించుదాం.

ఆనందనిలయే శ్రీమద్విమానే స్వర్ణ భూషితే
సర్వమంగళ మాంగల్యే దీవ్యతే నిత్యమంగళమ్

*బంగారు గోపురాలవాడ! గోవిందా!!*
*ఆనందనిలయవాసా! గోవిందా! గోవింద!!*

## 53. విమాన వేంకటేశ్వరస్వామి

మనంఅందరం ఇప్పుడు ఆనందనిలయవిమానం అద్భుతమైన అనంతమైన ఆశ్చర్యకరమైన సౌందర్యాన్ని వీక్షిస్తూ ఆనందిస్తూవున్నాం కదూ. ఆ విమానంమీద విరాజిల్లుతూవున్న 'విమాన వేంకటేశ్వరస్వామి' వారిని కూడా దర్శించండి మరి!

ఇక్కడ 'విమాన వేంకటేశ్వరస్వామి' అనే ఫలకం (బోర్డు) వున్న వేదికపై నిలవబడి విమానంమీద వాయవ్యమూలకు గూడులాంటి చిన్న మందిరం మకరతోరణంతో అలంకరింపబడి ఉంది. బాగా పరికించండి! ఆ మందిరంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తిని పోలిన చిన్నవిగ్రహం వుంది చూశారా! ఆయనకు ఇరువైపులా గరుత్మంతుడు, నృత్యభంగిమలో బాలకృష్ణుడు, హనుమంతుడు వుంటూ సేవిస్తూవున్నారు. ఆనందనిలయ విమానంపై వేంచేసివున్నందువల్ల ఈ స్వామి 'విమాన' వేంకటేశ్వరస్వామి అని పిలువబడుతూవున్నాడు.

ఈ విమానవేంకటేశ్వరస్వామివారిని పరమభక్తశిఖామణి అయిన తొండమాను రాజు ఏర్పాటుచేశాడని

*తత ఆనందనిలయే తొండమాన్నృప నిర్మితే*
*విమానాగ్రే శ్రీనివాసో రరాజ భగవాన్ హరిః*

వేంకటాచలమాహాత్మ్యం తెలుపుతోంది. ఈ స్వామివారి దర్శనం సర్వపాపహరం! సర్వశుభదాయకం! ఈ విమానవేంకటేశ్వర స్వామి వారి దర్శనం ఆనందనిలయంలో స్వయంభూమూర్తియై వేంచేసివున్న శ్రీ వేంకటేశ్వరస్వామి మూలవిరాణ్మూర్తిదర్శనంతో సమానమని

విశ్వాసం. అంతమాత్రమేకాదు ఒకవేళ ఆనందనిలయంలోని మూల మూర్తి, దర్శనం కాకపోయినా ఈ విమానవేంకటేశ్వరుని దర్శిస్తే చాలట! యాత్రా ఫలితం దక్కుతుందట!

పూర్వం భక్తులు విమాన ప్రదక్షిణం చేస్తూ ముందుగా 'విమాన వేంకటేశ్వరస్వామి' వారిని దర్శించిన తర్వాతే ఆనందనిలయంలోని మూల మూర్తిని దర్శించేవారు. ప్రస్తుతం నానాటికి పెరుగుతున్న భక్తజన సందోహం దృష్ట్యా తొలుత శ్రీ మూలమూర్తిని దర్శించినతర్వాతనే విమాన వేంకటేశ్వరస్వామివారిని దర్శించడం జరుగుతున్నది.

విమానం సర్వపాపఘ్నం విష్ణునాఽధిష్ఠితం సహ
పశ్యతాం సర్వభూతానాం ఆహ్లాద జనకం శుభమ్

ఈ విమానంతోకూడ, విమానంమీద వున్న శ్రీనివాసుని దర్శించిన సర్వజీవుల పాపాలు తొలుగుతాయి. అంతేకాదు. సంతోష జనకమేకాక సర్వశుభాలు కలుగుతాయట. అందువల్లే చూడండి! ఇక్కడ స్వామివారిని దర్శించి, వచ్చిన భక్తులు తలలు పైకెత్తి విమానంమీది శ్రీవారిని కూడ దర్శించి ధన్యులవుతూవున్నారు చూడండి. కొందరు ఈ విమాన వేంకటేశ్వరునికి ఎదురుగా వున్న మండపంలో క్రింద కూర్చొని స్తోత్రాల్ని పురాణాల్ని పారాయణం చేస్తూవున్నారు గమనించండి!

ఆనందనిలయ విమానం మీదవున్న ఈ వేంకటేశ్వరస్వామివారు శ్రీవ్యాసతీర్థులవారి కాలంనుంచి భక్తలోకంలో మరింత ప్రాధాన్యాన్ని విశిష్టతను సంతరించుకున్నాడు.

శ్రీ కృష్ణదేవరాయలకాలంలో ప్రసిద్ధిపొందిన ద్వైతపీఠ సంప్రదాయ ప్రవర్థకులు ఈ వ్యాసతీర్థులు. కృష్ణదేవరాయలకు కలిగిన 'కుహూ' యోగ మనే కాలసర్ప దోషంనుండి కాపాడడానికి విజయనగర సింహాసనాన్ని తానే అదిష్ఠించినారట. అందువల్లే ఈ యతీశ్వరులకు 'రాయలు' అనే బిరుదమేర్పడి "వ్యాసరాయలు"గాలోకంలో ప్రసిద్ధిపొందినారు. తదుపరి శ్రీ వ్యాసరాయలు తిరుమల శ్రీవారి ఆలయంలో సుమారు 12 ఏండ్లపాటు అర్చనాదికములు నిర్వహించినారట. ఆ సమయంలో విమాన వేంకటేశ్వర స్వామివారి సన్నిధిలో పారాయణలు, దర్శనాదులు అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకున్నాయి.

అందువల్లే శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని దర్శించిన తర్వాత విమాన ప్రదక్షిణ మార్గంలో నడుస్తున్న భక్తులు, యాత్రికులు ఈ విమాన వేంకటేశ్వర స్వామివారిని దర్శించడం కూడ ప్రధాన ఘట్టంగా ఆలయ సంప్రదాయంలో స్థిరంగా నిలిచివుంది. ఇలా ఒక్క భక్తులు మాత్రమేకాదు. చివరకు శ్రీదేవి, భూదేవి సమేతంగా శ్రీ మలయప్పస్వామివారు కూడ ఆలయం బయటికి వెళ్లేముందుగా, విమాన ప్రదక్షిణంచేస్తూ ఈ విమాన వేంకటేశ్వరస్వామి సన్నిధిలో కాసేపు నిలిచివుండి హారతు లందుకుంటాడు.

అంతేకాదు ప్రతి సంవత్సరానికొకమారు మూడురోజులపాటు జరిగే పవిత్రోత్సవ సమయంలో విమానంమీద వెలసివున్న ఈ వేంకటేశ్వరస్వామి వారికి కూడ పవిత్రమాలలు సమర్పింపబడతాయి. అందుకోసమే అర్చకులు విమానవేంకటేశ్వరుని సన్నిధికి వెళ్లడానికి వీలుగా నిచ్చెనలు ఏర్పాటుచేస్తారు.

ఇంతేగాక ప్రతిరోజు ముప్పూటలా ఆనందనిలయంలో జరుపబడే నివేదన సమయంలో అర్చకస్వాములు ఆలయం లోపలినుండే విమానవేంకటేశ్వర స్వామివారికి నివేదనలు సమర్పిస్తారు.

మరి మనమందరం ఆ ఆనందనిలయ విమానవేంకటేశ్వరస్వామివారిని ప్రార్థిస్తూ, పునః పునః దర్శనం అనుగ్రహించ వలసిందని కోరుతూ ఎలుగెత్తి స్తోత్రంచేద్దాం. అదిగో మరొక్కమారు విమాన వేంకటేశ్వరుణ్ణి దర్శించండి మరి!

*శ్రీ వేంకటేశ! మత్స్వామిన్ జ్ఞానానంద దయానిధే!*
*శరణాగత సంత్రాణ! వరదాభీష్ట వర్షణ!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 54. రికార్డుల గది (సెల్)

విమాన వేంకటేశ్వరుని దర్శిస్తూ నిలుచున్న మనం నాలుగు అడుగులు ముందుకు నడవగా ప్రాకారమండపాల్లో 'రికార్డుసెల్' అనే ఫలకంతో వున్న గది కనపడుతున్నది చూడండి.

ఈ గదిలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి గర్భాలయానికి సంబంధించిన వెండి పాత్రలు గిన్నెలు సెమ్మెలు, బంగారు పాత్రలు, వగైరా వివరాలను తెలిపే రికార్డులు వున్నాయి. అంతేగాదు శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్య మూల విరాణ్మూర్తికి మరియు ఉత్సవమూర్తులకు అన్నింటికి సంబంధించిన నగలు, అభరణాలు, ఆపాద మస్తకము అలంకరింపబడే సర్వాభరణాలు వివరాలు వాటి తూకాలు మున్నగు అన్ని వివరాలు తెలియజేసే రికార్డులు కూడ ఈ గదిలో భద్రపరచబడి వుంటాయి.

## 55. వేదపారాయణలు

విమాన ప్రదక్షిణ మార్గంలో రికార్డుసెల్ (గది) మొదలుకొని ఉత్తర ప్రాకార మండపంలో వరుసగా వేదపండితులు వేదమంత్రాలను వీనుల విందుగా పారాయణం చేస్తూన్నారు.

ఋగ్వేదం, కృష్ణయజుర్వేదం, శుక్లయజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం ఇలా వరుసగా స్వరయుక్తంగా పఠిస్తూ, వేదరక్షకుడైన శ్రీ వేంకటే శ్వరస్వామివారిని కీర్తిస్తూవున్న ఈ వేదమూర్తులకూ, వేదాలను పరిరక్షిస్తూ తద్వారా ధర్మ రక్షణను కావిస్తూవున్న విరాట్పురుషుడైన సప్తగిరినాథునకు నమస్కరిస్తూ జయ జయ ధ్వానాలు చేద్దాం.

*నిగమ నిగమాంత వర్ణిత మనోహర శ్రీమన్నారాయణా!*
*నిగమాగమ రక్షక! శ్రీమన్నారాయణా!!*

## 56. సభ అర (సభేరా)

విమాన ప్రదక్షిణ మార్గంలో ఉత్తరం దిక్కున ప్రాకారంలోవున్న మండపాల్లో మరోగది 'సభేరాగది' చూడండి.

సభ అనగా కొలువు, ఆస్థానం, దర్బార్ అని అర్థం. శ్రీ వేంకటే శ్వరస్వామివారి వివిధ ఉత్సవమూర్తులకు వివిధ వేళల్లో, వివిధ రోజుల్లో జరిగే ఆస్థాన సేవలను, కొలువు ఉత్సవాలను తెలియజేసే పదమే సభ. అలా

ఆయావేళల్లో శ్రీవారికి జరిగే సభల్లో పాలుపంచుకొనే గది (అర) కనుక 'సభ అర' (గది) అని దీనికి పేరుకలిగింది.

శ్రీ వేంకటేశ్వరస్వామివారికి జరిగే ఆస్థాన సమయాల్లో ఉపయోగింపబడే బంగారుగొడుగులు చామరాలు, వెండిదివిటీలు, హారతితట్టలు, పట్టువస్త్రాలు వగైరా వగైరా వస్తువులను ఈ గదినుండే తీసుకెళతారు.

ప్రతిరాత్రి శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఏకాంతసేవకు ఉపయోగించే పట్టుపానుపు, బంగారు నవారుమంచం ఈ సభ అరలోనే భద్రపరచబడతాయి. రాత్రి ఏకాంత సేవా సమయంలో శ్రీ స్వామివారికి ఉపయోగించే చందనం మున్నగు పరిమళ ద్రవ్యాలు, ఈ గదిసిద్ధంగా వుంచుకొని ఉపయోగిస్తారు శ్రీవారి అర్చక పరిచారకులు.

ఇలా స్వామివారికి సంబంధించిన పవిత్ర సుగంధ ద్రవ్యాలను భద్రపరిచే గదిగా ప్రసిద్ధిపొందిన ఈ సభ అరకు భక్తితో నమస్కరించుదాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 57. సంకీర్తన భండారం

ఇదిగో! ఈ విమాన ప్రదక్షిణమార్గంలోనే సభ అర (సభేరా) గదిని ఆనుకొని దక్షిణాభిముఖంగా ముందుకు చొచ్చుకొని శిల్పశోభితమై పెద్దపెద్ద చెక్కడపు రాళ్లతో నిర్మింపబడివున్నగదే 'సంకీర్తన భండారం'. దీన్నే 'తాళ్లపాకం అర' అని కూడా అంటారు. అదిగో ఈ అరకు 'అన్నమాచార్యుల భాండాగారం' అనే ఫలకం వేలాడదీశారు చూడండి!

ఈ భాండారపు గదికి చెక్కతలుపులు బిగింపబడిన చిన్న ద్వారం వుంది. ఈ ద్వారానికి ఇరువైపులా తమచేతులతో అరను చూపుతూ, భుజాలమీది దండెలను మీటుతూ వున్న శిల్పమూర్తులను చూడండి.

ఇలా ఈ సంకీర్తన భాండారానికి ఇరువైపులా దండెలను (తంబూరా) మీటుతూ పాడుతూ వాగ్గేయకారుల వేషంలో వున్నవారిలో వయోభేదాన్ని అనుసరించి, ఆ విగ్రహాల ముఖకవళికలననుసరించి, తూర్పు వైపునవున్నది (కుడిచేత్తో అరను చూపుతూవున్నది) అన్నమాచార్యుల విగ్రహమనీ, అలాగే అరకు పడమటిదిక్కున ఎడమచేత్తో అరను చూపుతున్నది పెదతిరు

మలాచార్యులవారి విగ్రహమనీ పరిశోధక వరేణ్యులైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి నిర్ధారించినారు. వారి నిర్ధారణను తర్వాతి తర్వాతి పండిత పరిశోధకులెందరో దానిని రూఢిపరచినారు.

తాళ్లపాక వంశీయులైన అన్నమాచార్యులు, ఆయన కుమారుడు పెద తిరుమలాచార్యుడు, ఇతని పుత్రుడు అయిన చినతిరుమలాచార్యులు తిరుపతి శ్రీ వేంకటేశ్వరునిపై ఎన్నో సంకీర్తనలను గానంచేశారు. మరెన్నో దండకాలను, శతకాలను చెప్పారు. ఇలా తాళ్లపాకవారే స్వయంగా తాము చెప్పిన సంకీర్తనలన్నీ రాగిరేకుల (రాగిఫలకాలు)పై చెక్కించి, తిరుమల శ్రీ స్వామివారి సన్నిధిలో ఇదిగో! ఈ విమాన ప్రదక్షిణమార్గంలో వున్న ఈ రాతి అరలో శాశ్వతంగా వుండేట్లుగా భద్రపరచినారు. అందుకే ఈ రాతి అరను 'రాగిరేకుల అర' అనీ, సంకీర్తనల రేకులున్నందువల్ల, సంకీర్తన భాండారమనీ, తాళ్లపాకవారికి సంబంధించిన అర గనుక 'తాళ్లపాకం అర' అనీ ఇలా కాలక్రమంగా వివిధ నామాలతో ఇది ప్రసిద్ధి చెందింది.

నేడు దేశమంతటా కాసెట్లద్వారా, రేడియోద్వారా, టి.వి. ద్వారా, కచ్చేరీల్లోను అందరూ వింటూవున్న తాళ్లపాకవారి సంకీర్తనలన్నింటికి తిరుమలలోని ఈ సంకీర్తన భండారమే ప్రధానమైన ఆకరము. ఆ భండారంలోని రాగిరేకులే మూలము.

తిరుమలేశుని ఆనందనిలయ విమాన ప్రదక్షిణ మార్గంలో నెలకొనివున్న ఈ సంకీర్తన భండారం, తిరుమల శ్రీవారి ఆలయ వ్యవస్థలో నాటినుండి నేటివరకు ప్రధాన స్థాన మాక్రమించడమే గాక, తెలుగు ఆధ్యాత్మిక సాహిత్య చరిత్రలోనే ఒక ప్రత్యేకస్థానాన్ని పొందింది. అంతేకాదు నేడు ఈ సంకీర్తన భండారంలో లభ్యమైన తాళ్లాపాకవారికీర్తనల ద్వారా, శ్రీ వేంకటేశ్వరుడు ఆంధ్రదేశంలోనేగాక, విశ్వవ్యాపితమై ప్రకాశిస్తూ వున్నాడు. అందువల్లే--

నే నొక్కడ లేకుండితే నీకృపకు బాత్రమేది
పూని నావల్లనే కీర్తిపొందేవు నీవు

అని అంటూ అన్నమయ్య తన కీర్తనవల్లే శ్రీ వేంకటేశ్వరునికి అత్యంత ప్రచారం కల్గిందనీ, తద్వారా తెలుగువారే గాక, అందరూ ఆ స్వామివారి అనుగ్రహానికి పాత్రులయ్యారని స్వయంగా చాటిన పరమభక్త శిరోమణి అన్నమయ్య.

పరమవైష్ణవక్షేత్రమైన వేంకటాచలంలో వైష్ణవాచార్యులు ఆరాధించి అర్చించే శ్రీ వేంకటేశ్వరుని ఆలయవ్యవస్థలో జన్మతః అద్వైతి అయిన అన్నమయ్య స్వామివారి ఉత్సవాల్లో పాలుపంచుకోవడమేగాక, శాశ్వతంగా ఆలయ ప్రాంగణంలో ఒక గదిని ఏర్పాటుచేసుకోడం మరెంతటి పరమాద్భుతం! అంతేకాదు. ఆ అరపై తమ విగ్రహాలు చెక్కించుకోవడం మరెంతటి ఆశ్చర్యం!

మరి ఇలాంటి అద్భుతాల్ని సాధించడం సామాన్యమానవునికి ఎంతవరకు సాధ్యమవుతుంది? కాదు గాక కాదు. అందువల్ల సాక్షాత్తు ఆ వేంకటేశ్వరుని ఖడ్గమయిన నందకమే అలా అన్నమయ్యగా అవతరించి ఆనందనిలయుని ఆస్థానకవిగా ఆంతరంగిక భక్తునిగా, శాశ్వతంగా నిలిచి తన సునిశితమైన 'ధార' ద్వారా శ్రీ వేంకటేశ్వరుని మహిమలను లీలలను కీర్తించినాడు.

ఇలా శ్రీ వేంకటేశ్వరుని నందకాంశజుడైన అన్నమాచార్యులు రోజు కొక్క కీర్తనకు తక్కువకాకుండా రచిస్తూ జీవితాంతం శ్రీ వేంకటేశ్వరునిపై పదకవిత లల్లినాడు. గానంచేశాడు.

యోగమార్గంబున నొకకొన్ని బుధులు
రాగిల్ల శృంగార రసరీతిఁ గొన్ని
వైరాగ్య రచనలో వాసింప గొన్ని
సారసనేత్రుపై సంకీర్తనములు
నరసత్వమున దాళసముఖముల్ గాగ
పరమతంత్రములు ముప్పదిరెండువేలు

ఇలా సుమారు 32 వేల సంకీర్తనలను రచించి, శ్రీ వేంకటేశ్వర భక్తిని ప్రచారంచేశాడు. అన్నమయ్య. శ్రీ వేంకటేశ్వరుని భక్త ప్రియత్వాన్నీ, ఆశ్రిత పక్షపాతాన్నీ లీలలను, మహిమలను సూటిగా స్పష్టంగా అన్నమయ్య పేర్కొన్నట్లుగా, ఏ పురాణాలుగానీ, ఏ గ్రంథాలుగానీ స్పష్టంచెయ్యలేదేమో అనిపిస్తుంది. అందువల్లే అన్నమయ్య రచనలన్ని అనంతమహిమాన్వితములై శ్రీనివాసుని మంత్రాల మూటలై వరలినాయి. ఈ సంకీర్తనలన్నీ సప్తగిరీశుని శృంగార నర్తనలై రవళిస్తున్నాయి. ఈ అన్నమయ్య పదాలన్నీ ఏడుకొండల నధిరోహింపజేసే పరమ పద సోపానాలుగా రూపుదిద్దుకున్నాయి. కనుకనే

అన్నమయ్య కూడ తన పదకవితా పుష్పాలను శ్రీ వేంకటేశ్వరుని పాదాలకు సమర్పిస్తూ

దాచుకో నీపాదాలకు దగ నేజేసిన పూజలివి
పూచి నీ కీరితిరూప పుష్పము లివి యయ్యా
ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించగ
తక్కినవి నీ భండారాన దాచివుండనీ
వెక్కసమగు నీనామము వెల సులభము ఫల మధికము
దిక్కై నన్నేలితి వింక నవి తీరని నాధనమయ్యా

ఏ కీర్తన అయినా సరే పాడినవారిని, ఆ గానం చేసినవారిని వొద్దికగా రక్షించే మంత్రమనీ ఘంటాపధంగా చెప్పినాడు అన్నమయ్య. ఇలా జీవితాంతము పదకవితా యజ్ఞాన్ని నిర్వహించిన అన్నమయ్య తన తరువాత కూడ తనకుమారుడైన పెద తిరుమలాచార్యులను రోజుకొక్క కీర్తనకు తక్కువ గాకుండ శ్రీ స్వామివారికి సమర్పించమని ఆదేశించి శ్రీనివాసునిలో క్రీ.శ. 1503 ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు ఐక్యమయ్యాడు.

అన్నమాచార్యులు స్వయంగా "ఒక్కసంకీర్తనే చాలు. ఒద్దికై మమ్ము రక్షించగ తక్కినవి భండారాన దాచివుండనీ" అని పేర్కొన్నందువల్ల పరమ భక్తుడైన అన్నమయ్య నాటికే విమానప్రదక్షిణ మార్గంలోని ఈ 'సంకీర్తన భండారం' నిర్మాణానికి నాంది అయ్యిందని చెప్పవచ్చు. తాళ్లపాక అన్నమాచార్యుల నాటికి కీర్తనలన్నీ తాటాకుల్లోనే రాయబడినాయి. అన్నమయ్య తనకీర్తనలన్ని శాశ్వతంగా రాగిరేకుల్లో చెక్కించమని పెదతిరుమలయ్యను ఆదేశించి వుంటాడు. కాని తానుమాత్రం రాగిరేకులను చూడలేదనే స్పష్టంగా చెప్పవచ్చు. అన్నమయ్య తర్వాతనే ఈ రాగిరేకుల కార్యక్రమం, సంకీర్తన భండారపు నిర్మాణం పెద్దతిరుమలయ్య చేతుల మీదుగా జరిగింది. ఆ తర్వాత అనగా క్రీ.శ. 1525-30 ప్రాంతాలలో ఈ 'సంకీర్తన భాండారం' పూర్తిగా నిర్మాణం జరిగిందని అందులో తాళ్లపాక అన్నమాచార్యులు, పెదతిరుమలాచార్యుల, చినతిరుమలాచార్యుల వారల పదకవితలన్నీ రాగి రేకులపైన ఎక్కించి, ఆ రేకులన్నీ ఈ 'తాళ్లపాకం అర'లో భద్రపరచబడినట్లు విశ్వసించవచ్చు.

అయితే తాళ్లపాక కవుల కీర్తనలన్నీ రాగిరేకుల కెక్కించడంలోను తాళ్లపాక అర నిర్మాణంలోను విజయనగరచక్రవర్తి అచ్యుతరాయలు, పెద తిరుమలాచార్యులకు సహకరించినాడు. తాళ్లపాక కవులరాగిరేకులు భద్రప రచిన ఈ అరను గురించి క్రీ.శ. 1541 నాటి శాసనంలో ప్రస్తావన వుంది. ఆనాటినుంచి ఆ తర్వాత జరిగే బ్రహ్మోత్సవాల్లో 'తాళ్లపాకవారి అర' అని పిలువబడే ఈ 'సంకీర్తన భండారం' వద్ద అఖండ దీపారాధనలు, పూజానివేదనలు ఘనంగా నిర్వహింపబడినట్లు భక్తులకు అతిరసాల ప్రసా దాన్ని వితరణ చేయబడినట్లు ఆ శాసనం వల్ల వెల్లడౌతున్నది. అంతేకాదు ఆ భాండారం ముందు 'సంకీర్తన అరళప్పాడు' అనే పేరుతో సంకీర్తన కార్యక్రమం అత్యంత వైభవంగా జరుపబడేదని తెలుస్తున్నది.

అంతేగాక క్రీ.శ. 1545 ప్రాంతంలో ప్రతిసంవత్సరం వేసవి సమ యంలో 20 రోజులపాటు తిరుమలలో శ్రీ స్వామివారి 'కోడైతిరునాళ్లు' అనే గ్రీష్మోత్సవాలు జరుపబడేవనీ, ఆ సందర్భంలో తాళ్లపాక వారి అరవద్ద శ్రీ స్వామివారికి నివేదనలు జరిగేవని తెలియవస్తున్నది.

నేటికీ ప్రతిసంవత్సరం ఉగాది మొదలు 40 రోజులపాటు జరిగే నిత్యో త్సవంలో ప్రతిరోజు ఈ సంకీర్తనభండారం వద్ద శ్రీ మలయప్పస్వామివారికి తాళ్లపాకవారి హారతి జరుపబడుతున్నది.

తిరుమల శ్రీవారి ఆలయప్రాంగణంలో ఇంతటి ప్రాధాన్యాన్ని సంత రించుకున్న ఈ 'సంకీర్తన భండారం'లో భద్ర పరచబడిన రాగిరేకులన్నీ ఒకే పరిమాణంలో లేవు. వాటి పరిమాణాలను బట్టి ఉపయోగాలను బట్టి ఈ రాగిరేకులు నాలుగు విధాలుగా వింగడింపబడినాయి.

**సాధారణరేకులు (సా. రే):** తాళ్లపాక కవులంద రివి కలిసి ఇప్పటికి లభ్యమైన సాధారణరేకులు మొత్తం 2531. ఈ రేకులన్నీ చాలకొద్ది తేడాతో ఇంచుమించుగా $15\frac{1}{2}$ అంగుళాలపొడవు. 7 అంగుళాల వెడల్పును కలిగివున్నాయి. ఇవి ఒకచోట స్థిరంగా దేవాలయాలలో (గ్రంథాలయాలలాగ) వుంచేవారు.

**పెద్దరేకులు (పె. రే):** ఇవి మాత్రం లభ్యమైనవి మొత్తం 36 రేకులు. వీటిని రాగిబండలు అనీ, బండరేకులు అనీ అంటారు. ఇవి 28

అంగుళాల పొడవు, 16 అంగుళాల వెడల్పు కల్గివున్నాయి. ఈ పెద్దరేకులు 5 లేదా 6 వంతున గుత్తిగా ఒక కడియంతో బిగింపబడివున్నాయి.

వీటికివున్న కడియాలలో పెద్దకఱ్ఱలను దూర్చి ఒకచోటునుంచి మరో చోటికి భుజాల మీద డోలీలాగ, కావడిలాగ మోస్తూ కీర్తనలు ప్రచారం చెయ్యడానికి ఉద్దేశించబడినవి ఈ పెద్దరేకులు.

ఈ బండరేకులలో కడియాలతో వున్నవాటిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి అహోబలక్షేత్రానికి స్వయంగా వెళ్లి అన్వేషించి సేకరించినారు.

**శాసనపు రేకులు (శా. రే):** లభ్యమైన మొత్తంరేకులు 10. ఇవి ఒక్కొక్కటి 11 అంగుళాల పొడవు 8 అంగుళాల వెడల్పు కలిగివున్నాయి. ఇవికూడ ఇనుప కడియాలతో 4,5 రేకులు గుత్తిగా కట్టబడినాయి.

**నిడు రేకులు (ని. రే):** ఇవి తాళపత్రాకృతిలో వున్న పొడవైన రేకులు. ఇవి మొత్తం లభ్యమైనవి 119 రేకులు. ఇవికాక వీని అసమగ్రతుంటలు 5. ఈ రేకులు 33 అంగుళాల పొడవు. $2\frac{1}{2}$ అంగుళాల వెడల్పును కలిగివుండి తాటాకు గ్రంథాలను పోలివున్నాయి.

ఈ 'సంకీర్తన భండారం'లో లభ్యమైన రేకులను 1. సాధారణ రేకులు; 2. పెద్దరేకులు; 3. శాసనపు రేకులు; 4. తాళ్లపత్రాకృతి రేకులు అని నాలుగు విధాలుగా పై విధంగా వింగడింపబడినాయి. వీటిలో కాలాంతరంలో లుప్తమైపోయినవి పోగా, ఇప్పటికి లభ్యమైన రేకుల వివరాలు వాటి సంఖ్యను ఇంతకుముందే తెలుసుకున్నాం. అందులోను ఎక్కువ సంఖ్యలో లభ్యమైన సాధారణరాగిరేకులు మాత్రమే కవులవారీగా, రచనలవారీగా వింగడింపబడినాయి. ఆ వివరాలు క్లుప్తంగా పరిశీలిద్దాం.

సాధారణరేకులుగా పిలువబడుతున్నవి మొత్తం 2531 రేకులు లభ్యమయ్యాయి. ఇందులో:

| | |
|---|---|
| తాళ్లపాక అన్నమాచార్యులవారివి | = 2289 రేకులు |
| పెద తిరుమలాచార్యులవి | = 205 రేకులు |
| చిన్న తిరుమలాచార్యులవి | = 37 రేకులు. |

## అన్నమాచార్యుల సాధారణ రేకులు

అన్నమాచార్యులవారి సాధారణ రేకులు మొత్తం 2289. వీటిలో

| | | |
|---|---|---|
| 'శృంగారమంజరి' అనే మంజరీద్విపదలు కలిగిన | - | రేకులు 5 |
| అధ్యాత్మ సంకీర్తనలు | - | రేకులు 363 |
| శృంగార సంకీర్తనల | - | రేకులు 1921. |

## పెదతిరుమలాచార్యుల సాధారణ రేకులు

అన్నమాచార్యుల కుమారుడైన పెదతిరుమలాచార్యులవారికి సంబంధించిన సాధారణ రేకులు ఇంతవరకు లభ్యమైనవి 205. వీటిలో—

| | | |
|---|---|---|
| సీసపద్య శతకం | - | 10 రేకులు |
| చక్రవాళమంజరి | - | 2 రేకులు |
| సుదర్శన రగడ | - | 1 రేకు |
| శృంగార దండకం | - | 3 రేకులు |
| రేఫ అకారములు | - | 4 రేకులు |
| వేంకటేశ్వరోదాహరణము | - | 3 రేకులు |
| వృత్త పద్య శతకం | - | 7 రేకులు |
| వైరాగ్యవచనమాలికాగీతములు | - | 10 రేకులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | - | 76 రేకులు |
| శృంగార సంకీర్తనలు | - | 89 రేకులు. |

## చినతిరుమలాచార్యుల సాధారణ రేకులు

అన్నమాచార్యుల పౌత్రుడు పెద్ద తిరుమలాచార్యులవారి పుత్రుడైన చిన్న తిరుమలాచార్యులవారి సాధారణ రాగిరేకులు లభ్యమైనవి 37 మాత్రమే. ఇందులో —

| | | |
|---|---|---|
| అష్ట భాషా దండకం | - | 3 రేకులు |
| సంకీర్తన లక్షణములు | - | 4 రేకులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | - | 10 రేకులు |
| శృంగార సంకీర్తనలు | - | 20 రేకులు. |

# తాళ్లపాక కవుల రాగిరేకుల వాఙ్మయం పరిష్కర్తలు

తిరుమల తిరుపతి దేవస్థానం, ఈ 'సంకీర్తన భండారం' ద్వారా లభ్యమైన రాగిరేకులమీది తాళ్లపాకవారి సాహిత్యాన్ని 1922-23 నుంచి పరిష్కరింపచేసి ప్రచురింప జేస్తూనే వుంది.

క్రీస్తుశకం 1919 నుండి 1946 డిసెంబరు వరకు తిరుమల తిరుపతి దేవస్థానంలో, ముఖ్యంగా తిరుమల శ్రీవారి ఆలయంలో 'అముల్దారు'గా 'పారుపత్యదారు'గా పేష్కారుగా, 'పురాతత్త్వ శాసన పరిశోధకుడు'గా ఇలా వివిధ హోదాల్లో పనిచేసిన శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దృష్టి ఈ సంకీర్తన భండారంపై పడటంతోనే తాళ్లపాక సాహిత్యం వెలుగు చూచింది. సుమారు ఆనాటి శ్రీవారిఆలయం ముప్పై ఏళ్ల చరిత్రే శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి జీవితంగా, అభివర్ణిస్తే కూడ అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. ఒకవైపు తిరుమల శ్రీవారి ఆలయం ప్రాకారాల మీది శాసనాల పరిశోధన చేస్తూనే, పేష్కారుగా తిరుమల ఆలయ పూజాదికార్యక్రమాలు, ఉత్సవాదులు, యాత్రికుల దర్శనాదులను, వసతి సౌకర్యాదులను పర్యవేక్షిస్తూ నిరంతరం నిరాడంబరంగా సేవ చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలను పరిష్కరించి 6 సంపుటాలుగా ముద్రించారు. 1923లో ఈ భాండారంలో దాగివున్న తాళ్లపాక కవుల రాగిరేకుల నన్నింటిని వెలికి తీయించారు. అప్పటి దేవస్థానం తెలుగు పండితులైన శ్రీ కలబరిగి వెంకటరమణశాస్త్రిగారితో ఆ రాగిరేకులమీది సాహిత్యాన్నంతా ఎత్తి రాయించి పరిష్కరింపజేశారు. ఈ కార్యక్రమం 1930 దాకా సాగింది. ఇలా తొలి తాళ్లపాక వాఙ్మయోద్ధారకునిగా శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి పేరు దక్కింది.

అంతేకాదు క్రీస్తుశకం 1408 వైశాఖ పౌర్ణమి నాడే అన్నమాచార్యుల జన్మదినం అని సహేతుకంగా నిర్ణయించారు. వీరి నిర్ణయమే తర్వాతి పండిత కవులు నిర్ధారించగా, తిరుమల తిరుపతి దేవస్థానంవారు కూడా ప్రతిసంవత్సరం ఆ తేదీనాటికే అన్నమాచార్యుల జయంతి ఉత్సవాలు నిర్వహిస్తున్నారు.

కాని 1931లో శ్రీవేంకటేశ్వరస్వామివారి ఉత్సవమూర్తి అయిన శ్రీ మలయప్పకు గద్వాలరాణి వజ్రకిరీటం తయారుచేయ సంకల్పించింది. ఆ కార్యక్రమాన్ని పర్యవేక్షించడం కోసమే శ్రీసాధు సుబ్రహ్మణ్యశాస్త్రి మద్రాసుకు బదిలీ అయ్యారు. ఈ కార్యక్రమం సుమారు రెండేళ్లపాటు కొనసాగింది. ఈ రెండేళ్ల మధ్యకాలంలోనే శ్రీశాస్త్రిగారు పరిష్కరింపచేసిన సాహిత్యమంతా చాలవరకు నష్టమైపోగా అందులో మిగిలిన వాటిని, పండిత విజయరాఘవాచార్యులు, (ఎపిగ్రపిస్టు, తి.తి. దేవస్థానం) "తాళ్లపాక కవుల లఘుకృతులు (The minor works of Tallapaka poets)" మొదటి సంపుటంగా 1935లోను, అధ్యాత్మసంకీర్తనలు 1936 లో రెండవ సంపుటంగాను, శృంగారసంకీర్తనలు 1937 లో మూడవ సంపుటంగా పరిష్కరించి ప్రచురించారు. ఈ సంపుటాలు ప్రాచీన లిపి పద్ధతిలోనే అనగా వలపలగిలక, రేఫ ఱకారాలతోను, ఇవి ఫలానావారివి అని వింగడింపు లేకనే తాళ్లపాక కవులందరి కొన్ని కీర్తనలు ప్రచురింపబడినవి.

ఆ తర్వాత 1945 లో తి.తి. దేవస్థానం వారి ప్రాచ్య కళాశాల తెలుగు శాఖాధ్యక్షులుగా వున్న పండిత ప్రభాకరులైన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి, కరస్పర్శ 1930 నుండి 1945 వరకు అసూర్యంపశ్యలా వున్న ఈ రాగిరేకులకు కలిగింది. అంతే ఆ రాగిరేకులలోనుంచి సప్తస్వర సరాగాలు నినదిస్తూ, సప్తగిరుల సానువులు దాటి తెలుగునాట ప్రతిధ్వనించాయి. ఆ వేంకటరాయుని వర్ణించే అన్నమయ్య పదకవితా వాగ్దేవి ఆనందనిలయుని ప్రాంగణాన, సంగీత సాహిత్య నృత్య సమ్మిళితమై త్రివేణీ సంగమంగా పెల్లుబికి నర్తనమాడింది. అది అంతటితో ఆగలేదు. తిరుమలేశుని దరహాసాలను విరజిమ్మే కరుణరస దరహాస ప్రవాహాలతో ఏడుకొండలు దిగి తెలుగునాట మాత్రమే గాక విశ్వమంతటా ఏరులై పొంగులు వారింది.

సమగ్రమైన పరిష్కర్తలుగా, పరిశోధకులుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్న శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, తాళ్లపాక కవుల రాగిరేకుల నన్నింటిని ఇవి ఫలానావారివి, ఇవి ఫలానావారివి అని వింగడించడమేగాక, అన్నమాచార్యులవారి సంకీర్తనల రెండు సంపుటాలను సంస్కరించి ప్రచురించారు. వీటితోపాటు 'అన్నమాచార్య చరిత్ర - పీఠిక' అనే గ్రంథాన్ని వెలయించారు. ఇందులో చిన్నన్న రాసిన అన్నమయ్య ద్విపద చరిత్రతోపాటు

సోదాహరణంగా అన్నమాచార్యుల వారి చరిత్ర పీఠికను సంతరించారు. ఈ గ్రంథంలో శ్రీ వేటూరి వారు స్పృశించని విషయంగాని, పరిశోధనాంశంగాని లేదని ఘంటాపథంగా చెప్పవచ్చు.

నేడు విలువలు పలువలుగా సాగుతున్న అన్నమయ్య వాఙ్మయ పరిశోధనాంశాలన్నీ శ్రీవేటూరివారి 'అన్నమాచార్య చరిత్ర పీఠిక'లో సంక్షిప్తంగా పేర్కొనబడి వున్నాయన్న సత్యాన్ని గుర్తించినదో వారి కూలంకషమైన పరిశోధన పరిష్కరణ అంశాలు మనకు అవగతమవుతాయి.

ఇదిగాక పెద్దతిరుమలయ్య వచనాలను 'వైరాగ్యవచన మాలికలు' అనే సంపుటంగా పరిష్కరించి ముద్రించారు.

ఆ తర్వాత శ్రీమాన్ ఏ.వి. శ్రీనివాసాచార్యులు, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, శ్రీ పి.టి. జగన్నాథరావు, శ్రీ గౌరిపెద్దిరామసుబ్బశర్మ తాళ్లపాకకవుల సాధారణరాగిరేకులలోని పదకవితా సాహిత్యాన్ని పరిష్కరించి ప్రచురించారు.

ఈ సక్రమమైన పరిష్కరణ కార్యక్రమంలో ఆద్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి కాగా, చివరగా వాటిని సంపూర్తిచేస్తూ ఎక్కువ సంపుటాలను పరిష్కరించి ప్రచురించిన వారు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు. అంతమాత్రమేగాక శ్రీ గౌరిపెద్దివారు పూర్వముద్రితమైన అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలన్నింటిని వందరేకుల కొక సంపుటం చొప్పున 4 సంపుటాలను పునః పరిష్కరించారు. వీరు వెలయించిన సంపుటాలన్నింటికి అమూల్యమయిన పీఠికలను సంతరించారు. తి.తి. దేవస్థానం ఈ పరిష్కరణ కోసమే 1979లో "అన్నమాచార్య వాఙ్మయ ప్రాజెక్టు"ను ఏర్పాటుచేసి శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మను స్పెషలాఫీసరుగా నియమించింది. ఆ సందర్భంలోనే శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారికి తాళ్లపాక వాఙ్మయ పరిష్కరణలో సహాయకుడుగా ఈ రచయిత (జూలకంటి బాలసుబ్రహ్మణ్యం,) నియమింపబడి పనిచేశాడు. మొట్టమొదటి నుంచి ఎవరెవరు ఏ యే సంపుటాలను ఎప్పుడెప్పుడు పరిష్కరించారో పూర్తి వివరాలను తెలియగోరే పాఠకులు, పరిశోధకులు శ్రీ గౌరిపెద్దివారు పరిష్కరించిన అన్నమాచార్యులవారి అధ్యాత్మ సంకీర్తనల 3వ సంపుటంలోని పీఠికను చూడవచ్చు.

ఇలా పైన పేర్కొన్న పండితులందరి దృష్టి, పరిశోధనా పరిష్కరణ తాళ్లపాక కవుల సాధారణ రేకుల వరకే పరిమిత మయిందని చెప్పవచ్చు. బండరేకులు అనబడే పెద్దరేకులు, శాసనపు రేకులు, నిడురేకులు ఇలా ఈ మూడురకాల రాగిరేకులలో ఏ యే అంశాలు వున్నాయి, ఏ యే పాటలు వున్నాయి అనే వాటిని క్షుణ్ణంగా పరిశీలింప బడలేదనే చెప్పవచ్చు.

ఇవిగాక శ్రీరంగంలోని శ్రీరంగనాయకుల దేవస్థానం అధీనంలో కొన్ని తాళ్లపాకవారి రాగిబండరేకులు వున్నాయని, వాటిలో కొన్నింటిని తెప్పించి శ్రీ పి.టి. జగన్నాథరావు పరిశీలించి కొన్ని పాటలు వెలువరించినట్లు వారు పరిష్కరించిన పెదతిరుమలాచార్యుల అధ్యాత్మ కీర్తనల సంపుటంవల్ల తెలుస్తున్నది. అలాగే నిడురేకులు (తాళపత్రాకృతి రేకుల్లో) కొన్ని పాటలను పరిశీలించినట్లు, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ప్రచురించిన అన్నమాచార్యుల అధ్యాత్మ కీర్తనలు 11 వ సంపుటం (1955) వల్ల తెలియవస్తున్నది. ఇంతేగాక శ్రీరాళ్లపల్లివారు ఒక్కొక్క గ్రంథంలో 54 సంకీర్తనల వంతున స్వరపరచి రెండు సంపుటాలను 1956 లో ప్రచురించారు.

ఇలాగ ప్రచురితమైన అన్నమయ్య సంకీర్తన సంపుటాలను ఆకరంగా చేసికొని ఎందరో పండితులు సాహిత్య రంగలోను, సంగీతరంగంలోను పరిశోధన చేశారు, చేస్తూనే వున్నారు.

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి విమాన ప్రదక్షిణమార్గంలో తాళ్ల పాక అర వెలసిననాటి నుండి నేటివరకు, రేపటి వరకు కూడా తన ప్రత్యేకతను, ప్రాముఖ్యతనూ చాటుతూనే వుంది.

నేటికీ అన్నమాచార్యులవారి వంశీయులు ప్రతిరోజు సుప్రభాతసేవలో బంగారు వాకిలివద్ద "మేలు కొలుపులు" పాడుతున్నారు. ప్రతిరాత్రి ఏకాంత సేవా సమయంలో జోలపాటలు, లాలిపాటలు గానంచేస్తూ శ్రీనివాసుని సుఖనిద్రకు దోహదం చేస్తున్నారు. ప్రతిరోజు తిరుమలేశునికి జరిగే నిత్య కల్యాణోత్సవంలో నిత్య కన్యాదాతలుగా తాళ్లపాకంవారు వ్యవహరిస్తూ నేటికీ నిత్య తాంబూల సత్కారాలు సగౌరవంగా అందుకొంటూనే వున్నారు. అంతేగాక, వసంతోత్సవాల్లోనూ, అభిషేకోత్సవాల్లోనూ తాళ్లపాకవారి ప్రముఖ పాత్ర సుస్పష్టం.

కోరి మమ్ము నేలినట్టి కులదైవమా! చాల
నేరిచి పెద్ద లిచ్చిన నిధానమా!

అన్నట్లు తిరుమలేశుడు తానుగా కోరికోరి ఈ తెలుగు నేలలో ఇల్లు గట్టుకొని నిలవడమేగాక, తెలుగువారిని అనుగ్రహించడం కోసమే, తన నందక ఖడ్గాన్ని అన్నమయ్యగా అవతరింపజేసుకొని తన దాతృత్వాన్నీ, తన వరప్రదానాన్ని, తన ఆశ్రిత రక్షకత్వాన్ని, తన ఆపదుద్ధారకత్వాన్నీ... ఇలా ఎన్నో ఎన్నెన్నో విధాలుగా సుస్పష్టం చేసికొని నిరంతరం భక్తులచేత పూజలందుకొంటున్నాడు. మరి ఇందుకు తెలుగువారు చేసికొన్న భాగ్యం ఎంతటిదో ఎంతెంతటిదో కొలిచి చెప్పడం ఎవరికి సాధ్యం! అది కొండలరాయని కొక్కనికే చెల్లు!!

పావనములు హరిభక్తి వి
భావనములు సర్వమంత్ర పరమరహస్యో
ద్భావనములు గాయక నిక
రావనములు తాళ్లపాక అన్నయ పదముల్.

అని ప్రసిద్ధి చెందిన పదకవితా పితామహుడైన అన్నమాచార్యులవారి పాటలను ఎవరికివారు పారాయణం చేసుకుంటూ పునీతులమవుదాం. తద్ద్వారా తిరుమలేశుని అనంత కరుణాసాగరంలో మునకలిడి తరిద్దాం!

*గోవిందా!గోవిందా!! గోవింద!!!*

## 58. సన్నిధి భాష్యకారులు

విశదోర్ధ్వపుండ్ర విలసన్ముఖాంబుజం
లలితోపవీత కలితోరు వక్షమ్
కరపద్మ వజ్రకలిత త్రిదండకం
కలయే యతీంద్ర మహనీయ విగ్రహమ్

ఇదిగో! ఈ ప్రక్కనే తాళ్లపాక వారి సంకీర్తనభండారానికి ఆనుకొని తూర్పువైపున దక్షిణాభిముఖంగా ముందుకు చొచ్చుకొని వున్న మందిరమే భగవద్రామానుజుల వారి సన్నిధి! తిరుమల శ్రీవారి ఆలయప్రాంగణంలో విమానప్రదక్షిణ ఆవరణలోని చిన్నగుడిలో వెలసివున్న శ్రీరామానుజులను

'సన్నిధి భాష్యకారులు' అనిఅంటారు. తిరుమల శ్రీనివాసుని సన్నిధిలో వేంచేసి వున్నందువల్లా, భాష్యాలను వివరిస్తూ వ్యాఖ్యానముద్రతో వున్నందు వల్లా ఇక్కడ ఈ మందిరంలో దక్షిణాభిముఖంగా దర్శనమిస్తూ వున్న రామానుజులవారికి 'సన్నిధి భాష్యకారులు' అని ప్రసిద్ధి కలిగింది. సన్నిధి భాష్యకారుల మందిరం ముఖమంటపం, గర్భమంటపం అనే రెండు భాగా లుగా నిర్మింపబడివుంది. ఇందులో 15 అడుగుల పొడవు 12 అడుగుల వెడల్పులతో నిర్మింపబడిన గర్భమండపంలో శ్రీరామానుజులవారి శిలామూర్తి, సుమారు రెండు అడుగుల ఎత్తుతో పద్మాసనస్థితిలో, వ్యాఖ్యానముద్రతో దక్షిణాభిముఖంగా స్థిరంగా ప్రతిష్ఠింపబడివుంది. అంతేగాక సుమారు $1\frac{1}{2}$ అడుగుల ఎత్తువున్న పంచలోహ విగ్రహమూర్తిగా కూడా 'చలప్రతిష్ఠ' (ఉత్సవమూర్తి)తో కూడ శ్రీరామానుజులు ప్రతిష్ఠింపబడినారు. సుమారు నాలుగు అడుగుల ఎత్తువున్న రాతి అధిష్ఠానం మీద నిర్మింపబడిన ఈ గర్భమండపంపై వేసర శైలిలో ఏకకలశగోపురం ఏర్పాటు చేయబడింది గమనించండి!

ఇదిగాక శ్రీరామానుజులు వారి మూర్తులు వున్న ఈ గర్భమండపానికి ముందు ముఖమండపం నిర్మింపబడింది. 19 అడుగుల పొడవు 12 అడుగుల వెడల్పు కొలతలు గల ఈ మండపంలో రెండు వరుసలుగా శిల్పశోభితమైన రాతిస్తంభాలున్నాయి.

తిరుమల శ్రీవారి ఆలయంలో శాశ్వతంగా శ్రీరామానుజులసన్నిధి ఎలా వెలసింది? ఎప్పుడు వెలసింది? అనే విషయాలను పరిశోధించి పరిశీలించి చూస్తే మనకు ఎన్నో అద్భుతమైన ఆశ్చర్యకరమైన ఆనందం కలిగించేటువంటి విషయాలు ఎన్నెన్నో తెలుస్తాయి.

భగవద్రామానుజులవారు రెండు మహాకార్యాలు చేశారు. అందులో మొదటిది వైష్ణవమతాన్ని అందరికీ ఆమోదయోగ్యం చేస్తూ, సంఘం లోని సమాజంలోని అత్యున్నత స్థాయినుంచి, అట్టడుగున వున్నవారందరికీ స్వీకార అర్హతను కలిగించారు.

మన సనాతనధర్మానికి, హైందవసంస్కృతికీ గుళ్లూ, గోపురాలు మూలకందాలని విశ్వసించిన శ్రీరామానుజులు దేశం నలుమూలలా సంచ

రిస్తూ ఎన్నో వైష్ణవ ఆలయాలను, శ్రీవైష్ణవక్షేత్రాలను సముద్ధరించారు. అంతమాత్రమేకాక అక్కడి క్షేత్రాల్లో, ఆలయాల్లో కలగాపులగంగా, అస్త వ్యస్తంగావున్న అర్చనా విధానాలను ఆగమోక్తంగా సంప్రదాయసిద్ధంగా తీర్చిదిద్ది ఒక సక్రమమైన ఆలయ వ్యవస్థను ఏర్పరిచిన ఘనులు మహనీయులు భగవద్రామానుజులు. ఇది వీరొనర్చిన రెండవ మహాకార్యం.

అలా వారు సముద్ధరించి పటిష్ఠమైన అర్చనాది ఆలయకార్యక్రమాలను ఏర్పరచిన క్షేత్రాల్లో ప్రథమంగా పేర్కొనదగింది ఈ వేంకటాచలక్షేత్రం.

తిరుమలక్షేత్రానికి భగవద్రామానుజుల వారికి విడదీయరాని విడదీయ లేని ఒక దివ్యఅనుబంధం పెనవేసుకుంది.

శ్రీరామానుజులు తమ 120 ఏళ్ల (1017-1137) సుదీర్ఘ జీవితం కాలంలో మూడుమారులు తిరుమల యాత్ర చేసినట్లుగా తెలుస్తోంది.

సప్తగిరులలో భాసిస్తూ ప్రసిద్ధి చెందిన తిరువేంకటాచల క్షేత్రాన్ని సాక్షాత్తు, శ్రీనివాసప్రభువుగా భావించి, ఆ దివ్యక్షేత్ర ప్రశస్తినీ, మహ త్యాన్నీ అనేక విధాలుగా లోకానికి తెలియజేసిన వైష్ణవాచార్యులు శ్రీ భగవద్రామానుజులు. అలాంటి పుణ్యస్థలాన్ని కాళ్లతో ఎక్కరాదని తొక్క కూడదని నిక్కచ్చిగా తెలియజేశారు. కాని తమ గురువులయిన తిరుమలనంబి (తిరుమల తాతాచార్యులు), శిష్యులైన అనంతాళ్వానుల వారివల్ల అప్పట్లో తిరుమల శ్రీవారి ఆలయ అర్చనాది కార్యక్రమాలు సరిగా జరగడం లేదన్న విషయాన్ని విన్నారు. అంతేకాక ఆ కార్యక్రమాలను పునఃసమీక్షించి స్థిరీక రించవలసిన అవసరం ఎంతైనా వుందనీ, పరమ పవిత్రమయిన తిరుమల క్షేత్రాన్ని అందుకోసం అధిరోహించడంలో తప్పులేదన్న వారి ప్రార్థనను ఆచార్యులు మన్నించారు. అందువల్లే తిరుమలక్షేత్ర సముద్ధరణకోసం విధిలేక మోకాళ్లతో మాత్రమే అధిరోహించి అత్యంత భక్తి ప్రపత్తులలో శ్రీ వేంకటాచలక్షేత్రాన్ని అభివృద్ధి చేశారు.

తొలిగా తిరుమలకొండను మోకాళ్లతో ఎక్కుతూవున్న సమయంలోనే రామానుజాచార్యులు మోకాళ్లమిట్ట దగ్గర కాసేపు విశ్రాంతి తీసుకున్నారట. అందుకు గుర్తుగా ఆ పవిత్రస్థలంలో తదనంతరకాలంలో భగవద్రామానుజుల మందిరం ఏర్పాటు చెయ్యబడింది. తిరుమల తిరుపతి కాలినడక దారిలో

మోకాళ్లమిట్ట మధ్యలో వున్న ఈ మందిరంలో వెలసిన రామానుజులవారివి దోవభాష్యకారులంటారు. నడక దోవలో వున్న ఈ దోవభాష్యకారులకు తిరుమల శ్రీవారి ఆలయం నుండి నిత్యమూ నివేదనలు తెచ్చి సమర్పింప బడుతున్నాయి.

తిరుమల క్షేత్రం చేరుకొన్న తర్వాత రామానుజులు క్షేత్ర సంప్ర దాయం ప్రకారం మొదట శ్రీభూసమేతఆదివరాహస్వామివారిని దర్శించి నారు. అక్కడ క్షేత్ర సంప్రదాయం ప్రకారం జరుగవలసిన మొదటి పూజ, మొదటినైవేద్యం, మొదటి దర్శనం ఇత్యాది నియమాలను మళ్లా పునరుద్ధరించారు. ఆ తర్వాతనే ఆనందనిలయంలోని శ్రీనివాస ప్రభువులను సందర్శించారు. ఆనందనిలయం అంతర్భాగంలో వెలసిన శ్రీవారి కౌతుక, స్నపన, బలి, ఉత్సవ, ధ్రువబేరాలను దర్శించారు.

పంచాస్త్రుకోటుల భావంబు మించి
పంచ విగ్రహముల భాసిల్లి, పసిడి
గజ్జలు నందియల్ కనకాంబరంబు
గొజ్జంగి ముత్యాల కుచ్చు కటారి...

దర్శించినారట.... ఇంకా

మకరకుండలములు మణికిరీటంబు
వికసిత ధవళారవిందనేత్రములు
చల్లని చూపును జారునాసికయు
దెల్లని మెరుగు ముత్తియపునామమును
గలిగి యెంతయును శృంగారభావంబు
మలయు నయ్యలమేలుమంగామనోజ్ఞు
సేవించి ప్రణమిల్లి చేరిసన్నుతులు
గావించి పులకిత గాత్రుడై చెలగి
శ్రీరంగమున నున్న శేషపర్యంకు
డీరూపమున వచ్చి యిట బొడచూపె.
బరతత్త్వమితండె! పరయోగిహృదయ!

పరిపూర్ణు డితడె! శ్రీపతియు నితడె!
పరమకారుణికుడు! భక్తవత్సలుడు!
పరవాసుదేవుడీ పంకజాక్షుండె!
జగములు పొడమింప, సమయింప బ్రోవ
దగువాడు నితడె యీ ధరణీ ధరంబె
వైకుంఠ మితని కెవ్వరు సరిగలరె.

అని భావిస్తూ ఆ శ్రీరంగనాథుడే ఈ అలమేలుమంగావల్లభుడైన శ్రీనివాసునిగా దివ్యదర్శనాన్ని అనుగ్రహిస్తూ వున్నడంటూ శ్రీరామానుజాచార్యులు కీర్తించినారు.

కాని అప్పటికే కొన్నివేలసంవత్సరాలపాటు శ్రీవేంకటాచలపతి

పద్మావతీం విశాలాక్షీం భగవానాత్మ వక్షసి
అరిశంఖ విహీనోఽసౌ కటిన్యస్త కరోత్తమః
దర్శయన్ పాణినైకేన దక్షిణేన వృషాకపిః
పదపద్మం సురారాజ్యం గతిం చ పరమాం నృణామ్
కటిన్యస్త కరేణాపి నిదపాదాబ్జకామినామ్
నృణాం భవపయోరాశిం కటి దఘ్నం ప్రదర్శయన్
విరాజతే వేంకటేశః సంప్రత్యపి రమాపతిః

పరమదయాస్వరూపిణి కరుణాస్వరూపిణి యగు శ్రీ మహాలక్ష్మిని తన దివ్యవక్షఃస్థలంలో వుంచుకొని భయాన్ని కలిగించే శంఖచక్రాలను ధరించకుండా పరమశాంతస్వరూపంతో వరదకటిహస్తాలతో మానవుల సంసార భయాలను దుఃఖాలను నిశ్శేషంగా పోగొడుతూ శ్రీనివాసుడయిన శ్రీ వేంకటేశ్వరుడు పరమానందాన్ని కలిగిస్తూవున్నాడట! ఇలా వేల సంవత్సరాల నుంచి దర్శనమిస్తూవున్న సాక్షాత్తు శ్రీ మన్నారాయణుని దర్శించిన భక్తులు శంఖ చక్రాలు లేని ఈ స్వామిని శివుడనీ, శక్తి అనీ, కుమారస్వామి అనీ, వీరభద్రుడనీ, ఇలా ఎన్నెన్నో విధాలుగా తలుస్తూ అర్చిస్తూ వుండినారు. కేవలం అర్చించి ఆరాధించడమేకాదు. వారిలోవారికి తర్జన భర్జనలు జరిగాయి. కొందరికి ఘర్షణలు జరిగాయి. వాదోపవాదాలు జరిగాయి.

ఇలాంటి సమయంలోనే భగవద్రామానుజులవారు తిరుమలను సందర్శించి, ఆ స్వామివారు సాక్షాత్తు పరంబ్రహ్మమైన శ్రీమన్నారాయణుడని, నిరూపిస్తూ తన తపోశక్తిచేత ఆ శ్రీనివాసునికి శంఖచక్రాంకనం చేయించి వక్షఃస్థల మహాలక్ష్మితో విరాజిల్లుతున్న ఈ స్వామి సాక్షాత్తు, శ్రీ మహావిష్ణువే అని ఘంటాపథంగా లోకానికి చాటడమేగాక సాక్షాత్తు ఆ స్వామివారికే గురుస్థానమలంకరించి, తిరుమల శ్రీవారి ఆలయంలో ప్రత్యేకస్థానాన్ని పొందినారు.

అంతేకాక రామానుజాచార్యులు పాంచరాత్రాగమ శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందిన వారైనా, తిరుమల తిరుపతి ఆలయాలలో జరుగుతూవున్న వైఖానసాగమ సంప్రదాయ పూజలన్నింటికీ ఏమాత్రం విఘాతం కలగకుండా వాటిని సక్రమంగా నిర్వహించునట్లు పర్యవేక్షించారు.విష్వక్సేన ఏకాంగి (సేనాపతి జీయరు) అనే బ్రహ్మచారిని నియమించి, తిరుమలేశునికి జరిగే అన్ని సేవల్లోను, ఆరాధనల్లోనూ, భక్తి ప్రపత్తులతోను, వినయవినమ్రలతోను త్రికరణశుద్ధిగా సేవాకైంకర్యం చేసేట్లుగా ఏర్పాటుచేశారు. ఆయనే ఆ తర్వాత 'వేంకటశఠకోపయతి' అని పేరుతో సన్యాసం స్వీకరించి జీయరుగా అయ్యారు. అప్పటినుంచి నేటివరకు జీయరులనే వైష్ణవాచార్య పరంపర కొనసాగేట్లుగా చూసిన 'పెరియజీయరు' శ్రీరామానుజస్వామి.

నేటికీ సుప్రభాతం పఠించే సమయంలో 'సన్నిధిగొల్ల' బంగారువాకిలి తాళాలు తీసి ఆ వాకిళ్లను తెరచి తొలుత దివిటితో లోనికి ప్రవేశిస్తాడు. ఆ వెనువెంటనే అర్చకులు 'కౌసల్యా సుప్రజారామా!...' అంటూ సుప్రభాతస్తవాన్ని పఠిస్తూ లోనికి వెళతారు. ఆ వెను వెంటనే భగవద్రామానుజుల ప్రతినిధిగా 'ఏకాంగి' లోనికి వెళ్లిన వెంటనే బంగారువాకిళ్లను వెంటనే మూసివేస్తారు. బయట బంగారువాకిలిముందు పండితులచేత సుప్రభాతపఠనం సాగుతూనే వుంటుంది.

బంగారువాకిళ్ల లోపల దివిటీ వెలుగులో 'గొల్ల' కులశేఖరపడి వరకు తీసుకెళతాడు. అర్చకులు, ఏకాంగి, కులశేఖరపడి దాటి లోనికి వెళతారు. సన్నిధిగొల్ల చేతిలోని దివిటీని ఏకాంగి తీసుకొని శ్రీవారి సన్నిధిలో గర్భాలయంలో జ్యోతులను వెలిగిస్తారు. ఇలాగ ప్రతిరోజు సుప్రభాత

సమయాన శ్రీస్వామివారి సన్నిధిలో ఆనందనిలయంలో దీప జ్యోతులను వెలిగించే కార్యక్రమంతో శ్రీరామానుజులసేవ ప్రారంభమవుతుంది. అంతే కాదు. అప్పటినుండి రాత్రి ఏకాంతసేవ వరకు జరిగే ప్రతి ఉత్సవంలోను, ప్రతి ఊరేగింపులోను ప్రతి విషయంలోను భగవద్రామానుజులవారి కైంకర్యం తప్పక వుంటుంది. వుండి తీరుతుంది.

ప్రధానంగా గమనించవలసిన విషయం ఏమంటే శ్రీ వేంకటాచల క్షేత్రంలో వైఖానసాగమంప్రకారంగా అర్చనలు, ఆరాధనలు జరుపబడుతున్నాయి. అయినా ప్రతి నిత్యం శ్రీనివాసునికి నిర్వహించబడే ఏ సేవలో అయినా, ఏ పూజలో అయినా కర్పూరహారతి అయినా శ్రీవారి అర్చక స్వాములు స్వయంగా తాముతీసికొని నిర్వహించరు. అనగా పూజాద్రవ్యాలను ఏది సమర్పించాలన్నా తొలుత భగవద్రామానుజులవారి ప్రతినిధి అయిన జియ్యంగారులు లేదా వారి సహాయకులయిన 'ఏకాంగి' తమ చేతులతో స్వీకరించి, అర్చకులకు అందించడం జరుగుతుంది. ఆనాటినుంచి ఇలాగ యథాతథంగా నేటివరకు సాగుతూవున్న సంప్రదాయం.

అనగా ఆలయంలోని అర్చనాదులన్నీ వైఖానసాగమం ప్రకారంగా నిర్వహింప బడుతూ, ఆ సంప్రదాయానికి ఎలాంటి భంగం జరగకుండా రామానుజులవారి పర్యవేక్షణ, సహాయకత్వంలో శ్రీవారిఆలయకార్యక్రమాలు మరింత పరిపుష్టం చెందాయి.

*అనంతః ప్రథమం రూపం, లక్ష్మణస్తు తతః పరమ్*
*బలభద్రః తృతీయస్స్యాత్, కలౌ రామానుజః స్మృతః*

కృతయుగంలో అనంతునిగా, త్రేతాయుగంలో లక్ష్మణునిగా, ద్వాపరంలో బలరామునిగా అవతరించిన ఆదిశేషుడు ఈ కలియుగంలో భగవద్రామానుజులుగా అవతరించినాడట. అపరశేషావతారులైన శ్రీరామానుజాచార్యులు ఈ కలియుగంలో కూడ శ్రీనివాసునికి ఎన్నో సేవలు చేశారట!

రామానుజులవారు తిరుమలశ్రీవారికి కేవలం శంఖచక్రాలను మాత్రమే కాకుండా అనంతరకాలంలో ఒక నాగాభరణాన్ని కూడా సమర్పించారు. వీరనరసింహరాజు అనే ప్రభువు ఒక నాగాభరణాన్ని శ్రీస్వామివారికి సమర్పించగా, రెండు చేతులకు రెండూ వుంటేనే బాగుంటుందన్న అభిప్రాయంతో

రెండవ నాగాభరణాన్ని స్వామివారికి అలంకరింపజేసి, ఆచార్యులవారు తన శేషత్వాన్ని నిరూపించుకున్నారు.

తిరుమల శ్రీస్వామివారి ఆలయచరిత్రలో, శ్రీరామానుజులవారి చరిత్రలో శ్రీనివాసప్రభువులమూలవిరాణ్మూర్తికి ఆభరణంగా బంగారుఅలమేలు మంగప్రతిమను సమర్పించడం అత్యంత ప్రధాన ఘట్టంగా వర్ధిల్లింది.

*ద్విభుజా వ్యూహలక్ష్మీస్యాత్*
*బద్ధ పద్మాసన ప్రియా*
*శ్రీనివాసాంగమధ్యస్థా*
*సుతరాం కేశవ ప్రియా*

శ్రీవేంకటేశ్వరస్వామివారిదివ్యమంగళమూలవిరాణ్మూర్తి వక్షఃస్థలంలో "వ్యూహలక్ష్మి" అని పిలువబడే "ద్విభుజ లక్ష్మి" కొలువై వున్నారు. ఆమె రెండుచేతుల్లో రెండు పద్మాలను ధరించి, పద్మంలో ఆసీనురాలై శ్రీనివాసుని హృదయంలో కుడిప్రక్కన ముందుకు చొచ్చుకొని ఉబ్బెత్తుగా వుంది. శ్రీ అంటే లక్ష్మి. ఆమెను కలిగి వున్నందువల్లే తిరుమలేశుడు శ్రీనివాసుడిగా ప్రసిద్ధిపొందినాడు.

అలా, శ్రీస్వామివారి హృదయ పద్మంలో ముందుకు ఉబ్బెత్తుగా వున్న అలమేలుమంగ, స్వామికంటే ముందుగా భక్తుల ప్రార్థనల్ని ముందుగా వింటుంది. విని వారి వారి కోరికలను తీర్చవలసిందని స్వామివారికి బిడ్డల తరపున, భక్తుల తరపున పురుషకారము (సిఫారసు) చేస్తుంది. ఆ అమ్మవారి కోరికను కాదనలేక భక్తులందరి ఇష్టార్థాలను తీరుస్తూవున్నాడు స్వామి. తద్వారా, శ్రీవేంకటేశ్వరుని దయను పెంపొదించి, ఆయన కరుణను, ప్రేమను, వాత్సల్యాన్ని అందరిమీదా చూపించునట్లు చేస్తుంది. అసలు ఆ అమ్మ వునికివల్లే సాక్షాత్తు శ్రీమహావిష్ణువని తిరుగులేని సాక్ష్యంతో ప్రకాశిస్తూ వున్నాడు.

*మాతర్నమామి! కమలే! కమలాయతాక్షి!*
*శ్రీవిష్ణు హృత్కమలవాసిని! విశ్వమాతః!*
*క్షీరోదజే! కమలకోమల గర్భగౌరి!*
*లక్ష్మి! ప్రసీద సతతం నమతాం శరణ్యే.*

అయితే శ్రీస్వామివారి వక్షఃస్థలమీది శ్రీమహాలక్ష్మిని ఎల్లప్పుడు దర్శించ వలను పడదు. ఒక్క శుక్రవారాభిషేకసమయంలో మాత్రమే దర్శించవచ్చు. ఇక మిగిలిన సమయాల్లో వస్త్రాచ్ఛాదనతో, ఆభరణాలతో పుష్పాలంకారా లతో నిండివుంటుంది. అందువల్ల భగవద్రామానుజులవారు ఆమె దర్శనం అన్నిసమయాల్లో భక్తులందరికీ కల్గించవలెననేఉద్దేశంతో ప్రతిగా ఒక బంగారు అలమేలుమంగప్రతిమను తయారుచేయించి శ్రీస్వామివారి హృదయంలో సమర్పింపజేసి కుడివైపున అలంకరింపజేశారు. భగవద్రామానుజులు బంగారు అలమేలుమంగను సమర్పించిన రోజు శుక్లపక్షద్వాదశీ, ఉత్తరఫల్గునీ నక్షత్ర యుక్త శుక్రవారమైనందువల్లా, శ్రీస్వామివారి ఆలయంలో ఆనాటినుండి శుక్రవారాభిషేకం మరింత విశిష్టతను సంతరించుకుంది.

ఆ తర్వాతి కాలంలో భూదేవికి ప్రతిరూపంగా మరొక బంగారు ప్రతిమ శ్రీస్వామివారి మెడలో సమర్పింపబడింది. ఇప్పుడు రెండు బంగారు ప్రతిమలు వక్షఃస్థలంలో అలంకరింపబడి దర్శన మిస్తూన్నాయి. అందుకే అన్నమాచార్యులు కూడ ఒక చోట స్వామివారిని వర్ణిస్తూ - "అలమేలుమంగ తాళి మెడవాడు" అని కీర్తిస్తాడు.

అసలు శ్రీతిరుమలేశునికి ఎన్ని పేర్లున్నాయో, ఎవరికి తెలియదు కాని, రామానుజాచార్యులవారికి మాత్రం ఆ స్వామిని 'శ్రీనివాసుడు' అని పిలవడమంటేనే ఇష్టం.

వేంకటాచలక్షేత్రం పుష్పమండపమనీ, అందున్న స్వామి పుష్ప ప్రియు డనీ నమ్మాళ్వారులు చెప్పినపాశురాన్నిబట్టి తెలుసుకొన్న రామానుజాచార్యుల వారు, తిరుమలలో పుష్పకైంకర్యం చేసే నిమిత్తం అనంతాళ్వారులు అనే తన శిష్యుణ్ణి ప్రేరేపించి కొనసాగింపచేశాడు. పిదప తిరుమలకు వచ్చిన రామానుజులు అనంతాళ్వారులు చేస్తున్నపుష్పకైంకర్యాన్ని చూసి ఆనందించి నారు. అనంతాళ్వారులు తాను నిర్మించిన పూలతోటకు "శ్రీరామానుజ నందనవనం" అని నామకరణం చేసి, తనగురుభక్తిని చాటుకొన్నాడు.

శ్రీస్వామివారు అనంతళ్వారులను పరీక్షించిన విధానాన్ని తెలుసుకొని స్వామివారు ప్రతిఏటా ఆరోజు, అనంతాళ్వారులతోటకు అప్రదక్షిణంగా వేంచేయునట్లు కట్టడిచేశారు. అదే నేడు బాగ్‌సవారిగా అమలులోవుంది. [చూడు : ఈ గ్రంథంలోనే అనంతాళ్వారుల వృత్తాంతం]

తిరుమలక్షేత్రంలో పూలన్నీ శ్రీవారి పూజకేనంటూ నిర్ణయంచేసి, పూజ అనంతరంకూడ శ్రీస్వామివారిపూలు ఎవ్వరికీ ఇవ్వరాదనీ, 'పూలబావి'లోని భూదేవికోసం సమర్పించాలన్న కట్టుదిట్టం చేసినవారు రామానుజులు. సంవత్సరంలో ఒక్కరోజు మాత్రం తిరుచానూరు పంచమిరోజున మాత్రమే శ్రీస్వామివారి పుష్పమాలలు పసపుకుంకుమలతోపాటు శ్రీపద్మావతి అమ్మవారికి పంపబడునట్లు ఏర్పాటుచేసినవారు కూడ భగవద్రామానుజులే. (చూడు - 'పూలబావి')

తనకు గురువూ, మేనమామ అయిన తిరుమలనంబి తిరుమలక్షేత్రంలో చేస్తున్న తీర్థకైంకర్యం సమయంలో సాక్షాత్తు శ్రీనివాసుడు తాతా! తాతా! అంటూ బోయవాని రూపంలో వెంటపడి నీళ్లుతాగిన వృత్తాంతాన్ని గూర్చి వినిన రామానుజులవారు ఆనందించి, ఆ ఘట్టం జరిగిన రోజుకు గుర్తుగా ప్రతి ఏటా 'తణ్ణీరముదు ఉత్సవం' (ఆకాశగంగా అమృతజలోత్సవం) జరుగునట్లు ఏర్పాటు చేశారు. ఈ ఉత్సవం అధ్యయనోత్సవాల చివరి రోజున జరుగుతున్నది. (ఇందులోనే చూడు తిరుమలనంబి వృత్తాంతం).

తిరుమల శ్రీవారిసేవల్లో, కైంకర్యాల్లో నిత్యమూ పాల్గొనే జియ్యంగార్లు, తాళ్లపాకం, గమేకార్లు (వంటవారు), భజంత్రీలు మున్నగువారు, భక్తులసేవ నిమిత్తమే రామానుజులవారు ప్రతిసంవత్సరం ఉగాదినుంచి 40 రోజుల పాటు నిత్యోత్సవాలు జరుగునట్లు ఏర్పాటుచేశారు. ఉత్సవానంతరం 40 రోజులూ రామానుజులవారి సన్నిధిలో శ్రీవారి కొలువు ఆస్థానం జరుగుతుంది.

ఇంకా ఆలయంలో శ్రీయోగనరసింహస్వామిని ప్రతిష్ఠచేయించి, నిత్య పూజా నివేదనలు జరుగునట్లు ఏర్పాటు చేశారు.

తిరుమల శ్రీవారిఆలయంలో సంక్రాంతిపండుగ మరుసటిరోజు కనుమనాడు తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలోని శ్రీగోదాదేవి (ఆండాళ్) ధరించిన పూలమాలను తీసుకొనివచ్చి తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అలంకరించిన తర్వాత గోదాకల్యాణం జరుపునట్లును, ధనుర్మాసంలో సుప్రభాతానికి బదులుగా తిరుప్పావై పఠన జరుగునట్లును, తోమాలసేవ సమయంలో దివ్యప్రబంధపారాయణ, అన్ని ఉత్సవాల



శ్రీభాష్యకారులు
శ్రీరామానుజాచార్యులు
(మోకాళ్ళమిట్ట)
తిరుమల నడకదారి

సమయంలో గోష్ఠి, శాత్తుమొర..... ఇలా ఎన్నో ఏర్పాట్లను రామానుజా చార్యులు చేశారు.

వ్యాఖానముద్రతోవున్న తన శిలావిగ్రహాన్ని తాను స్వయంగా ఆలింగన చేసుకొని అనంతాళ్వారులకు బహూకరించినాడు. అదే శ్రీవారి ఆలయ ప్రాంగణంలో ప్రతిష్ఠింపబడింది. రామానుజులవారి సమక్షంలో వారిచేతుల మీదుగా ఇవ్వబడిన అతిచిన్నవయసు కలిగిన రామానుజుల విగ్రహంగా ఈ మూర్తి చరిత్రలో ప్రసిద్ధికెక్కింది. ఇక్కడి మందిరంలో రామానుజులవారి పాదుకలు కలిగిన శఠారికే "అనంతాళ్వారు" తన పేరును పెట్టుకొని తన గురుభక్తిని లోకానికి చాటుకొన్నారు అనంతాళ్వారులు.

ఇలా తిరుమల శ్రీవారిఆలయంలో వైఖానసఆగమశాస్త్ర సంప్రదాయంగా పూజలు జరుగుతున్నప్పటికీ, వాటికి ఏమాత్రం విఘాతం కలుగకుండా పర్య వేక్షిస్తూ ప్రతిపూజలోను, కైంకర్యంలోను పాలుపంచుకొంటున్నవారు భగవ ద్రామానుజాచార్యస్వామి. ఇది నేటికీ కొనసాగుతూనే వుంది. ప్రతినెల ఆర్ద్రి నక్షత్రంరోజున తిరుమలస్వామివారితో రామానుజులవారు కూడ శ్రీస్వామి వారికి అభిముఖంగా తిరుమలలో ఊరేగింపబడతారు. ఇక వైశాఖమాసంలో శ్రీరామానుజజయంతికి జరిగే పదిరోజుల ఉత్సవాల్లో, ఉత్సవానంతరం శ్రీ భాష్యకార్యసన్నిధిలో ప్రత్యేకంగా ఆస్థానం నివేదనలు ఆరాధనలు కూడ జరుగుతవి. శ్రీస్వామివారిశేషహారతి తీర్థచందన శఠారులు రామానుజులకు ప్రసాదింపబడతవి.

ప్రతిరోజు మూడుపూటలా శ్రీవేంకటేశ్వరస్వామివారికి నివేదన అయిన వెంటనే శ్రీస్వామివారికి నివేదింపబడిన దధ్యోదనం, శుద్ధాన్నం, దోసెలు.... వగైరాలు రామానుజులకు నివేదింపబడతవి.

శ్రీరామానుజులవారికంటె పూర్వం తిరుమలలో బ్రహ్మోత్సవాలు జరి గేవి కావు. మొదటిరోజున ధ్వజారోహణంమాత్రం చేసిన తర్వాత మిగిలిన బ్రహ్మోత్సవాలు తిరుచానూరులో జరిగేవి. శ్రీరామానుజులు, శ్రీవారి బ్రహ్మోత్సవాలు తిరుమలలోనే జరిగితీరవలెనని నిశ్చయించి, తిరుమల పురవీధులను విశాలంగా తీర్చిదిద్ది నిర్వహించినారు.

ఇలా తిరుమల శ్రీవారి అర్చనాది కార్యక్రమాలను, ఆలయ వ్యవ స్థను సమున్నతంగా తీర్చిదిద్ది భవిష్యత్తరాలవారికి అందించిన ఘనత శ్రీ రామానుజాచార్యులవారికి దక్కింది. శ్రీవారి ఆలయ సంప్రదాయంలో భగవద్రామానుజులను గూర్చి ఎంత చెప్పుకున్నా అసంపూర్ణమే అవుతుంది. సాక్షాత్తు శ్రీవేంకటేశ్వరునికే గురుస్థానమలంకరించి, జగద్గురువుగా భాసించిన రామానుజులవారిని తాళ్లపాక అన్నమాచార్యులవారితోపాటు మనం కూడ కీర్తించి తరించుదాం.

గతులన్ని ఖిలమైన కలియుగమందును
గతి యితడె చూపె ఘన గురుదైవము.

వెలయించె నీతడెకా వేదపురహస్యము
చలిమి నీతడే చూపె శరణాగతి
నిలిపి నా డీతడేకా నిజముద్రాధారణము
మలసి రామానుజులే మాటలాడే దైవము.

నియమము లీతడేకా నిలిపె బ్రపన్నులకు
దయతో మోక్షము చూపె దగ నీతడె
నయమై శ్రీవేంకటేశు నగమెక్కె వాకిటను
దయజూచీ మమ్ము నిట్టె తల్లి దండ్రి దైవము.

## 59. శ్రీవారి డాలర్లు

భాష్యకారులసన్నిధిని ఆనుకొని తూర్పుదిక్కున ఒక చిన్నమండపం (గది) వుంది. అందులో శ్రీ వేంకటేశ్వరస్వామివారి బంగారు డాలర్లు, వెండి డాలర్లు విక్రయింపబడతాయి. బజారులోవున్న బంగారు, వెండి ధరలనుబట్టి ఈ డాలర్ల విలువను ఎప్పటికప్పుడు నిర్ణయిస్తుంటారు.

శ్రీ వేంకటేశ్వరస్వామి, ఆనంద నిలయము, శ్రీస్వామివారు, శ్రీ పద్మావతి అమ్మవారు ముద్రలు కలిగిన 10 గ్రాములు మరియు 5 గ్రాముల బంగారు, వెండి డాలర్లు తి.తి. దేవస్థానంవారిచే ఇక్కడ మాత్రమే విక్రయింపబడతవి. ఇంకెక్కడా దొరకవు. శ్రీస్వామివారి దర్శనానంతరం యాత్రికులు భక్తులు వీటిని కొనవచ్చును.

# 60. శ్రీ యోగనరసింహస్వామి సన్నిధి

ఇదిగో! చూడండి! ఈ విమాన ప్రదక్షిణ మార్గంలోనే ఈశాన్య మూలన పశ్చిమాభిముఖంగా శ్రీయోగనరసింహస్వామిఆలయం ఉంది. ఇది ముఖమండపం, అంతరాళం, గర్భాలయం - అని మూడు భాగాలుగా నిర్మింపబడింది.

గర్భాలయంలో సుమారు 3 అడుగుల శిలావేదికపై యోగముద్రలో వున్న యోగనరసింహస్వామివారి మూర్తి పశ్చిమాభిముఖంగా ప్రతిష్ఠింపబడి వుంది. గర్భాలయం ముందున్న చిన్న గది అంతరాళం. ఇక, అంతరాళానికి ముందువున్న ముఖమండపం, శ్రీయోగనరసింహస్వామివారి ఆలయం చుట్టూ నిర్మింపబడి ప్రదక్షిణ మండపంగా కూడ తీర్చదిద్దబడింది.

ఈ నరసింహాలయం క్రీస్తుశకం 1330-1360 మధ్య నిర్మించబడిందని పరిశోధకుల అభిప్రాయం. అంతకుపూర్వం శ్రీరామానుజులవారు, తిరుమలక్షేత్రంలో మరోచోట పూజాపురస్కారాలు లేకుండావున్న ఈ యోగనరసింహుని శిలాప్రతిమను తెచ్చి ఇక్కడ ప్రతిష్ఠించినారని ప్రతీతి!

క్రీస్తుశకం 1469 లోని కందాడై రామానుజయ్యంగారి శాసనంలో ఈ యోగనరసింహుని ప్రస్తావన ఉంది. 'అళగియ సింగర్' (అందమైన సింహం) అనీ, 'వేంకటాత్తరి' (వేంకటశైలంపై నున్న సింహం) అని ఈ యోగనరసింహస్వామి శాసనాల్లో ప్రస్తావింపబడినాడు.

ఈ యోగనరసింహునికి ప్రతిదినం ప్రత్యేక పూజలు లేకపోయినా, ప్రత్యేక నివేదనలు మాత్రం జరుగుతునే వున్నై.

ప్రతి శనివారంనాడు అభిషేకం, పూజా నివేదనలు జరుపబడుతున్నాయి.

ప్రతి సంవత్సరం వైశాఖమాసంలో శ్రీ నృసింహజయంతినాడు ఘనంగా పూజలు జరుపబడుతున్నాయి. ఆ రోజు సాయంకాలం శ్రీవేంకటేశ్వర స్వామివారికి సాయంకాల ఆరాధన, తోమాలసేవ, అర్చన అయింతర్వాత 'తోమాల దోశపడి' నైవేద్యం జరుగుతుంది. ఆ తర్వాత శ్రీస్వామివారి అర్చకులు శ్రీవారి శఠారితో విమాన ప్రదక్షిణంగా ఛత్రచామర మంగళవాద్య పురస్సరంగా శ్రీయోగనరసింహుని సన్నిధికి వచ్చి శ్రీనరసింహస్వామివారికి పురుషసూక్తంతో అభిషేకం, వస్త్రాలంకరణ, పుష్పాలంకరణ చేస్తారు. ఈ

సందర్భంలో జియ్యంగార్లు మొదలైన శ్రీవైష్ణవాచార్యులు 'తిరుపల్లాండు' ఇత్యాది దివ్యప్రబంధ పాశురాలను గానం చేస్తారు. ఆ తర్వాత పానకం, వడపప్పు, చక్కెరపొంగలి, వగైరా ప్రసాదాల నివేదన జరుగుతుంది.

అటు పిమ్మట ఆస్థానం, హారతులు అయిన అనంతరం గోష్ఠి వినియో గంగా ప్రసాద వితరణ కావింపబడుతుంది.

శ్రీవారిఆలయంప్రాంగణంలోవున్న ఈయోగనరసింహునికి శ్రీస్వామి వారికి అభేదంగా అన్నమాచార్యులు ఎన్నో కీర్తనలను రాశారు. ఈ యోగనరసింహుని ఆలయ ముఖమండపంనుంచి ఆనందనిలయ విమాన దర్శనం అద్భుతావహంగా ఆనందప్రదంగా గోచరిస్తుంది. చూడండి!

ఇటు ఈ వేంకటనారసింహుణ్ణి సందర్శిస్తూ, అటు ఆనందనిలయ విమానదర్శనం చేస్తూ ముక్త కంఠంతో మనసారా స్తుతిద్దాము.

*శ్రీమత్పయోనిధి నికేతన చక్రపాణే !*
*భోగీంద్ర భోగమణిరాజిత! పుణ్యమూర్తే !*
*యోగీశ శాశ్వత శరణ్య! భవాబ్ధిపోత !*
*లక్ష్మీనృసింహ! మమదేహి కరావలంబమ్ !!*

*భక్తప్రహ్లాదవరద గోవిందా! గోవింద!!*

## 61. శంకుస్థాపన స్తంభం

శ్రీ యోగనరసింహస్వామివారిఆలయప్రదక్షిణమార్గంలో సరిగ్గా ఈశాన్య మూలకు మధ్యలో ఒక స్తంభం వుంది. తొండమానుచక్రవర్తి శ్రీ వేంక టేశ్వర స్వామివారిఆనతిమేరకు ఆనందనిలయ గోపుర ప్రాకారాదులను నిర్మించడానికి గాను ఈస్తంభం దగ్గర మొట్టమొదటి శంకుస్థాపన చేశాడని చెప్పబడుతున్నది. కాని ఇది నిజం కాకపోవచ్చు. శ్రీ యోగనృసింహస్వామి ఆలయం శంకుస్థాపన స్తంభంగా వుండవచ్చునేమో! ఈ శిలాస్తంభానికి క్రింది భాగంలో నాలుగు వైపులా ఆంజనేయస్వామి శిల్పాలు మలచబడినాయి.

ఈ స్తంభానికి ప్రదక్షిణ నమస్కారాలు చేస్తూ, కోరిన భక్తులకు కూడ స్వగృహ సౌకర్యాలు త్వరలో ఏర్పడతాయని భక్తుల విశ్వాసం. మనం కూడ గోవింద నామస్మరణ చేస్తూ ప్రదక్షిణలు చేద్దాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 62. పరిమళం అర

ఇటు రండి! ఈ యోగ నరసింహునికి ప్రదక్షిణంగా వెళదాం. ఆ! ఇటు చూడండి! ఈ యోగనరసింహుని ప్రదక్షిణమండపంలోనే దక్షిణ దిక్కునగల మార్గంలో 'పరిమళం అర' వుంది.

ప్రతి గురువారం నాడు మధ్యాహ్నవేళ ఈ అరలోవున్న సానరాతిమీద శ్రీవేంకటేశ్వరస్వామివారి తిరునామానికి వినియోగించే పచ్చ కర్పూరాన్ని మెత్తగా నూరి వుంచుకుంటారు. ఇలా మెత్తగా నూరి ఉంచుకొన్న 16 తులాల పచ్చకర్పూరపు పొడితో, మరునాడు శుక్రవారం ఉదయం అభిషేకానంతరం అలంకారాలన్నీ అయిన తర్వాత శ్రీస్వామివారికి నామం తీర్చి దిద్దుతారు. బ్రహ్మోత్సవాల సమయంలో అయితే బ్రహ్మోత్సవాలముందు, మధ్యలో తరువాత వచ్చే మూడు లేదా నాలుగు శుక్రవారాలలో శ్రీవారి నామానికి రెట్టింపు పరిమాణంలో అంటే 32 తులాల పచ్చకర్పూరం అలంకరింపబడుతుంది.

అంతేగాక ఈ పరిమళం అరలోనే ప్రతి గురువారంనాడు శుక్రవారాభిషేకానికి గాను, పచ్చకర్పూరం, పునుగు, జవ్వాది, కుంకుమపువ్వు, కస్తూరి వగైరా సుగంధ ద్రవ్యాలను కలిపి వెండి గిన్నెల్లో నింపి సిద్ధం చేస్తారు. శుక్రవారం ఉదయం అభిషేకం ఆర్జితసేవలో పాల్గొనే భక్తులకు ఈ గిన్నెలను అందిస్తారు.

ప్రతి శుక్రవారం అభిషేకానికి ముందు జియ్యంగార్ శ్రీవారికి తిరునామంగా అలంకరించే పచ్చకర్పూరం ఉన్న వెండిగిన్నెను శిరస్సుపై పెట్టుకొని వెంటరాగా, ఆలయ అధికారులు, భక్తులు ఇతర సుగంధ ద్రవ్యాలతో ఛత్ర చామర మంగళవాద్య సహితంగా పరిమళపు అరనుండి బయలుదేరి వెండివాకిలిదాటి వెళ్లి ధ్వజస్తంభానికి ప్రదక్షిణం చేస్తూ వచ్చి, విమాన ప్రదక్షిణం కావిస్తూ లోపలికి వెళ్లి శ్రీవారి సన్నిధిలో సమర్పించి, అభిషేక సేవలో పాల్గొంటారు.

తిరుమల శ్రీస్వామివారికి ఊర్ధ్వపుండ్ర సమర్పణలోను, అభిషేక సేవలోను ప్రాముఖ్యం వహించిన ఈ 'పరిమళం అర' నుండి శ్రీవారి ఆనందనిలయాన్ని దర్శిస్తూ గోవిందనామాన్ని పలుకుదాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

# 63. శ్రీవారి హుండీ (కొప్పెర)

పరిమళం అరనుండి మెట్లు దిగి నేరుగా శ్రీవారిహుండీకి నడవండి!

ఈ హుండీ బంగారువాకిలికి ఉత్తర పార్శ్వంలో గల నాలుగు స్తంభాల నడుమ ఏర్పాటు చెయ్యబడి వుంది.

శ్రీ స్వామివారి దర్శనం చేసికొని, విమాన ప్రదక్షిణం చేసి వచ్చిన భక్తులు తమ తమ మొక్కుబళ్లను, కానుకలను, నిలువుదోపిళ్లను, ఈ హుండీలో సమర్పించు కొంటారు.

బంగారు నగలు, వెండి పాత్రలు, ముడుపులు, నాణాలు, నోట్లు, వస్త్రాలు, కర్పూరం, బియ్యం కలకండ,.. ఇలా ఎన్నోరకాలైన వస్తువులను భక్తులు స్వామివారికి కానుకలుగా ఈ హుండీద్వారా సమర్పిస్తారు.

నిటారుగా పెద్ద పంచీ ఆకృతిలో ఏర్పాటుచేయబడిన తెల్లని 'కాన్వాసు గుడ్డలో పెద్ద రాగిగంగాళాన్ని దించి, పై గుడ్డను రోటివలె తాళ్లతో కట్టి వేలాడ దీస్తారు. ఈ 'కాన్వాసు' గుడ్డపై శ్రీవారి శంఖ చక్రాలు తిరునామాలు చిత్రింపబడివున్నాయి.

భక్తులు వేసే కానుకలు భద్రంగా సరాసరి గంగాళంలో పడేటట్లుగా ఏర్పాటుచేయబడిన ఈ బుర్కాగంగాళాన్ని "కొప్పెర" అని కూడా అంటారు. ఈ హుండీ గుడ్డపై గల తాళ్లపైన దేవస్థానం వారి సీళ్లు ఏడు, అలాగే జియ్యంగార్ల సీళ్లు ఆరు లక్కతో వేస్తారు. ఈ హుండీని ఏర్పాటు చేసినప్పుడు, పరకామణి నిమిత్తం విప్పేటప్పుడు అధికారులు ఈ సీళ్లు సరిగా వున్నదీ లేనిదీ తనిఖీ చేస్తారు. ఇందుకు సాక్ష్యంగా ఇద్దరు యాత్రికులు కూడ వుంటారు.

హుండీని రోజుకు రెండు మార్లు అనగా మధ్యాహ్నం రెండవ నైవేద్య కాలంలో 12 గంటల సమయంలోను, మళ్లీ రాత్రి ఏకాంత సేవా సమయంలోను విప్పదీస్తారు. మరీ యాత్రిక జనసమ్మర్దం విపరీతంగా ఉంటూ కానుకలుఎక్కువైన సమయంలో హుండీని రోజుకు మూడు, నాలుగు మారులు కూడా తీయడం కద్దు.

హుండీని ఏర్పాటు చేసిన ఈ స్థలంలో జగద్గురువులయిన శ్రీ మచ్ఛంకర భగవత్పాదులవారు శ్రీ చక్రాన్ని ప్రతిష్ఠించారని, అందువల్లే

అపరిమితమైన సంపద అసంఖ్యాకంగా ద్రవ్యరాశి ఆకర్షింపబడి ఈ హుండీ లోనికి చేరుతున్నదని అనూచానంగా, పరంపరగా వినవస్తున్నగాథ అని పెద్దల మాట.

ఇది సత్యమే. ఈ హుండీ క్రిందుగా శ్రీచక్రమున్నట్లుగా ప్రత్యక్షంగా దర్శించిన తిరుమల తిరుపతి దేవస్థానం వేద పండితులు శ్రీ రామనాథ ఘనాపాటి గారు ఈ రచయితతో (1992 లో) చెప్పారు. సుమారు 70 ఏండ్లక్రితం తాను వేదవిద్యార్థిగా వున్నప్పుడు ఆలయ అధికారులు నేలను ఎత్తు పెంచడానికిగాని హుండీ వున్న స్థలాన్ని త్రవ్వి చూడగా శ్రీచక్ర యంత్రం స్పష్టంగా గోచరించినదని అన్నారు.

ఇందువల్లనే కాబోలు ఈ ఆలయంలో ఉత్సవాలు (కల్యాణోత్సవాలు వగైరా) నిర్వహించే స్థలాలను అటుఇటు మార్పు చేశారు కాని, ఈ హుండీని (కొప్పెరను) మాత్రం ఇక్కడి నుంచి కదల్చలేదు!

శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలంలో శ్రీమహాలక్ష్మి నెలవై వున్నందువల్లే ఈ క్షేత్రంలో అంతులేని సంపద సమకూరుతున్నదని ప్రాచీనకాలం నుండి వస్తున్న విశ్వాసం! శ్రీవారివక్షఃస్థలంలో నెలకొనివున్న శ్రీదేవిని స్థిరరూపిణి యైన లక్ష్మిగాను, హుండీ ద్వారా వచ్చే అపూర్వమైన సంపదల సమూహాన్ని చర రూపిణియైనలక్ష్మిగాను భక్తులు భావిస్తారు.

ఈ రీతిగా సాక్షాత్ లక్ష్మి స్వరూపమైన శ్రీవారి హుండీకి ప్రదక్షిణం చేస్తూ మనశక్తికొద్దీకానుకలను సమర్పించుకొంటూ ఒక్కసారి చేతులు జోడిద్దాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 64. బంగారు వరలక్ష్మి

శ్రీవారి హుండీలో కానుకలు సమర్పించి బయటికి వచ్చిన వెంటనే ఎడమవైపున ప్రాకారానికి పైన నిలువెత్తు ఒక బంగారు వరలక్ష్మి ప్రతిమ అమర్చబడి వుంది. ధన వర్షాన్ని కురిపిస్తూ భక్తులను అనుగ్రహించే ఈ అమ్మ, శ్రీ స్వామివారికి సరిగ్గా ఈశాన్యంలో వుండడం విశేషం! శ్రీ స్వామివారికి కానుకలు, మొక్కుబళ్లు సమర్పించిన భక్తులకు ఈ వరలక్ష్మి ఇబ్బడిముబ్బడిగా సంపదలు ప్రసాదిస్తుందని భక్తుల విశ్వాసం.

# 65. కటాహతీర్థం (తొట్టితీర్థం)

ఇది తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి వారి ఆలయంలోనే విమాన ప్రదక్షిణ మార్గంలో అన్నమాచార్య భాండారానికి ఎదురుగా వున్నది. దీనినే తొట్టి తీర్థమని కూడా అంటారు. శ్రీస్వామివారి పాదముల నుండి వచ్చే అభిషేకతీర్థం ఇది. శ్రీ స్వామిపుష్కరిణీస్నానం, శ్రీనివాసునిదర్శనం, కటాహతీర్థపానం - ఈ మూడును త్రైలోక్య దుర్లభాలని ప్రసిద్ధి. ఈ తీర్థం శ్రీవారి హుండీకి వెలుపల ఆనుకొని తొట్టిమాదిరిగా ఎడమ దిక్కునవున్నది.

ఈ తీర్థాన్ని స్వీకరించునపుడు అష్టాక్షరి, లేదా కేశవాది నామాలో లేక, శ్రీ వేంకటేశుని మంత్రమో ఉచ్చరించాలి.

పూర్వం తుంగభద్రా నదీతీర్థంలో పద్మనాభుని పుత్రుడైన కేశవుడనే బ్రాహ్మణ యువకుడు వేశ్యాలంపటుడయ్యాడు. ధనంమీది దురాశచే ఒక విప్రుని చంపాడు. వెంటనే బ్రహ్మహత్యాపాపం భయంకర రూపంతో అతని వెంటపడింది. కేశవుడు భయంతో దేశాన్ని తిరుగుతూ, తన తండ్రి కాళ్లపై పడి రక్షించమని ప్రార్థించినాడు. అదే సమయానికి అక్కడికి వచ్చిన భరద్వాజ మహర్షి కటాహతీర్థ మహిమను తెలియజేసి, ఆ తీర్థాన్ని సేవింపజేయుమని ఆనతిచ్చినాడు. కేశవశర్మ తండ్రితో కూడ తిరుమల క్షేత్రాన్ని చేరుకొని, శ్రీ స్వామివారి కోనేట్లో స్నానమాచరించి, వరాహస్వామిని దర్శించి, శ్రీ వేంకటేశ్వరుని దర్శించి, పిదప శ్రీస్వామివారిపాదాల నుండి స్రవించే కటాహతీర్థాన్ని స్వీకరించి బ్రహ్మహత్యాపాపం నుండి విముక్తి పొందాడు.

ఈ కటాహతీర్థ జలాన్ని ఎవరైనా, ఎప్పుడైనా పానం చేయవచ్చని, స్పర్శా దోషంలేని ఆ తీర్థం, బ్రహ్మహత్యాది మహాపాపాలను తొలగించుటే గాక, కర్మరోగాలైన భయంకర వ్యాధులను కూడ పోగొడుతుందని స్కందపురాణంలో పేర్కొనబడింది.

ఈ కటాహతీర్థ మాహాత్మ్యాన్ని పరమశివుడుకూడా పూర్తిగా తెలియ లేడని ఇలా చెప్పబడింది.

**కటాహతీర్థ మాహాత్మ్యం కోవేత్తి భువనత్రయే**
**మహాదేవో విజానాతి తస్య తీర్థస్య వైభవమ్**

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 66. శ్రీ విష్వక్సేనులవారు

శ్రీవారి హుండీకి ప్రదక్షిణం చేసి వెలుపలికి వచ్చాం కదా! ఇప్పుడు ఇటు ఎడమ చేతివైపు తిరిగి నేరుగా చూడండి! అదిగో! వైకుంఠ ప్రదక్షిణ ద్వారం! దానికి ప్రక్కన చిన్న మందిరం ఉంది. రండి! లోనికి నడవండి! ఇదిగో ఈ చిన్నమందిరంలో దక్షిణాభిముఖంగా రెండడుగుల ఎత్తుగల శ్రీ విష్వక్సేనులవారి శిలామూర్తి ప్రతిష్ఠింపబడింది. దర్శించండి!

చతుర్భుజాలు, పై రెండు చేతుల్లో శంఖ చక్రాలు ధరించి కూర్చొని వున్న భంగిమలో అభయముద్రతోను ఊర్ధ్వపుండ్రాలతో వున్న వీరు శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రధాన సైన్యాధిపతి. వీరినే సైన్యనాథుడనీ, సేనాధిపతి అనీ, శ్రీ సేనమొదలియార్ అనీ అంటారు. వీరి పంచలోహ ఉత్సవ విగ్రహం ప్రస్తుతం తీర్థం ఇచ్చే చోట అంకురార్పణ మండపంలో నెలకొని ఉంది.

ఆణివర ఆస్థానం, ఉగాది, దీపావళి ఆస్థానాల్లోను, బ్రహ్మోత్సవం వంటి విశేష ఉత్సవాల్లోను సేనాధిపతి అయిన ఈ విష్వక్సేనుల వారి ఉత్సవమూర్తి ప్రధానపాత్ర వహిస్తారు.

శ్రీ స్వామివారికి సర్వ సైన్యాధ్యక్షుడయిన శ్రీ విష్వక్సేనులవారిని ప్రార్థిస్తూ భక్తితో స్తుతించండి!

యస్య ద్విరద వక్త్రాద్యాః
పారిషద్యాః పరశ్శతమ్
విఘ్నం నిఘ్నంతి సతతం
విష్వక్సేనం! తమాశ్రయే!!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 67. ముక్కోటి ప్రదక్షిణం
## (వైకుంఠప్రదక్షిణం)

విమాన ప్రదక్షిణం పూర్తిచేసినమనం అందరం ఇప్పుడు ముక్కోటి ప్రదక్షిణంలో ప్రవేశిద్దాం రండి! ఇదిగో ఇదే ముక్కోటి ప్రదక్షిణ మార్గం. దీన్నే వైకుంఠప్రదక్షిణ మార్గం అని కూడ అంటారు.

విమాన ప్రదక్షిణ మార్గంలో దక్షిణందిక్కున గర్భాలయానికి ఆనుకొని వున్న ప్రాకారానికి గల ద్వారంద్వారా ఈ వైకుంఠం లేదా ముక్కోటి ప్రదక్షిణ మార్గంలోనికి ప్రవేశించాలి. హుండీకి ప్రక్కనగల మార్గం ద్వారా బయటికి రావాలి.

శ్రీ స్వామివారిగర్భాలయప్రాకారానికి, విమానప్రదక్షిణం లోపలి ప్రాకారానికి మధ్యన వున్న ఈ మార్గమే ముక్కోటిప్రదక్షిణ మార్గం అంటారు. ప్రతి సంవత్సరం ధనుర్మాసంలో వైకుంఠ ఏకాదశి నాడు మాత్రమే ఈ ప్రదక్షిణమార్గం తెరుస్తారు. అంటే ప్రతి సంవత్సరం వైకుంఠ ఏకాదశి నాడు, అనగా దశమినాటి అర్ధరాత్రి నుండి ద్వాదశినాటి అర్ధరాత్రి వరకు తెరచి వుంచుతారు. మిగతా సమయాల్లో ఈ మార్గానికున్న ద్వారాలతో మూసివేయ బడుతుంది. వీటిని వైకుంఠద్వారాలంటారు.

శ్రీవేంకటేశ్వరస్వామివారికి చాల దగ్గరిగా ఆనుకొనివుండే ప్రదక్షిణ మార్గమే ఇది. ఈ ప్రదక్షిణ మార్గం అన్నివైపులా ఒకే కొలతలతో సమానంగా కనిపించదు. దక్షిణదిక్కునవున్నమార్గం 69'.6" పొడవు x 8'.3" వెడల్పుకలిగి వుంది. ఇందులో తూర్పునుంచి పడమటికి వరుసగా 6 రాతిస్తంభాలున్నాయి. పడమటిదిక్కునవున్న మార్గం 6'.6" పొడవు x 8'.6" వెడల్పు కలిగివుంది. ఇందులో 4 స్తంభాలున్నాయి. ఇక ఉత్తరం దిక్కున 77' పొడవు 16'.3" నుండి 18'.4" వరకు వెడల్పు కలిగివుంది. ఈ వైపున 12 స్తంభాలు (6 + 6 రెండువరుసలుగా) వున్నాయి. ఉత్తరం వైపునగల విశాలమైన ప్రదక్షిణ స్థలంలో పూర్వం శ్రీస్వామివారి ఉత్సవమూర్తులకు ఆస్థానంకొలువు వగైరాలు జరిపేవారని తెలియవస్తున్నది.

ఈ వైకుంఠమార్గం తూర్పు దిక్కున మూసివేయబడివుంది. ప్రస్తుతం "రాములవారిమేడ" అని పిలువబడే ఇరుకైన నడవ నిర్మాణంవల్ల ఈ వైకుంఠప్రదక్షిణ మార్గం తూర్పుదిక్కున మూసివేయబడిందని తలంచ వలసియున్నది.

వైకుంఠ ఏకాదశి, ద్వాదశి రోజులలో ఈ వైకుంఠ ప్రదక్షిణమార్గం విద్యుద్దీపాలతోను, పుష్పమాలలతోను శోభాయమానంగా అలంకరిస్తారు.

శ్రీ మహావైకుంఠాన్నివదలి భక్తులమీది ప్రేమచే భూలోక వైకుంఠ మయిన శేషాచలంమీద ఆనందనిలయంలో నిలిచివున్న శ్రీ వేంకటపతిని దర్శిస్తూ, వైకుంఠ ప్రదక్షిణ మార్గంలో ప్రవేశించిన వాని జన్మమే జన్మము! వాని భాగ్యమే మహాభాగ్యము!!

శ్రీ వైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీ తటే!
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్.

## 68. సాష్టాంగ నమస్కారాలు

అద్భుతావహమైన, ఆనందదాయకమైన మంగళకరమైన శ్రీ వేంకటే శ్వరస్వామివారిదివ్యమంగళ మూలవిరాణ్మూర్తి దర్శనం చేసికొనివచ్చాం. ఇంకా శ్రీవారి ఆలయంలోని ఎన్నో విషయాలను, మరెన్నో విశేషాలను తెలుసుకున్నాం- ఇప్పుడు ఇదిగో వెండివాకిలి ఎదురుగా లోపల శ్రీ రంగ నాధస్వామి దగ్గర భక్తితో సాష్టాంగనమస్కారాలుసమర్పిస్తూ, ఓ స్వామీ! ఏడుకొండల వాడా! మళ్లా దర్శనం త్వరలో అనుగ్రహించవయ్యా! ఓ ఆనందనిలయ వాసా! నీ అప్రాకృత దివ్యమనోహరమైన మూర్తిని అతిత్వరలో దర్శించేటట్లుగా నిండుగా దండిగా అనుగ్రహించుము స్వామీ! అంటూ భక్తితో నమస్కారాలు సమర్పించుదాం.

*ఏడుకొండలవాడా! గోవిందా!*
*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 69. శ్రీవారి ప్రసాదం

ఇక అందరూ ఆ సప్తగిరీశునకు సాష్టాంగ నమస్కారాలు సమర్పించారు కదా. రండి. వెండివాకిలి గుండా బయటికి రండి! వెండివాకిలికి ఉత్తరం దిక్కున అదిగో! అర్చకస్వాములు, పరిచారక స్వాములు, శ్రీవారు ఆరగించి మనకోసం మిగిల్చిన దివ్యాన్నాలను ప్రసాదంగా పంచుతూవున్నారు. మనం అందరం వరుసలో ఒకరి వైనుక ఒకరు నిలవబడి ఆ ప్రసాదాలను వినయ విన్రమతలతో, భక్తి ప్రపత్తులతో స్వీకరించి ఆరగించుదాం! అదిగో చూశారా! ప్రసాద గంగాళాలు! చక్కెరపొంగలి, పులిహోర, పొంగళ్లు, దధ్యోదనాలు

ఆహా! తిరుమలేశుడు ఆరగింపుచేసిన ఈ ప్రసాదాలు మన పాలిట దివ్యౌషధాలు. ఆ ప్రసాదాలు మనపాలిట లక్ష్మీసంపత్ప్రదాలు! రుచికరమైన ఆ దివ్య పాయసాలు మన ఆధ్యాత్మిక జీవిత దివ్యలోక ప్రాసాదాలు! ఆ ప్రసాదాలు సర్వార్థ సిద్ధిప్రదాలు!! తృప్తిగా తిరుమలేశుని ప్రసాదాలను ఆస్వాదించండి!

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయ విశేషాలన్నీ మనకు అర్థమయినంతగా, మనం అర్థం చేసుకున్నంతగా తెలుసుకున్నాం! శ్రీ స్వామివారినీ ఆనందంగా దర్శించుకున్నాం. ఆ స్వామివారి లీలలు అనంతములు. అనంతములైన ఆ విశేషాలు వేయితలలు వున్న అనంతునికే అర్థంకావట! మరి ఈ "బాలు"డేపాటి!

ఇక ఈ ఆలయం బయటా మట్టూ ఎన్నో చూడదగిన చూడవలసిన ఆలయాలున్నాయి. దర్శించవలసిన తీర్థాలెన్నో వున్నాయి తెలుసుకోవలసిన విషయాలున్నాయి. ముందుగా శ్రీవారి ఆలయం ఎదురుగా వున్న శ్రీ బేడీ ఆంజనేయస్వామివారి ఆలయాన్ని దర్శించుదాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

## 70. శ్రీ బేడీ ఆంజనేయస్వామి

ఇటు తిరుపతి నుంచి వచ్చే యాత్రికులకు భక్తులకు అటు శ్రీ వేంకటేశ్వర స్వామివారికి అనుసంధానకర్తగా తొలిగా దర్శనమిచ్చే స్వామి, రామభక్తాగ్రేసరుడైన శ్రీ బేడి ఆంజనేయస్వామి.

తిరుమల శ్రీస్వామివారి సన్నిధివీధిలో శ్రీవేంకటేశ్వరునికి అభిముఖంగా అంజలిఘటిస్తున్న భంగిమలో చేతులకు కాళ్లకు బేడీలు తగిలించుకొని, నిలిచివున్న శ్రీ బేడి ఆంజనేయస్వామి దర్శనమిస్తారు. ఇక్కడి అంజనాద్రిలో అల్లరిచిల్లరిగా తిరుగుతూ వావారభసచేస్తున్న హనుమంతుని కాళ్లకు చేతులకు బేడీలు తగిలించి ఎక్కడికి కదలకుండా శ్రీవేంకటేశ్వరునికి ఎదురుగా నిలబెట్టిందట అంజనాదేవి. అందువల్లే ఈయనను బేడీ ఆంజనేయస్వామి అంటారు.

కాని క్రీ.శ. 1841 ప్రాంతంలో దేవస్థానం అధికారులైన మహంతులవల్ల ఉత్తరదేశమైన పూరీజగన్నాథం నుంచి వచ్చిన సంప్రదాయమే "ఈ బేడీఆంజనేయస్వామి" అని చెప్పబడుతున్నది.

ఈ ఆంజనేయస్వామి ఆలయం ముఖమండపం గర్భాలయం అని రెండు భాగాలుగా నిర్మింపబడింది. గర్భాలయంలో గోడవారకు మధ్యలో సుమారు 6 అడుగుల నిలువెత్తు ఆంజనేయస్వామి ప్రతిష్ఠింప బడ్డాడు. గర్భాలయంపై ఏకకలశ గోపురం నిర్మింపబడింది. గోపురానికి నాలుగు మూలల్లో ఆనందనిలయానికి వలెనే సింహాలు వున్నాయి. ఇటీవలే ఈ ఆలయానికి ప్రదక్షిణ మండపం కూడా నిర్మింపబడింది.

ప్రతిరోజు మూడుపూటలా శ్రీవేంకటేశ్వరుని నివేదనానంతరం భక్త శిఖామణియైన శ్రీ బేడిఆంజనేయస్వామికి నైవేద్యం జరుగుతున్నది. ఈ నివేదన శ్రీస్వామివారి ఆలయం నుండే పంపబడుతున్నది. ప్రతి ఆదివారం ఈ మూర్తికి పంచామృతాభిషేకం పూజా నివేదనాదులు జరుగుతున్నాయి.

ప్రతినెలా పునర్వసు నక్షత్రం రోజున శ్రీ సీతారామలక్ష్మణులు ఊరేగుతూ, ఇక్కడికి వస్తారు. శ్రీసీతారామలక్ష్మణులకు ఇచ్చిన శేషహారతిని ఆంజనేయస్వామివారికి ఇస్తారు. శ్రీరాములవారి మెడలోని పుష్పహారాన్ని ఈ బేడి ఆంజనేయస్వామికి సమర్పిస్తారు.

ప్రతి బ్రహ్మోత్సవంలో గరుడోత్సవంనాడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఈ బేడీఆంజనేయస్వామివారి ఆలయంనుండే ఊరేగింపుగావెళ్లి శ్రీవేంకటేశ్వర స్వామివారికి పట్టువస్త్రాలను సమర్పిస్తారు.

ఇటు శ్రీ బేడిఆంజనేయస్వామినిస్తుతిస్తూ, అటు ఎదురుగా శ్రీ స్వామివారి ఆలయమహాద్వారశిఖరాన్ని చూస్తూ గోవిందలు పెడదాం!

*శ్రీ మదాంజనేయ వరద గోవిందా!*

*గోవిందా! గోవిందా!! గోవింద!!*

# 71. కల్యాణ కట్ట - తలనీలాల సమర్పణ

కరుణాసింధువు, భక్తపారిజాతం అయిన శ్రీవేంకట ప్రభువును దర్శించ డానికి దేశ విదేశాల నుంచి నిరంతరం నిరంతరాయంగా భక్తజనులు తిరుమల చేరుకుంటూనే వుంటారు. అత్యంత భక్తి ప్రపత్తులతో తమకు నచ్చినరీతిలో తాము మెచ్చిన రీతిలో మొక్కులు చెల్లిస్తూనే వుంటారు.

తిరుమల క్షేత్రాన్ని చేరుకున్న యాత్రికులు, భక్తులు శ్రీవేంకటేశ్వర స్వామివారిని దర్శించటానికి ముందుగా సమర్పించే అత్యంత ప్రధానమైన మొక్కు "తలనీలాల సమర్పణ".

తిరుమల క్షేత్రంలో తలవెంట్రుకలను మొక్కులుగా సమర్పించటమనే సంప్రదాయం ఎప్పటినుంచి వస్తున్నదో, ఏనాటినుంచి కొనసాగుతున్నదో ఇదమిత్థంగా తేల్చి చెప్పటం కష్టం.

క్రీ.శ. 1830 నాటికే తిరుమలలో తలనీలాల సమర్పణమనే మొక్కును భక్తులు పవిత్రకార్యంగా భావించి చేసేవారని తెలియవస్తున్నది.

హిందూ సంప్రదాయంలో ఉపాసనా కార్యక్రమాల్లో, పారాయణల్లో, వ్రతాల్లో, వాటిని ఆచరించేవారు శిరోజాలను తీసివేయడం అమంగళంగా భావిస్తారు. అందువల్లే ఆ వ్రతంగానీ, ఆ ఉపాసనా కార్యక్రమం గానీ పూర్తి అయిన తర్వాతనే శిరోజాలను తీసివేస్తారు ఇలా హిందువుల్లో శుభాశుభ కార్యక్రమాల్లో క్షవరం చేయించుకోవడం ఆనవాయితీ. అయితే ఆయా కార్యక్రమాల్లో పాల్గొనే, లేదా పాలు పంచుకొనే కొద్దిమంది మాత్రమే అలాంటి క్షవరం చేయించుకోవటం, శిరోజాలను తీసివేయటం జరుగుతున్నది. మిగిలినవారు, అందులోను కన్యలు, ముత్తైదువలు క్షవరం చేయించుకోవటం, శిరోజాలను తీసివేయటం నిషిద్ధం.

కాని, తిరుమల పుణ్యక్షేత్రంలో, శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో చంటి పిల్లల నుంచి వృద్ధుల వరకు, స్త్రీలు సయితం... .. ఇలా యావత్ కుటుంబ సభ్యులు ఆడా, మగా తమ తమ తలవెంట్రుకలను ఆనందంగా శ్రీస్వామివారికి మొక్కులుగా సమర్పించటం జరుగుతున్నది.

భక్తులు, కోరికలు నెరవేరినవారుగానీ, కోరికలు నెరవేరవలసినవారు గానీ, ఏకభుక్తం, భూశయనం, బ్రహ్మచర్యం వంటి నియమాలతోపాటు

శిరోజాలను తీయకుండా దీక్ష వహించి నియమితకాలంపాటు శ్రీనివాసుణ్ణి ఉపాసిస్తారు, ఆరాధిస్తారు. ఇలా నియమితకాలం పూర్తి అయిన వెంటనే దీక్షగా యాత్రచేస్తూ తిరుమలక్షేత్రాన్ని చేరుకొంటారు. అచట శ్రీవారి సన్నిధిలో తమ దీక్షావ్రతంలో అత్యంత ప్రాధాన్యం వహించిన శిరోజాలను భక్తిప్రపత్తులతో సమర్పించి తమ దీక్షా విరమణ చేస్తారు. ఆ తర్వాత స్నాన దర్శనాదులు ముగించుకొని, కానుకలు వగైరా వాటిని హుండీద్వారా సమర్పించుకుంటారు.

ఇలా తిరుమల క్షేత్రంలో ఒక పవిత్ర యజ్ఞంగా భావింపబడుతూ ప్రతి నిత్యం ఈ తలనీలాల సమర్పణ పుణ్యప్రదమైన శుభకార్యంగా కొనసాగుతూ వుంది. అందువల్లే దీనిని 'తిరుక్షవరం' అనీ, "కల్యాణప్రదమైన క్షవరం" అనీ అనటం అనూచానంగా వస్తున్నది. ఇలా భక్తులు వింత వింత ఆనందానుభూతులతో కల్యాణప్రదంగా తలనీలాలు సమర్పిస్తున్న దివ్య స్థలాన్ని "కల్యాణ ఘట్టం" అని పిలిచేవారు. అదే నేడు "కల్యాణకట్ట"గా వ్యవహరింప బడుతూ వుంది.

ఈ 'కల్యాణకట్ట'లో యాత్రికులు కొందరు తమ పిల్లలకు పుట్టు వెంట్రుకలు తీస్తారు. మరికొందరు ఏండ్ల తరబడి దీక్షాధారులై వచ్చి తమ తలనీలాలను (శిరోజాలు) సమర్పిస్తారు. స్త్రీలు కొందరు పూర్తిగా తమ తలనీలాలను సమర్పించుకొంటే, మరికొందరు స్త్రీలు మూడుకత్తెరలుగా కొద్దిగా సమర్పించుకొంటారు. అసలు తిరుమల యాత్రలోనే స్వామివారికి సమర్పింపబడే ప్రధానమైన మొక్కుబడి "తలనీలాల సమర్పణ". తిరుమల క్షేత్రంలో తలవెంట్రుక లివ్వడమనే పవిత్రకార్యంవల్ల భక్తులకు ఎన్నో శుభాలు కలుగుతాయి.

*తీర్థోపవాసః కర్తవ్యః శిరసో ముండనం తథా*
*శిరోగతాని పాపాని యాన్తి ముండనం తోయతః.*

— పద్మపురాణం

తీర్థ క్షేత్రాల్లో విధిగా తలవెంట్రుకలను తీయించుకోవాలి. అలా సమర్పించినట్లయితే శిరస్సులోవున్న పాపాలన్నీ పోతాయి. అనగా బుద్ధి

పూర్వకంగా చేసిన పాపాలన్నీ నశిస్తాయని రోగాలు నివారింపబడతాయని, అహంకారం తగ్గుతుందని సారాంశం.

పూర్వం పాతకల్యాణకట్టభవనం దగ్గరవున్న పెద్దరావిచెట్టుక్రింద తల నీలాలు తీసే వారట. ఆ తర్వాత ఆ రావిచెట్టు పక్కనే ఒక కల్యాణ కట్ట నిర్మింపబడింది. నానాటికీ పెరుగుతున్న యాత్రికజనాన్ని దృష్టిలో వుంచుకొని ఇటీవల తిరుమల తిరుపతి దేవస్థానం పాతకల్యాణకట్ట పక్కనే నాలుగు అంతస్థుల పెద్ద కల్యాణకట్ట భవనాన్ని నిర్మించింది. సుమారు 30 లక్షల రూపాయల ఖర్చుతో నవీనంగా నిర్మింపబడ్డ ఈ కల్యాణకట్ట భవనంలో ఒక విడతగా ప్రతి అరగంటలోను సుమారు 500 మంది యాత్రికులు తమ తలనీలాలను సమర్పించుకోవచ్చు. ఈ కల్యాణకట్ట భవనంలోనే పాదరక్షల గది, సామానులు భద్రపరుచుకొనే గది, స్నానాల గదులు, ఆఫీసు.... వగైరా ఏర్పాట్లు వున్నాయి. ఈ కల్యాణకట్ట భవనంలోనేకాక భక్తుల సౌకర్యం కోసం వారువారు విడిదిచేసిన కాటేజీల్లో తలనీలాలు సమర్పించుకొనే సౌకర్యాన్ని కూడ తి.తి. దేవస్థానం కల్పించింది.

మామూలుగా రోజుకు సుమారు 5 వేలమంది పిల్లా, పెద్దా తమ తలనీలాలను సమర్పించుకొంటారు. మరీ రద్దీగావున్న రోజుల్లో అయితే ఈ సంఖ్య 20 వేలు దాటుతుంది.

అహరహం ఆర్తిగా, ఆర్ద్రంగా, ఆనందంగా తనను చేరుతున్న భక్తుల యొక్క తలచిక్కులను (తలనీలాలను) మరింత ఆనందంగా స్వీకరిస్తూ, ఆ భక్తుల యొక్క చిక్కు (సమస్య)లన్నింటిని తీరుస్తూ, తద్వారా ఆ భక్తుల చేతికి చిక్కుతూ అరచేతి మాణిక్యమై వెలుగుతున్న కరుణాసింధువైన కొండలరాయణ్ణి ఇలా స్తుతిస్తాం!

భవాబ్ధితారం కటివర్తి హస్తం
స్వర్ణాంబరం రత్నకిరీట కుండలమ్
ఆలంబిసూత్రోత్తమ మాల్యభూషితం
నమామ్యహం వేంకటశైల నాయకమ్.



శ్రీ స్వామిపుష్కరిణి



శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్ప స్వామి

# 72. శ్రీ స్వామిపుష్కరిణి

స్వామిపుష్కరిణీ స్నానం సద్గురోః పాదసేవనమ్,
ఏకాదశీవ్రతం చాపి త్రయ మత్యంత దుర్లభమ్.
దుర్లభం మానుషం జన్మ దుర్లభం తత్ర జీవనమ్,
స్వామి పుష్కరిణీ స్నానం తత్ర మత్యంత దుర్లభమ్.

శ్రీ స్వామి పుష్కరిణీ స్నానం, సద్గురు పాదసేవనం, ఏకాదశీ వ్రతం — ఈ మూడును అత్యంత దుర్లభములు. అలాగే మానవునిగా జన్మించడం, మానవునిగా మనుగడ సాగించడం, ఆ మానవ జీవితంలో శ్రీస్వామి పుష్కరిణిలో స్నానం చెయ్యడం — అనే కార్యాలు లభ్యంకావటం చాల దుర్లభమైనవి అని వరాహపురాణం చాటుతోంది.

కలియుగ వైకుంఠమైన తిరుమల పుణ్యక్షేత్రంలో నెలకొన్న కోనేరునే 'శ్రీస్వామిపుష్కరిణి' అంటారు. బ్రహ్మాండంలోని సర్వతీర్థాలకు 'స్వామి' వంటిది కనుకే 'స్వామిపుష్కరిణి' అనే సార్థక నామధేయంతో తిరుమలక్షేత్రంలోని కోనేరు అలరారుతూవుంది.

శ్రీ మహావిష్ణువు ఆనతిమేరకు వైకుంఠం నుండి క్రీడాద్రితోకూడ ఈ పుష్కరిణిని తెచ్చి గరుత్మంతుడు ఇక్కడ ఈ క్షేత్రంలో స్థాపించినట్లు పురాణాలు స్పష్టం చేస్తూ వున్నాయి. ఈ స్వామిపుష్కరిణి సర్వతీర్థాలకు నిలయం. సర్వపాపహరం. స్నానమాత్రంచేత ఇహపరాలను రెంటిని ప్రసాదిస్తుంది.

ఈ పుష్కరిణిని దర్శించడంవల్లా, ఈ తీర్థాన్ని సేవించడంవల్లా, స్మరించడంవల్లా, ఇందులో స్నానం చెయ్యడంవల్లా సమస్త పాపాలు నశిస్తాయి. సర్వసుఖాలు కలుగుతాయి. దీనికి ఇదే సాటి.

శాస్త్రాణాం పరమో వేదః, దేవానాం పరమో హరిః
తీర్థానాం పరమం తీర్థం, స్వామిపుష్కరిణీ నృప!

ఇలా తీర్థాలలో కెల్ల పరమపావనమైంది ఈ తిరుమలలోని స్వామి పుష్కరిణి.

పూర్వం రాజ్యం పోగొట్టుకొన్న శంఖణుడనే రాజు ఈ పుష్కరిణిలో స్నానంచేసి తపమాచరించి మళ్లీ రాజ్యాన్ని పొందాడు.

నిస్సంతువైన దశరథ మహారాజు స్వామి పుష్కరిణిని సేవించి, ఇచ్చట తపమాచరించి శ్రీనివాసుని ప్రార్థించినాడు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువునే పుత్రునిగా బడసినాడు.

ఒకప్పుడు ఆత్మారాముడనే పేదవిప్రుడు వేంకటాచలం చేరుకొని, సనత్కుమారుడనే ఋషి ఆదేశంతో ఈ స్వామి పుష్కరిణిలో తీర్థ మాడి వక్షఃస్థలమహాలక్ష్మితో కూడిన శ్రీస్వామివారిని సేవించి ఇష్టార్థసిద్ధిని పొందినాడు. సకలైశ్వర్యములతో తులతూగినాడు.

పూర్వం కుమారస్వామి తారకాసురుణ్ణి సంహరించినందువల్ల వచ్చిన బ్రహ్మహత్యా పాపాన్ని ఈ పుష్కరిణిలో స్నానంచేసి పోగొట్టుకున్నాడు. ఈ కోనేటి స్నానంవల్ల ధర్మగుప్తుడనే రాజుకు పిచ్చి తొలగింది.

ఇలా అనంతకాల గమనంలో ఎందరో ఎందరెందరో ఈ స్వామిపుష్కరిణిని సేవించి శ్రీనివాస ప్రభువును ప్రార్థించి ఎన్నో వరాలను పొందినారు. తాళ్లపాక అన్నమాచార్యులు ఈ కోనేటి గొప్పదనాన్ని ఇలా కీర్తించాడు.

## గుండక్రియ

దేవునికి దేవికిని తెప్పల కోనేటమ్మ
వేవేలు మొక్కులు లోకపావని నీకమ్మా!

ధర్మార్థ కామమోక్ష తతులు నీ సోపానాలు
అర్మిలి నాలుగు వేదాలదె నీదరులు
నిర్మలపు నీ జలము నిండు సప్త సాగరాలు
కూర్మము నీలోతు వో కోనేరమ్మా!

తగిన గంగాదితీర్థములు నీ కడళ్లు
జగతి దేవతలు నీ జలజంతులు
గగనపు బుణ్యలోకాలు నీదరి మేడలు
మొగి నీ చుట్టు మాకులు మునులోయమ్మా!

వైకుంఠనగరము వాకిలే నీ యాకారము
చేకొను పుణ్యములే నీ జీవభావము
యే కడను శ్రీవేంకటేశుడే నీవునికి
దీకొని నీ తీర్థ మాడితిమి కావవమ్మా!

ఇంతటి పరమపావనియైన ఈ పుష్కరిణీ తీరంలో ధనుర్మాసంలో వైకుంఠ ద్వాదశి అరుణోదయవేళ సమస్త తీర్థాలన్నీ ఆవహిస్తాయట! అందుకే ఆ రోజు "శ్రీస్వామి పుష్కరిణీ తీర్థముక్కోటి"గా ప్రసిద్ధి పొందింది.

ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యా మరుణోదయే
ఆయాన్తి సర్వతీర్థాని స్వామిపుష్కరిణీ జలే
తత్ర స్నానం ప్రకుర్వంతి యే నరాః ప్రీత మానసాః
తే సర్వపాప ర్ముచ్యంతే సగోత్ర జ్ఞాతి బాంధవాః.

ధనుర్మాసంలో శుక్ల పక్ష ద్వాదశినాడు అరుణోదయ వేళలో ఎవరైతే మనఃప్రీతితో స్నానంచేస్తారో వారు, వారి సగోత్రులైన దాయాదులు, బంధువులు, అన్ని పాపాలనుండి విముక్తులవుతారు.

ఇక బ్రహ్మోత్సవంలో చివరిరోజున, రథసప్తమి రోజున, ఈ పుష్కరిణిలో శ్రీసుదర్శన చక్రత్తాళ్వారునకు పవిత్రస్నానం చేయించగా అదే సమయంలో భక్తులు పవిత్రస్నానాలు చేస్తారు.

ఈ కోనేట్లో ప్రతి సంవత్సరం ఫాల్గుణమాసం పౌర్ణమికి ముగిసేట్లుగా ఐదురోజులపాటు తెప్పోత్సవాలు శ్రీసీతారామలక్ష్మణులకు, శ్రీ రుక్మిణీ శ్రీకృష్ణులకు, శ్రీదేవి భూదేవీ సమేత శ్రీవేంకటేశ్వరస్వామివారికి జరుగుతాయి.

1.50 ఎకరాల వైశాల్యమున్న ఈ కోనేటి మధ్యలో క్రీ.శ. 1468లో సాళువ నరసింహరాయలు నీరాళి మండపాన్ని నిర్మించాడు. అంతేగాదు ఈయన సంక్రాంతికి మరునాడు, బ్రహ్మోత్సవాల్లోను, ఇంకా ఆయా సందర్భాల్లో తెప్పోత్సవాల సమయంలో నీరాళి మండపంలో జరిగే ఆస్థానంలో నివేదనల్ని ఏర్పాటు చేశాడు.

క్రీ.శ. 15వ శతాబ్దంలో తాళ్లపాకవారు ఈ కోనేటికి మెట్లను నిర్మించి నీరాళిమండపాన్ని బాగు చేయించారు.

ప్రతిరోజా వేలాదిమంది యాత్రికులు స్నానం చేస్తున్నందువల్ల కోనేటి నీళ్లరంగు మారడం, నీళ్లు కలుషితం కావడం జరుగుతున్నది. అందువల్లే 1972లో కోనేటిలో నీటిని శుభ్రపరచే ఫిల్టర్లను దేవస్థానం ఏర్పాటు చేసింది. అంతేకాక ఏడాది కొకమాటు పూర్తిగా నీటిని తీసివేసి, కొత్తనీటిని నింపడం, నీటిలో ప్రాణవాయువును చొప్పించి శుభ్రం చేయడంవంటి కొత్త కొత్త చర్యలు ఎప్పటికప్పుడు దేవస్థానం తీసుకొంటూనే వుంది.

ఇదీ పరమ పవిత్రమైన శ్రీస్వామి పుష్కరిణి చరిత్ర. ఎందరో భక్తుల్ని, యాత్రికుల్ని స్నానంద్వారా ముందుగా పునీతుల్ని చేస్తుంటుంది. అలాంటి స్వామిపుష్కరిణికి ఒక్కసారి అందరం చేతులెత్తి గోవిందలు పెడదాం.

*గోవిందా! గోవిందా! గోవింద!!!*

* * *

# సమర్పణం

తిరుమల యాత్రలో ఆనంద నిలయం ఆవరణంలో, తిరుమల క్షేత్ర పరిసరాల్లో సంచరిస్తూ తెలిసో తెలియకో మనసా వాచా కర్మణా ఎన్నో దోషాల్ని, తప్పుల్ని చేసివుంటాం. శ్రీనివాస ప్రభువు ఆ దోషాలను ఏమాత్రం పట్టించుకోకుండా నిండుగా అనుగ్రహింపజేస్తూ వుంటుంది అమ్మ అలమేలు మంగ! ఆ అలమేలుమంగ తిరుమల ఆనందనిలయంలో శ్రీవేంకటేశుని వక్షఃస్థలంలో "వ్యూహలక్ష్మి"గా, తిరుచానూరు (అలమేలుమంగాపురం)లో "శాంతినిలయం" అనే బంగారుగోపురంలో అర్చామూర్తియై శ్రీ పద్మావతి అమ్మవారిగాను భక్తులకు దర్శనమిస్తూ సంపూర్ణంగా అనుగ్రహిస్తూవుంది. జగన్మాత అయిన శ్రీవేంకటేశుని పట్టపురాణి అలమేలుమంగమ్మను పరమ భక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులవారి కీర్తనతో మనసారా ప్రార్థిస్తూ, "హరికొలువు" గ్రంథాన్ని ఆ అమ్మపాదాలకు ఒక చిన్న పూజా పుష్పంగా సమర్పించుకుంటున్నాను.

పరమాత్ముడైన హరి పట్టపురాణివి నీవు
ధర మము విచారించతగు నీకు అమ్మా!

కమలజుకన్నతల్లి కామునికన్నతల్లి
అమరుల కన్నతల్లి ఆదిమలక్ష్మి
విమలపు నీపతికి విన్నపము సేసి మమ్ము
నెమకి యేలితి దయ నీకే తగునమ్మా!

కామధేను తోబుట్టుగ కల్పకము తోబుట్టుగ
దోమటి చల్లని చంద్రు తోబుట్టుగ
నీమగని పంపునను నిజసిరులిచ్చితివి
నేమపు వితరణము నీకే తగునమ్మా!

పాలజలధికన్యవు పద్మాసనివి నీవు
పాలపండే శ్రీవేంకటపతిదేవివి!

*యేలిన యితని బంట్ల కిహపరాలిచ్చి మా*
*పాల కలిగితివి సంబంధము మేలమ్మా!*

*ఏడుకొండలవాడా! గోవిందా!! గోవింద!!!*

చివరగా ఒక్కమాట! ఈ హరికొలువు గ్రంథం పరంధాముని పారాయణ గ్రంథం. ఘనవేంకటేశుని అద్భుతఘట్టాలను లీలలను తెలియజేసే ఆనంద మయ గ్రంథం. ఎందరోభక్తుల త్యాగాలను విడమరచి చెప్పే వ్యాఖ్యాన గ్రంథం. తద్ద్వారా తిరుమలేశుని ఆశ్రిత వాత్సల్యాన్ని, భక్తప్రియత్వాన్ని లోకానికిచాటే విజయగీతిక! అందరూ పారాయణం చెయ్యండి. ఇతరులతో చెయ్యించండి! మీ మీ కోరికలన్నింటిని తీర్చుకోండి!

"ఏమి వలసిన నిచ్చు నెప్పుడైనను
ఏమఱక కొలిచిన నితడే దైవము"

కో! అనిపిలిస్తే 'ఓ'! అనిపలికే కొండలరాయణ్ణి ఆ శ్రియఃపతిని మనసారా మరోసారి స్మరిస్తూ మంగళ నీరాజనా లర్పించుదాం.

*శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినామ్*
*శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్*

*గోవిందా! గోవిందా!! గోవిందా!!!*

* * *

